## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001067

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఏ రామనాధం అంటే

'ఏ రామనాధ'మని చిరునవ్వుతో బదులు పలికే డాక్టర్ గారు ఇందులో చెప్పిన హక్కుల కోసమే కాక యింకా చాలా చాలా హక్కుల కోసం బలై, ఏ రామనాధమంటే 'పౌర హక్కుల రామనాధం' అని మనకి చెప్పక తెలియ జెబుతూ వెళ్ళిపోయిన డాక్టర్ ఏ. రామనాధం గారికి "న్యాయాన్యాయాలు" ప్రేమతో అంకితం.

## జస్టిస్. ఒ. చిన్నప్పరెడ్డి గారి ముందు మాట

మొదట 'ఉదయం' లో శీర్షికారూపంలో అవతరించి ఇప్పుడు పుస్తక రూపంలో వెలువడుతున్న 'న్యాయాన్యాయాలు' రచయిత శ్రీ నందిగం కృష్ణారావు గారు వారి కృషికి ఎంతో అభివందనీయులు, ప్రశంసనీయులు.

మనదేశంలో న్యాయవాదులున్నారు, న్యాయమూర్తులున్నారు, న్యాయస్థానాలున్నాయి, విధానస్థానాలు (Tribunals) న్నాయి చట్టాలున్నాయి. ఇతర న్యాయ సిద్ధాంతాలూ ఉన్నాయట. అందరూ, అన్నీ, ప్రజలకోసమే, ప్రజలకు న్యాయం సమకూర్చడంకోసమే, ప్రజలకు అన్యాయం జరగకుండా ఉండడం కోసమే! కానీ, ఇలా జరుగుచున్నదా? ఈ మాట సామాన్య ప్రజ లెవరైనా నమ్ముతారా? న్యాయస్థానాలకు, ప్రజలకు, న్యాయసిద్ధాంతాలకు, ఆచరణావిధానాలకు బహుదూరం కాదా? ఎందుకిలా అని ఒకసారి ప్రశ్నించుకుందామా?

మన జాతీయరంగంలో క్లేశ పరిచే దృశ్యాలెన్నో ఉన్నాయి. అందులో ముఖ్యమైంది ఒకటి : ప్రజానీకపు సంపూర్ణ అభాగ్యపుటజ్ఞానము. వారి రాజ్యాంగపు

హక్కులను గురించి వారి తదితర న్యాయ హక్కులను గురించి, రాజ్యాంగాన్ని గురించి, చట్టాలను గురించి, న్యాయనిబంధనలను గురించి, కార్యాచరణ విధానాన్ని గురించి, న్యాయవాదుల, న్యాయస్థానాల బాధ్యతను గురించి, న్యాయసంస్థ ప్రజల కోసమే ననీ, అది వారికందుబాటులో ఉండాలన్న అవసరాన్ని గురించి మన సామాన్య ప్రజల అజ్ఞానమేగాక, మన విద్యాధికుల జ్ఞాన శూన్యత కూడా ఎవరినైనా చకితుల్ని చేస్తుంది.

భారతదేశం ప్రజాస్వామ్య, ప్రజారాజ్యమని మన రాజ్యాంగం ప్రకటిస్తున్నది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం, భావస్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం, అంతస్తూ, అవకాశాల సమానత్వం, పౌరులందరికీ సమకూర్చబడుతాయనీ మన రాజ్యాంగం ప్రవేశికలో (**Preamble**) పేర్కొన్నది.

ఎన్నో హక్కులు ప్రాథమిక హక్కులుగా నిర్దేశింపబడ్డాయి. న్యాయ శాస్త్రక సమానత్వం, సమాన అవకాశం, వాక్స్వాతంత్ర్యం, భావ ప్రకటనా స్వాతంత్ర్యం, సమావేశపు స్వేచ్ఛ, వృత్తి స్వేచ్ఛ, సంచరణా స్వేచ్ఛ, జీవిత స్వేచ్ఛ, మతస్వేచ్ఛ ఇలాంటివన్నీ ప్రాథమిక హక్కులుగా గుర్తింప బడ్డాయి. అంతేగాక అరెస్టు కాబడ్డ వారిని 24 గంటలలో న్యాయస్థానానికి తీసుకురావాలని, వారి తరపున న్యాయవాదిని సంప్రదించి ఏర్పాటు చేసుకొనే అవకాశం కల్పించాలని, ఇవి కూడ ప్రాథమిక హక్కులుగా గుర్తింపబడ్డాయి. నిష్కారణంగా నిర్బంధములో ఉంచబడితే విడుదల చేయించమని కోర్టునర్థించేహక్కు (**Habeas Corpus**) పౌరునికి ఇవ్వబడింది. ఇంకా ఎన్నో **Ultravaries, Natural Justice** లాంటి న్యాయసిద్ధాంతాలు, న్యాయస్థానాల్లో గుర్తింపబడ్డాయి. బలహీనవర్గాల సంరక్షణకై ఎన్నో చట్టాలు చేయబడ్డాయి. ఈ చట్టాలు, ఈ హక్కులు మన ప్రజాబాహుళ్యానికి కాగితపు హక్కులే. ఎందుకంటే, ఉదాహరణకు చిన్నకారు రైతులు, కౌలుదారు రైతులు, రైతు కూలీలు, బీద చేముట్టు కార్మికులు, వీరిని వారి ఋణ భారాన్నుంచి విముక్తి చేయుటకు, కౌలుకు వారు సాగు చేసే భూముల్లో వారికి హక్కులు సంపాదించుటకు, వ్యవసాయ కూలీలకు, చేనేత కార్మికులకు కనీస వేతన నిర్ణయానికి ఎన్ని చట్టాలొచ్చాయి. కానీ, ఎవరికోసం ఈ చట్టాలు నిర్దేశింపబడ్డాయో, ఎవరికోసం రాజ్యాంగంలో చట్టాలు, హక్కులు కలుగ జేయబడ్డాయో, వారికి ఆ చట్టాలు, ఆ హక్కులూ ఉన్నట్టు తెలీదు. ఎలా వినియోగించు కోవాలో అసలే తెలీదు. మన రాజ్యాంగం సజీవంగా ఉండాలంటే, ఈ చట్టాలు, ఈ న్యాయసంస్థ నామకార్థము గాక ప్రజలకుపయోగకరంగా ఉండాలంటే, ఈ హక్కులు, ఈ చట్టాలు ఉన్నాయి, ఈ అవకాశాలున్నాయి, ఈ విధంగా న్యాయసంస్థద్వారా అవన్నీ గెల్చుకోవచ్చు, అనుభవించవచ్చు అని ప్రతి పౌరునికీ తెలియపర్చాలి. అందుకే,

న్యాయహక్కులు, సౌకర్యాలు ప్రజలకు తెలియపరిచే ఒక విస్తృత ప్రణాళిక మన దేశంలో ఎంతైనా అవసరం. శాస్త్రీయ పద్ధతులనవలంబించి వ్యవసాయం ఎలా చేయాలో నేర్పించడానికి **Agricultural Extention Officers** ఉన్నారు. పశు సంపదనెలా పెంపొందించాలో తెల్పడానికి **Animal Husbandry Extention Officers** ఉన్నారు. కుటుంబ పరిమితిని గురించి సలహా ఇవ్వడానికి **Family Planning Doctors** ఉన్నారు. మరి రాజ్యాంగ, తదితర న్యాయ సంరక్షణార్థము, ప్రతి కొన్ని గ్రామాలకు ఒక **Legal Extention Officer** ఎందుకుండకూడదు? అలాంటి **Officer** తనలోనే అధ్యాపకుడు, సలహాదారు, సాంఘిక పరిశోధకుడు, న్యాయవాది, వీరందరి విధులను కలయిక చేసుకోవాలి. గ్రామీణ ప్రజలకు వారి హక్కులను గురించి వారికి బోధపరుస్తూ వారికి జరుగుతున్న అన్యాయములనేవిధంగా పోరాడాలో వారికి సలహాలిస్తూ, అవసరమైనప్పుడు వారి కేసులు తానే చేపట్టి కోర్టుకు తీసుకెళ్ళాలి. రేడియోలో, **TV**లో ప్రజలకు వారి వారి హక్కులను గురించి రోజూ బోధపర్చవచ్చు. న్యాయవాదులు, న్యాయశాస్త్రవేత్తలు, పత్రికల్లో వ్యాసాల ద్వారా చిన్న చిన్న పుస్తకాల ద్వారా చదువనేర్చిన వారికైనా న్యాయవిద్య గరుపవచ్చు. ఇలాంటి ఉద్యమం బయలు దేరతీస్తేనే గాని మన రాజ్యాంగమూ, మన న్యాయసంస్థలూ ప్రజలకుపయోగకరం గావు.

ఈ నిజాన్ని గ్రహించి, శ్రీ నందిగం కృష్ణారావు గారు ఆదిలోనే "న్యాయాన్యాయాలు" అనే ఈ పుస్తకానికి వారు వ్రాసిన 'నామాట' లో ఇలా అన్నారు. "..........................న్యాయశాస్త్రం అనేది కేవలం న్యాయవాదులకి, న్యాయమూర్తులకి, పోలీసులకి, తత్సంబంధీకులకి మాత్రమే పరిమితమైనది కాదు.........."ఈ వ్యాసాల్లో శ్రీ కృష్ణారావు గారు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సూత్రాలను, నియమాలను, ముఖ్యాంశాలను వివరించి అందరికీ అర్థమయ్యేట్లుగా చక్కటి తెలుగులో చక్కగా చెప్పారు. చాలా బాగుంది. అందరూ చదివితే ఇంకా బాగుంటుంది. ఒక్క క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ మాత్రమే కాక ఇంకా ప్రజలకుపయోగపడే రాజ్యాంగపు హక్కులను గురించి, చట్టాలను గురించి, మరికొన్ని పుస్తకాలను వ్రాయమని కృష్ణారావు గారిని ఆదేశిస్తున్నాను. ఇప్పుడు వ్రాసిన ఈ పుస్తకం రాబోయే వాటికి నాంది అని భావిస్తున్నాను. మొదట్లోనే అన్నాను, శ్రీ కృష్ణారావు గారు అభివందనీయులని. ఆ మాటే మరీ చెప్తున్నాను. న్యాయశాస్త్రాన్ని ప్రజలకందుబాటుచేయాలన్న ఈ కృషికి శ్రీ కృష్ణారావు గారు నిజంగా ప్రశంసనీయులు.

# న్యాయాన్యాయాలెందుకు ?

నందిగం కృష్ణారావు గారు రాసిన న్యాయాన్యాయాలను మేం పుస్తక రూపంలో ఎందుకు తెస్తున్నాం ? న్యాయంకోసం ప్రతినిత్యం పదేలింటిముందు, దొరవారి ఇంటిముందు పడిగాపులు గాసే ఈ దేశ ప్రజలకు చాలామందికి అక్షరాస్యతే లేదు. అన్యాయం చేసే దొరలకు చట్టం అంటూ లేదు. ఇది ఇలా వుండగా ఈ మధ్య కాలంలో మండలానికో పోలీస్ స్టేషన్ వచ్చింది. గిరిజన ప్రాంతాల్లో అయితే ఒక్కొక్క మండలానికి నాలుగైదు పోలీస్ స్టేషన్లు వచ్చాయి. ఫలితంగా ఊరి

దొరతో పాటు పోలీస్ అమీన్ (SI) పెద్ద దొర అయిపోయాడు. గ్రామీణ ప్రజల్ని, పట్టణాల్లో మురికివాడల ప్రజల్ని మధ్య తరగతి ఉద్యోగుల్ని కూడా పోలీసులు భయ పెట్టినంతగా మరే వ్యవస్థా భయపెట్టడం లేదు. చట్టం ప్రకారం, ఉద్యోగాల్లో ఎంపికై ఉనికిలోకి వచ్చిన పోలీసులు చట్టాన్ని పాటించాలి కదా! పోలీసులు కొడితేనో, తిడి తేనో చదువురాని నిరుపేదలు నోరుమూసుకొని పడివుంటే అర్థమున్నది. తెల్ల బట్టల దొరలను, ఖాకీ బట్టల 'దొర' లను చదువురాని వారు నిలదీసి అడక్కపోతే వారికి తెలియదని మనం సరిపెట్టుకోవచ్చు. కానీ చదువుకున్నవారు పోలీసులు తమను ఏ సందర్భంలో అరెస్టు చేస్తే ఏం చెయ్యాలి, ఏ నేరానికి ఏ శిక్ష విధించే హక్కు కోర్టు కుంది - వంటి విషయాలు తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది కదా!

అరెస్టు చేస్తే ఏం చెయ్యాలి అనే వివరాలు మనలో చాలామందికి తెలియవు. చదువుకున్న మిత్రులంతా ఈ వివరాలు తెలుసుకొని తమని తాము 'పోలీస్ భయం' నుండి కాపాడుకొనేందుకని, చదువుకున్న వ్యక్తులు చదువురాని వారికి సహకరించడాని కని కృష్ణారావు గారు రాసిన ఈ వ్యాసాలను ముద్రించాం. మిమ్మల్ని పోలీసులు బెదిరించిన ప్రతి సందర్భంలోనూ ఈ పుస్తకాన్ని సంప్రదించండి. 'ప్రజా స్వామ్య హక్కుల వేదిక' వంటి చిన్న సంఘానికి ఈ పుస్తకాన్ని అచ్చువేయడం కొంచెం తలకు మించిన భారమే అయినా మా సంస్థ శ్రేయోభిలాషులు అందించిన సహాయ సహకారాలతో ఈ పుస్తకాన్ని మీ ముందుంచ గలుగుతున్నాం.

ఈ పుస్తకంలోని వ్యాసాలన్నీ ధారావాహికంగా 'ఉదయం' దినపత్రికలో ప్రచురింపబడ్డాయి. ఈ వ్యాసాల నన్నిటినీ పుస్తకం రూపంలో ప్రచురించడానికి అను మతించడమే కాక ఇతరత్రా కూడా ఈ పుస్తక ప్రచురణకు సహాయపడ్డ ఉదయం పత్రిక ప్రధాన సంపాదకుడు శ్రీ దాసరి నారాయణరావు గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని కొనుకున్న ప్రతి పాఠకుడు తాను చదవడమేకాకుండా పది మంది చేత చదివిస్తాడనీ, చదివిన ప్రతివ్యక్తీ పది మంది చదువురానివారికి ఈ చట్టాల గురించి చెబుతాడనీ మా ఆశ. మీరు రోడ్డువెంట పోతూ పోలీస్ లాకప్‌లో మనుషు లున్నారని గమనిస్తే వారు ఏ నేరం క్రింద ఏ చట్టం క్రింద అరెస్టు చెయ్యబడ్డారో కను క్కొని వారిని విడిపించేందుకు కృషి చెయ్యండి. పోలీసులను చట్టాలను పాటించమని విధిగా అడగండి.

ఎఫ్.డి.ఆర్.

*(Forum for Democratic Rights)*

# నామాట

ఎవరైనా తెలిసో తెలియకో నేరం చేస్తే ఆ నేరం నేరంకాకుండా పోదు. దాన్ని చట్టం క్షమించదు. "నాకు చట్టం తెలవదు కాబట్టి ఇలా చేశా" నన్నా చట్టం ఊరుకోదు. అలాగే చట్టం తెలవక పోవడం వల్ల కూడా కొందరు అన్యాయానికి గురవుతున్నారు. ఉదాహరణకు గ్రామీణ ప్రాంతాల్లో కట్టు బానిసలుగా పడి వుంటున్న వాళ్లు, పోలీస్ లాకప్‌లో రోజుల తరబడి మగ్గి బయటపడ్డ తర్వాత ఇన్‌స్పెక్టర్ గారు మంచి వారు కాబట్టి తనను వదిలేశారు అని సంతోషించే అమాయకులు తమకు జరిగింది అన్యాయమని చట్ట వ్యతిరేకమని తెలీక ఊరుకుంటున్నారు. అంచేత న్యాయశాస్త్రం అనేది కేవలం న్యాయవాదులకీ న్యాయమూర్తులకీ, పోలీసులకీ, తత్సంబంధితులకీ మాత్రమే పరిమితమైనది కాదు. ఇది అందరికీ వర్తించేది కాబట్టి అందరూ అధ్యయనం చేసి తెలుసుకోవలసి వుంది.

ఈ న్యాయాన్యాయాలు వ్రాయడం మొదలుబెట్టినపుడు (7-10-1986 నుండి ఉదయం డైలీలో) న్యాయాన్ని న్యాయంగానే ఒకే కథలో భాగంగా చట్టాన్ని వివరించాలను కున్నాను. మొదటి వ్యాసంలో పోలీస్ రిపోర్టు ఇవ్వడం ఎలాగో, ఆ తర్వాత పోలీస్ వ్యవస్థ ఎలా దర్యాప్తుకు కదులుతుందో చెప్పడం జరిగింది. ఈ రెండు వ్యాసాలూ పూర్తిచేసి నేనొక రోజు కోర్టు కారిడర్‌లో తిరుగు తూండగా నాకొక మనిషి ఎదురు పడ్డాడు. "నాదొక్కేసుందండి" అని పలకరించాడు నన్ను. అతనికి కేసుండటం నాకు బాగుంది గనుక, ఆ కేసు నా బ్రతుకుదెరువుకి అవసరంగనుక నేను "బాగుంది, చెప్పండ"న్నాను.

"నన్ను నా ఎదురింటి వాడు కొట్టాడు సార్" అని ఆవేశంగా చెప్పాడతను "అయితే పోలీస్ రిపోర్టివ్వక పోయావూ" అన్నాను. "ఇచ్చానండీ ఇస్తే సబ్ఇన్స్పెక్టర్ కూడా నన్ను పట్టుక్కొట్టాడండీ" అని చెప్పి కంటనీరు పెట్టుకున్నాడతను. "ఇంతకీ పోలీసు రిపోర్టు తీసుకున్నాడా, తీసుకోలేదా?" అనడిగాను. "తీసుకోకుండానే నన్ను కొట్టాడండీ" అని తిరిగి చెప్పి బాధ పడ్డాడతను. అయితే ఒక పన్జెయ్, నువు రాసిన రిపోర్టు సబిన్స్పెక్టర్ తీసుకోలేదనీ, కాబట్టి మీకు పంపుతున్నానని తెలియజేస్తూ ఎస్.పి.కి నీ రిపోర్టు రిజిస్టరు పోస్టులో పంపు. అపుడు దాన్ని ఎస్.పి. రిజిస్టర్ చేయమని పోలీసు స్టేషన్‌కు పంపుతారు" అని నాకు తెలిసిన జ్ఞానాన్ని కాస్తా అతనికి వివరించాను. "అది కాదు సార్. నన్ను మా ఎదురింటి వాడు కొట్టినందుకు నేను రిపోర్టు ఇవ్వబోతే సబిన్స్పెక్టర్ కొట్టాడు. ఇపుడా సబిన్స్పెక్టర్‌ని మనం చట్ట ప్రకారం ఏంచెయ్యగలుగుతామో అది చెయ్యడానికే నేను మీ దగ్గరికొచ్చాను." అన్నాడతను.

ఎదురింటి వాడు కొట్టడం ఎంత నేరమో, సబిన్స్పెక్టర్ కొట్టడం కూడా అంతే నేరమన్న విషయాన్ని పట్టించు కోకుండా నేను కేవలం ఎదురింటి వాడి మీద చర్య తీసుకోడానికి ఏంచెయ్యాలో చెప్పి ఊరుకున్నందుకు నాలిక్కరుచు కున్నాను.

నేరారోపణ చేసిన వారైనా నేరానికి గురైన వారైనా ఏదో ఒక రూపంలో చట్టానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పోలీస్ వ్యవస్థ కర్కశకబంధ హస్తాల్లో నలిగి పోతున్నారు. అంచేత నా అనుభవాన్నుంచే, వీలైనంతవరకూ చట్టాన్ని ఎలా దుర్వినియోగ పరుస్తున్నారో హక్కుల్ని ఎలా కాలరాసి వేస్తున్నారో తెలియజెప్పే కథనంతో అన్యాయం నుంచీ చట్టాన్ని వివరించడానికి ప్రయత్నించాను.

న్యాయం వేరు, చట్టం వేరు. ఒక్కోసారి చట్టాలే అన్యాయంగా కూడా ఉండవచ్చు. తెల్లవాళ్ళు వారి అవసరాలకోసం రూపొందించుకున్న చట్టాలు మనకింతా న్యాయంగా ఉండటానికి వీల్లేదు. అంచేత కొన్ని చట్టాలు అన్యాయంగా కూడా వుండవచ్చు. అలా ఉన్నచోట చట్టంలోని అన్యాయాల్ని, అక్రమాల్ని కూడా వివరించడం

జరిగింది.

మారుతున్న సమాజంలో మారుతున్న పరిస్థితులకనుకూలంగా చట్టాన్ని విశ్లేషించాల్సి వుంటుంది. ఈ బాధ్యత పూర్తిగా న్యాయ వ్యవస్థ మీదవుంది.

ప్రజా ప్రయోజనాల దృష్ట్యా ప్రస్తుత పరిస్థితుల కనుకూలంగా అవసరమైన చోట చట్టాన్ని నూతనంగా విశ్లేషించాను. సహృదయులు ఈ దృక్పధాన్ని ఆహ్వానిస్తారని ఆశిస్తాను.

ఒక నేరం జరగడము, ఆ నేరానికి సంబంధించిన సమాచారం అందిన వెంటనే పోలీస్ వ్యవస్థ ప్రతిస్పందన, దర్యాప్తులో భాగంగా పోలీసులకి ఏర్పడిన అధికారాలు, వాటి పరిమితులు ఒకవైపున వివరిస్తూ మరోవైపున పోలీసులకున్న అధికారాల పేరిటసాగే అక్రమాలనుండీ ప్రజల హక్కులు కాలరాయబడకుండా ఎలా కాపాడుకోవాలో కూడా వివరించాను. ఈ క్రమంలో నిందితుల హక్కులు కూడా సమగ్రంగా వివరించాను.

పోలీసులకి దర్యాప్తులో భాగంగా మాత్రమే అధికారాలు ఏర్పడలేదు. నేరం జరక్కుండా తీసుకోవలసిన ముందు జాగ్రత్త చర్యల్లో భాగంగా కూడా అధికారాలేర్పడ్డాయి. కాబట్టి ముందు జాగ్రత్త చర్యల్ని "అనుబంధం" గా చేర్చాను.

'న్యాయాన్యాయాలు' రాయమని పట్టుబట్టిన మా పతంజలిగారికి, తక్కువ ధరలో అందరికీ అందుబాట్లోకి తీసుకు రావాలని ప్రయత్నించిన ప్రజాస్వామ్య హక్కుల వేదిక (F.D.R.) వారికి, అడగ్గానే ముందుమాట రాసిచ్చిన ప్రజా న్యాయమూర్తి శ్రీ ఒ. చిన్నపరెడ్డి గారికీ, నిరంతరం నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించే న్యాయవాదమిత్రులు సి. పద్మనాభరెడ్డి గారికీ, సి. వి. మోహన్‌రెడ్డి గారికీ, శ్రీ కె. జి. కన్నాభిరాన్ గారికీ, ఎ. లక్ష్మినారాయణ రెడ్డి గారికీ, మా రిజిస్ట్రార్ ఐ. పాండురంగా రావు గారికి నేను చాలా ఋణపడి ఉన్నాను.

నందిగం కృష్ణారావు

*చిరునామా :-*

నందిగం కృష్ణారావు, ఎం.ఏ., ఎల్.ఎల్.బి.

*అడ్వొకేట్*

ఎం.ఐ.జి-II, బ్లాక్ 8, ఫ్లాట్ 8.

బాగ్ లింగంపల్లి, హైదరాబాద్-500 044.

ఫోన్ : 6 5 6 3 2.

# విషయ సూచిక

*అనుబంధం*

# ప్రథమ సమాచార నివేదిక

రమ లైబ్రరీకి వెళ్ళి పొద్దుపోయే వరకు చదువుకుంటూ వుండిపోయింది. లైబ్రేరియన్ వచ్చి టైమైపోయిందని చెప్పేవరకు ఆమె ఈ ప్రపంచంలో పడలేదు. ఈ

చీకట్లో ఒంటరిగా ఇంటికెలా వెళ్ళాలి అనుకుంది.

సాధారణంగా రిక్షాలు దొరకని ఏరియాలో ఆరోజు ఊహించని విధంగా రిక్షా ఒకటి కనబడింది.

చీకట్లోంచి నాలుగు ఆకారాలు బయటికొచ్చి అమాంతం రిక్షామీద పడి రమను బరబరా ఈడ్చుకుపోసాగాయి. అడ్డంవచ్చిన రిక్షావాడ్ని నెట్టేశాయి.

చెయ్యగలిగిందేమీ లేక ఏడుస్తూ రిక్షాఅతను దగ్గర్లోవున్న పోలీస్ స్టేషన్‌కి పరిగెత్తాడు. డ్యూటీలో వున్న ఇన్‌స్పెక్టర్‌గారికి జరిగింది వివరించాడు. చెప్పిందంతా రాసుకుని అది రిక్షాఅతనికి చదివి వినిపించి ఆ కాయితంమీద సంతకంగానీ, వేలిముద్రగానీ వెయ్యమన్నాడు ఇన్‌స్పెక్టర్. తనీ కాయితాల మీద వేలిముద్ర వెయ్యొచ్చో లేదోనని ఆలోచించాడు.

సాధారణంగా ఇటువంటి ఆలోచన, సందేహాలు చదువురాని ఈ రిక్షా అతనికే కాక, చదువొచ్చిన వారికిసైతం రావచ్చు. పోలీసులకు సమాచారం అందజేయటం అంటే ఫిర్యాదు చెయ్యటంకాదు. చట్టపరిభాషలో సమాచారం (**Report**) అందించటానికి ఫిర్యాదు (**Complaint**) చెయ్యటానికి చాలా వ్యత్యాసం వుంది. ఒకనేరం జరిగినప్పుడు సమాచారం అందించటం వలన పోలీసు వ్యవస్థని ఆ నేర పరిశోధనకి కదిలించటం అవుతుంది. పరిశోధన అనంతరం నిర్దిష్ట వ్యక్తులపైన నేరారోపణ చేస్తూ పోలీసులు, కోర్టులు దాఖలుచేసే 'చార్జిషీటు' ఒకరకంగా 'ఫిర్యాదు' అవుతుంది. కాబట్టి నేర పరిశోధన గురించి పోలీసు వ్యవస్థను కదిలించటం ప్రతిపౌరుడి ప్రాథమిక కర్తవ్యం అని న్యాయశాస్త్రం అభిప్రాయపడుతోంది.

పోలీసులకు ఇచ్చే ఈ సమాచారం మౌఖికంగాగానీ (**Oral**), రాతపూర్వకంగా (**Written**) కాని వుండవచ్చు. నేరాన్ని ప్రత్యక్షంగా చూసిన వాళ్ళుగానీ, నేరానికి గురికాబడ్డవాళ్ళుగానీ లేదా నేరుగా నేరస్తుడే (తాను చేసిన నేరాన్ని ఆమోదించినప్పుడు) పోలీసులకు సమాచారం ఇవ్వవచ్చు. అంతేకాక నేరాన్ని గురించి తెలిసిన వారెవరైనా సరే పోలీస్ రిపోర్ట్ ఇవ్వవచ్చు.

న్యాయశాస్త్రం నేరాల్ని రెండురకాలుగా విభజించింది. 1. కాగ్నిజబుల్ అఫెన్సెస్ అంటే ముద్దాయిని పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టుచేసే కేసులు (ఉదా:- మానభంగం, దోపిడీ, హత్య, కుట్ర మొదలైన కేసులు) 2. నాన్ కాగ్నిజబుల్ అఫెన్సెస్ అంటే ముద్దాయిని పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టు చెయ్యటానికి వీల్లేని కేసులు (ఉదా:— అబద్ధపుసాక్ష్యం, చిన్నకొట్లాటలు, పబ్లిక్‌న్యూసెన్స్, ఎన్నికల్లో లంచం ఇవ్వడం)

కాగ్నిజబుల్‌నేరం జరిగినప్పుడు పోలీసులకు ఎవరైనా వచ్చి (**Oral**గా)

విషయం తెలియజేసేట్లయితే స్టేషన్ అధికారి ఆ సమాచారాన్ని రాసుకుని లేక రాయించి సమాచారం ఇచ్చినవారికి చదివి వినిపించి వారిచేత సంతకం పెట్టించుకోవాలి. పై సంఘటనలో ఇన్‌స్పెక్టర్ అందుకే రిషా అతని సంతకం అడిగాడు.

ఇదే విధంగా ఎవరైనా రాతపూర్వక సమాచారం ఇచ్చినా దానిపై సమాచారం ఇచ్చినవారి సంతకం తీసుకోవాలి. తర్వాత ఈ సమాచారాన్ని పోలీసు అధికారి రాష్ట్ర ప్రభుత్వం నిర్దేశించిన పద్ధతి ప్రకారం డైరీలో రాసుకోవాలి. ఈ సమాచారం యొక్క ప్రతిని సమాచారం అందజేసిన వారికివ్వాలి.

అయితే పోలీసు అధికారి సమాచారాన్ని స్వీకరించటానికి నిరాకరిస్తే ఏం చెయ్యాలి? ఇలా జరగటానికి అవకాశముందా అనే అనుమానం రావచ్చు. అనేక సందర్భాల్లో ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో పోలీసులకు సమాచారం అందజేసినప్పటికీ స్వీకరించటానికి నిరాకరించిన సందర్భాలు అనేకం వుంటున్నాయి. ఈ విషయమై ఒక సందర్భంలో లా కమీషన్ కూడా ఆందోళన వ్యక్తం చేసింది.

ఇలాంటి పరిస్థితుల్లో సమాచారం ఇవ్వదల్చుకున్నవారిముందు రెండే అవకాశాలున్నాయి. ఒకటి తత్సంబంధిత పోలీసు సూపరింటెండెంట్‌గారికి రాతపూర్వకంగా పోస్టులో సమాచారం పంపటం, ఇలా సమాచారం అందినప్పుడు ఆ అధికారి తానే స్వయంగా కేసు పరిశోధింపవచ్చు లేదా తన క్రింది అధికారులకెవరికైనా అప్పగించవచ్చు.

రెండవది: ఒకవేళ నేరస్తుల వివరాలు ఖచ్చితంగా తెలిసినప్పుడు వారిపై నేరారోపణ చేస్తూ నేరుగా అభియోగం కోర్టులో దాఖలు చేయవచ్చు.

ముద్దాయి పేరు తెలియచేస్తూ కాగ్నిజబుల్ నేరానికి సంబంధించిన సమాచారాన్ని పోలీసులకు టెలిఫోన్ ద్వారా కూడ అందించవచ్చు.

పోలీసులకు అందించిన సమాచారం ఆధారంగా రూపొందిన సంబంధిత పత్రాన్ని న్యాయశాస్త్ర పరిభాషలో **FIR (First Information Report)** లేదా ప్రథమ సమాచార నివేదిక అంటారు. ప్రథమ సమాచారం అందజేసేవారు నేరం జరిగిన వెంటనే ఇవ్వడం మంచిది. దీనివల్ల అనేక అనుమానాలు అపోహలు తలెత్తకుండా పోతాయి. ఆలస్యం అయిన కొద్దీ ఆ ఆలస్యానికి సంబంధించిన నమ్మదగ్గ వివరణ ఇవ్వాల్సి వుంటుంది. వెంటనే సమాచారం ఇచ్చేట్లయితే అబద్ధపు కథ అల్లి చెప్తున్నారు అని అనుకునే అవకాశం వుండదు. కేసు విచారించే అధికారం వున్న మెజిస్ట్రేట్ నుండి ఆదేశం పొందిన అనంతరమే పోలీసు అధికారులు కేసు పరిశోధన ప్రారంభిస్తారు. ఒకే కేసులో రెండుకానీ అంతకు మించికానీ నేరాలున్నప్పుడు అందులో ఒకటి కాగ్నిజబుల్ అయితే తదనుగుణంగా కేసు దర్యాప్తు ప్రారంభమవుతుంది.

# దర్యాప్తు

పోలీస్ ఇన్స్పెక్టర్ ప్రథమ సమాచార నివేదికను కాపీలు తీసి పై అధికార్లకీ, కేసును విచారించే అధికారమున్న మేజిస్ట్రేట్ గారికి పంపారు. వెంటనే ఇలాగనుక

ఆయన పంపకపోతే ప్రథమ సమాచారం నేరం జరిగిన తరువాత కావాలని తయారు చేశారనే అభిప్రాయం కోర్టుకి కలిగే ప్రమాదముంది. ఆలస్యమయిన కొద్దీ, తర్వాత కోర్టులో విచారణ జరిగేటపుడు, ఆలస్యానికి ఆమోదయోగ్యమైన వివరణ ఇవ్వవలసి వుంటుంది.

తరచు హత్యకేసుల్లో పోలీసులు హతుడిశవాన్ని చూసిన తరువాతో, పోస్టుమార్టం అయిన తరువాతో గాయాలు ఏరకమైన ఆయుధాలవల్ల కలిగాయో చూసి దాన్ని బట్టి ఫలానా ముద్దాయి, ఫలానా ఆయుధంతో ఫలానాచోట కొట్టి చంపాడని రాసుకొని, మరొకరితోటి సంతకం చేయించుకొని ప్రథమ సమాచార నివేదిక తయారు చేస్తారు. ఆ తరువాత కోర్టులో కూడా ప్రథమ సమాచారకుడ్ని, ప్రథమ సమాచారంలో వున్నది వున్నట్లుగా చెబితేనే కేసు గెలుస్తామని చెప్పి బతిమాలో బామాలో బెదిరించో సాక్ష్యం చెప్పిస్తారు.

సాధారణంగా క్రిమినల్ కేసుల్లో పోలీసు రిపోర్టు ఇవ్వటానికి వచ్చేవాళ్ళు నేరానికి గురైన వాళ్ళో, లేదా వారికి దగ్గరసంబంధమున్న వాళ్ళో అయివుంటారు. వారికి నేరస్తులు ఎవరో తెలియకపోతే తమ విరోధులమీద నేరం మోపి పోలీసుల చేతుల్లో కీలుబొమ్మలౌతుంటారు. ఇలా చేయటం వలన పోలీసులకి కేసుపరిశోధన సులభం కావచ్చు. కానీ ఏనేరం చేయకుండానే అమాయకులు శిక్షించబడే అవకాశముంది.

ఇలా పోలీసులు నేరం జరిగిన తర్వాత తయారుచేసిన నివేదిక ఏదైనప్పటికీ అది నేరపరిశోధనలో భాగమే. ఇక్కడ పోలీసులకి అంతకుముందే నేరం జరిగిందని సమాచారం అందినట్లు స్పష్టం అవుతుంది. అది మాత్రమే ప్రథమ సమాచారం అవుతుంది.

అందుచేత ఇలాంటి ప్రమాదాన్ని నివారించటానికే న్యాయశాస్త్రం ప్రథమ సమాచార నివేదికను ఆలస్యంలేకుండా మేజిస్ట్రేట్‌కి పంపాలని నిబంధన పెట్టింది. మరి ప్రథమ సమాచారం అందకుండానే పోలీసులు పరిశోధన ప్రారంభించవచ్చునా? అనే సందేహం కలగవచ్చు. పోలీసులకి వాళ్ళ ఇన్‌ఫర్‌మెంట్స్ (Informants) నించి కాగ్నిజబుల్ నేరం జరిగిందని నమ్మదగ్గ సమాచారం అందినపుడు కూడా అది రికార్డుచేసి సమాచారం స్వీకరించిన అధికారి సంతకం పెట్టిన తరువాత వెంటనే పరిశోధన ప్రారంభించవచ్చు. కిడ్‌నాప్‌చేయబడ్డఅమ్మాయిగురించి సమాచారంఇవ్వటానికొచ్చిన రిక్షా అతన్నించి నేరస్తులను గుర్తించటానికి అవసరమైన పోలికల్ని, కిడ్‌నాప్ చేయబడ్డఅమ్మాయి గురించి, ఆమె ఎక్కడివరకు రిక్షామాట్లాడుకొందీ అన్నీ వివరంగా అడిగి అతని స్టేట్‌మెంట్ వేరుగా రికార్డు చేసుకొన్నాడు. (దీన్ని 161 సి.ఆర్.పి.సి. స్టేట్‌మెంట్ అంటారు).

ఒకప్పుడెప్పుడో తనని ట్రాఫిక్ పోలీసు అన్యాయంగా కొడితే పోలీసురిపోర్టు ఇవ్వటానికి స్టేషన్‌కి వెళితే యస్.ఐ. గారు కూడా కొట్టిపంపిన విషయం గుర్తుచేసుకొని పోలీసు రిపోర్టు ఇవ్వటం అంటే తన్నులు తినటం కాదన్నమాట అనుకొన్న రిక్షావాల యస్.ఐ.కి దండం పెట్టి వెళ్ళిపోయాడు.

ఇక ఈ కేసులో యస్.ఐ. తను వెంటనే పరిశోధన ఎలా ప్రారంభించాలో ఆలోచించటం మొదలు పెట్టాడు.

*నేరపరిశోధనలో పోలీసులు ఏం చెయ్యాలి ?*

1. నేరస్తులుఎవరో కనుక్కోవాలి. 2. నేరస్తులకి వ్యతిరేకంగాసరైన సాక్ష్యాధారాలు సంపాదించాలి. 3. నేరస్తులను కోర్టులో హాజరు పర్చాలి. కోర్టు ఉత్తర్వులమేరకు నేరస్తులను ఖైదు చేయాలి. ప్రధానంగా ఈ మూడు విధులూ నిర్వహించడానికి వీలుగా పోలీసులకి అనేక అధికారాలు ఇవ్వబడ్డాయి. ఉదా.కి నేరస్తులను అరెస్టు చేయటమూ, ఇళ్ళు సోదా చేయటమూ మొదలగునవి. పోలీసులకి ఉన్న ఇలాంటి అధికారాలు కూడా చట్టపరిధిలో పరిరక్షించబడతాయి. నేరపరిశోధన సక్రమంగా జరగటానికి పోలీసులకి కేవలం అధికారాలు వున్నంతమాత్రాన సరిపోదు. వాళ్ళు ప్రజల్లో నమ్మకాన్ని, అభిమానాన్ని చూరగొనాలి. పోలీసులు ప్రజల కోసం పనిచేస్తున్నారనీ వారి ధన, మాన, ప్రాణాలు రక్షించడానికే వున్నారని గుర్తించడానికి వీలుగా నడుచుకోవాలి. కానీ దురదృష్టవశాత్తూ ఇవ్వాళ పిల్లల్ని బూచోడొచ్చాడని భయపెట్టి ఏడుపు మాన్పించే తల్లులు అదిమానేసి అడుగో పోలీసొచ్చాడని భయపెట్టి నోరుమూయించే హీనమైన పరిస్థితుల్లో వుంది మన పోలీసు వ్యవస్థ.

కనుక పరిశోధన సక్రమంగా జరగడానికి వీలుగా అనేకమంది న్యాయశాస్త్ర నిపుణులు, హైకోర్టులు, సుప్రీంకోర్టులు ఇచ్చిన సూచనలను కొన్నింటిని స్థూలంగా వివరిస్తాను.

1. పోలీసులు సద్గుణాలతో ప్రజలతో సత్సంబంధాలు కలిగి వుండాలి. ప్రజల సహకారం లేకుండా పని చేయలేరని జవహర్లాల్ నెహ్రూ కూడా స్పష్టంగా చెప్పి వున్నాడు. 2. పరిశోధనాధికారి పోలీసు స్టేషన్ పరిధిలో ప్రతి వ్యక్తిని గురించీ తెలుసుకొని వుండాలి. 3. పోలీసు స్టేషన్ పరిధిలోని ప్రాంతాలను గురించి తెలుసుకొనివుండాలి. 4. సాక్షులను ప్రశ్నించి సరైన సమాచారం రాబట్టాలి. 5. విచారణకు ముందుగానే ఒక అభిప్రాయం ఏర్పర్చుకొని పరిశోధన ప్రారంభించకూడదు. పాత నేరస్తుల్నే అనుమానించి కేసు పరిశోధించటం సరైనది కాదు. 6. సేకరించిన సమాచారాన్ని వెంటనే వీలైనంత క్లుప్తంగా రాసుకోవాలి. 7. నేరస్తుడికి, అభియోగికి

మధ్య నిష్పక్షపాతంగా మెలగాలి. తను ఇరుపక్షాలకిచెందిన వ్యక్తినని మర్చిపోకూడదు. 8. నిజాయితీగా వుండి ఎలాంటి శ్రమకైనా ఓర్చుకోవటానికి సిద్ధంగా వుండాలి. కానీ ఇందుకు భిన్నంగా ఆచరణలో లంచగొండులై డబ్బుతీసుకొని నేరస్తులను విడిచి పెట్టి, అమాయకుల్ని నేరస్తులుగా చూపటం మనం అనేక సందర్భాల్లో చూస్తున్నాం. 9. పరిశోధనాధికారి సరైన న్యాయాన్ని వెలుగులోకి తీసుకు రావటానికి ప్రయత్నించాలి. 10. శాస్త్రీయమైన పరిశోధన జరపాలి. వేలిముద్రలను, మెడికల్ ఎవిడెన్సును అంత తేలిగ్గా తీసివేయలేంగదా! ఆధునిక శాస్త్రీయ పరిశోధనల్ని ఉపయోగించుకొని నేరాన్ని రుజువుచేయడానికి ప్రయత్నించాలి.

కాగ్నిజబుల్ నేరం జరిగినపుడు పోలీసులు మేజిస్ట్రేట్ నించి పర్మిషన్ తీసుకోకుండానే పరిశోధన ప్రారంభించవచ్చు. కాగ్నిజబుల్ నేరం జరిగిందని ప్రథమ సమాచార నివేదిక (యఫ్.ఐ.ఆర్)లో స్పష్టంగా వుంటే హైకోర్టు ఆకేసుపరిశోధనలో జోక్యం చేసుకొని, పరిశోధన ఆపివేయమని ఆదేశించడానికి వీల్లేదు. కాగ్నిజబుల్ నేరం జరిగినప్పుడు, సమాచారం అందాక అధికారి స్వయంగా గానీ లేక తన క్రింది అధికారినైనా కేసు పరిశోధన చేయమని ఆదేశించవచ్చు. తక్షణంనేరస్థలానికివెళ్ళి విషయాన్ని, పరిసరాల్ని పరిశీలించవచ్చు.

సమాచారం వచ్చిన కేసుల్లో, సీరియస్ నేరం కాకపోయినట్లయితే పరిశోధనాధికారి నేరస్థలానికి వెళ్ళాల్సిన పనిలేదు. పోలీసు స్టేషన్ అధికారికి కేసు పరిశోధన అవసరం లేదనుకొంటే కూడా అతను పరిశోధన చేయకుండా వుండొచ్చు.

## కాగ్నిజబుల్ కేసులో పోలీసుల దర్యాప్తు

పోలయ్యకి దాహంగా వుంది. ఆకలిగా వుంది. నెత్తిమీద ఎండ దంచేస్తోంది. అతను పనిచేస్తోన్న పొలానికి దగ్గరలోనే రావుగారి లోగిలుంది. ఆ లోగిట్లో మంచినీళ్ళ బావి కూడా వుంది. అయినా పోలయ్య వెళ్ళి గుక్కెడు మంచినీళ్ళు తాగలేదు.

తాగుంటే ఇంకేమైనావుందా? అతని వొళ్ళు హూనమైపోతుంది. అతను మాదిగ కులస్తుడు. పెద్దకులంవాళ్ల ఇళ్లలో నీళ్ళు తాగటానికి వీల్లేదు. ఈ భయమే అతన్ని నీళ్ళు తాగకుండా కట్టిపడేసింది. అయినా దాహం ఆగలేదు. సమయం గడుస్తున్న కొద్దీ ఎక్కువవుతోంది. నాలుక పిడచగట్టుకుపోయి గొంతెండి దాహాన్ని తట్టుకోలేక భయాన్ని ప్రక్కకి నెట్టి ప్రాణాల్ని కాపాడుకోవడానికి రావుగారి బావి దగ్గరకెళ్ళి నీళ్ళు తోడుకొని తాగాడు. హమ్మయ్య అని ఊపిరిపీల్చుకుని వెనక్కి తిరిగే సరికి అతని నెత్తిమీద కర్రదెబ్బ పడింది.

"ఎంత ధైర్యంరా నీకు, అంటూసొంటూ లేకుండా బావిలో నీళ్ళు తాగుతావురా" అని బూతులు తిడుతూ ఇష్టమొచ్చినట్లు బాదాడు. ఆదెబ్బల్లో ఎక్కడో తగలరాని దెబ్బతగిలి 'అమ్మా' అని పెద్దగా అరచి క్రిందపడి కోడిపిల్లలా గిలగిల తన్నుకుని చనిపోయాడు పోలయ్య.

రావుగారు పెద్దగా కంగారు పడకుండానే లోపలికి వెళ్ళి ఎవరెవరికో ఫోన్లు చేశాడు. పోలీసులకి కూడా కబురు వెళ్ళింది. పోలీసులు వచ్చి పోస్టుమార్టం చేయించారు. ఆ తరువాత ఎలాంటి చర్యా తీసుకోలేదు. సాక్షులను విచారించలేదు. రావుగార్ని అరెస్టు చేయలేదు.

అలాంటప్పుడు పోలీసులు కేసు దర్యాప్తు చేయకుండా వొదిలేస్తే సమాచార నివేదిక (ఎఫ్.ఐ.ఆర్) ను స్వీకరించిన మేజిస్ట్రేట్ దర్యాప్తు జరుపవలసిందిగా పోలీసుల్ని ఆదేశించవచ్చు లేదా ఆయనే స్వయంగా ప్రాథమిక విచారణ జరుపవచ్చు. సబార్డినేట్ మేజిస్ట్రేట్ చేతనైనా ప్రాథమిక విచారణ జరిపించవచ్చు.

ఇక్కడ ప్రాథమిక విచారణ అని ఎందుకంటున్నామంటే కేసు దర్యాప్తు పూర్తయిన తరువాత కోర్టులో జరిగే విచారణకాదు. అందులో సాక్ష్యాధారాలు స్వీకరించిన తర్వాత నేరస్తుడు శిక్షార్హుడో కాదో తేలుస్తారు. కానీ ప్రాథమిక విచారణలో సాక్ష్యాధారాల్ని స్వీకరించి అభియోగం తయారుచేస్తారు.

ప్రాథమిక విచారణలో సాక్ష్యాలు రికార్డుచేయడం మొదలుకొని మిగతా ఆధారాలు సేకరించడానికి అవసరమైన చర్యలు తీసుకోవచ్చు. సబార్డినేట్ మేజిస్ట్రేట్ గనుక విచారణ జరిపేట్లయితే ఆయనకు విధించిన పరిమితుల్లో మాత్రమే విచారణ జరపాలి. మెజిస్టీరియల్ విచారణ పూర్తయిన తరువాత తయారుచేసిన నివేదికపై మేజిస్ట్రేట్, పోలీసులు పంపే నివేదికమీద ఏ విధంగానైతే వ్యవహరిస్తారో ఆ విధంగానే వ్యవహరించాలి. దీన్నిబట్టి పోలీసులు దర్యాప్తు పూర్తిచేసిన తరువాత తయారుచేసే అభియోగపత్రానికి (చార్జిషీట్) మెజిస్టీరియల్ విచారణ నివేదికకీ పెద్దగా తేడా ఏమీలేదని స్పష్టమవుతుంది.

### *పోలీసు అధికార్లకి సాక్షులను పిలిపించే అధికారం*

దర్యాప్తు జరుపుతున్న పోలీసు అధికారి కేసుకు సంబంధించిన సాక్ష్యాలు సంపాదించడానికి ఎవరినైనా పిలిపించవచ్చు. ఇక్కడ ఎవరికైనా అనేమాటకి నేరం గురించి ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గానీ తెలిసిన వాళ్ళు అని అర్థంచేసుకోవచ్చు. ఇలా పిలిపించే వ్యక్తి నుంచి సమాచారం సేకరించి కోర్టులోగాని మెజిస్టీరియల్ విచారణలోగానీ అతన్ని సాక్షిగా ఉపయోగించుకోవచ్చు. ఇలా ఒకర్ని పిలిపించి సాక్ష్యాల్ని

సేకరించే అధికారం కేవలం దర్యాప్తుచేసే అధికారికే వుంటుంది. అతనుకాక అతని క్రింది అధికారి పిలిపించినట్లయితే వెళ్ళాల్సిన అవసరం లేదు.

దర్యాప్తుచేస్తున్న అధికారి సాక్షుల్ని పిలిపించేటప్పుడు రాతపూర్వకమైన ఉత్తర్వు ద్వారానే పిలిపించాలి. అలాకాకుండా సాక్షిని హాజరుకమ్మన్నప్పుడు సాక్షి నిరాకరించినట్లయితే అతనిమీద ఏ రకమైన చర్యా తీసుకోవడానికి వీల్లేదు. ఒక పోలీసు కానిస్టేబుల్ ఒక వ్యక్తిని తన వెంట పోలీస్‌స్టేషన్‌కి రమ్మని అడిగాడు.

"ఎందుకు" అన్నాడా వ్యక్తి.

"సాక్ష్యం చెప్పడానికి" అని చెప్పాడు కానిస్టేబుల్.

"నేను రాను" అన్నాడా వ్యక్తి.

కానిస్టేబుల్ బలవంతం చెయ్యడంతో వాళ్ళిద్దరి మధ్యనా గొడవ జరిగింది. ఆ వ్యక్తి కానిస్టేబుల్‌ని కొట్టాడు. ఈ కేసులో ఆ వ్యక్తిని రమ్మంటూ లిఖితపూర్వకమైన ఉత్తర్వు ఏమీ ఇవ్వనందువల్ల అతనిమీద ఏ రకమైన చర్యాతీసుకోవడానికి వీల్లేదని పాట్నా హైకోర్టు తీర్పు చెప్పింది.

దర్యాప్తు చేస్తున్న పోలీసు అధికారి తన పోలీస్టేషన్ పరిధిలోని వ్యక్తినిగానీ, లేదా తన పోలీస్‌స్టేషన్‌కి దగ్గర్లోవున్న పోలీస్‌స్టేషన్ పరిధిలోని వ్యక్తిని మాత్రమే. పిలిపించవచ్చు. తనముందుమాత్రమే హాజరు కమ్మని కోరవచ్చు. కానీ ఏ మేజిస్ట్రేట్ ముందో లేక మరే ఇతర అధికారిముందో హాజరు కమ్మని అడగటానికి వీల్లేదు.

ఫలానాచోట, ఫలానా సమయంలో హాజరు కావాల్సిందంటూ దర్యాప్తు చేస్తున్న అధికారినుంచి ఉత్తర్వులు అందుకొన్నవ్యక్తి ఆ ఆదేశాల్ని కనుక ఖాతరుచేయకపోతే అతనిమీద పోలీసులు చర్యతీసుకోవచ్చు. మనకి ఒకనేరానికి సంబంధించి ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ ఏ సమాచారం అయినా తెలిస్తే అది పోలీసులకు తెలపడం అన్నది కనీసకర్తవ్యం. అలా హాజరై సాక్ష్యం చెప్పిన వ్యక్తికి అయిన ఖర్చులు రాష్ట్ర ప్రభుత్వం నిర్దేశించినంత వరకూ కట్టివ్వాలి.

పోలీసు అధికారి స్త్రీలనుగానీ 15 సం లోపు మగపిల్లలనుగాని పోలీస్‌స్టేషన్‌కో మరోచోటుకో పిలిచి సాక్ష్యం సేకరించడానికి వీల్లేదు. అధికారే వారివద్దకు వెళ్ళాలి. ఇలాంటి నిబంధన స్త్రీలపై అత్యాచారాలను, పిల్లలను భయానకస్థితికి గురిచేసే ప్రమాదాన్ని నివారించి పోలీసులపై అపవాదు పోగొట్టాలనే ఉద్దేశ్యంతోనే ఏర్పడిందని సుప్రీంకోర్టు 1978లో అభిప్రాయపడింది.

ఇక్కడ ఒక విషయం మనం మర్చిపోకూడదు. కేసు పరిశోధనలో వున్నప్పుడు మాత్రమే ఈ విధంగా పోలీసులు సాక్షుల్ని పిలిచే అధికారం వుంటుంది. అదే కేసు దర్యాప్తు పూర్తయి, కోర్టులో కేసు నడుస్తున్నప్పుడు పోలీసులకి ఈ విధంగా

సాక్షుల్ని పిలిపించే అధికారం వుండదు. అప్పుడు కోర్టు సమన్లు పంపి సాక్షుల్ని పిలిపిస్తుంది.

ఇలా పిలిపించి స్టేట్‌మెంట్లు తీసుకున్న వాళ్ళనందర్నీ దర్యాప్తు చేసే అధికారి సాక్షులుగా భావించాల్సిన అవసరం లేదు. అందులో ఎవరి సాక్ష్యమైతే ఉపయోగించుకోవడానికి వీలుగా వుంటుందో వారిది మాత్రమే ఉపయోగించుకోవచ్చు.

ఇలాంటి విస్తృతాధికారం పోలీసులకి వుండటంవల్ల వారు ముద్దాయిలకి అనుకూలంగా వుండే సాక్ష్యాలను త్రోసిపుచ్చే ప్రమాదం వుందని స్పష్టమౌతోంది. పోలీసులు నిష్పక్షపాతంగా వ్యవహరించాలి. వారికి అభియోగి, ముద్దాయి ఇద్దరూ సమానమే. కానీ వాస్తవానికి చాలా కేసుల్లో ఇలా జరగడంలేదని మనందరికీ తెలుసు.

## స్టేట్‌మెంట్ రికార్డు

ఆ మధ్యన ఒక పోలీస్‌స్టేషన్‌లో దొంగతనం జరిగింది. మర్నాడు పోలీసులకి వ్వాల్సిన జీతం డబ్బుకాస్తా పోయింది. పోలీస్ స్టేషన్ అయినా మరెక్కడైనా దొంగతనం జరిగిందంటే సమాచారం అందిన వెంటనే కేసు రిజిష్టర్ చెయ్యాల్సిందేకదా! అందుకని డబ్బుపోయిందని తెలియగానే కేస్ రిజిష్టర్ చేశారు ఇన్‌స్పెక్టర్‌గారు. డబ్బు పోయిన సమయంలో డ్యూటీలో ఉన్న కానిస్టేబుల్స్ అందర్నీ ఇంటారాగేట్ చేసి సమాచారం రాబట్టాలనుకొన్నారు ఇన్‌స్పెక్టర్‌గారు. ఇంటరాగేషన్ అనగానే కానిస్టేబుల్స్ అంతా భయంతో ఒణికిపోయారు. వాళ్లకి తెలుసు పోలీసు లాఠీకి అమ్మయినా ఆలైనా ఒకటేనని. అసలు ఇంటరాగేషన్ అన్నా, పోలీసులముందు స్టేట్‌మెంట్ ఇవ్వడం అన్నా చావగొట్టి సమాచారం లాగడంకాదు. పోలీసులకే ఇంటరాగేషన్ అంటే ఇంత భయం ఉన్నప్పుడు ఇక మామూలు వాళ్ళయితే ఇంకెంత భయపడాలి? అందుకని ఇంటరాగేషన్ పేరిటగానీ, సాక్షుల స్టేట్‌మెంట్ రికార్డుచెయ్యడం పేరిటగాని చట్ట ప్రకారం పోలీసులు ఏం చెయ్యాలో తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

సాక్షుల వాంగ్మూలం రికార్డుచెయ్యడం సాధారణంగా రెండు సందర్భాల్లో జరుగుతుంది. మొదట పోలీసులు కేసు పరిశోధన జరుపుతున్న క్రమంలో నేరస్తులకి వ్యతిరేకంగా పోలీసులు సాక్ష్యాన్ని రికార్డు చెయ్యడం. ఆ తరువాత కోర్టులో నేరస్తుణ్ని శిక్షించడానికిగ్గానూ న్యాయమూర్తి ఎదుట చెప్పిన సాక్ష్యాన్ని కోర్టువారు రికార్డు చెయ్యడం. కోర్టులో సాక్ష్యం చెప్పేముందర సాక్షి ప్రమాణం చేస్తాడు. ఏ పోలీసు అధికారి అయినా కేసు పరిశోధనలో ఉన్నప్పుడు ఎవర్నైనా సరే పిలిచి ప్రశ్నించి అతని స్టేట్‌మెంట్ రికార్డు చెయ్యవచ్చు. సాక్షినిగానీ, నిందితుణ్ణిగానీ,అనుమానితుణ్ణిగానీ పిలిపించి ప్రశ్నించి

సమాచారం సేకరించవచ్చు. పోలీసు అధికారి సాక్షినిగానీ ముద్దాయిని గానీ మౌఖికం గానే ప్రశ్నించవచ్చు. ఇలా ప్రశ్నించి సమాచారం తెలుసుకున్న తరువాత అది తప్పనిసరిగా రికార్డు చెయ్యవలసిన (రాయవలసిన) అవసరం లేదు. ఒకవేళ రికార్డుచేసేట్ట యితే దాని ప్రతిని ముద్దాయికి ఇవ్వాలి. అందరి స్టేట్‌మెంట్లు కలిసి ఉమ్మడిగా రికార్డు చెయ్యకూడదు. దేనికదే వేరువేరుగా రికార్డు చెయ్యాలి. ఇలా రికార్డు చేసిన స్టేట్ మెంట్ లని ఎప్పటికప్పుడు వెంటనే మేజిస్ట్రేట్‌కి పంపాలి. సాక్షి ఇచ్చే సమాచారాన్ని అతని మాటల్లోనే రికార్డు చెయ్యాలని ఏమీలేదు. అదే ముద్దాయి స్టేట్‌మెంట్ అయితే వీలైనంత వరకూఅతని మాటల్లోనే రికార్డు చెయ్యడం అవసరం. సాధారణంగా ఏ ముద్దాయికూడా కోర్టుల్లో నేరం ఒప్పుకోడు. కానీ పోలీసులు మాత్రం ముద్దాయి తమ ముందు నేరం ఒప్పుకున్నాడని చార్జిషీట్‌లో రాస్తూ ఉంటారు. ఇందులో నిజానిజాల్ని తేల్చడం కోసమే ముద్దాయి సొంతమాటల్లోనే స్టేట్‌మెంట్ రికార్డు చెయ్యాల్సిన అవసరం ఉందని కోర్టులు అభిప్రాయ పడుతున్నాయి.

సాక్ష్యాల్ని పోలీసులు వీలైనంత తొందరగా రికార్డు చెయ్యాలి. లేకుంటే తమకి ఇష్టం వచ్చినప్పుడు తమకి అవసరమైనప్పుడు రికార్డుచేసే ప్రమాదం ఉంది. సాక్షిని విచారిం చడం ఆలస్యం అయితే ఆ ఆలస్యానికి గల కారణంపోలీసులు వివరించాల్సి ఉంటుంది. సాక్షులని విచారించేప్పుడు పోలీసు అధికార్లు పెద్దల సమక్షంలో విచారించి పెద్దల సంత కాలు తీసుకోవాలని నిబంధన ఏమీలేదు. అయితే శవపంచనామా అప్పుడు పోలీసులు రికార్డు చేసే పద్ధతికీ, కేసు దర్యాప్తులో ఉన్నప్పుడు తీసుకొనే స్టేట్ మెంట్‌కి తేడా వుంది. శవ పంచనామా అప్పుడు కేవలం ఒక అభిప్రాయానికి రావడానికి మాత్రమే సాక్షుల్ని విచారిస్తారు. దర్యాప్తులో భాగంగా మాత్రమే ఈ స్టేట్‌మెంట్లు తీసుకొంటారు.

ముద్దాయిల్ని కనుక పోలీసులు ప్రశ్నించాల్సివస్తే అతను పోలీసు కస్టడీలో ఉన్నప్పుడుగానీ, లేదా కోర్టులో హాజరుపరచిన తర్వాత కోర్టు ఆమోదంతో కానీ ప్రశ్నించి స్టేట్‌మెంట్ తీసుకోవచ్చు. పోలీసుల దగ్గర స్టేట్‌మెంట్ ఇచ్చిన వ్యక్తుల నంద రినీ కోర్టులో సాక్షులుగా ప్రవేశపెట్టాలని ఏమీలేదు. నేరాన్ని రుజువు చెయ్యడానికి ఎవరి సాక్ష్యం అయితే అవసరమో వార్ని మాత్రమే కోర్టులో సాక్ష్యానికి ప్రవేశ పెట్టవచ్చు.

పోలీసులు పిలిపించి ప్రశ్నించినప్పుడు పోలీసులకి తప్పనిసరిగా సాక్షి సమా ధానం చెప్పవల్సిన అవసరంలేదు. ఒకసారి సాక్షిచెప్పే విషయాలు అతిన్నే నేరస్తు డుగా నిలబెట్టే ప్రమాదం ఉంది. అలాంటప్పుడు అతను సమాధానం చెప్పడానికి నిరా కరిస్తే నేరంకాదు. ఎవరైనా సరే తనకి వ్యతిరేకంగా తను సాక్షి కావలసిన అవసరం లేదని చట్టం అభిప్రాయపడుతోంది.

ఇంటరాగేషన్ పేరిట పోలీసులు ముద్దాయిల్ని హింసిస్తున్నారని గ్రహించి

సుప్రీంకోర్టు 1978లో ముద్దాయికనుక కోరుకునేట్లయితే అతని న్యాయవాది ముందే అతన్ని ఇంటరాగేట్ చెయ్యాలని ఆదేశించింది. దీనివల్ల ముద్దాయిల్ని పోలీసులు శారీరకంగా, మానసికంగా హింసించే పరిస్థితి ఉండదని అభిప్రాయ పడింది.

*పోలీసుల ముందు ఇచ్చే సాక్ష్యానికి కోర్టులో ఉండే విలువ*

పోలీసుల ముందు ఇచ్చిన సాక్ష్యాన్ని రికార్డుచేసిన అధికారి దానిమీద సంతకం చేయించుకోకూడదు. పోలీసులు కుతూహలంతో కొట్టో, తిట్టో, బెదిరించో, బ్రతిమాలో అబద్ధపు సాక్ష్యం చెప్పించే ప్రమాదంఉందికాబట్టి ఇలాంటి నిబంధన ఏర్పడింది. పోలీసుల ముందు ఇచ్చిన సాక్ష్యం కోర్టులో చెల్లదు. ఒకవేళ పోలీసులకు ఇచ్చిన సాక్ష్యం ఒక మేరకిగాని పూర్తిగాగానీ రుజువైతేఅప్పుడు సాక్ష్యాల్ని వైరుధ్యాల కోసం వాడుకోవచ్చు. అంటే పోలీసులు కోర్టులో ఇచ్చిన స్టేట్‌మెంట్‌కీ, పోలీసుల ముందు ఇచ్చిన స్టేట్‌మెంట్‌కి మధ్యనవున్న వైరుధ్యాల్ని వాడుకోవడం అన్నమాట. ఉదాహరణకి 'ఏ' అనేవ్యక్తి, 'బి' అనే వ్యక్తి 'సి'ని కత్తితో పొడిచి పారిపోతుండగా తాను చూశానని కోర్టులో సాక్ష్యం చెప్పాడనుకోండి. అంతకుముందు అతను పోలీసులకు ఇచ్చిన స్టేట్‌మెంట్‌లో 'సి'ని 'బి' గొడ్డలితో నరికాడనిచెప్పివుంటే, ఈ వైరుధ్యాన్ని వాడుకోవచ్చు. డాక్టర్లు, చేతివ్రాత నిపుణులు తదితర నిపుణుల రిపోర్టుల విషయంలో కోర్టు వాటిని తమ ముందు ఇచ్చిన సాక్ష్యాలుగానే భావిస్తుంది.

ఎవరైనాసరే పోలీస్‌స్టేషన్‌లో ఒక వ్యక్తిని గుర్తించాను అంటే అది కోర్టు ఆమోదించదు.

ఒకవ్యక్తి మరణానికి ముందు పోలీసులకి ఏదైనా చెబితే దాన్ని కోర్టు మరణ వాంగ్మూలంగా భావిస్తుంది. పోలీసు అధికార్లు తప్ప ఆ వాంగ్మూలం రికార్డు చెయ్యడానికి ఆ సమయంలో మరెవరూ లేకపోతేనే కోర్టు దీన్ని నమ్ముతుంది.

నేరాన్ని ఒప్పుకుంటూ ముద్దాయికనుక పోలీసులకి స్టేట్‌మెంట్ ఇచ్చేట్లైతే అది కోర్టు ఆమోదించదు. ఇలాపోలీసుల ముందు ముద్దాయినేరం ఒప్పుకొన్నాడంటే చెల్లదు. కానీ ముద్దాయి నేరాన్ని ఒప్పుకుంటూఇచ్చిన స్టేట్‌మెంట్ ఆధారంగా పోలీసులు నేరానికి సంబంధించిన వస్తువు ఏదైనా స్వాధీనం చేసుకొంటే, స్వాధీనం మేరకే సాక్ష్యాన్ని కోర్టు పరిగణనలోకి తీసుకుంటుంది.

సాక్షి తమ ముందు చెప్పని విషయాల్ని చెప్పినట్లుగా పోలీసులు రికార్డు చేసేట్లయితే అందుకు పోలీసులు శిక్షార్హులు అవుతారు. పోలీసులు సాక్షిని భయపెట్టో, బెదిరించో, మభ్యపెట్టో సాక్ష్యం రికార్డు చేసుకోవడానికివీల్లేదు. అలాగే సాక్షి స్వచ్ఛందంగా చెప్పదలచిన విషయాన్ని చెప్పకుండా నిరోధించాడానికి వీల్లేదు.

# సోదాచేసే అధికారం

ఆనాడెప్పుడో ఒక గిరిజనుడి ఇంటిని పోలీసులు చుట్టుముట్టారు, గట్టిగా తలుపులు బాదారు. గిరిజనుడు బయటికి వచ్చి "ఏం కావాలి?" అని అడిగాడు. "నీ ఇల్లు సోదా చెయ్యాలి" అని చెప్పారు పోలీసులు. "ఏం, ఎందుకు" తిరిగి అడిగాడు. గిరిజనుడు. "మీ ఇంట్లో దొంగ సొత్తు ఉంది" అని ఆ దొంగ సొత్తు ఏమిటో వివరంగా చెప్పారు ఇన్‌స్పెక్టర్ గారు. తన దగ్గర గానీ తన ఇంట్లో గాని అలాంటి వస్తువులు ఏమీ లేవని నెత్తి నోరు బాదుకొని చెప్పాడు గిరిజనుడు. అయినా పోలీసులు వినిపించుకోలేదు. ఇల్లంతా దొంగ సొత్తు కోసం వెదికారు. ఎక్కడా తమకి కావలసిన వస్తువులు కనిపించలేదు, దాంతో పోలీసులు వెనక్కి తిరిగి వెళ్లిపోవలసింది, కాని వెళ్ళలేదు. ఒక కోడిపిల్ల కావాలనీ ఇవ్వకపోతే గిరిజనుడి మీద దొంగకేసు పెడతామని బెదిరించారు. భయంతో గిరిజనుడు కోడి పిల్లని ఇచ్చేశాడు. ఆ తరువాత ఇప్పసారా కావాలని తీసుకొన్నారు. పోతూపోతూ అతని భార్య ఒంటిమీద చెయ్యి వేసి "ఏమంటావ్" అన్నారు. గిరిజనుడికి తట్టుకోలేనంత కోపం వచ్చింది. కర్ర తిరగేసి ఇద్దరు పోలీసుల బుర్రలు బద్దలు కొట్టాడు. దీంతో గిరిజనుడి ఇల్లుసోదా చేసి దొంగసొత్తు తీసుకు పోవడానికి వచ్చిన పోలీసులు, తలలు పగిలిన కానిస్టేబుళ్ళనీ, గిరిజనుణ్ని తీసుకుపోయారు. ఆ తరువాత గిరిజనుడి మీద తాము చట్టబద్ధంగా సోదా చేస్తుంటే అడ్డగించాడన్న ఆరోపణ మీద కేసు బనాయించారు.

నేర పరిశోధనలో భాగంగా పోలీసులకి సోదాచేసే అధికారం ఉంది. సాధారణ పరిస్థితుల్లో మెజిస్ట్రేట్ నుంచి వారంట్ తీసుకుని మాత్రమే పోలీసులు ఇళ్ళూవాకిళ్లూ సోదా చెయ్యవలసి వుంటుంది. సెర్చ్‌వారంట్ తీసుకోడానికి తగినంత సమయం లేనప్పుడు మాత్రమే పోలీసులకి వారంట్ లేకుండా సోదాచేసే అధికారం ఏర్పడుతుంది అని స్పష్టం అవుతోంది.

నేర పరిశోధనలో భాగంగా పరిశోధనాధికారి గానీ, పోలీస్‌స్టేషన్ అధికారిగానీ తన పోలీస్‌స్టేషన్ పరిధిలోని ఏ ప్రాంతాన్నైనా సోదా చెయ్యవచ్చు. ఒకవేళ అధికారికి

తను స్వయంగా సోదా చెయ్యడానికి వీలుకాక పోతే తన క్రింది అధికారికి సోదా జరుప మని లిఖితపూర్వమైన ఆదేశాలు ఇవ్వవచ్చు. ఈ ఆదేశాల్లో సోదా జరుపవలసిన స్థలమూ, ఏ వస్తువులను గురించి సోదా జరిపి స్వాధీనం చేసుకోవాలో స్పష్టంగా పేర్కొనాలి. తన క్రింది అధికారిని కనుక పరిశోధనా అధికారి సోదా చెయ్యమని ఆదే శించినట్లైతే, అలా ఎందుకు చెయ్యవలసి వచ్చిందో కారణాలను స్పష్టంగా రికార్డు చెయ్యాలి.

సోదా చేస్తున్న అధికారి ఏ వస్తువునుబడితే ఆ వస్తువుని గురించి సోదా చెయ్యడా నికి వీల్లేదు. తను ఏ నేరాన్ని గురించి పరిశోధిస్తున్నాడో, లేక తనకు ఏ నేరాన్ని గురిం చైతే పరిశోధించే అధికారం వుందో ఆ నేరానికి సంబంధించిన వస్తువుల స్వాధీనం గురించి మాత్రమే సోదా జరుపవచ్చు. ఒక నాన్‌కాగ్‌నిజబుల్ కేసులో (పోలీసులు వారంట్ లేకుండా నేరస్థుణ్ణి అరెస్టు చెయ్యడానికి వీల్లేని కేసులో) మెజిస్ట్రేట్ పర్మిషన్ లేకుండా పోలీస్ అధికారి సోదా చెయ్యడానికి వీల్లేదు. అంటే ఈ కేసుల్లో అధికారి సెర్చ్‌వారెంట్ తీసుకోవలసి వుంటుంది. అలాగే అసలు ఒక దొంగతనం గురించి సమాచారం ఏదీ లేకుండానే దొంగిలించబడ్డ వస్తువుల కోసం పోలీసులు సోదా చెయ్య డానికి వీల్లేదు. సాక్ష్యాధారాలు సేకరించడానికి నేరపరిశోధనకి సంబంధిత వస్తువుల కోసం మాత్రమే పోలీసులకు సోదా చేసే అధికారం వుంటుంది. ఈక్రమంలో పోలీసు లకు నేరస్థుడు నివసించేచోటు మొదలుకొని మరెక్కడైనా వెదికే అధికారం ఉంది.

సోదాజరిపే ముందు పోలీసు అధికారి, సోదాకి ముందు ఏదేనా నేరానికి సంబం ధించిన సాక్ష్యాధారాలు లభిస్తాయని నమ్మడానికి సరైన ఆధారాలు ఉన్నప్పుడు, కార ణాలు రాసుకొని సోదా చెయ్యడానికి పురోగమించవలసి ఉంటుంది. ఇలా తయారుచేసిన రికార్డుప్రతిని మెజిస్ట్రేటుకు పంపించాలి. ఇలా సోదా జరుపడానికి ముందు కారణాలు రాయకుండా, మెజిస్ట్రేట్‌కి రికార్డు పంపకుండా వెళ్ళడమన్నది అక్రమం అవుతుంది. కానీ అన్యాయం కాదు. కోర్టులో పరిశోధనాధికారి సాక్ష్యం కనుక నమ్మ దగ్గదిగా వుంటే కోర్టు సోదా సక్రమమేనని భావిస్తుంది.

సోదా చెయ్యడానికి పోలీసు అధికారి వెళ్ళినట్లైతే అతను దేన్నిపడితే దాన్ని సోదా చేసి స్వాధీనం చేసుకోవడానికి వీల్లేదు. ఉదాహరణకి కొన్ని నిర్దిష్టమైన దొంగిలించబడ్డ వస్తువుల కోసం కనుక సోదా జరిపివుంటే, వాటిని మాత్రమే స్వాధీన పర్చుకునే అధికారం వుంది.

ఎవరైనా సరే అక్రమసోదాని నివారిస్తే అది నేరంకాదు. పైగా అక్రమ సోదాని జరిపినందుకుగాను పోలీసు అధికారి మీద నష్టపరిహారానికి దావా వెయ్యవచ్చు. తగిన ఆధారాలు లేకుండా పోలీసులుకనుక సోదా జరిపేట్లైతే వారు నష్టపరిహారం చెల్లించవలసి

వుంటుంది.

సోదాచేసి స్వాధీన పర్చుకున్న వస్తువులను అధికారి కేసు విచారించే అధికారం వున్న మెజిస్ట్రేట్ గార్కి పంపించవలసి వుంటుంది.

తన పోలీసుస్టేషన్ పరిధిలో లేని ప్రాంతాల్లో కనుక అధికారి సోదా చేయవలసి వస్తే, ఆ ప్రాంతపు పోలీసు అధికారికి సోదా వివరాలు రాసి సోదా చెయ్యమని కోరాలి. అసలు ఇలా చెయ్యడానికి సమయంలేకపోతే అధికారి తను స్వయంగా వెళ్ళి సోదా చెయ్యవచ్చు. ఈ మేరకు సమాచారం తెలియజేస్తూ, ఆ ప్రాంతపు పోలీసు అధికారికి నోటీసు పంపవలసి వుంటుంది. సోదా చేసి స్వాధీన పర్చుకొన్న వస్తువుల వివరాలు కూడ ఆ అధికారికి తెలియచెయ్యాలి.

వారంట్ లేకుండా సోదా చేసే పద్ధతికి వారంట్‌తో సోదా చేసే పద్ధతికి తేడా ఏమీలేదు.

*పోలీసు అధికారి సోదా చేసేప్పుడు అవలంభించాల్సిన పద్ధతి*

సోదా జరిపే అధికారి తను సోదా జరుపుతున్న ప్రాంతంలో నివసిస్తున్న వ్యక్తికి గానీ ఆధిపత్యం వున్న వ్యక్తికిగానీ తను దేన్ని గూర్చి సోదా జరుపనున్నాడో తెలియ జేయాలి. ఒకవేళ వారెంట్ ఉంటే అది చూపించాలి. ఈ విషయంలో ఆ నివాసికూడా పోలీస్ అధికారికి సహకరించాల్సి వుంటుంది. ఒకవేళ పోలీసు అధికారికి సహకరించ కుండా సోదా జరపడాన్ని నివారించినట్లయితే అధికారి తలుపులుగానీ, కిటికీలుగానీ పగలగొట్టి లోపలికి ప్రవేశించవచ్చు.

ఒక్క వ్యక్తి గనుక కావలసిన వస్తువును దాస్తున్నట్లు పోలీసు అధికారికి సహేతు కమైన అనుమానం వస్తే ఆ వ్యక్తినికూడా సోదా చెయ్యవచ్చు. ఒకవేళ స్త్రీ అయిన పక్షంలో ఆమె మానమర్యాదలకి భంగం వాటిల్లకుండా మరో స్త్రీతో సోదా చేయించాలి.

సోదాజరపడానికి ముందు అధికారి ఇద్దరు లేక ముగ్గురు స్వతంత్ర వ్యక్తులని, ఆ ప్రాంతంలోని వారిని గానీ లేక దగ్గరలోని వారినిగానీ సాక్షులుగా పిలిపించాలి. వారి సమక్షంలోనే సోదా జరిపి, స్వాధీన పర్చుకొన్న వస్తువుల వివరాలు రాసి వారితో సంతకం చేయించుకోవాలి. ఇలా తయారు చేసిన జాబితాను, ఎవరి అధీనంలో వున్న ప్రాంతాన్ని సోదాచేసారో వారికి ఇవ్వాలి. ఒక వ్యక్తినుంచి కనుక స్వాధీన పర్చు కొన్నట్లైతే అతనికి ఈ ప్రతిని ఇవ్వవలసి వుంటుంది.

సోదా జరిగినప్పుడు, ఆ ప్రాంతనివాసి తన సమక్షంలో సోదా జరగాలి అని కోరేట్లైతే అతన్ని వుండనివ్వాలి. సోదా జరిపే ముందు అధికారి స్వతంత్ర వ్యక్తులని సాక్షులుగా పిలిచే ప్రయత్నం చెయ్యకపోతే, అది అక్రమ సోదా అవుతుంది.

# సెర్చ్‌వారెంట్‌తో సోదా

ఉదయం తొమ్మిదిగంటలు కావస్తోంది. ఎవరో తలుపులు కొడుతున్నారు."ఎవరు" అన్నాను. "మేం పోలీసులం తలుపులు తియ్యండి" అన్నారు బయటనించి పోలీసులు అధికార పూర్వకంగా. వెళ్ళి తలుపుతీసి గుమ్మాని కడ్డంగా నిల్చొని "ఏం కావాలి" అని అడిగాను. వాళ్ళు నాకు ఒక వారంట్ తీసి చూపించారు. అందులో ఎక్కడో దొంగిలించబడ్డ స్టీల్‌సామాను షాపు తాలూకూ వివరాలు రాసివున్నాయి. అంతేకాక మా ఇంటి వివరాలు యిచ్చి, ఆ షాపులో దొంగిలించబడ్డ సొమ్ములగురించి పోలీసులకి మా ఇంటిని సోదా చేసే అధికారం కల్పిస్తూ ఆదేశించబడింది. క్రింద మెజిస్ట్రేట్ గారి సంతకం ఉంది. కోర్టుసీల్‌వుంది. ఇహ చేసేది లేక ప్రక్కకి తొలగి పోలీసులకి సోదాచేసే అవకాశం కల్పించాను. మా ఇంట్లో దొంగసొత్తు వుండటం ఏమిటి? బహూశా ఈ మధ్య పాత బట్టలు వేసి మాఇంట్లో వాళ్ల కొన్న స్టీలు సామాన్లు దొంగసొత్తుకాదుకదా? అసలు కోర్టుకి పోలీసుల్ని కానీ యింకొకళ్ళని కానీ నా ప్రమేయం లేకుండా నాఇంట్లోకి ప్రవేశించే అధికారం కల్పించే హక్కువుందా? అని రకరకాల అనుమానాలు కలుగసాగాయి.

సెర్చ్‌వారెంట్ అంటే సోదా చెయ్యడానికి అధికారం కల్పిస్తూ పోలీసు అధికార్లకికాని, ఇతర్లగ్గాని కోర్టు ఇచ్చే ఆదేశపత్రం.

1. సోదా చెయ్యడానికి వారెంట్ యివ్వడం అన్నది రాజ్యాంగ విరుద్ధం అనుకోవడానికి వీల్లేదు. సాధారణంగా సాక్ష్యానికి అవసరమైన వస్తువులని కానీ పత్రాలని కానీ స్వాధీనపర్చుకోవడానికి వారెంట్ ఇచ్చేముందు అవి ఒక వ్యక్తి దగ్గర లేవని నిర్ధారించుకొన్న తరువాత మాత్రమే వాటిని వెతకడానికి వారెంట్ యివ్వాలి. జనరల్ స్కెర్చ్‌వారెంట్ యిచ్చి న్యాయం చెయ్యడానికి అవసరమైన వాటిని వెదికించి తెప్పించవచ్చు. సెర్చ్‌వారెంట్ యిచ్చే ముందు కోర్టు ఒక వ్యక్తి ప్రాథమిక హక్కులకి భంగం

కలగకుండా వుండేలా అన్ని ముందు జాగ్రత్తలు తీసుకోవాలి. కేవలంఒకరి అభ్యర్థనని ఆధారం చేసుకొని సెర్చ్‌వారంట్ యివ్వడం మంచిదికాదు. సరైన ఆధారాలు వున్నాయని కోర్టు విశ్వసించి, కారణాలు రాసుకొన్న తరువాత సెర్చ్‌వారంట్ యివ్వవలసి వుంటుంది. వీలైతే ఈ విషయంలో సెర్చ్‌వారంట్ కోరుతున్న వారితో ప్రమాణం చేయించుకోవాలి. ఒకవేళ ఆలస్యం జరిగేట్లైతే సెర్చ్‌వారంట్ యిచ్చి లాభం లేదనుకుంటే ఈ నిబంధనలు పాటించాల్సిన అవసరం లేదు.

ముద్దాయిని కానీ అతని యింటిని కానీ సాక్ష్యాధారాలు సేకరించడానికి సోదా చెయ్యడానికి సెర్చ్‌వారంట్ యివ్వాలనిలేదు. ఏ కోర్టయినాసరేసెర్చ్‌వారంట్‌యివ్వవచ్చు.

మెజిస్ట్రేట్ ఒక నిర్దేశించిన వస్తువును కానీ పత్రాన్ని గాని వెదకమని సెర్చ్‌వారంట్‌లో ఆదేశించవచ్చు. ఒక వస్తువునో లేదా ఒక నేరానికి సంబంధించిన సాక్ష్యాధారాల గురించి సోదా చెయ్యడానికి వారంట్ యిచ్చేట్లైతే, ఆ వారంట్‌ని అపహాస్యం పాలుకాకుండా చూసే బాధ్యత మెజిస్ట్రేట్ పైనే వుంటుంది. దీన్నిబట్టి సెర్చ్‌వారెంట్ వున్నప్పటికీ పోలీసులు ఏదిపడితే అది స్వాధీనపర్చుకోవడానికి వీల్లేదు. వారంట్‌లో సోదా ఎక్కడ జరపాలో ఏమిటో వివరంగా రాయాలి.

సాధారణంగా సెర్చ్‌వారంట్ పోలీసులకే యివ్వాలి. దగ్గరలో పోలీసులు అందుబాటులో లేకపోయినట్లైతే మరెవరికైనా యివ్వవచ్చు. అవసరమనుకొంటే మెజిస్ట్రేట్ కూడా స్వయంగా సోదా జరుపవచ్చు. లేదా తన సమక్షంలో సోదా జరిగేలా చూడవచ్చు.

దొంగసొత్తుకానివాటిని సాక్ష్యాధారాలకోసం మూడోవ్యక్తినించి స్వాధీనపర్చుకోవడానికి వీల్లేదు. అతన్నించి అవసరమనుకున్నప్పుడు కోర్టులో హాజరు పరుస్తామని హామీ తీసుకోవాలి.

సెర్చ్‌వారంట్ యిచ్చిన తరువాతకూడా కోర్టులో ఆవస్తువునుహాజరు పరుస్తామని హామీ కనుక ఇచ్చేట్లైతే సెర్చ్‌వారంట్ ఉపసంహరించుకోవచ్చు. వారంట్ తీసుకున్న తరువాత పోలీసు అధికారి వీలైనంతవరకూ పగలే సోదా జరపాలి. సెర్చ్‌వారంట్ తీసుకుని సోదా చెయ్యడం అంటే కేవలం వెదకడం వరకే పరిమితం అని అర్థం చేసుకొనడానికి వీల్లేదు. ఆ వస్తువును స్వాధీనపర్చుకోవడం కూడా. ఇలా స్వాధీన పర్చుకొన్న వస్తువుల్ని కోర్టులో దాఖలు చెయ్యవలసి వుంటుంది.

2. దొంగసొత్తుని, నకిలీ పత్రాలనీ, నోట్లని స్వాధీన పర్చుకోవడానికి యిచ్చే వారంట్: ఈ విషయంలో సోదా జరపడానికి కేవలం న్యాయమూర్తులేకాక జిల్లా కలెక్టర్లకి, ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్లకి కూడా సెర్చ్‌వారంట్ యిచ్చే అధికారం వుంటుంది. అసలే పోలీసులను చూడగానే తాము పోలీసులకి సబార్డినేట్స్‌మని అనుకొని లేచి

నిల్చునే ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్లు ఈ విషయంలో ఎంతవరకూ న్యాయంగా వ్యవహరిస్తున్నారో ఆలోచనీయం....

ఈ విషయంలో దొంగసొత్తో, నకిలీనోట్లో, పత్రాలో ఫలానాచోటవున్నాయని తెలిస్తే అవసరమైనంత మేరకు నిజనిజాలు తెల్సుకొని, వీలైతే సమాచారకుడి చేత ప్రమాణం చేయించుకొని, సెర్చ్‌వారంట్ యివ్వటం అవసరం అనుకుంటేనేయివ్వాలి. ఈ సెర్చ్‌వారంట్ పోలీసు అధికారికి మాత్రమే యిస్తారు. ఒకవేళ సెర్చ్‌వారంట్ తీసుకున్న పోలీసు అధికారి, ఆకోర్టుకానీ, ఆ మెజిస్ట్రేటు పరిధి కానీ దాటి సోదా చెయ్యవలసివస్తే ఆ వారంట్ మీద ఆ ప్రాంతపు పోలీసుఅధికారి చేతకానీ ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ చేతకానీ సంతకం చేయించుకోవాలి. అలా సంతకం చేయించుకోవడానికి ఆలస్యం అవుతుందనుకొంటే సంతకం తీసుకోకుండానే సోదా జరుపవచ్చు. ఇలా స్వాధీన పర్చుకొన్న వస్తువులని వెంటనే మెజిస్ట్రేట్ వద్దకుతీసుకువెళ్ళడమో లేదా, తీసుకువెళ్ళ లేకపోతే ఎవరికైనా స్వాధీనపర్చి అవసరమైనప్పుడు కోర్టులో హాజరు పరుస్తామని హామీ తీసుకోవాలి.

3. చట్టప్రకారం ఏదైనా ప్రచురణ, చిత్ర లేఖనం, పెయింటింగ్ శిక్షార్హం అయినదని ప్రభుత్వం కనుక ప్రకటిస్తే వాటిని స్వాధీనపర్చుకోవడానికి ఏ మెజిస్ట్రేట్ అయినా పోలీసులకి సెర్చ్‌వారంట్ యివ్వవచ్చు. ప్రభుత్వం కనుక ఏదైనా ప్రచురణ శిక్షార్హం అని ప్రకటిస్తే ఆ తేదినుంచి రెండునెలల్లోపు మాత్రమే దీన్ని గురించి ప్రశ్నిస్తూ హైకోర్టులో దరఖాస్తు చెయ్యవచ్చు.

## సాధారణ విషయాలు

వారంట్ యివ్వడానికి కానీ దాన్ని ఉపయోగించడానికి కానీ పరిధులు లేవు. భారతదేశంలో ఎక్కడైనా ఉపయోగించవచ్చు. బయిటి ప్రాంతాలకి కనుక వారంట్ పంపేట్లైతే, తనకి వచ్చిన సమాచారం తదితర వివరాలు పొందుపర్చాలి.

దొంగసొత్తుగానీ, నేరానికి సంబంధించిన ఏ వస్తువులైనా కలిగి వున్నారనుకుంటే పోలీసులు ఎవరైనా సరే వారంట్ లేకుండానే వాటిని స్వాధీన పర్చుకొని, ఆ విషయం పైఅధికార్లకి తెలియచెయ్యాలి. అంతేకాక ఈ విషయాన్ని వెంటనే కోర్టుకి పంపాలి. లేకపోతే ఎవరికైనా యిచ్చి భద్రపర్చమని, అవసరమైనప్పుడు కోర్టులో హాజరుపరుస్తామని హామీ తీసుకోవచ్చు. వారంట్ లేకుండా సోదా జరిపే పద్ధతి వారంట్‌తో సోదా చేసే పద్ధతీ ఒకటే. వారంట్ లేకుండా పోలీసులకి సోదాచేసే అధికారం సాధారణంగా వారంట్ తీసుకోవడానికి చాలినంత సమయం లేకపోతేనే కలుగుతుందని మర్చిపోవద్దు.

# అరెస్టు

సుబ్రహ్మణ్యం బట్టల మూట నెత్తిన పెట్టుకొని దగ్గరలో వున్న పల్లెకు వెడుతున్నాడు అమ్మడానికి. పల్లెకు తొందరగా చేరుకోవాలని పరిగెడుతున్నట్లు నడుస్తున్నాడు. ఇంతలో అతనిముందు రాక్షసుడిలా అకస్మాత్తుగా ఒక పోలీసు అధికారి ప్రత్యక్షమయ్యాడు. "నిన్ను అరెస్టు చేస్తున్నాం" అన్నాడు పోలీసు అధికారి.

"వారెంట్ చూపించండి" అన్నాడు సుబ్రమణ్యం. "వారెంట్ కావాలా పద పోలీసు స్టేషన్‌కి చూపిస్తాం. దొంగ సొత్తు తీసుకొని పారిపోతుంటే అరెస్టు చేస్తే వారెంట్ చూపించమంటావ్రా లం...." అని మొదలుపెట్టి నోటికొచ్చిన బూతులన్నీ తిట్టాడు పోలీసు. ఆ తరువాత సుబ్రమణ్యాన్ని బరబరా పోలీసుస్టేషన్‌కి ఈడ్చుకు వెళ్ళి లాఠీతో చితక్కొట్టి అతని వొంటిమీద తేలిన వాతలు చూపించి "ఇదిగో వారెంట్" అన్నాడు పోలీసు. ఇలా పోలీసులకి ఒకర్ని తిట్టే అధికారంకానీ, కొట్టే అధికారంకానీ, కారణం చెప్పకుండా అరెస్టుచేసే అధికారంకానీ లేదు. కానీ వారెంట్ లేకుండా అరెస్టు చేసే అధికారం కొన్ని సందర్భాల్లో పోలీసులకి వుంటుంది.

### *వారెంట్ లేకుండా అరెస్టు*

కొన్ని సందర్భాలలో పోలీసులు అరెస్ట్‌చేసే విషయమై విస్తృత అధికారాలు ఇవ్వబడినాయి. అనేక సందర్భాలలో మనము పోలీసులకున్న ఈ విస్తృత అధికారాన్ని దుర్వినియోగపరచడమే చూస్తున్నాము. ఏ అధికారికైనా కొన్ని పరిమితులుంటాయి. అలాగే పోలీసులకి వారెంట్ లేకుండా అరెస్టు చేసే అధికారం విషయంలో కూడా కొన్ని పరిమితులు విధించారు. కొన్ని సందర్భాలలో మాత్రమే పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు. ఈ రకమైన అధికారం పోలీసులకి చట్టంలో కల్పించడానికి కారణం మేజిస్ట్రేట్‌నుండి ఉత్తర్వులు తీసుకోవడానికి తగినంత సమయము లేనప్పుడు నేర నివారణకోసం పోలీసులు అరెస్టు చేయవచ్చు. అంతేకాక కొన్ని నేరాలలో నేరస్థుడు న్యాయస్థానాలలో జరిగే విచారణని ఎదుర్కోకుండా తప్పించుకునే అవకాశం లేకుండా చేయడానికి అరెస్టు చేయవచ్చు. వారెంట్ లేకుండా ఏ పోలీసు అధికారయినా అరెస్టు చేయవచ్చు. ఎవరైనా ఒకవ్యక్తి కాగ్ నిజబుల్ (పోలీసులకి వారెంట్ లేకుండా నేరస్థుడిని అరెస్టుచేసే అధికారం వున్న) నేరం చేసినట్లయితే వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు. అంతేకాక కాగ్‌నిజబుల్ నేరంతో సంబంధం ఉందని పోలీసులు భావిస్తే కూడా అరెస్టు చేయవచ్చు. ఒక కాగ్‌నిజబుల్ నేరం జరిగిందని సరయిన ఆరోపణవచ్చి వున్నా పోలీసులు అరెస్టు చేయవచ్చు. ఈ ఆరోపణ పోలీసులకేకాక మేజిస్ట్రేట్‌కి వచ్చి ఉండి దానిపై ఆయన చర్య తీసుకొనేప్పుడైనా పోలీసులు అరెస్టు చేయవచ్చు. కాగ్‌నిజబుల్ నేరానికి సంబంధించి వచ్చిన ఆరోపణపై పోలీసు అధికార్లకి ఏదైనా అనుమానం ఉండేట్లయితే ముద్దాయిని వారెంట్ లేకుండా అరెస్టు చేయడం సరయిందికాదు. ఒక వ్యక్తి కాగ్‌నిజబుల్ నేరం చేశాడనికాని లేక ఆ నేరంతో సంబంధం ఉందనికాని పోలీసులకి సమాచారం వచ్చిఉండేట్లయితే ఆ వ్యక్తిని పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు.

సహేతుకమైన అనుమానం కలిగినపుడు పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు. ఉదాహరణకి ఒకవ్యక్తి బట్టలమూట నెత్తిన పెట్టుకొని వెళుతున్నాడనుకొందాము. ఎవరైనా పోలీసు అధికారి ఆ వ్యక్తి పట్టుకు వెళుతున్న బట్టలు దొంగసొత్తని కనుక అనుమానించేట్లయితే అతనిని అరెస్టు చేయవచ్చు. సాధారణంగా పోలీసులు తమ వ్యక్తిగత శత్రువులను అరెస్టుచేసి ఏదో ఒక కేసు బనాయిస్తున్నారు. అందుకని అనేక కోర్టులు ఈ విషయంలో ఆందోళన వ్యక్తం చేశాయి. పోలీసులు తమ వ్యక్తిగత శత్రువులని అరెస్టు చేసేట్లయితే ఆ అరెస్టు న్యాయమైందని విశ్వసించి చేసిన చర్యగా రుజువుచేసుకొనవలసి వుంటుంది.

ఎవరైనా ఒక వ్యక్తి ఇళ్లల్లో జొరబడాలని అనుకుంటున్నట్లుగా పోలీసులకి సమాచారము అందేట్లయితే లేక ఇళ్ళు దోచుకోడానికి అవసరమైన వస్తువులు ఎవరైనా కలిగివున్నారని అనుకున్నట్లయితే పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు. ఇలా అరెస్ట్ చేయడానికి ముందు ఇళ్ళు దోచుకోడానికి అవసరమైన వస్తువులు సోదా జరిపినమీదట లభించకపోయినట్లయితే అరెస్ట్ చేయడానికి వీలులేదు.

ఎవరైనా దొంగసొత్తు కలిగి ఉన్నా లేక కలిగిఉన్నారని పోలీసులు అనుమానించినా పోలీసులు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చును.

ఒక పోలీసు అధికారి తన విధులు నిర్వహిస్తుండగా ఎవరైనా అతన్ని అడ్డగించేట్లయితే అడ్డగించిన వ్యక్తిని వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు. ఉదాహరణకి ఒక పోలీసు అధికారి X అనే వ్యక్తిని అరెస్ట్ చేయడానికి వెళ్ళాడు. అప్పుడు అక్కడేవున్న Y ఆ పోలీసు అధికారిని Xని అరెస్ట్ చేయకుండా అడ్డగించాడు. దాంతో పోలీసు అధికారి Yని అరెస్ట్ చేశాడు.

మిలటరీ నుంచి, నావీ నుంచీ, ఎయిర్‌ఫోర్స్ నుంచీ ఉద్యోగం చేస్తున్న వ్యక్తి పారిపోయి వచ్చేట్లయితే పోలీసులు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు.

భారతదేశానికి బైట నేరం చేశాడనిగానీ, చేసినట్లు అనుమానించినాగానీ లేక సమాచారం వచ్చినాగానీ పోలీసులు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు. ఎక్కడో అమెరికాలో దొంగతనంచేసి, ఖూనీలుచేసి భారతదేశం వచ్చి సుఖంగా బ్రతుకుదామంటే కుదరదు.

వేరే పోలీసు స్టేషను నుంచి వ్రాతపూర్వకంగా గానీ మౌఖికంగాగానీ ఒక వ్యక్తిని అరెస్ట్ చేయమని, అక్కడ పోలీసు స్టేషన్ అధికారి కనక కోరేట్లయితే వారెంట్ లేకుండా ఆ వ్యక్తిని అరెస్ట్ చేయవచ్చు. ఇట్లాంటి సమాచారము కనుక ఇతర పోలీసు స్టేషన్లనుండి వచ్చేట్లయితే అరెస్ట్ చేయవలసిన వ్యక్తి వివరాలు ఏ నేరం క్రింద అరెస్ట్ చేయాలో తెలుసుకోవాల్సిఉంటుంది. టెలిఫోన్‌ద్వారా కాని వైర్‌లెస్‌ద్వారా

కాని సమాచారము వచ్చినపుడు కూడా అరెస్ట్ చేయవచ్చు. అంటే వరంగల్‌లో ఉన్న ఒక వ్యక్తిని అరెస్ట్ చేయమని హైదరాబాద్ పోలీసును వరంగల్ పోలీసులు కోర వచ్చు. అప్పుడు వరంగల్ పోలీసులు వారెంట్ లేకుండా ఆ వ్యక్తిని అరెస్ట్ చేయవచ్చు.

ఎవరైనా ఒకవ్యక్తి చట్టబద్ధమైన నిర్బంధంనుండి పారిపోయినట్లయితే పోలీసులు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు. ఎవరైనా ఒకవ్యక్తికాని, కొందరు వ్యక్తులుకాని కాగ్నిజబుల్ నేరము చేయదలచారని పోలీసులకు సమాచారము తెలిసినట్లయితే వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు. అలవాటుపడిన నేరస్థులను కూడా పోలీసులు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు.

ఎవరైనా ఒకవ్యక్తి నాన్‌కాగ్నిజబుల్ నేరము (వారెంట్ లేకుండా పోలీసులు నేరస్థుడిని అరెస్ట్ చేయడానికి వీలులేని నేరము) పోలీసు అధికారి ముందు చేసినా లేక ఆ నేరంలో ముద్దాయి అయివున్నా పోలీసు అధికారి అతని పేరూ చిరునామా అడిగినపుడు చెప్పటానికి నిరాకరించేట్లయితే పోలీసులు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు.

ఈ విధంగా అరెస్ట్ చేయబడ్డ వ్యక్తి అసలైన పేరు, చిరునామా తెలుసుకోగానే పోలీసులు అతనిని బెయిలు మీద విడుదల చేయాల్సివుంటుంది.

## అరెస్టు చేసే అధికారం

ఫస్ట్ తారీఖున రాజయ్య మార్కెట్ కేసి వెడుతున్నాడు. అతని చేతిలో సంచి వుంది. తొడుకున్న చొక్కా జేబుల్లోంచి వంద రూపాయల నోట్లు కనిపిస్తున్నాయి. ఇరానీ హోటల్ ముందు సిగరెట్ కాలుస్తూ నిల్చొన్న రమణయ్య దృష్టి రాజయ్య మీద పడింది. మంచి బేరం తగిలిందనుకొన్నాడు రమణయ్య, రాజయ్యననుసరించాడు. రమణయ్య అదృష్టం బాగుంది. రాజయ్య మెయిన్‌రోడ్డున కాక అడ్డదారంట నడవసాగాడు.

హైస్కూల్ ప్రక్కన వున్న చింతలదారంట నడవసాగాడు. చుట్టూ ఎక్కడా నరసంచారం లేదు. ముందు రాజయ్య, వెనక రమణయ్య తప్ప ఎవరూ లేరు. రమణయ్య నడక వేగం పెంచాడు. రాజయ్యని దాటి నాలుగు అడుగులు వేశాడు. చటుక్కున జేబులోంచి కత్తిదూశాడు. బటన్ ప్రెస్‌చేసి వెనక్కు తిరిగి "తియ్యి డబ్బులు" అని రాజయ్యని బెదిరించాడు. రాజయ్య భయంతో నిలువునా ఒణికి పోయాడు.

"డబ్బులా....డబ్బులా" అని నీళ్ళు నమిలాడు రాజయ్య. తన జేబులో వున్న డబ్బులు తన నెల జీతం. అవి పోయేట్లయితే ఇంకా ఏమైనావుందా అనుకొని తెగించి "దొంగ దొంగ" అని అరిచాడు రాజయ్య. ఊహించని ఈ పరిణామానికి కంగారు పడ్డ రమణయ్య కత్తితో రాజయ్యని పొడిచి డబ్బు తీసుకొని పారిపోబోయాడు. ఇంతలో అరుపులు కేకలు విని అటుకేసి వస్తూ ఇదంతా చూసిన స్కూల్ వాచ్‌మెన్ రమణయ్యను పట్టుకున్నాడు. రమణయ్య గింజుకుంటూ "నువెవరివి నన్ను పట్టుకోడానికి" అన్నాడు.

పోలీసులు కాక మరెవ్వరైనాసరే అరెస్టు చేయవచ్చా? పోలీసులు కాక నువ్వు నేను కూడా అరెస్టు చెయ్యవచ్చు. అయితే ఈ అరెస్టు చేయడం అనేటువంటి విషయంలో కొన్ని నిబంధనలు వున్నాయి. ఎప్పుడు పడితే అప్పుడు ఎవరిని పడితే వాడిని అరెస్టు చేయడానికి వీలులేదు. కొన్ని సందర్భాలలో మాత్రమే అరెస్టు చెయ్యవచ్చు. ఒక కాగ్నిజబుల్ నేరం (పోలీసులకు వారెంట్ లేకుండా అరెస్టుచేసే అధికారం వున్న నేరం) అరెస్టుచేస్తున్న వ్యక్తి సమక్షంలో జరిగివుండాలి. అదైనా బెయిలబుల్ నేరం అయి వుండకూడదు. బెయిలబుల్ నేరం అంటే పోలీసులకి ముద్దాయిని జామీనుపై విడుదల చేసే అధికారం వున్న నేరం.

ఇక్కడ మూడు విషయాలను మనం దృష్టిలో వుంచుకోవాలి. 1. కాగ్నిజబుల్ నేరం చేసి వుండాలి. 2. ఆ నేరం అయినా అరెస్టు చేస్తున్న వ్యక్తి సమక్షంలో జరిగి వుండాలి. 3. ఆ నేరం కాగ్నిజబుల్ మాత్రమే కాక నాన్‌బెయిలబుల్ కూడా అయివుండాలి. ఇంతకు ముందు మనం చెప్పుకున్న ఉదాహరణలో రమణయ్య రాజయ్యని కత్తితో పొడిచి జేబులోంచి డబ్బు దొంగిలించాడు. దొంగతనం చెయ్యడం హత్యాప్రయత్నం రెండూ కాగ్నిజబుల్ నేరాలే (రెండు నేరాల్లోకూడా పోలీసులు నేరస్థుడిని వారెంట్ లేకుండా అరెస్టు చేయవచ్చు). అంతేకాక రమణయ్య చేసిన నేరం నాన్‌బెయిల్‌బుల్ కూడా (అరెస్టు చేసిన తరువాత పోలీసులే జామీనుపై విడుదల చేసే నేరం కాదు). బెయిలబుల్ నేరం విషయంలో ముద్దాయి జామీనుపై విడుదల అవడం అనేది అతని హక్కు.

స్కూల్ వాచ్‌మన్ వస్తూ రమణయ్య ఈ నేరం చెయ్యడం చూశాడు కనుక రమణయ్యని అరెస్టు చెయ్యవచ్చు.

పోలీసులు ఒక కాగ్నిజబుల్ నేరం చేశాడని అనుమానించినప్పుడు కూడా వారెంట్ లేకుండా అరెస్టు చెయ్యవచ్చు. కాని ఒక ప్రైవేటు వ్యక్తి మాత్రం అనుమానం మీద అరెస్టుచేయడానికి వీలులేదు.

ప్రైవేటు వ్యక్తి తన సమక్షంలో నేరం జరిగినప్పుడు వెంటనే నేరస్థుడిని అరెస్టు

చేయవచ్చు. కాని నేరం జరిగిన చాలా రోజుల తరువాత నేరస్థుడిని అరెస్టు చేయడానికి వీలులేదు. కోర్టు ఎవరినైనా నేరస్థుడని నిర్ధారించి ప్రకటించినపుడు ఎవరైనా సరే ఆ వ్యక్తిని అరెస్టు చేయవచ్చు.

ఈ రకమైన అరెస్టు స్వయంగాకానీ లేక ఇతరుల చేతకానీ చేయించవచ్చు. అంటే రమణయ్యని స్కూల్ వాచ్‌మన్ తను స్వంతంగానే కాకుండా ఇతరులచేత కూడా అరెస్టు చేయించే వీలువుంది. ఇలా అరెస్టు చేసిన వ్యక్తిని తను స్వయంగా తీసుకు వచ్చి పోలీసుస్టేషన్‌లో అప్పగించనైనా అప్పగించాలి. లేదా మరెవరి చేతనైనా పోలీసు స్టేషన్‌కి పంపించే ఏర్పాటు చెయ్యాలి. అరెస్టు చేసిన వ్యక్తిని అనవసరమైన ఆలస్యం చెయ్యకుండా పోలీసులకి అప్పగించాలి. ఒకవేళ అనవసరమైన ఆలస్యం చేసేట్లయితే అది శిక్షార్హం అయిన నేరంగా పరిణమిస్తుందని మరచిపోవద్దు.

అరెస్టు చెయ్యబడ్డ వ్యక్తిని పోలీసులకి అప్పగించిన తర్వాత పోలీసు అధికారి కనుక అతను కాగ్నిజబుల్ నేరానికి పాల్పడ్డాడనుకుంటే మాత్రం అతన్ని తిరిగి అరెస్టు చెయ్యవచ్చు. లేదా వెంటనే విడిచి పెట్టాలి.

ప్రైవేటు వ్యక్తులు అరెస్టు చెయ్యడానికిగానీ, పోలీసులు అరెస్టు చేయడానికి కానీ అవలంబించాల్సిన పద్ధతి ఒకటే. అరెస్టు చేసేప్పుడు అరెస్టు చెయ్యబడుతున్న వ్యక్తి తిరగబడే ప్రమాదం వుంటుంది. అలాంటప్పుడు అవసరమైన మేరకు హింసించవచ్చు. హింస మితిమీరేటట్లయితే శిక్షార్హం అవుతుంది. సాధారణంగా దొంగలను పట్టుకొన్నప్పుడు మనలో అందరికి అతన్ని కొట్టే అధికారం వున్నట్టుగా తలా ఒక దెబ్బవేస్తాం. ఇలా కొట్టడం అన్యాయం, శిక్షార్హం అని మరిచిపోవద్దు. కానీ దొంగని పట్టుకున్నప్పుడు అతను పారిపోయే ప్రయత్నం చేస్తే దాన్ని నివారించడానికి అతన్ని కట్టివేయడమో లేక గట్టిగా దెబ్బతీసి మూర్ఛపోయేలా చెయ్యడమో చేస్తే అది తప్పుకాదు. ఇలా అరెస్టు చేసేప్పుడు నేరస్థుడిని ఏ పరిస్థితుల్లో కూడా చంపడానికి వీల్లేదు. ఉద్దేశ పూర్వకంగా చేసే ఏ నేరం ఐనా శిక్షార్హమే.

## మేజిస్ట్రేటుచే అరెస్టు

మేజిస్ట్రేటు సమక్షంలో నేరం జరిగినట్లైతే ఆయన స్వయంగా అరెస్టు చేయవచ్చు. లేదా అరెస్టు చెయ్యమని ఆదేశించవచ్చు. ఈ అధికారం ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేటుకు కూడా వుంటుంది. ఇక్కడ ప్రధానంగా అవసరమైన నిబంధన లేమిటంటే 1. మేజిస్ట్రేటు సమక్షంలో నేరం జరిగి వుండాలి. 2. ఆ నేరం మేజిస్ట్రేట్ అధికార పరిధిలో జరిగివుండాలి. ఇలా అరెస్టు చేసినప్పుడు మేజిస్ట్రేట్ ముద్దాయిని బెయిల్ మీద విడుదల చెయ్యడమో లేదా జైలుకి పంపడమో చెయ్యవచ్చు.

ఇంకో సందర్భంలో కూడా మేజిస్ట్రేట్ స్వయంగా అరెస్టు చెయ్యవచ్చు. ఎవరి అరెస్టును గురించి అయితే మేజిస్ట్రేట్ వారెంట్ ఇచ్చే అధికారం వుంటుందో ఆ వ్యక్తిని స్వయంగా అరెస్టు చెయ్యవచ్చు. లేదా అరెస్టు చెయ్యమని ఆదేశించవచ్చు. ఒక కేసులో ముద్దాయి అయిన వ్యక్తి కోర్టుకు వచ్చి సరండర్ అయ్యాడని మనం తరచు వింటూవుంటాం. ఇలా సరెండర్ అయిన వ్యక్తిని మేజిస్ట్రేట్ అరెస్టుచేసి జైలుకు పంపుతారని దీన్నిబట్టి స్పష్టం అవుతోంది.

## అరెస్టు ఎట్లా చేస్తారు?

రామయ్య అడవిలోకి కట్టెలు కొట్టడానికి వెడుతున్నాడు. ఫారెస్టువాళ్ళు ఎక్కడ చూస్తారోనని భయం భయంగా వెడుతున్నాడు. 'ఆగక్కడ' అని అరిచారెవరో అతని వెనకనించి. టక్కున ఆగిపోయాడతను. వొణుకుతూ వెనక్కి తిరిగి చూశాడు. చేతిలో తుపాకుల్తో కాకి బట్టల వాళ్ళు పదిమంది నిల్చొని ఉన్నారు. వాళ్ళు ఫారెస్టువాళ్ళో పోలీసులో అతనికి అంతుబట్టలేదు. భుజంమీద గొడ్డలి తీసి ప్రక్కకి విసిరేశాడు. పరుగు లంకించుకున్నాడు. వెనక అతనికి అర్ధంకాని భాషలో 'ఫైర్' అని వినిపించింది. ధన్ ధన్ మంటూ తుపాకులు పేలాయి. 'అమ్మా' అని అరుస్తూ నేలకొరిగాడు. చెట్లమీద నించి పక్షులు గోలగోలగా అరుస్తూ ఎగిరి పోయాయి.

మర్నాడు ప్రముఖ నక్సలైట్ నాయకుడు రామయ్యను పోలీసులు అరెస్టు చెయ్యబోగా అతను పోలీసుల మీద కాల్పులు జరిపాడనీ, పోలీసులు తిరిగి కాల్పులు జరపగా అతను అక్కడిక్కడే మరణించాడు అని అన్ని పత్రికల్లోను ఒక వార్త వెలువడింది.

ఈ వార్తలో నిజానిజాలు అటుంచి అసలు పోలీసులకి ఎవరైనా అరెస్టు చేసేటప్పుడు చంపే అధికారం ఉందా? పోలీసులేకాని, ఎవరైనాకానీ అరెస్టు చేసేప్పుడు అరెస్టు చేయ్యదలచిన వ్యక్తిని చంపే అధికారం లేదు. అరెస్టుకు అవసరం అయిన చర్యలు తీసుకోవచ్చు. ఒకవ్యక్తిని నిర్బంధించాలన్న ఉద్దేశంతో అతన్ని అంటుకోవడం కానీ అతన్ని నిర్బంధించడం కోసం చేసే చర్యకానీ అరెస్టు అవుతుంది. అంటే ఒక వ్యక్తిని స్వాధీనపర్చుకోవడం అన్నమాట. అంతేకాక ఎవరైనా సరే తనకి తానుగా స్వాధీనం అయినప్పుడు అతన్ని నిర్బంధంలోకి తీసుకోవడం కూడా అరెస్టే అవుతుంది. ఈ స్వాధీనం అనేటువంటిది నేరం ఆమోదిస్తూ పోలీసు అధికారితో మాట్లాడినా సరిపోతుంది. కేవలం అనుమానం మీద ఎవరి మీదైనా పోలీసులు నిఘావేసి ఉంచినట్లయితే అది అరెస్టు కాదు.

చాలామందికి కోర్టు ఆవరణలో ఒకవ్యక్తిని అరెస్టు చేయడానికి వీల్లేదన్న అభిప్రాయం వుంది. సివిల్ కేసులో పోలీసులు కోర్టు ఆవరణలో అరెస్టు చెయ్యడానికి వీల్లేదు. కాని క్రిమినల్ కేసులో కోర్టులో అరెస్టు చెయ్యవచ్చు. సాధారణంగా పోలీసులు ఎక్కడైనా నేరం జరిగిందంటే చాలు, ఆ నేరం ఎవరు చేశారు. ఏమిటి అన్న విషయం పరిశోధించకుండా పాత నేరస్తులని పట్టుకోవడమో లేక వాళ్ళకి అనుమానం వున్న వాళ్ళని పట్టుకోవడమో చేస్తుంటారు. ఇలా అరెస్టు చెయ్యదలుచుకొన్నప్పుడు పోలీసులు ఏ శ్రమా తీసుకోకుండానే హాయిగా వాయిదాలనాడు కోర్టుల్లో బీటు వేసి తమకి కావల్సిన వాళ్ళని పట్టుకుంటున్నారు. ముఖ్యంగా వరంగల్ లాంటి చోట్ల యువకుల మీద పోలీసులు అనేక తప్పుడు కేసులు బనాయించడమే కాకుండా ఆ కేసులకి వాళ్ళు హాజరుకాకుండా కోర్టుల్లోంచే పట్టుకుపోతున్నారు. దీనితో ఏ కేసులో అయితే వాళ్ళు హాజరు కావడానికి కోర్టుకి వచ్చారో ఆ కేసులో హాజరుకాలేక పోతున్నారు. హాజరుకానందుకు గను కోర్టు అతని అరెస్టు గురించి వారెంట్ ఇస్తుంది. ఒక్కొక్కసారి పోలీసులు జాలి దలచి వారెంట్ ఆధారంగా వాళ్ళని తీసుకువచ్చి కొన్ని రోజుల తరువాత గానీ కోర్టుల్లో హాజరుపర్చక పోవడమో లేదా ఇంకో కేసు ఏదైనా బనాయించి హాజరు పర్చటమో చేస్తున్నారు. దీంతో మొదటి కేసులో వున్న బెయిల్ కూడా కాన్సిల్ అయిపోతుంది. కోర్టు దృష్టిలో ముద్దాయి పరారు అయినట్టే లెక్క. అందుచేత సాధారణంగా మళ్ళీ బెయిల్ దొరికే అవకాశాలు తక్కువ. కోర్టులో అరెస్టుచేసే అధికారాన్ని పోలీసులు దుర్వినియోగ పరుస్తున్నారు. తనమీద వచ్చిన ఆరోపణకి సమాధానం చెప్పుకొనే అవకాశం ప్రతి పౌరుడికీ ఉండాలి. తనకి వ్యతిరేకంగా కోర్టులో ఏం జరుగుతుందో తెలుసుకొనే స్వేచ్ఛకూడా ఉండాలి. సభ్యసమాజం ఇవి ముద్దాయికి ఉండాల్సిన కనీసం హక్కులుగా భావిస్తుంది. ఈ హక్కులని పోలీసులు కాలరాయకుండా చూడాల్సిన బాధ్యత న్యాయస్థానాలమీద ఉంది.

అరెస్టుచేసిన అధికారి వెంటనే గొలుసులతోనో, తాళ్ళతోనో కట్టి పడేయాల్సిన పనిలేదు. ఆ తరువాత నిర్బంధానికి అవసరం అనుకుంటేనే హ్యాండ్‌కఫ్స్ తగిలించవచ్చు.

ఒక దొంగని అరెస్టు చెయ్యడానికి వెళ్ళినప్పుడు పోలీసులని చూడగానే అతను పారిపోతుండేట్లయితే ఏ లాఠీతోనో అతన్ని గాయపర్చి పారిపోకుండా నివారించి అరెస్టు చెయ్యవచ్చు. అరెస్టు నించి తప్పించుకోవాలన్న ఉద్దేశంతో అరెస్టు నివారించే ప్రయత్నంచేసే వారి విషయంలోనే ఈ నిబంధన వర్తిస్తుంది. మరణశిక్ష కానీ జీవిత ఖైదు కాని విధించేటువంటి నేరాలకి పాల్పడిన వారి విషయంలో మాత్రం అరెస్టు చేసే క్రమంలో అవసరం అయితే వారిని చంపవచ్చు.

**శిక్షార్హమైన అక్రమ అరెస్టు :**

ఒకవేళ తనకి అరెస్టుచేసే అధికారం ఉందని విశ్వసించి కనుక అరెస్టు చేసేట్టయితే అది అక్రమ అరెస్టు అయినప్పటికీ శిక్షార్హంకాదు. పోలీసు అధికారి దురుద్దేశంతో కనుక అరెస్టుచేసి నిర్బంధించేట్లయితే ఆ అధికారి శిక్షార్హుడవుతాడు. అక్రమ అరెస్టుని నివారించడానికి ప్రయత్నిస్తే అది నేరం కాదు. పోలీసు అధికారి అరెస్టుచేసేప్పుడు చంపే ప్రమాదం ఉందనుకుంటే ఆ హత్యని నివారించడానికి అధికార్ని గాయపర్చేట్లయితే నేరంకాదు. ఉదాహరణకి మరణశిక్షకానీ యావజ్జీవ ఖైదుకానీ పడని నేరం చేసినప్పుడు, అరెస్టు చెయ్యడానికి వచ్చిన అధికారి కనుక తనని తుపాకితో కాల్చ ప్రయత్నిస్తే దాన్ని నివారించడానికి ఆత్మరక్షణకోసం అధికార్ని గాయపర్చ వచ్చు. అరెస్టు చేసిన అధికారి తను ఏ సమయంలో అరెస్టు చేసింది ఏ ప్రాంతంలో అరెస్టు చేసింది కోర్టుకు తెలియచెయ్యాలి. ఈ మేరకు అతను సాక్ష్యాధారాలు కూడా సమర్పించాలి.

**అరెస్టు చెయ్యడానికి సెర్చ్**

తను ఎవరినైతే అరెస్టు చేయదలిచాడో, ఆ వ్యక్తి ఇంట్లోనే ఉన్నాడను కొనేట్లయితే అతనికోసం ఆ ఇల్లు సోదాచేసే అధికారం ఉంటుంది. ఇళ్లు సోదాచేసేప్పుడు, ఆ యింటి యజమానికి తాను సోదా చేయనున్నట్లుగా తెలియజెయ్యాలి. ఆ ఇంటి యజమాని కూడా సోదా చెయ్యడానికి తోడ్పడాలి. ఒకవేళ తలుపులు కనుక మూసివుండేటట్లయితే వాటిని పగలగొట్టే అధికారం సోదాచేసే అధికారికి ఉంటుంది. ఘోషాల్లో స్త్రీలు కనుక ఆ ఇంటిలో ఉండేటట్లయితే అధికారి వారికి పక్కకు తొలగే అవకాశం కల్పించాలి. కాని, 'నువ్వు నేను అరెస్టు చెయ్యాల్సిన వ్యక్తివేమో' నని ముసుగు తొలగించి చూడడానికి వీల్లేదు.

అరెస్టు చెయ్యడానికి వచ్చిన అధికార్ని నిర్బంధించేటట్లయితే ఆ అధికారికి తలుపులు పగులగొట్టుకొని బయటకు వచ్చే అధికారం ఉంది. పోలీసులకి అరెస్టుచేసే క్రమంలో విస్తృతమైన అధికారాలు ఉన్నాయని స్పష్టం అవుతోంది. ఈ అధికారాల్ని దుర్వినియోగపర్చకుండా చూసే బాధ్యత న్యాయస్థానాల మీదే ఉంటుంది. అరెస్టు చెయ్యడం కోసం తలుపులు దర్వాజాలు విరగ్గొట్టే అధికారం ఉందంటే అసలు ఇళ్ళే కూలదోస్తున్నారు. అవసరమైన మేరకు గాయపర్చి నిర్బంధంలోకి తీసుకోవచ్చంటే ప్రాణాలు తీస్తున్నారు. సామాన్యపౌరుడు ఈ విషయంలో ఏమీ చెయ్యలేకుండాఉన్నాడు. న్యాయస్థానాలే వీటిని నివారించగలవు. న్యాయస్థానాలూ, న్యాయవాదులూ, పోలీసులు చేస్తున్న పనులు తనిఖీ చెయ్యాలి. చట్టానికి పోలీసులు కట్టుబడి పనిచేసేలా చూడాలి.

## లాకప్

రాముల్ని పోలీసులు పట్టుకొన్నారు. రాముల్ని పట్టుకొన్నప్పుడు అతని ఇంట్లోవాళ్ళు ధైర్యంచేసి "మావాడిని ఎందుకు పట్టుకొన్నారు?" అని అడిగారు. పోలీసులు కోపంగా పళ్ళు పటపటా నూరుతూ "రండి పోలీసు స్టేషన్‌కి చెబుతాం"

అన్నారు. పోలీస్ స్టేషన్ అనగానే వాళ్ళకి భయంతో వెన్నులోంచి చలి పుట్టు కొచ్చింది. ఎవరూ ధైర్యంచేసి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళలేదు. రాముల్ని వాళ్ళు బలి పశువులా బరాబరా ఈడ్చుకుపోయి ఒక చీకటికొట్లో పడేశారు అది పగలో రాత్రో తెలవట్లేదు. అతనితో పాటు మరో ముగ్గురుకూడా వున్నారు. చౌరస్తాలోని మునిసిపల్ టాయిలెట్‌లా కుళ్ళుకంపుకొడుతోంది. ముగ్గుర్లో ఎవరైనా ప్రక్కకు తిరిగితే చాలు యింకొకర్ని ఢీ కొంటున్నారు. మహా ఇరుగ్గా వుంది. రాములు పోలీసులు తనని బ్రతికుండగానే పాతేసినట్లుగా బాధ పడ్డాడు. అసలు తను ఏ నేరం చెయ్యకుండా పోలీసులు ఎందుకు అరెస్టు చేశారో అర్థం కాలేదు. ఒక ఖైదీని బయటకు తీసుకు వెళ్ళ డానికి వచ్చిన కానిస్టేబుల్ని "అన్నా, నన్నెందుకు పట్టుకొచ్చారు" అని అడిగాడు.

"కొంచెం ఆగితే తెలుస్తుంది" అని కసురుకొని వెళ్ళిపోయాడు. కానిస్టేబుల్ బయటకు తీసుకువెళ్ళిన ఖైదీని పోలీసులు నానా బూతులు తిడుతూ కొడుతున్న చప్పుడు వినిపించింది. భయంతో నిలువునా ఒణికిపోయాడు రాములు. ఎలాగైనా సరే ఈ నరకం నుంచి బయట పడాలనుకొన్నాడు. బయట అటూ ఇటూ తిరుగుతున్న సెంట్రీని పిలిచి రెండు వేళ్ళు చూపించాడు. తిట్టుకొంటూ లాకప్ తాళాలు తీసి అతన్ని బయటకు తీసుకువెళ్ళాడు. పాకిదొడ్లోంచే పరుగు లంకించుకొన్నాడు రాములు.

ఇక్కడ మనకు రెండు ప్రశ్నలు ఉదయిస్తాయి. 1) లాకప్ ఎట్లా ఉండాలి? 2) కారణం చెప్పకుండా నిర్బంధించవచ్చా? ఇలా కారణం చెప్పకుండా నిర్బంధిస్తే, ఆ నిర్బంధం నించి పారిపోవడం నేరం అవుతుందా? ఈ ప్రశ్నలకి సమాధానం మీదే రాములు శిక్షార్హుడా కాదనని తేలేది.

పోలీసులు అరెస్టు చేసి లాకప్‌లో పెట్టడాన్ని కస్టడీలోకి తీసుకోవడం అని కూడా అంటారు. ఒకానొకప్పుడు ఒకవ్యక్తిపైన ఏదైనా ఆరోపణ వచ్చి ఉండేట్లైతే, ఆ వ్యక్తికి ఎవరూ ఏ రకమైన అపాయము తలపెట్టకుండా వుండటానికి వీలుగా అతన్ని కస్టడీలోకి తీసుకొనేవారు. అంతేకాక నేర పరిశోధనకి, నేరస్తుడినుంచి అవసరమైన సమాచారం సేకరించడానికి కూడా అతన్ని కస్టడీలోకి తీసుకొనేవారు. ఇక్కడ ఇంకో విషయం కూడా యిమిడి వుంది. నేరస్తుడు నేర పరిశోధనకి అవసరమైన ఆధారాలు నిర్మూలించకుండా వుండడానికి గానూ అతన్ని నిర్బంధిస్తారు. అన్నింటికంటే ముఖ్యమైన కారణం ఏమిటంటే నేరస్తుడు నేర విచారణ నించి పారిపోకుండా చూడడం. ఈ మూడు కారణాల చేతనే ఒక వ్యక్తి నేరస్తుడని నిర్ధారణ కాక ముందే పోలీసులకి, న్యాయస్థానాలకి జైళ్ళకి నిర్బంధించే అధికారం ఏర్పడింది.

సుప్రీంకోర్టు 1980లో ఖైదీలకి కూడా ప్రాథమిక హక్కులుంటాయి అని తీర్పు చెప్పింది. అలాగే 1982లో లాకప్‌లలోనూ ఖైదుల్లోనూ స్త్రీల పరిస్థితుల

గురించి స్వయంగా పరిశీలించి, ఒక జర్నలిస్టు ప్రచురించిన వార్తని రిట్ పిటీషన్‌గా భావించి సుప్రీంకోర్టు కొన్ని ఆదేశిక సూత్రాలు జారీ చేసింది.

లాకప్‌లో వున్న వ్యక్తిని తాళ్ళతో కట్టి పడెయ్యడానికి వీలులేదు. హ్యాండ్ కప్స్ తగిలించకూడదు. లాకప్‌లోని వ్యక్తిని చిత్రహింసలు పెట్టడానికి వీల్లేదు. ఒక వేళ ఎవర్నైనా అరెస్టుచేసి పోలీసులు కనుక లాకప్‌లో పెట్టి హింసిస్తే అది నేరం. పోలీసులు గనుక ఈ నేరం చేసేట్లయితే వారిపైన అభియోగం మోపి విచారణ జరిపి శిక్షింపవచ్చు.

ఏ మనిషినైనా విచారణ లేకుండా శిక్షించే అధికారం ఎవరికీ ఉండదు. అలా కనుక శిక్షించేట్లయితే ఆటవిక రాజ్యం కొనసాగుతున్నట్లే. లాకప్‌లో వున్న ఖైదీలని వాళ్ళ దగ్గర బంధువులను, స్నేహితులను కలువనీయవచ్చు. దీని ద్వారా వాళ్ళకి అవసరమైన న్యాయ సహాయం తీసుకోవడానికి వీలు కల్పించాలి. 1982లో సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పులో ప్రతి లాకప్‌లోను ఖైదీల హక్కులను తెలియజేసే పట్టికని గోడకు వేలాడదీయాలని ఆదేశించారు. ఈ ఆదేశాల ప్రకారం ఖైదీలకి న్యాయసహాయం ఏర్పరిచే బాధ్యత పోలీసులపైనే వుంటుంది. అంతేకాక ఖైదీలకి వైద్య సహాయం కూడా కల్పించాలి. స్త్రీ ఖైదీల విషయంలో వారిని అరెస్టు చేసేటప్పుడు ఆడ పోలీసులే అరెస్టుచేయాలి. లాకప్ ముందర కావలిగా ఆడవాళ్ళనే ఉంచాలి. ఖైదీలకు అవసరమైన భోజన తదితర సౌకర్యాలు చూడవలసిన బాధ్యత పోలీసుల మీదే వుంటుంది. దీనికి అవసరమైన డబ్బు రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన నిధుల నుండి ఖర్చు చేస్తారు. అయితే పోలీసులు చాలా మందిని అక్రమంగా నిర్బంధిస్తున్నారు గనుక ఈ డబ్బు అందరికీ పంచడం వలన చాలా తక్కువ మొత్తంలో ఖైదీలకు సౌకర్యాలు ఏర్పరుస్తున్నారు. గాలి వెలుతురు సమృద్ధిగా వుండే విశాలమైన గదిలో ఖైదీలను వుంచాలి.

కారణాలు చెప్పకుండా నిర్బంధిస్తే అది అక్రమ నిర్బంధం అవుతుందా? స్వేచ్ఛ ప్రతి జీవి కాంక్షించేది. స్వేచ్ఛను కోల్పోవడం ఎవరికీ ఇష్టం వుండదు. నిజమైన స్వేచ్ఛను అనుభవించే వాళ్ళు ఈ ప్రపంచంలో అందరికంటే గొప్పవాళ్ళమని అనుకుంటారు. స్వేచ్ఛ అనేది మన రాజ్యాంగం ప్రతి పౌరుడికి ప్రసాదించిన ప్రాథమిక హక్కు. అయితే ఆచరణలో వ్యక్తి స్వేచ్ఛ అనేది చాలా మందికి అనుభవంలో లేని విషయం. జంతువులైనా సరే తమ స్వేచ్ఛకు భంగంవాటిల్లినప్పుడు స్వేచ్ఛ కోసం ప్రాణాలకి తెగించడం మనం నిత్యం చూస్తూనే వుంటాం. పెంపుడు జంతువులు తప్ప. ఇంట్లో పిల్లినిబెట్టి తాళం వేసి తిరిగివచ్చి చూసేసరికి పిల్లి ఇల్లంతా ధ్వంసంచేసి వుంటుంది. అవకాశం వుంటే ఏ కిటికీ అద్దాలో పగలకొట్టి బైటకు తప్పించుకొని పారి

పోతుంది. ఆలోచనా జ్ఞానం లేని జంతువులు కాబట్టి పరిస్థితి ఇట్లా ఉంది. సామాజిక కట్టుబాట్లకి లొంగివుండే మనిషి చట్టాలకు కట్టుబడి వుంటాడు. చట్టరీత్యా అతని స్వేచ్ఛకి భంగం కలిగితే సహించ కలుగుతాడు. ఒక మనిషిని అరెస్టు చేసి నిర్బంధించేట్లయితే అతనిని ఎందుకు అరెస్టు చేసారో చెప్పాలిసిన బాధ్యత అరెస్టుచేసిన అధికారిదే. కారణం చెప్పకుండా అరెస్టు చేసేట్టయితే అది అక్రమ అరెస్టు అవుతుంది. అరెస్టు చేసే అధికారి తాను ఎందుకు అరెస్టు చేశాడో చెప్పడమే కాకుండా ఆ కేసులో నిందితుడు జామీనుపై విడుదలైయే అవకాశాన్ని గురించి కూడా నిందితుడికి చెప్పాలి. కారణం చెప్పకుండా పోలీసులు నిర్బంధించారని కోర్టులో నిందితుడు ప్రమాణ పత్రం దాఖలు చేస్తే సరిపోతుంది. ఒకవేళ పోలీసులు మేము అరెస్టుకు గల కారణం చెప్పాము. కావాలంటే మాకేస్ డైరీగానీ, జనరల్ డైరీగాని చూడండి అని కోర్టులో ఆ రికార్డు దాఖలు చేసినప్పటికి కోర్టులో విలువ లేదు. నిందితుడి ప్రమాణ పత్రాన్నే కోర్టు విశ్వసిస్తుంది కారణం తెలియకుండా ఎవరైనాసరే నిర్బంధాన్ని ఆమోదించరు. ఇలా అకారణంగా నిర్బంధించబడ్డప్పుడు పారిపోవడం నేరం కాదు. ఇంతకు ముందు చెప్పుకొన్న ఉదాహరణలో రాములు నేరానికి పాల్పడలేదని స్పష్టమౌతోంది. ఇలా కారణం చెప్పకుండా పోలీసులు నిర్బంధించేట్టయితే నిర్బంధితుడి తరపున హెబియస్ కార్పస్ పిటిషన్ వేయవచ్చు.

## నిలువు దోపిడీ

ఆ రోజు మా ఊరు వెడదామని బస్‌స్టాండ్‌కి వచ్చాను. బస్‌స్టాండు గోల గోలగా వుంది. వచ్చే బస్సులు వస్తున్నాయి. పోయే బస్సులు పోతున్నాయి. హడా విడిగా ప్రయాణికులు అటూయిటూ పరిగెడుతున్నారు.

ఎవరో బిచ్చగాడిలావున్న ఒకతను నా దగ్గరకువచ్చి "ఏరా" అని పలక రించాడు. మాసిపోయిన తలా, గుడ్డల్తోవున్న అతన్ని చూడగానే బ్రతుకే మాసిపో యిన వాడిలా వున్నాడతనని అనిపించింది. అతను పలకరించింది నన్ను కాదేమో నని ఊరుకున్నాను. "నిన్నేరా" అన్నాడతను. ఈసారి అతను బిచ్చగాడు కాదు పిచ్చివాడేమోనని అనుకొని భయంతో రెండడుగులు వెనక్కి వేశాను. "నేనురా గోపిని" అన్నాడతను. బాగా పరిశీలనగా చూశాను. సందేహం లేదు, గోపియే వాడు నా చిన్నప్పటి క్లాస్‌మేట్. "ఏమిరా యిలా అయిపోయావేం" అని అడిగాను. నిర్లిప్తంగా నవ్వి "ఏం చెప్పాలి. మూడురోజుల క్రితం పనిమీద ఈ ఊరు వచ్చాను. అనుమానా స్పదంగా వున్నానని బస్సు దిగగానే పోలీసులు అరెస్ట్ చేశారు. లాకప్‌లోపెట్టి సోదా

పేరిట నిలుపుదోపిడీ చేసి ఈపూట ఒదిలేశారు" అని చెప్పాడు. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "ఒరేయి నా దగ్గర ఒక్క పైసాకూడా లేదు, ఊరిదాకా టికెట్టు నువ్వే పెట్టి తీసుకెళ్లాలిరా" అని దీనంగా అడిగాడు వాడు. "అలాగే అలాగే" అన్నాను కన్నీళ్ళు తుడుచుకుంటూ. పోలీసులు ఎవరినైనా అరెస్ట్‌చేసినప్పుడు నిలువుదోపిడీ చేసే అధికారం ఉందా ?

ముద్దాయిని పోలీసులే బెయిలుమీద విడుదలచేసే అవకాశంఉన్న కేసుల్లో అరెస్ట్ చేసినట్లైతే పోలీసులు అతన్ని సోదా చెయ్యడానికి వీల్లేదు. ఒకవేళ ముద్దాయి బెయిలుమీద విడుదల కావడానికి నిరాకరించేట్లయితే మాత్రం పోలీసులు సోదా జరుపవచ్చు. పోలీసులు బెయిల్ యివ్వడానికి వీల్లేని కేసుల్లో కూడా ముద్దాయిని సోదాచేసే అధికారం పోలీసులకి ఉంటుంది. సాధారణంగా పోలీసులు బెయిలుమీద విడుదలచేసే కేసుల్లో కూడా ముద్దాయిలని బెయిలుమీద విడుదల చెయ్యకుండా అతను బెయిలుమీద విడుదల కావడానికి నిరాకరించాడని ఆరోపిస్తూ కోర్టులో హాజరుపరుస్తున్నారు. కనీసం ముద్దాయికి బెయిలుమీద విడుదలయే అవకాశం ఉందనికూడా తెలియచెయ్యడంలేదు. అలాంటప్పుడు అవసరంఉన్నా లేకపోయినా పోలీసులకి సోదాచేసే అధికారం ఎప్పుడూ వుంటుందని స్పష్టం అవుతోంది. గుండు చేయించుకోడానికి తిరుపతిదాకా వెళ్లాల్సిన అవసరంలేదు, పోలీసుస్టేషనుకి వెడితే సరిపోతుందన్నట్లుగానే, నిలువుదోపిడీ యివ్వడానికి తిరుపతి దేవుడికి దండం పెట్టుకోవాల్సిన పనిలేదు. పోలీసులు పట్టుకెడితే చాలు ఆ పనేదో వాళ్ళే చేసేస్తారు.

ఒకవేళ ప్రైవేటువ్యక్తి అరెస్ట్‌చేసి పోలీసులకి స్వాధీనం చేసినప్పటికీ, అది బెయిలుమీద విడుదల చెయ్యడానికి అవకాశంలేని కేసు అయితే పోలీసులు అతన్ని సోదా చెయ్యవచ్చు.

సోదా చెయ్యడం అనేది, పోలీసులు అరెస్ట్‌చేసిన ప్రతివ్యక్తినీ తప్పనిసరిగా చెయ్యాలని ఏమీలేదు. అవసరం అనుకొంటే మాత్రమే చెయ్యాలి. అరెస్ట్ చేసిన వ్యక్తిని సోదాచేసిన తరువాత ఏమైనా వస్తువులు లభిస్తే వాటిని స్వాధీనపర్చుకునే అధికారం పోలీసులకి ఉంటుంది. ఇలా స్వాధీనపర్చుకొన్న వస్తువుల జాబితా సిద్ధంచేసి, వాటి వివరాలతో ఒక రశీదు తయారుచేసి, ఎవరినుంచయితే స్వాధీనపర్చుకొన్నారో వారికి యివ్వాలి. అంతేకాక స్వాధీన నివేదికని వెంటనే మేజిస్ట్రేటుకు పంపించాలి. స్వాధీనపర్చుకొన్న సొత్తును భద్రపర్చాల్సిన బాధ్యత పోలీసులపైన ఉంటుంది. ఇలా స్వాధీనపర్చుకొన్న ఆస్తి, కేసులో అవసరమైన సాక్ష్యాధారాలకి ఉపయోగపడాల్సిన అవసరంలేదు. మేజిస్ట్రేటు ఉత్తర్వులమేరకు స్వాధీనపర్చుకొన్న వస్తువులని ఎవరికైనా ఇవ్వవచ్చు. అప్పుడు పోలీసుల బాధ్యత ఏమీవుండదు.

అరెస్ట్ చేసిన వ్యక్తిని పోలీసులు సోదా చేస్తుండగా అతను తిరగబడేట్లయితే అది నేరం.

ఇలా సోదా చేసేప్పుడు సాక్షులుండాల్సిన అవసరం ఏమీలేదు. అయితే రాష్ట్రప్రభుత్వం మాత్రం వీలైనంతవరకూ సాక్షుల సమక్షంలో మాత్రమే సోదా చెయ్యాలని నిబంధన విధించింది. వస్తువులని సాక్షుల సమక్షంలో స్వాధీనపర్చుకొని సీల్ వెయ్యాలి.

స్వాధీనపర్చుకొనే అధికారం ఉందంటే, ఒంటిమీద గుడ్డలు వల్చుకొని స్వాధీనపర్చుకోవడం కాదు. గుడ్డల్ని మినహాయించే మిగతా వస్తువులని స్వాధీనపర్చుకోవచ్చు.

స్త్రీలని అరెస్ట్‌చేసి సోదా చెయ్యవలసి వచ్చినప్పుడు వాళ్ళ గౌరవానికి ఏ మాత్రం భంగం వాటిల్లకుండా సోదా జరపాలి. స్త్రీలని స్త్రీలముందే సోదా చెయ్యాలి. పురుషులు సోదా చెయ్యడానికి వీల్లేదు. పోలీసులు స్వాధీనపర్చుకొన్న ఆస్తుల గురించి మేజిస్ట్రేటుకు నివేదిక అందిన తరువాత, అవి కేసువిచారణలో అవసరం లేదనుకొంటే తనకి న్యాయమని తోచినవారికి ఆ వస్తువులు యివ్వవలసిందిగా ఉత్తర్వులు జారీ చేస్తారు. ఒకవేళ అరెస్టు చేసినప్పుడు ఆ ముద్దాయినుంచి వస్తువులు కనుక స్వాధీనం చేసుకోనుంటే అతనికే తిరిగి యివ్వవలసిందిగా ఆదేశించవచ్చు. పాడైపోయే వస్తువుల విషయంలో అవి అమ్మమని ఆదేశాలు జారీచేసి వస్తువులను అమ్మిస్తారు.

అరెస్టు చేసేప్పుడు నేరం చెయ్యడానికి అవసరం అయిన వస్తువులు ముద్దాయి కలిగివుందేట్లయితే పోలీసులు వాటిని స్వాధీనపర్చుకోవచ్చు. యిలా స్వాధీనపర్చుకొన్న వాటిని వెంటనే మేజిస్ట్రేటుకు పంపించాలి. అరెస్టు చేసిన వ్యక్తిని ఏ మేజిస్ట్రేటు ముందు హాజరుపరుస్తారో ఆ మేజిస్ట్రేటుకే పంపాలి. యిలా కత్తులూ కటారులూ బాంబులూ స్వాధీనపర్చుకొన్న తరువాత వాటిని వెంటనే అక్కడే సీల్ చెయ్యాల్సిన అవసరంలేదు. ఒకవేళ గుర్తుపట్టడానికి గుర్తులు ఏమీలేకుంటే మాత్రమే సీల్ చెయ్యాలి. అలాగే చట్టం స్వాధీనపర్చుకొనేప్పుడు సాక్షులు వుండాలన్న నిబంధనకూడా ఏమీలేదు. కానీ వీలైనంతవరకూ సాక్షులు వుండడం అవసరం. ఉదాహరణకి బాంబులు కలిగిఉండటం నేరం. అలాంటప్పుడు పోలీసులు అరెస్టుచేసి బాంబులు స్వాధీనం చేసుకొన్నామని చెప్తే సరిపోతుందంటే ఎలా ? వేరే సాక్ష్యాలు ఏమీలేకుండా కొన్ని ఆయుధాలు కలిగివుండటమే నేరం అయినప్పుడు వాటి స్వాధీనమప్పుడైనా కనీసం సాక్షులు ఉండాల్సిన అవసరం ఉంది. పోలీసులే కేసు నమోదు చేసేవాళ్ళు, అరెస్టు చేసేవాళ్ళు, సాక్ష్యం చెప్పేవాళ్ళు అయినప్పుడు, కోర్టులు శిక్షలు వెయ్యడంతప్ప చెయ్యగలిగేది ఏమీ ఉండదు.

## వైద్య పరీక్ష

ఒక స్త్రీని రేప్ చేశాడని రామయ్యమీద అభియోగం మోపబడింది. రామయ్య అరవై సంవత్సరాల వృద్ధుడు. అతను పాతిక సంవత్సరాల స్త్రీని రేప్ చేశాడంటే ఏమైనాఅర్థంవుందా? పోలీసులు రామయ్యని అరెస్టు చేసినప్పుడు, అతను రేప్‌చేసే అవకాశం వుందా లేదా అని తేల్చుకోవడం గురించి వైద్యపరీక్ష చేయించవచ్చు. సాక్ష్యాధారాలకి ఉపయోగపడే పద్ధతిలో పోలీసులు ముద్దాయిని అరెస్ట్ చేసినప్పుడు వైద్యపరీక్ష చేయించవచ్చు. వైద్య పరీక్ష రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్‌చేత చేయించాలి. వైద్యపరీక్షలో కేవలం శరీరంపైన మాత్రమేకాక, రక్త పరీక్షలాంటివి కూడా చెయ్యవచ్చు. వైద్యపరీక్ష చేయించడం రాజ్యాంగ విరుద్ధం కాదు. అరెస్ట్ చేసిన స్త్రీలకి కనుక వైద్యపరీక్ష చేయించేట్లయితే మహిళా వైద్యులతో మాత్రమే పరీక్ష జరిపించాలి. ముద్దాయికి వైద్యపరీక్ష జరుపడానికి సబ్ ఇన్‌స్పెక్టర్‌కి తక్కువస్థాయి అధికారికి వైద్యులనికోరే అధికారం వుండదు.

## స్తంభించిన కాలం

పిచ్చివాడిలా వున్న ఒకతను రోడ్డు మీద ఏదో ఎడ్రస్ అడుగుతూ తిరుగుతున్నాడు. అతన్ని చూసి అందరూ ఏవగించుకుంటున్నారు తప్ప అతను అడిగిన చిరునామా చెప్పడం లేదు. అతనికి కూడా ఊరంతా కొత్తగా కనిపిస్తోంది. ఎన్నిరోజులైందో ఎన్ని సంవత్సరాలైందో అతను ఆ వూరు చూసి అతనికే సరిగ్గా తెలియదు. అతని జీవితంలో కాలం స్తంభించిపోయింది. కానీ కాలం తన ప్రభావాన్ని మాత్రం లోకం మీద చూపించకుండా ఊరుకోలేదు. అంతేకాదు భౌతికంగా కూడా కాలం అతని మీద తన ప్రభావం చూపించింది. అందుకే అతనికి తను పుట్టి పెరిగిన నగరం మహానగరం అయి కనిపించింది. అది తను పుట్టి పెరిగిన నగరం కాదనుకొన్నాడు. నగరాన్ని అతను పోల్చుకోలేదు. ఆధునికత సంతరించుకొని స్తబ్దతతో తులతూగుతున్న నగరంలో అతను ఆది మానవుడిలా, మృగంలా సంచరిస్తున్నాడు.

వీధిలో అతను అనుకోకుండా ఒక ఎరిగిన ముఖాన్ని పోల్చుకొన్నాడు. అతను ఎవరో కాదు. స్వయంగా తన తమ్ముడు. కాని అదేమిటి, అతని జుట్టంతా తెల్లటి రంగు వేసినట్లుగా మెరుస్తోంది. "ఒరేయి శంకరం" అనిపిలిచాడతను. శంకరం ఆగిపోయాడు. వెనక్కి తిరిగి తనని పిలిచిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు. "ఈ పిచ్చివాడికి తన పేరెలా తెల్సిందబ్బా అనుకొన్నాడు. బాగా దగ్గర నుంచి చూసిన తరువాత కానీ అతను పిచ్చివాడుకాదు స్వయంగా తన అన్నయ్యేనని పోల్చుకోలేకపోయాడు.

"ఇదేమిటన్నయ్యా యిన్నేళ్ళుగా నువ్వేమైపోయావ్" అంటూ బోరున ఏడ్చాడు. 'ఏళ్ళు గడిచిపోయాయిటరా' అంటూ అన్నయ్య కూడా కంట తడి పెట్టుకొన్నాడు ఒకరోజు సినిమానించి ఇంటికి వస్తుంటే తనని పోలీసులు అరెస్టు చెయ్యడం, లాకప్‌లో పెట్టడం, తను ఎంత బతిమాలినా, విడిచిపెట్టకపోవడం అన్నీ పూస గుచ్చినట్లు చెప్పాడతను. "యిప్పటికి పన్నెండు సంవత్సరాలు గడిచి పోయింది తెలుసా అన్నయ్యా" అన్నాడు తమ్ముడు.

ఈ కథ కొంత అతిశయోక్తిగా కనిపిస్తోంది కావచ్చు. కానీ కొన్ని వాస్తవాల్ని వాస్తవికంగా చెప్పడానికి యింతకంటే వేరే మార్గం లేదనుకొంటాను. పోలీసులు ఎవరినైనా వారెంట్ లేకుండా అరెస్టు చేస్తే యిలా రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు యుగాలు కొద్దీ నిర్బంధించవచ్చా?

పోలీసులు ఎవరినైనా అరెస్టు చేస్తే, ఏ కేసులోనైతే అరెస్టు చేశారో, ఆ కేసులో వెంటనే జామీనుపై విడుదల అయ్యే అవకాశం లేనపుడు, లేదా జామీనుపై విడుదల కావడానికి నిరాకరించినా, అరెస్టు చేసిన అధికారి అతన్ని పోలీస్‌స్టేషన్ అధికారి వద్ద కాని మెజిస్ట్రేట్ వద్ద కానీ హాజరు పర్చాలి. ముద్దాయి కనుక జామీనుపై విడుదలయ్యే అవకాశం వుండి, విడుదల కావడానికి సిద్ధపడేట్లయితే అతన్ని వెంటనే విడుదల చెయ్యాలి. దీన్నిబట్టి వీలైనంతవరకూ ఎవర్నీ పోలీస్‌స్టేషన్లో ఎక్కువ కాలం నిర్బంధించకూడదనేది చట్టం యొక్క ఉద్దేశం అని స్పష్టం అవుతోంది. అరెస్టు చేసిన తరువాత జామీనుపై విడుదల చేసే అవకాశం ఉన్న కేసుల్లో పోలీసులు విడుదల చెయ్యడానికి నిరాకరిస్తే హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటీషన్ పెట్టుకోవచ్చు. జామీనుపై పోలీసులు విడుదల చెయ్యడానికి అవకాశం వున్న కేసుల్లో ముద్దాయి జామీనుపై విడుదల కావడం అనేది అతని హక్కు. మెజిస్ట్రేట్ ముందు హాజరు పర్చిన తరువాత కూడా ఈ రకమైన కేసుల్లో ముద్దాయి కనుక జామీనుపై విడుదల కాదల్చుకొంటే మెజిస్ట్రేట్ నిరాకరించడానికి వీల్లేదు. పోలీసులు అరెస్టు చేసిన తరువాత మెజిస్ట్రేట్ ముందు సకాలంలో హాజరు పర్చకపోతే వారు శిక్షార్హం అయిన నేరానికి పాల్పడ్డట్టు.

భారత రాజ్యాంగం కూడా అరెస్టు చేసిన వ్యక్తిని పోలీసు నిర్బంధంలో యిరవై నాలుగుగంటలకి మించి వుంచడానికి ఆమోదించదు. పోలీస్‌స్టేషన్ అధికారి ఎవరినైనా అరెస్టు చేసిన వెంటనే, ఆ అరెస్టు గురించి కేసు వివరాలతో సహా జిల్లా మెజిస్ట్రేట్‌కు తెలియచెయ్యాలి. ఒకవేళ జిల్లా మెజిస్ట్రేట్ కనుక సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌కు తెలియ చెయ్యమని ఆదేశించేట్లయితే పోలీసులు అరెస్టుకు సంబంధించిన వివరాలు సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌కు తెలియచెయ్యాల్సివుంటుంది. జిల్లా మెజిస్ట్రేట్ కానీ సబ్‌డివిజనల్ మెజిస్ట్రేట్ కాని అరెస్టుకు సంబంధించిన రికార్డుని తనిఖీచేసి, అది అక్రమ నిర్బంధమా సక్రమ

నిర్బంధమా తేల్చాల్సి వుంటుంది. ఇక్కడొక విషయాన్ని దృష్టిలో వుంచుకోవాల్సి వుంటుంది. పోలీస్ స్టేషన్లో నిర్బంధంలో ఉన్న ప్రతి వ్యక్తి యొక్క రికార్డూ తప్పని సరిగా జిల్లా మెజిస్ట్రేట్ వద్దకానీ, సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ వద్దకాని వుంచాలి. దీన్నిబట్టి ఎవరి అరెస్టుకి ఎవరి నిర్బంధానికి సంబంధించిన రికార్డు అయితే ఈ మెజిస్ట్రేట్ల వద్ద ఉండదో ఆ వ్యక్తిని నిస్సందేహంగా పోలీసులు అక్రమ నిర్బంధంలో వుంచారని స్పష్టం అవుతోంది. అక్రమ నిర్బంధాల్ని నిరోధించడానికి మాత్రమే చట్టం ఈ రకమైన నిబంధనని విధించిందని మనం మర్చిపోవద్దు. జిల్లా మెజిస్ట్రేటు అప్పుడప్పుడూ పోలీస్‌స్టేషన్లు తనిఖీ చేసి, తన వద్ద అరెస్టుకు సంబంధించి రికార్డులులేనివాళ్ళు ఎవరైనా వుండేటట్లయితే వాళ్ని విడిపించడానికి ప్రయత్నం చెయ్యవచ్చు. ఇంతటి విస్తృతాధికారం కలిగివుండి కూడా చాల సందర్భాల్లో జిల్లా మెజిస్ట్రేట్లు తాము నిస్సహాయులమనీ తాము అక్రమ నిర్బంధం విషయంలో ఏమి చెయ్యలేమనీ ప్రకటిస్తూ వుంటారు. ఇలా తమకున్న అధికారాల్ని జిల్లా మెజిస్ట్రేట్ సద్వినియోగపర్చక పోవడం మన దురదృష్టం.

జిల్లా మెజిస్ట్రేట్‌కు పోలీసులు అరెస్టుకు సంబంధించిన వివరాలు తెలియచెయ్యక పొయ్యేట్లయితే మనం ఏం చెయ్యాలి? సుబ్బయ్యని పోలీసులు అరెస్టు చేశారు. ఎందుకు అరెస్టు చేశారో ఏమిటో మనకి తెలియదు. సుబ్బయ్యని కోర్టులో హాజరు పరుస్తారన్న నమ్మకం మనకి లేదు. అప్పుడు సుబ్బయ్య భార్య జిల్లా మెజిస్ట్రేట్‌ని కల్సి తన భర్త అరెస్టుని గురించి చెప్పింది. (జిల్లా మెజిస్ట్రేట్ అంటే జిల్లా కలెక్టర్ అని అర్థం చేసుకోవచ్చు) మౌఖికంగా చెప్పడమే కాకుండా వ్రాతపూర్వకమైన అభ్యర్థన కూడా యిచ్చింది. జిల్లా మెజిస్ట్రేట్ అరెస్టులకి సంబంధించి తన వద్దవున్న పోలీసులు పంపిన రికార్డులు చూశారు. ఎక్కడా సుబ్బయ్యని పోలీసులు అరెస్టు చేసినట్లుగా రికార్డులేదు. సుబ్బయ్యని అరెస్టు చేశారా లేదా తెలియ చెయ్యమని పోలీసులకి నోటీసు పంపించారు. యిలా నోటీసు పంపడంవల్ల పెద్దగా ఫలితం వుండకపోవచ్చు. సింపుల్‌గా పోలీసులు అసలు సుబ్బయ్యని మేము అరెస్టు చేయలేదని చెప్పవచ్చు. అందుకని వీలైనంత తొందరగా జిల్లా మెజిస్ట్రేట్ పోలీసుస్టేషన్‌కి వెళ్ళి అక్కడ సుబ్బయ్య వుందీ లేందీ చూడవచ్చు. ఒకవేళ వుంటే అతని అరెస్టుకు సంబంధించిన వివరాలు తెలపనందుకుగానూ సంజాయిషీ నోటీసు కూడా యివ్వవచ్చు.

అరెస్టు చేసిన వారంరోజులకో పదిరోజులకో కనుక సుబ్బయ్యని కోర్టులో హాజరు పర్చేట్లైతే, సుబ్బయ్య అక్రమ నిర్బంధాన్ని నిరూపించడానికి జిల్లా మెజిస్ట్రేట్‌కి సుబ్బయ్య భార్య యిచ్చిన దరఖాస్తు వుపయోగపడుతుంది. కాబట్టి ఎవరినైనా పోలీసులు అరెస్టు చేసేట్లైతే దానికి సంబంధించిన సమాచారం జిల్లా మెజిస్ట్రేట్‌కి పోలీసులు యిచ్చినా యివ్వకపోయినా, మనం జిల్లా మెజిస్ట్రేటుకు తెలియచెయ్యడంమంచిది.

# 24 గంటల్లో హాజరు

"నమస్కారం సార్" అన్నాడతను నన్ను చూడగానే. అతన్ని ఎక్కడో చూసినట్లుగా వుంది. ఎవరో పోల్చుకోవడానికి పరిశీలనగా చూచాను. వారం రోజుల క్రితం షేప్ చేసిన గడ్డం. మాసిన గుడ్డలూ, రేగిపోయినా జుట్టూ, ఆహార పానీయాలు సరిగ్గా లేక పోవడంతో నీరసించిన మొహం. అతని చేతులకు బేడీలు తగిలించి వున్నాయి. చుట్టూ పోలీసులు. అతను ఎవరో గుర్తు పట్టకుండానే తిరిగి నమస్కారం చేశాను. "నేను సార్, వెంకటేశ్వరరావుగారి అబ్బాయిని, మీ వీధిలోనే వుంటాం" అన్నాడతను. అప్పుడు గుర్తుకొచ్చింది నాకు. వెంకటేశ్వరరావుగారు యేడాది క్రితం పోయారు పాపం. ఆయన వెనకాముందు ఏమీ మిగిల్చిపోక పోవడంతో సంసారం కాస్తా వీధిన పడింది. వీడాయన పెద్ద కొడుకు సురేష్. ఏం అఘాయిత్యం చేశాడో ఏమో.

"వారం రోజుల క్రితం లక్ష్మీటాకీస్ దగ్గర బ్లాక్‌లో టికెట్లు అమ్ముతుంటే పట్టుకున్నారు సార్! ఇన్స్‌పెక్టర్ గారు చాలా మంచాయనండి. అందుకనే యివాళ కోర్టులో హాజరుపరుస్తున్నారు" అన్నాడు. వారం రోజుల నించి చట్ట విరుద్ధంగా రాజ్యాంగ విరుద్ధంగా అతన్ని నిర్బంధించిన ఇన్స్‌పెక్టర్ని మంచి వాడంటున్న అతని అమాయకత్వం చూసి నాకు నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు. బహుశా వారం రోజులకంటే ఎక్కువకాలం లాకప్‌లో వున్న వాళ్లని అతను చూసి వుండవచ్చు. అందుకనే ఈ అభిప్రాయానికి వచ్చి వుండాలి. ఎవరినైనా సరే పోలీసులు అరెస్టు చేస్తే అరెస్టు చేసిన సమయంనుంచి వీలైనంత తొందరలో మెజిస్ట్రేట్ ముందు హాజరు పర్చాలి. వీలైనంత తొందరగా అంటే పోలీసులకి ఒక సంవత్సర కాలం అవసరం కావచ్చు. కానీ రాజ్యాంగం దీనికి ఒక హద్దు ఏర్పరచింది. అంతేకాక క్రిమినల్ ప్రొసిజర్ కోడ్ కూడా ఒక పరిమితి ఏర్పర్చింది.

ఏ పరిస్థితుల్లోనూ ఒక వ్యక్తిని వారెంట్ లేకుండా అరెస్టు చేసిన తరువాత యిరవై నాలుగు గంటల్లో మెజిస్ట్రేటు ముందు హాజరుపర్చాలి. అలాగని అవసరమున్నా

లేకున్నా యిరవై నాలుగు గంటల సేపూ పోలీసు లాకప్‌లో ఉంచుకొనే అధికారం వుందికదా అని యిరువైనాలుగు గంటలూ అట్టి పెట్టుకోవాలని కాదు. సాధారణంగా అవసరమైన పరిస్థితిల్లో మాత్రమే, అవసరమైనంత సమయమే వ్యక్తిని నిర్బంధించే హక్కు పోలీసులకి వుంటుంది. అయితే దీని గరిష్ఠ పరిమితి యిరవై నాలుగు గంటలు. అంతకు మించి వుంచుకోవడానికి వీల్లేదు. ఉదాహరణకి గోవిందుని యివాళ పొద్దున్న తొమ్మిది గంటలకి పోలీసులు ఒక ఖూని కేసులో అరెస్టు చేశారు అనుకొందాం. తొమ్మి దిన్నరకి అతన్ని పోలీస్టేషన్‌కి తీసుకువెళ్లారు. అరగంటపాటు అతని వివరాలు రాసు కొన్నారు. అంటే సమయం పదైందన్నమాట. తరువాత అతను నేరం ఏ పరిస్థితుల్లో చేశాడు? ఎందుకు చేశాడు? నేరం చేయడానికి ఉపయోగించిన ఆయుధాలు ఎక్కడ దాచాడు? లాంటి వివరాలు సేకరించడానికి కొన్ని ప్రశ్నలు వేశారు ఇన్స్‌పెక్టర్‌గారు. గోవిందు చెప్పిన వివరాలన్నీ రాసుకొన్నారు. ఆ తరువాత కేసు దర్యాప్తుకు సంబం ధించిన ఒక నివేదిక తయారు చేశారు. యిదంతా పూర్తయ్యే సరికి మూడయ్యింది. యింక ఈ కేసులో గోవిందుతో పోలీసులకి పనేమీ లేదు. గోవిందుని అరెస్టుచేసి ఏడు గంటలైంది. యింకా యిరవై నాలుగు గంటలు పూర్తి కాలేదుకదా అని పోలీసులు గోవిందుని నిర్బంధంలో వుంచడానికి వీల్లేదు. వెంటనే తీసుకువెళ్ళి మెజిస్ట్రేట్ ముందు హాజరు పర్చాలి. సహాయకమైన, ఏ అవసరమైన పరిస్థితులు ఏమీ లేకుండా పోలీసులు అరెస్టు చేసిన వ్యక్తిని ఒక గంట కూడా నిర్బంధించడానికి వీల్లేదు అని స్పష్టం అవు తోంది.

చట్టం పోలీసు అరెస్టు చేసిన వ్యక్తిని యింత తక్కువ సమయంలో కోర్టుకు హాజరు పర్చమని ఎందుకు నిబంధన విధించిందంటే, నిర్బంధితుడికి పోలీస్ లాకప్‌లో అననుకూలమైన పరిస్థితులు వుంటాయని భావించడం వల్లనే. అంతేకాక కస్టడీ పేరిట భయోత్పాతాన్ని సృష్టించి, హింసించే అవకాశం ఎక్కువగా వుందని కూడా చట్టం భావించింది. న్యాయాన్ని ముద్దాయికి వీలైనంత తొందరగా అందించాలన్న ఉద్దేశం కూడా చట్టానికి ఉంది. 1972లో సుప్రీంకోర్టు ముద్దాయి కోర్టుకి ఏమైనా చెప్పుకోవడా నికీ, వీలైనంత తొందరగా అవకాశం కల్పించడానికి మాత్రమే ఈ నిబంధన విధించి నట్లు పేర్కొంది.

పోలీసులు ఎవరినైనా నేరస్తులుగా భావించి అరెస్టుచేసేట్లయితే అరెస్టు అయిన వ్యక్తిని శిక్షించే అధికారం లేదు. ఒక వేళ పోలీసులకి వ్యక్తిని రోజుల తరబడి నిర్బం ధించే హక్కు గనుక వుండేట్లయితే నిర్బంధితుడు ఏ విచారణ లేకుండా శిక్ష అనుభ వించడంతో సమానమౌతుంది. ఈ పరిస్థితిని నివారించాలంటే తప్పని సరిగా ఈ నిబంధన యొక్క అవసరం ఎంతైనా వుంది. మెజిస్ట్రేట్ ముందు ముద్దాయిని హాజరు

పర్చినప్పుడు పోలీసులు తాము ఏ ఆధారాల వలన అతను నేరస్తుడనుకొంటున్నది చూపించాల్సి వుంటుంది. ఈ ఆధారాలు సరైనవా కావా అని విచారించాల్సింది మెజిస్ట్రేట్ మాత్రమే. (కొన్ని సార్లు ముద్దాయిని మెజిస్ట్రేటు ముందు హాజరుపర్చేప్పుడు దర్యాప్తు కనుక పూర్తి అయ్యేట్లయితే చార్జిషీట్‌తో హాజరుపరుస్తారు దర్యాప్తు పూర్తి కాని పక్షంలో రిమాండ్ రిపోర్టుతో హాజరు పరుస్తారు.) మెజిస్ట్రేట్‌కి ముద్దాయిని హాజరు పర్చినప్పుడు చూపించే ఆధారాలు సహేతుకంగా లేవని కనుక మెజిస్ట్రేటుగారు భావిస్తే ముద్దాయిని విడుదల చెయ్యమని ఆదేశించవచ్చు.

ఇరవై నాలుగు గంటల పరిమితి అనేది అరెస్టు చేసి ఒక గంట వుంచుకొని వదిలేసి మళ్ళీ అరెస్టుచేసి అనే పద్ధతిలో సాగేట్లయితే వర్తించదు.

పోలీసులు కనుక ఈ పరిమితిని అతిక్రమించేట్లయితే, ఆ పని వాళ్ళు సదుద్దేశంతో చేసినా దురుద్దేశంతో చేసినా శిక్షార్హులే అవుతారు. యిరవై నాలుగు గంటల్లో హాజరుపర్చాలనే నిబంధన రాజ్యాంగం పరిరక్షిస్తోంది. న్యాయస్థానంలో శిక్షపడ్డ వాళ్ళకీ, ప్రివెంటివ్ డిటెన్షన్ క్రింద అరెస్టు అయిన వాళ్ళ విషయంలో ఈ నిబంధన వర్తించదు.

పోలీసులు అరెస్టు చేసిన తరువాత కస్టడిలో వుంచడం అంటే తాళ్ళతో కట్టి పడెయ్యవలసిన అవసరం లేదు. నైతికంగా ముద్దాయికి తాను నిర్బంధంలో వున్నాడు అన్న విషయం అర్థం అయితే సరిపోతుంది. కానీ పైన అతను తప్పించుకు పారిపోకుండా పోలీసు కాపలా వుంటే సరిపోతుంది అని అర్థం చేసుకోవాలి. చట్టం ఎంత పెద్ద నేరస్తుడినైనా మనిషిగా గుర్తించి, అతనికి ఆలోచన వుంది, జ్ఞానం వుంది, ప్రాణం వుంది అని భావిస్తోంది. అందుకనే తాను నిర్బంధంలో వుండాల్సిన అవసరం వుందని ముద్దాయికి తెలుస్తే చాలు అని భావిస్తోంది.

ఇరవై నాలుగు గంటలు దాటిన తరువాత కూడా కొందరు ముద్దాయిల్ని చట్టబద్ధంగా పోలీసు లాకప్‌లో వుంచవచ్చు. అదెలాగంటే? ఇరవై నాలుగు గంటల్లో మెజిస్ట్రేట్ ముందు హాజరు పర్చి, దర్యాప్తు గురించో లేక మరే కారణం గురించో ముద్దాయిని మెజిస్ట్రేట్ ఉత్తర్వు తీసుకొని పోలీసు కస్టడీలో వుండవచ్చు

ఈ ఇరవై నాలుగు గంటలు ఎట్లా లెక్క పెటాలి? అరెస్టు చేసిన సమయం నుంచి, కోర్టుకు తీసుకువెళ్ళేవరకూ. నిర్బంధించిన చోటు నించి కోర్టుకు వెళ్ళడానికి పట్టే సమయాన్ని మినహాయించాలి. ఎలాగో ప్రయాణానికి పట్టె సమయం విషయంలో మినహాయింపు వుంది కదా అని పోలీసులు ముద్దాయిని ఎక్కువ సేపు నిర్బంధించడానికి వీల్లేదు. ముద్దాయిని హాజరు పర్చిన తరువాత, ప్రయాణానికి అవసరమైన సమయం విషయంలో మెజిస్ట్రేట్‌గారు సరిగ్గా వుందో లేదో చూసుకోవాలి.

# అక్రమ నిర్బంధం

"మా ఆయన్ని పోలీసులు పట్టుకెళ్ళి మూడు నెల్లయింది. రోజూ కొడుతున్నారు. రోకలి బండలు ఎక్కిస్తున్నారు. అన్నం కూడా సరిగ్గా పెట్టనివ్వడం లేదు" అని బొలబొలా ఏడ్చింది ఒకావిడ వచ్చి. ఆవిడ అలా చాలాసేపు ఏడ్చి "ఎలాగయినా మాఆయన్ని విడిపించండి. లేకపోతే ఆయన పోలీస్ స్టేషన్‌లోనే చచ్చిపోతాడు బాబు" అంటూ దండం పెట్టింది. "నీవు బాధపడకు. ఇంతకీ మీ ఆయన్ని పోలీసులు ఎందుకు పట్టుకెళ్ళారు" అని అడిగాను. "నాకు తెలువదు బాబూ" అంది ఆమె అమాయకంగా. "మీ ఆయన్ని అరెస్టుచేసి తీసికెడుతున్నపుడు నువ్వున్నావా?" తిరిగి అడిగాను. "లేకపోవడమేమిటండీ? మేమిద్దరం చేలో పని చేసుకుంటుండగానే తీసుకుపోయారు". అని చెప్పిందావిడ. ఒక మనిషి నేరస్తుడైనప్పటికీ కారణం చెప్పకుండా అరెస్టుచేసి నిర్బంధించడానికి పోలీసులకి అధికారం లేదు. పైగా పోలీసులు ఏమనిషినైనా అరెస్టుచేసి యిరవైనాలుగు గంటల్లోగా కోర్టులో హాజరు పర్చకపోతే కూడా అతన్ని అక్రమ నిర్బంధంలో వుంచినట్లే. పోలీసులేకాక పరాయివాళ్ళైనాసరే ఎవరైనా అక్రమంగా నిర్బంధించేట్లైతే జిల్లా మెజిస్ట్రేట్ (కలక్టర్), సబ్‌డివిజినల్ మెజిస్ట్రేట్, ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్‌లలో ఎవరిదగ్గర నించైనా సరే సెర్చ్ వారెంట్ తీసుకొని అక్రమ నిర్బంధంలో వున్న వ్యక్తిని గురించి వెదకవచ్చు. అక్రమ నిర్బంధం అనగానే పోలీసులు మాత్రమే ఈ పనికి పాల్పడతారని మనం అనుకొంటాం. ఎందుకంటే పోలీసులు కాకుండా ఎవరైనా సరే యింకొకర్ని నిర్బంధించారనుకొంటే, పోలీసులు ఏ వారెంట్ లేకుండానే ఆ నిర్బంధితుడి కోసం వెదకవచ్చు.

## సెర్చ్ వారెంట్

ఎవరైనా పోలీసులు కానీ యింకా ఎవరైనా కానీ అక్రమ నిర్బంధంలో ఉంచారని మెజిస్ట్రేట్ దృష్టికి తీసుకు వచ్చినప్పుడు అది అక్రమ నిర్బంధం అని

మెజిస్ట్రేట్ భావించినప్పుడు అతన్ని వెదికి తీసుకురావడానికి సెర్చ్‌వారెంట్ యివ్వ వచ్చు. సాధారణంగా యీ రకమైన సెర్చ్ వారంట్ అత్యవసర పరిస్థితిల్లోనే ఇస్తారు. కనుక వారెంట్ యివ్వడానికి ముందు మెజిస్ట్రేట్ సాక్ష్యాధారాలు తీసుకోవలసిన అవసరం లేదు. ఈ రకమైన సెర్చ్ వారెంట్‌లు యిచ్చేముందు సాధారణంగా యీ రోజుల్లో మెజిస్ట్రేట్లు సెర్చ్ వారెంట్ కోరుతున్న వారినుంచి ప్రమాణ పత్రాలు తీసు కొంటున్నారు. వీలునుబట్టి అతనితో ప్రమాణం కూడా చేయించుకొంటున్నారు. అక్రమ నిర్బంధంలో వున్న వ్యక్తులను వెదకడానికి సెర్చ్ వారెంట్ తీసుకొనేవాళ్ళు సాధారణంగా న్యాయాన్యాయాలు తెలిసివుంటారనే అభిప్రాయంతో మెజిస్ట్రేట్ కోర్టుకే వెళతారు. అలాటప్పుడు మెజిస్ట్రేట్లు కూడా సెర్చ్ వారెంట్ యిచ్చేప్పుడు దాని మౌలిక వుద్దేశం దెబ్బతినకుండా చూసుకోవాలి. అక్రమ నిర్బంధితుడి కోసం పోలీసు స్టేషన్ కనుక సోదా చెయ్యవలసివస్తే, పోలీసుల ముందే వారెంట్ యిస్తానని అనడంలో అర్థం లేదు. ఈ విషయం తెలిసిన వెంటనే పోలీసులు అతన్ని అక్కడ్నించి మార్చకుండా వుంటారా?

అలాగే ఎవరైతే అక్రమంగా నిర్బంధించారని అంటున్నామో అతనికి నోటీస్ యిచ్చినాక సెర్చ్‌వారెంట్ యిస్తామని అనడంవల్ల కూడా, జరిగే ఆలస్యం కారణంగాకానీ లేక నేరస్తుడు నిర్బంధితుడిని మరోచోటికి మార్చడం వల్లకానీ, సెర్చ్ వారెంట్ తీసుకొన్న ఉద్దేశం నెరవేరకపోవచ్చు.

అక్రమ నిర్బంధంలో ఉన్న వ్యక్తిని వెదకడానికి సెర్చ్‌వారంట్ యిచ్చే మెజిస్ట్రేటుకు పరిమితులు లేవు. అతను భారతదేశంలో ఏ మూల అక్రమ నిర్బంధంలో వున్న వ్యక్తినైనా సరే వెదకడానికి వారంట్ యివ్వవచ్చు ఉదాహరణకి హనుమకొండ పోలీసు స్టేషన్లో ఒక వ్యక్తిని అక్రమంగా నిర్బంధించారు కాబట్టి అతన్ని వెదకడానికి సెర్చ్‌వారెంట్ యివ్వవలసిందిగా హైద్రాబాద్ కోర్టులో దరఖాస్తు చేసుకొంటే, హైద్రాబాద్ మెజిస్ట్రేటు గారు సెర్చ్ వారెంట్ యివ్వవచ్చు.

సర్చ్‌వారంట్ యిచ్చేప్పుడు మెజిస్ట్రేటుగారు అక్రమ నిర్బంధితుడు ఎక్కడు న్నాసరే వెదికి పట్టుకోమని వారెంట్ యివ్వవచ్చు. లేదా ఒకేఒక ప్రాంతంలో వెదక మని వారెంట్‌లో పేర్కొనవచ్చు. ఉదాహరణకి రామయ్యని మొగిలయ్యఅనే యిన్ స్పెక్టర్ వారం రోజుల క్రితం అరెస్టుచేశారు. కాని రామయ్యని ఏ పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించారో తెలియదు. ఇలాంటి సందర్భాలలో సెర్చ్‌వారెంట్ యివ్వవలసి వస్తే రామయ్యని వెదకడానికి ఏ పోలీసుస్టేషన్ అయినా వెదకవచ్చునని అధికారం కల్పిస్తూ వారెంట్ ఇవ్వవచ్చు. పోలీస్‌స్టేషన్ను కనుక సోదా చెయ్యవలసివస్తే సాధారణంగా ఒక న్యాయవాదిని కమీషనర్‌గా నియమించి అతనిచేత సోదా జరిపిస్తారు.

ఎవరినైనా నిర్బంధించినప్పుడు, ఆ నిర్బంధం అక్రమమైంది. శిక్షార్హం అయినది అని కోర్టు భావిస్తేనే సెర్చ్‌వారెంట్ యివ్వాలి. ఇలాంటి సెర్చ్‌వారెంట్ యివ్వడానికి ప్రత్యేకమైన పద్ధతులంటూ ఏమీ లేవు. అంటే మెజిస్ట్రేటు గారి ఇష్టాయిష్టాల మీద ఆధారపడి వుంటుందని స్పష్టం అవుతుంది. తన ఇష్టాల మీద ఆధారపడి నిర్ణయం తీసుకోవల్సి వచ్చినప్పుడు న్యాయమూర్తులెప్పుడూ న్యాయాన్ని చేయడానికి వీలుగా వుండే నిర్ణయాలే తీసుకోవలసి వుంటుంది. తనకు అధికారం వుందికదాని పోలీసు స్టేషన్ సోదా జరపవలసి వచ్చినప్పుడు పోలీసు అధికార్లకే వారెంట్ యివ్వడం లాంటి పనులు చేసినట్లైతే సెర్చ్ వారంట్ యిచ్చి ఫలితం వుండదు.

సెర్చ్‌వారెంట్ ఉపయోగించి అక్రమ నిర్బంధితుణ్ణి తీసుకువచ్చి తన ముందు హాజరుపర్చిన తరువాత అప్పటి పరిస్థితిని బట్టి మెజిస్ట్రేటు అవసరమైన నిర్ణయం గైకొనవచ్చు. అక్రమ నిర్బంధం విషయంలో సెర్చ్‌వారెంట్ తీసికొని, అధికారి కనుక సోదా చెయ్యడానికి వెళ్ళినప్పుడు ఎవరైనా అడ్డగిస్తే అది నేరం అవుతుంది. అడ్డగించిన వాళ్ళు శిక్షార్హులు.

ఈ రోజుల్లో సామాన్య ప్రజానీకం, పోలీసులు అక్రమంగా ఎవరినైనా నిర్బంధించినట్లయితే అది సక్రమ నిర్బంధమేననే అభిప్రాయంలోవున్నారు. రోజుల తరబడి కారణం లేకుండా పోలీసు లాకప్పుల్లో మగ్గివచ్చి ఇన్‌స్పెక్టర్ గారు మంచి వారు, ధర్మాత్ములు దేవుడు లాంటివారు అని దండం పెట్టుకొనే అమాయకులు వున్నారు. అందుకని వీలైనంత వరకూ న్యాయవాదులూ, న్యాయమూర్తులు ప్రజానీకానికి ఏది అక్రమ నిర్బంధమో ఏది సక్రమ నిర్బంధమో తెలియ చెయ్యాల్సిన అవసరం వుంది. అంతేకాక లాకప్పుల్లో నుంచి అక్రమ నిర్బంధితుడ్ని సెర్చ్ వారెంట్ ఉపయోగించి తీసుకువచ్చిన తరువాత అతన్ని డాక్టరుచేత పరీక్షచేయించాలి. అక్రమనిర్బంధంలో వుంచినందుకుగాను చట్టరీత్యా చర్యతీసుకోవచ్చునని కూడా తెలియవలసిన అవసరం వుంది. ఇలా చేసినప్పుడు మాత్రమే సెర్చ్‌వారెంట్లకి ఒక సార్థకత ఏర్పడుతుంది.

అక్రమ నిర్బంధంలో చట్టవిరుద్ధమైన ఉద్దేశంతో స్త్రీలనో ఆడపిల్లల్నో వుంచేట్లైతే జిల్లా మెజిస్ట్రేట్ కాని సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ కాని మెజిస్ట్రేట్ కానీ విడిచి పెట్టమని ఆదేశించవచ్చు. ఈ సందర్భంలో దరఖాస్తుచేసిన వారితో ప్రమాణం చేయించుకొని నిందితుడికి షోకాజు నోటీసు యివ్వాలి. మెజిస్ట్రేటు యీ విషయం షోకాజు నోటీసు యిచ్చిన తరువాత నిర్బంధించిన స్త్రీని తన ముందు హాజరు పర్చమని నిందితుణ్ణి ఆదేశించవచ్చు. ఒకవేళ నిందితుడుని హాజరు పర్చకపోతే, అవసరమైన విచారణ జరిపి సెర్చ్ వారెంట్ యివ్వవచ్చు

# లాకప్‌లో హింస

అది ఒక చీకటికొట్టు. ఆ చీకటికొట్టు బయట మిణుకు మిణుకుమంటూ వెలుగుతోంది, ఇరవై అయిదు వోల్ట్ బల్బు. ఆ చీకటికొట్టు బయటనిల్చున్న సెంట్రీ ఆ చీకటికొట్టులోకి కాస్తకూడా వెలుగు జొరబడకుండా కావలికాస్తున్నట్లుగా కటకటాల తలుపుకి వెలుక్కి అడ్డంగా నిల్చున్నాడు. ఆ చీకటి కొట్లోవున్న వాళ్ళకి అది రాత్రి అని మాత్రం తెలుసు. కాని ఎన్నిగంటలవేళో తెలియదు. ఏ తారీఖో, ఏ వారమో తెలియదు. అసలు తమ జీవితాలకి ఉదయం అంటూ వుందో లేదో తెలవదు. భవిష్యత్తులో వెలుగు తొంగి చూస్తుందని మాత్రం వాళ్ళకి నమ్మకంలేదు. ఎందుకనంటే అది పోలీస్ లాకప్. ఆ లాకప్ వాళ్ళకి అనేక ఆత్మహత్యలకథలు చెబుతున్నది. ఈ కథలన్నీ లాకప్ ఆత్మహత్యల కథలు కాదు. భయంకరమైన దారుణమైన దుర్మార్గమైన హత్యలు అన్న నిజాల్ని చెబుతోంది. అందుకనే అందులో ఉన్నవాళ్ళు బితుకుబితుకుమంటూ భయంతో బ్రతుకుతున్నారు. పగలంతా బూతులు వినివిని వాళ్ల హృదయాలు గాయాలు అయ్యాయి. రాత్రంతా సాగే చిత్రహింసలకి వాళ్ళ శరీరాలు వ్రణాలయ్యాయి.

బాగాతాగి ఒక పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్ లోపలికి వచ్చారు. "ఏరా మీరు నిజం చెప్పరన్నమాట" అని అరిచి చేతిలోని లాటీతో ఆ లాకప్‌లో ఉన్న ఇద్దర్ని చావచితకబాదారు. ఆ దెబ్బలకి ఒకతను చితికిపోయాడు. మరొకతను చచ్చిపోయాడు. బతికున్నతను చచ్చిపోయినతన్ని తల్చుకొని, ఇంక తన చావుకూడా అతిసమీపంలోనే ఉందనుకొని హృదయవిదారకంగా ఏడ్చాడు. లాకప్‌లో ఒకతను చనిపోయాడని పోలీసులు గుర్తించారు. బతికున్న శివయ్యను వేరేలాకప్‌కి తరలించారు. ఆ తరువాత చనిపోయిన కోటిరెడ్డి లాకప్‌లో లుంగీతో ఆత్మహత్య చేసుకున్నాడని ప్రకటించారు.

లాకప్‌లో జరిగిన హత్యని కప్పిపెడతానని హామీ ఇచ్చేలా నయానో భయానో శివయ్యను ఒప్పించారు. ఆ తరువాత శివయ్య ఒంటిమీద గాయాలు కాస్త మానింతరువాత దోపిడీ కేసుపెట్టి కోర్టులో హాజరుపర్చారు.

శివయ్య కోర్టులో బోరుబోరునా ఏడ్చి తనకి జరిగిన అన్యాయం గురించి చెప్పుకున్నాడు. తన వంటికి తగిలిన గాయాలు అన్నీచూపించి "ఇలా ఏ మనిషినైనా కాదు, ఏ గొడ్డునైనా కొట్టవచ్చా?" అని అడిగాడు. మేజిస్ట్రేటుగారి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. ఇలాంటి కేసుల్లో మెజిస్ట్రేటుగారు ఏం చెయ్యవచ్చు? అసలు న్యాయస్థానాలు ఏమైనా చెయ్యగలుగుతాయా లేదా? ఈ విషయంలో న్యాయస్థానం ఏమీ చెయ్యకపోతే ప్రజలకి న్యాయస్థానాలమీద విశ్వాసం పోతుంది. పోలీసు న్యాయమే రాజ్యంచేస్తోందని అది పక్షప్రాయమైన న్యాయమేనని అభిప్రాయపడే ప్రమాదం ఉంది.

## *లాకప్‌లో చిత్రహింస - వైద్యపరీక్ష*

అరెస్టుచేసిన వ్యక్తిని మెజిస్ట్రేటు ముందు హాజరుపర్చినప్పుడు అరెస్టు అయిన వ్యక్తి తనకు వైద్యపరీక్ష జరిపించమని అడిగేట్లయితే మెజిస్ట్రేటుగారు వైద్య పరీక్ష జరిపించాలి. కొన్ని కొన్నిసార్లు ముందుజాగ్రత్త చర్యక్రింద అరెస్టు అయినా సరే వైద్యపరీక్ష చేయించమని అడిగేట్లయితే మెజిస్ట్రేటుగారు వైద్యపరీక్ష చేయించాలి. ఈ వైద్యపరీక్ష జరిపించడానికి అరెస్టు అయిన వ్యక్తి ఏదో ఒక కేసులో ముద్దాయి అయివుండాల్సిన అవసరంలేదు కొన్ని సందర్భాల్లో కొన్నిరకాల నేరాలు చేసినట్లు ఆరోపణ ఉన్నప్పుడు ఆ రకమైన నేరానికి తను పాల్పడే అవకాశంలేదు, ఈవిషయం వైద్యపరీక్షలో రుజువవుతుందని ముద్దాయి స్పష్టంగా పేర్కొన్నప్పుడు కూడా ఏ దశలోనైనా మెజిస్ట్రేటుగారు వైద్యపరీక్ష చేయించమని ఆదేశించవచ్చు, ఉదాహరణకు లైంగిక లోపాలు ఉన్న వ్యక్తిని మానభంగం కేసులోనిందితుడిగా తీసుకువచ్చినట్లైతే అప్పుడతను తాను ఆ నేరంచేసే అవకాశంలేదు అందుకని డాక్టర్ దగ్గరికిపంపి వైద్యపరీక్ష చేయించండని అడిగితే వైద్యపరీక్ష జరిపించాలి. తనకుతానుగా నిరపరాధినని నిరూపించుకోవడానికి ఈ రకమైన వైద్యపరీక్ష ఉపయోగపడుతుంది.

అలాగే అరెస్టు అయిన వ్యక్తి ఏదైనా అభియోగం మోపదలుచుకుంటేకూడా వైద్యపరీక్ష అవసరం కావచ్చు. పోలీసులు లాకప్‌లో ముద్దాయిని హింసించేట్లయితే ముద్దాయిని కోర్టులో హాజరుపర్చిన తరువాత, ఆ విషయం అతను కోర్టులో పేర్కొన్నప్పుడు మెజిస్ట్రేటుగారు వైద్యపరీక్షకి ఆదేశించాలి. దీనిద్వారా ముద్దాయిని పోలీసులు హింసించారా లేదా అనే విషయం బయటపడే అవకాశం ఉంటుంది. శివయ్య కోర్టులో తనికి తగిలిన గాయాలు చూపించినప్పుడు మెజిస్ట్రేటుగారు సానుభూతి చూపించి ఊరు

కుంటే సరిపోదు. అతన్ని డాక్టర్ దగ్గరికి పంపి వైద్యపరీక్ష చేయించాలి.

ముద్దాయి కనుక లాకప్‌లో తాను చిత్రహింసలకి గురయ్యానని ఆరోపించేట్లయితే మెజిస్ట్రేటుగారు వైద్యపరీక్ష చేయించడమేకాక అతను చేసిన ఆరోపణని రికార్డు చేసుకుని దాన్ని ప్రైవేటు కాంప్లెయింట్‌గా భావించి నేరస్తులపై విచారణ జరపవచ్చు. ఆచరణలో మనం ఇలా జరగడం చూడకపోయినా చట్టంలో మాత్రం మెజిస్ట్రేట్లకి ఇలా చేసే అధికారం ఉంది. మౌఖికంగా చేసిన ఆరోపణనికూడా రికార్డు చేసుకుని ఆరోపించిన వ్యక్తిచే సంతకం తీసుకుని విచారణ జరపవచ్చు. నేరస్తుడని పేరుపెట్టి పోలీసులు ప్రతివాదినీ చావగొట్టే అవకాశం ఉండేట్లయితే ఇహ పోలీసుల అధికారమే మిగులుతుంది. న్యాయస్థానాలు కేవలం ముద్దాయిని వైద్యుడి దగ్గరికి పంపడంతో సరిపోదు. అతనికి జరిగిన అన్యాయాన్ని విచారించి న్యాయం జరిగేలా చూడాలి.

చాలామంది ముద్దాయిలు కోర్టులో హాజరుపర్చిన తరువాత నోరు విప్పరు. "కోర్టుకు తీసుకువెళ్ళిన తరువాత మెజిస్ట్రేటుగారి ముందు మాట్లాడవద్దు. మాట్లాడితే మెజిస్ట్రేటుగారు పది రూపాయల ఫైన్ వేసేవాడల్లా యాభైరూపాయల జుర్మానా వేస్తాడు. ఇదేమిటి అన్నావంటే జైలుకి నెట్టేస్తాడు. అదికాదండని నువ్వు ఇంకా ఏమైనా చెప్పబోయావో జీవితఖైదు విధిస్తారు. ఇంకా ఇది అన్యాయం, దారుణం అన్నావంటే ఉరి తీసేస్తారు. అందుచేత గుర్తుంచుకో నీ మంచి గురించే చెబుతున్నాము. మెజిస్ట్రేట్‌గారి ముందు నోరు మెదపకు. ఒకవేళ ఆయన నిన్ను ఏమి చెయ్యకపోతే బయటికి రాగానే మేము ముక్కలు విరిచేస్తాం జాగ్రత్త" అని కట్టుకధలుచెప్పి బెదరకొట్టేస్తారు పోలీసులు. బహుశా ఈ భయానికేనేమో ముద్దాయిలు నోరువిప్పరు. మరలాంటప్పుడు వాళ్ళకి పోలీసుస్టేషన్లో జరిగిన అన్యాయాలు గాలికి కొట్టుకుపోయినట్లేకదా? తెలిసిచేసినా, తెలవకచేసినా నేరం నేరం కాకుండాపోదు. అలాగే తెలవక అన్యాయానికి గురైనప్పుడు, అది అన్యాయం కాకుండాపోదు. న్యాయం చెయ్యాల్సిన బాధ్యత న్యాయస్థానాలమీదే ఉంటుంది. అందుకని మెజిస్ట్రేట్ ముద్దాయిని తనముందు హాజరు పర్చగానే అతన్ని "పోలీస్‌స్టేషన్‌లో ఏమైనా హింసించారా? ఏమైనా చెప్పదల్చుకుంటే చెప్పుకోవచ్చ"ని అడగాలి. దానిమీద ముద్దాయి ఇచ్చిన సమాధానాన్ని ఆసరా చేసుకుని అతన్ని వైద్యపరీక్షకి పంపడం, అభియోగం రికార్డు చేయడంలాంటిపనులు చెయ్యవచ్చు.

న్యాయస్థానంలో ముద్దాయికి ఏమైనా చెప్పుకునే స్వేచ్ఛ అధికారం ఎప్పుడూ ఉంటాయని గుర్తించాలి. న్యాయస్థానాల్లో హాజరుపర్చడంతో మౌలిక ఉద్దేశ్యమే ఇది.

వైద్యపరీక్ష రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టిషనర్‌తో మాత్రమే జరిపించాలి. వైద్యపరీక్ష జరిపించమని అడిగే హక్కు ముద్దాయికి ఎప్పుడూ ఉంటుంది.

# లాకప్ మరణాలు

ఒక హత్య జరిగినా, దోపిడీ జరిగినా మానభంగం జరిగినా, దొమ్మి జరిగినా, యింకా ఏ నేరం జరిగినా సరే నేరస్తులని శిక్షించే బాధ్యత ప్రభుత్వానిదే. అంతేకానీ నేరస్తుల్ని పట్టుకొని చావగొట్టడానికి, వాళ్ళ పెళ్లాలని రేప్ చెయ్యడానికీ ఎవరికీ హక్కు లేదు. అధికారం అంతకంటేనూ లేదు. ఒక వ్యక్తికి జరిగిన అన్యాయాన్ని, ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన అన్యాయంగా భావిస్తారు. ఒకరి కాలు విరగ్గొడితే, అతను తిరిగి నేరస్తుడి కాలు విరగ్గొట్ట డానికి వీల్లేదు. మొదట కాలు విరగ్గొట్టిన వ్యక్తి ఏ నేరానికైతే పాల్పడ్డాడో రెండో వ్యక్తి కూడ అదే నేరం చేసినట్లే. ఉదాహరణకి గోపాలరావుకీ గోవిందయ్యకీ చేనుగట్ల దగ్గర తగూ వచ్చింది. ముందు అమ్మా ఆలీ బూతులు తిట్టుకోవడంతో మొదలైన తగాదా చిలికి చిలికి గాలివాన అయినట్లుగా దెబ్బలాట వరకూ వచ్చింది. గోపాలరావు కోపంతో గోవిందయ్యని గడ్డపారతో పొడిచాడు. గోవిందయ్య

గిలగిలా తన్నుకొని చనిపోయాడు. ఊరి పోలీస్ పటేల్ పోలీసులకి సమాచారం పంపాడు. ఈ లోగా గోవిందయ్య బంధువులూ కులం వాళ్ళూ ఒకటై గోపాలరావు అంతుచూస్తాం అని ప్రతిజ్ఞ చేశారు. దొరికిన రాయీ రప్పా, పలుగూ పారా తీసుకొని గోపాలరావు యింటి మీద దాడికి వెళ్ళారు. సరిగ్గా గోపాలరావు యింటి తలుపులు పగుల గొడుతుండగా పోలీసులు వచ్చి గోపాలరావుమీద తాము కేసు పెట్టినట్లుగా, అతని మీద తగిన చర్య తీసుకోనున్నట్లుగా చెప్పి జనాన్ని సమాధాన పర్చారు. అప్పుడు జనం వెనక్కి తగ్గి పోలీసులకి కేసు దర్యాప్తు విషయంలో తోడ్పడ్డారు. పోలీసులు గోపాల రావుని కస్టడీలోకి తీసుకున్నారు పోలీసులు కనుక గోపాలరావు మీద కేసు పెట్టి అరెస్టు చేసి వుండకపోయేట్లయితే అతనూ ఖూనీ అయిపోయే వాడు అనుకున్నారు ఊళ్ళో వాళ్ళంతా. ఇక్కడ ప్రభుత్వం తరపున పోలీసులు కేసు పెట్టి గోపాలరావు మీద తగిన చర్య తీసుకొన్న వాళ్ళయ్యారు. అంతేకాక గోపాలరావుని అరెస్టు చెయ్యడం వల్ల అతను మర్డర్ కాకుండా కాపాడిన వాళ్ళయ్యారు.

**అభియోగి - ముద్దాయి**

పోలీసులు దాఖలుచేసే ప్రతి క్రిమినల్ కేసులోనూ ప్రభుత్వాన్ని అభియోగిగా, ముద్దాయిని ప్రతివాదిగా పేర్కొంటారు. పైన చెప్పిన ఉదాహరణలో పోలీసులు చార్జి షీటు దాఖలు చేసినప్పుడు అందులో ప్రభుత్వాన్ని అభియోగిగా పేర్కొంటూ, గోపాల రావుని ముద్దాయిగా పేర్కొంటారు. దీన్నిబట్టి నేరం జరిగినప్పుడు నేరస్తుడిని శిక్షించ డానికి అవసరమైన చర్యలు తీసుకొనే బాధ్యత ప్రభుత్వం మీదే వుందని స్పష్టం అవు తోంది. ప్రభుత్వం తరపున పోలీసులు కేసు పెడుతున్నారు కాబట్టి పోలీసులే ప్రభుత్వం, ప్రభుత్వం అంటేనే పోలీసులు అని అనుకోవడానికి వీల్లేదు. ఆచరణలో యిలాగున్నప్పటికీ పోలీసులు ప్రభుత్వ యంత్రాంగంలో భాగం మాత్రమే.

అరెస్టు చేసినప్పుడు అరెస్టుని నివారించడానికి ప్రయత్నించినప్పుడో ప్రతిఘటించి నప్పుడో తప్ప పోలీసులు ముద్దాయి మీద చేయి చేసుకోవడానికి వీల్లేదు. అదైనా ముద్దాయి ప్రాణానికి ఏ పరిస్థితుల్లోనూ హాని జరక్కుండా మాత్రమే అతన్ని గాయ పర్చ వచ్చు. అరెస్టు చేసి ముద్దాయిని కస్టడిలోకి తీసుకొన్న తరువాత అతన్ని కొట్టడానికి వీల్లేదు.

ముద్దాయిని లాకప్‌లో పెట్టడం అంటే అతన్ని కస్టడిలో వుంచడమే. మరలాంట ప్పుడు పోలీసు కస్టడిలో ముద్దాయిలు ఎందుకు హింసించబడుతున్నారు? ఎందుకు హత్య చెయ్యబడుతున్నారు.

## *పోలీస్ కస్టడీ*

ఎవరూ, ఏనాడూ కనీవినని భయంకరమైన పీడకల కంటేకూడా నేటి దైనందిక జీవితం దుర్భరంగా వుంది. అయినా మనిషికి ప్రాణంమీద తీపి, భవిష్యత్తుమీద ఆశా చచ్చిపోలేదు. అందుకే మనిషి జీవిస్తున్నాడు. జీవించాలనుకొంటున్నాడు. సామాన్య మానవుడు జీవితగమనంలో పోలీసుల కబంధ హస్తాల్లో ఇరుక్కోకుండా వుండలేని పరిస్థితులు వున్నాయి. ఆకలితో ఏడ్చే పిల్లలకి తిండి పెట్టకుండా కొట్టి నోరు మూయించ డానికి చేసే వ్యర్థ ప్రయత్నం లాగానే, చాలీచాలని జీతాలతో బ్రతుకీడ్చేవారు, జీతాలు పెంచమని సమ్మెచేస్తే, కాలేజీల్లో సీట్లు పెంచమని విద్యార్థులు స్ట్రైక్ చేస్తే, బ్రతుకు తెరువుకు మరో మార్గంలేక స్త్రీలు పడుపువృత్తిలోకి దిగితే, ఉపాధికల్పించమని నిరుద్యోగులు ఆలజడిచేస్తే అది నేరం అయింది. ఘోరం అయింది. ఈ సమస్యల పరిష్కారం పోలీసులు రంగంలోకి దిగటం చావగొట్టడం జైళ్ళల్లోకి తొయ్యడం మాత్రమే అయింది. అందుకనే పోలీస్ స్టేషన్ గడపతొక్కని వాళ్లూ, ఆసుపత్రిలోకి అడుగుపెట్టని వాళ్లూ సాధారణంగా వుండరు. పోలీసు కస్టడీ అనేది జీవితంకంటే దుర్భరమైందీ, దారుణమైందీ, హింసే సర్వత్రా వ్యాపించివుంది. ఇంతకంటే మరణమే మెరుగు అని అనుకొంటే తప్ప పోలీసు కస్టడీలోనైనా ఎవరూ ఆత్మహత్యచేసుకోవాలని అనుకోరు. ఇలాంటి పరిస్థితి కల్పించి ఆత్మహత్యకి పురికొల్పడం కూడా నేరమేనని మరిచిపోవద్దు. పోలీసులు అరెస్టు చెయ్యడమనేది మామూలు అయిపోయింది. అది ఏదో అసాధారణ విషయంగా అవమానకరమైన విషయంగా ఎవరూ భావించడంలేదు. బయట దుక్కలా తిరిగినవాడు పోలీసు స్టేషన్లో చచ్చిపోతే అది గుండె జబ్బు అని పోలీసులు బుకాయిస్తే నమ్మాల్సిన అవసరంలేదు. కస్టడీ మరణాలన్నీ కూడా హత్యలే, హత్యలే అని ఎవరైనా సరే అంటారు.

## *పోలీసులు - నేర పరిశోధన*

పోలీసులు నేరపరిశోధన చెయ్యడం అంటే తాము నేరస్తుడని భావించిన వ్యక్తిని అరెస్టుచేసిన తరువాత అతన్ని కొట్టి తిట్టి భయాన్నో, భక్తినో నేరం ఒప్పించడానికి ప్రయత్నం చెయ్యడమేనని భావిస్తున్నారు. ప్రతికేసులోనూ పోలీసులు తమముందు ముద్దాయి ఒప్పుకొన్నట్లు కేసు రికార్డుల్లో రాస్తారు. కానీ సాధారణంగా కోర్టులో ఏ ముద్దాయి కూడా నేరం ఒప్పుకోగా నా అనుభవంలో చూడలేదు. దీన్నిబట్టి అసలు

ముద్దాయి పోలీసు స్టేషన్లో నేరం ఒప్పుకోలేదనైనా మనము భావించాలి, లేదా పోలీసులు హింసించి నేరం బలవంతంగానైనా ఒప్పించి వుంటారు. అందుచేత దర్యాప్తు పేరుమీద పోలీసులు చేస్తున్న పని అనుమానితుల్ని హింసించడమేనని మనకి అర్థం అవుతోంది. అంతేకాక పోలీసులకి న్యాయస్థానాల మీద విశ్వాసం లేదని కూడా స్పష్టం అవుతోంది. పోలీసులు నేరస్తులని భావించి కేసు పెట్టిన వాళ్ళమీద న్యాయస్థానాలు విచారణ జరిపి నేరం రుజువయ్యేట్లైతే శిక్షిస్తాయి. కానీ న్యాయస్థానాలు విచారణ జరిపి శిక్షించాల్సిన వాళ్ళని పోలీసులు కస్టడీలోనే శిక్షిస్తున్నారు. న్యాయస్థానాల మీద పోలీసులకి విశ్వాసం వుండేట్లయితే కస్టడీలోవున్న ముద్దాయిల్ని పోలీసులు హింసించేవాళ్ళుకాదు. కస్టడీలో ముద్దాయిని వుంచడం అంటే ముద్దాయికి ప్రాణ రక్షణ కల్పించడం అని ఇక్కడ అర్థం చేసుకోవాలి.

ప్రతినేరం ప్రభుత్వ వ్యతిరేకంగా జరిగిన నేరంగా భావిస్తున్నప్పుడు లాకప్ మరణాలకి కూడా ప్రభుత్వమే బాధ్యత వహించాలి. బాధ్యులైన అధికార్లని ప్రభుత్వం శిక్షించలేకపోతే ప్రజలు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకొనే ప్రమాదం వుంది. అందుకనే లాకప్ మరణాలు సంభవించినప్పుడు ప్రజలు పోలీసు స్టేషన్లమీద దాడిచేస్తున్నారు. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగేట్లయితే ఇహ అరాచక, ఆటవిక న్యాయం రాజ్యం ఏలుతున్నట్లే.

## ఎన్‌కౌంటర్

కస్టడీ మరణాలు అంటే కేవలం లాకప్ మరణాలే కాకుండా ఈ మధ్యన ఇంకొక రకమైన మరణాలు కూడా అందులో చేరిపోయాయి. అవి ఏమిటంటే ఎన్‌కౌంటర్ మరణాలు. "మా వాణ్ణి పట్టుకొన్నారు. ఎన్‌కౌంటర్ చేస్తారని భయంగా వుందండి. మీరెలాగైనా సరే వాణ్ణి కోర్టులో హాజరుపర్చేలా చూడండి." అంటూ కన్నీళ్ల మధ్య దీనంగా వేడుకునే తల్లిదండ్రుల్ని అనేకుల్ని మనం ఈ రోజుల్లో చూస్తున్నాం. ఒక మనిషిని పట్టుకోవడమేమిటి? అతన్ని వారం రోజులో పదిరోజులో ఇంకా అంతకంటే ఎక్కువ రోజులో తమకి ఇష్టమైనన్ని రోజులు అక్రమంగా నిర్బంధించి, చితకగొట్టి జాలిదలిస్తే వదిలేసి లేకపోతే ఏదో ఒక కేసు బనాయించి కోర్టుకో హాజరు పర్చడమో చేస్తున్నారు. అప్పుడప్పుడు కస్టడీలో వున్న వాడి కర్మంచాలక హరీ మనడం మినహాయిస్తే మరీ క్రైమా కొట్టినట్లుగా ఈ ఎన్‌కౌంటర్లేమిటి అనుకోవచ్చు

పేపర్లో ఎన్‌కౌంటర్లకి సంబంధించిన వార్తలు వస్తుంటాయి. అందులో సాధారణంగా ఇలా వుంటుంది. ఫలానా ఊళ్లో ఫలానా పార్టీకి సంబంధించిన వారిని పోలీ

సులు అరెస్టు చెయ్యడానికి వెళ్లగా వారు పోలీసుల మీద కాల్పులు చేశారు. పోలీసులు తిరిగి కాల్పులు చెయ్యగా, అందులో ఇద్దరు అక్కడికక్కడే మరణించారు. మరణించినవారు ఫలానా వ్యక్తులుగా పోలీసువర్గాలు గుర్తించాయి. వాళ్ళకి పలు హత్య, దోపిడీ నేరాలతో సంబంధం వుందని పోలీసులు తెలియజేస్తున్నారు. మొదట పట్టుకొన్న వాణ్ణి ఎన్‌కౌంటర్ చేస్తారు అని భయపడడానికి ఆ తరువాత పత్రికల్లో ఎన్‌కౌంటర్ పేరిట వస్తున్న వాటికీ మధ్యన ఆకాశానికి భూమికీ మధ్యన వున్నంత వ్యత్యాసం వుంది. దీంతో అసలు ఎన్‌కౌంటర్ అంటే ఏమిటి అనే అనుమానం రావచ్చు. మామూలుగా ఇవాల్టి చట్టబద్ధ వ్యవహారికంలో ఎన్‌కౌంటర్ అంటే పోలీసులు ఆత్మరక్షణ కోసం చేసే కాల్పులు అని అర్థం. మరి మామూలు సర్వసామాన్య ప్రజా వ్యవహారికంలో పోలీసులు అరెస్టు చేసిన తరువాత కాల్చి చంపడమో లేదా కనిపించగానే కాల్చెయ్యడమో నన్న అర్థంతో ఈ మాట వాడబడుతోంది. పత్రికల్లో వస్తున్న వార్తల్ని బట్టి ఈ మాటకున్న అర్థాన్ని బట్టి ఎన్‌కౌంటర్ మరణాలన్నీ అనుమానాస్పదమైన మరణాలేనని స్పష్టం అవుతోంది.

సాధారణంగా ఎన్‌కౌంటర్లు జరిగినప్పుడు అందులో ఒకవైపు పోలీసులు వుండటం మరో వైపు మృతుల తాలూకు పార్టీలు వుండటం జరుగుతుంది. ఒక వేళ మరణించిన వాళ్ళవైపునుంచి వారి తల్లో, తండ్రో, తమ్ముడో, స్నేహితుడో, భార్య బిడ్డా, లేక మరెవరైనా సరే ఇది ఎన్‌కౌంటర్ కాదు, పట్టపగలు నలుగురూ చూస్తుండగా జరిగిన హత్య అన్నా పట్టించుకుంటున్న నాథుడు లేడు. వేరే ఎవరైనా నేరం చేస్తే పోలీసులే ప్రభుత్వం తరపున కేసు పెడతారు. పోలీసులే నేరం చేస్తే ఇహ దిక్కేమిటి? కంచే చేను మేసినట్లుగా అన్నట్లుగా తయారైంది పరిస్థితి. ఈ విషయంలో ప్రభుత్వం సర్వసాధారణంగా పట్టించుకోదు. ఒకవేళ పట్టించుకొన్నా మేజిస్ట్రీరియల్ విచారణ జరిపించి ఊరుకొంటుంది. దీనివల్ల పెద్దగా ఫలితం వుండదు. ఒకవేళ ఏమైనా నేరం రుజువైనప్పటికీ ఆ తరువాత కేసు పెట్టాల్సింది పోలీసులే కాబట్టి విషయం గాలికి కొట్టుకు పోతుంది.

ఈ విషయంలో ఎప్పుడైనా పౌరహక్కుల సంఘాల వారే స్వచ్ఛందంగా తమకున్నటువంటి పరిమితమైన హంగులతో విచారణ జరుపుతారు. వాళ్ల విచారణలో నిజమైన ఎన్‌కౌంటర్ కాదని తేలితే ఇది ఎన్‌కౌంటర్ కాదు హత్య అనీ ఒక వేళ నిజమైన ఎన్‌కౌంటర్ అయితే పోలీసులు సురక్షితంగా వుండి మిగిలినవాళ్లు ఎందుకు చచ్చిపోయారు? పోలీసులకి చీమకుట్టినట్టయినా దెబ్బతగల్లేదే? ఫలానా ఫలానా వాళ్లంతా అది ఎన్‌కౌంటర్ కాదని తమకి చెప్పారని ప్రకటిస్తూ నివేదికలు సమర్పిస్తారు. ఈ నివేదికలేవీ చార్జిషీట్లు కాదు. కనీసం ప్రథమ సమాచార నివేదికలైనా కావు. అంచేత

న్యాయస్థానాలు పట్టించుకోవు. పట్టించుకోవాల్సిన ప్రభుత్వం కూడా పోలీసులను సమర్థిస్తూ వుంటుంది. పై పెచ్చు పౌరహక్కుల సంఘం నివేదిక బూటకమని పౌరహక్కుల సంఘం వాళ్లు కూడా ఫలానా పార్టీకి సంబంధించినవాళ్లు అని పోలీసులు అంటే దాన్ని కూడా ప్రభుత్వం గుడ్డిగా సమర్థిస్తోంది. ఏ నేరం జరిగినా ప్రభుత్వమే బాధ్యత తీసుకొని నేరస్తుణ్ణి శిక్షించడానికి అవసరమైన చర్యలు తీసుకోవాలి. అలాగే పోలీసులు నేరం చేసినా ఇంకొకరు నేరం చేసినా దాని బాధ్యత కూడా ప్రభుత్వమే తీసుకొని నేరస్తుల్ని శిక్షించాలి. ఒక వేళ ప్రభుత్వం నిష్పక్షపాతంగా వ్యవహరించకుండా ఏ నేరస్తుడికైనా మినహాయింపు ఇచ్చేటట్లయితే ప్రభుత్వం నేరస్తుడితో చేతులు కలిపినట్లవుతుంది.

పోలీసులు ఆత్మరక్షణ కోసం కాల్పులు జరపడానికి వీల్లేదా? అని సందేహం కలగనచ్చు. నిస్సందేహంగా పోలీసులే కాదు మరెవరైనా సరే ఆత్మరక్షణ కోసం నేరం చెయ్యవచ్చు. చట్టం దీనికి మినహాయింపు కూడా ఇచ్చింది. అంటే పోలీసులు ఆత్మరక్షణ కోసం కాల్పులు జరపవచ్చు. ఆత్మరక్షణ పేరిట ఎవరైనా నేరం చేసేట్లయితే వాస్తవానికి అది ఆత్మ రక్షణ కోసం చేసిన పని అయినప్పటికీ పోలీసులు కేసు పెడతూండటం మనం చూస్తున్నాం. ఆ తరువాత న్యాయస్థానాల్లో అది ఆత్మరక్షణ చర్య అని రుజువైతే విడిచి పెడుతున్నారు. ఉద్దేశపూర్వకంగా జరిగినదని అనుకున్నప్పుడు మాత్రం ముద్దాయిని శిక్షిస్తున్నారు. చట్టంలో ఆత్మరక్షణ కోసం చేసే నేరం విషయంలో ఒక నిబంధన వుంది. ఏ పరిస్థితుల్లోనూ ఆత్మరక్షణ కోసం చేసే చర్య అతిక్రమించ కూడదు. ఉదాహరణకి ఒక వ్యక్తి 'ఎక్స్' ని కత్తితో పొడవటానికి వచ్చేట్లయితే 'ఎక్స్' ఆత్మరక్షణకోసం అతన్ని గాయపర్చే హక్కు వుంది. అలాగని 'ఎక్స్' ఏ తుపాకో తీసుకొని తనని చంపడానికి వస్తున్న వాడి గుండెలకి గురిపెట్టి కాల్చడానికి వీల్లేదు. ఏ కాలినో కాల్చి ప్రమాదాన్ని తప్పించుకోవచ్చు. 'ఎక్స్' గనుక అతని గుండెలకి గురిపెట్టి కాల్చిచంపినట్లయితే అది నేరం అవుతుంది. శిక్షార్హం కూడా. ఇక్కడ 'ఎక్స్' తన ఆత్మరక్షణ హక్కుని దుర్వినియోగపర్చుకొన్నట్టే. ఈ విషయంలో తెలిసి కానీ తెలియక కానీ ఈ నిబంధనని ఉల్లంఘిస్తే అది శిక్షార్హమే అవుతుంది. కాబట్టి కూడా పోలీసులు ఆత్మరక్షణ కోసం చేసిన నేరాల విషయంలో కూడా సాధారణంగా చార్జిషీట్లు దాఖలు చేసి ఆ చర్య ఆత్మరక్షణ కోసం జరిగిందా కాదానని తేల్చడానికి కోర్టులకే వదిలేస్తున్నారు.

దురదృష్టవశాత్తు ఆత్మరక్షణ కోసం ఎన్‌కౌంటర్ల పేరిట పోలీసులు చేస్తున్న కాల్పుల విషయంలో కేవలం ప్రాథమిక సమాచార నివేదిక మాత్రమే దాఖలు చేసి వూరుకుంటున్నారు. చార్జిషీటు పెట్టడంలేదు. ఏ న్యాయస్థానాల ముందూ విచారణని

ఎదుర్కోవడంలేదు. ఎందుకనంటే తామే ఆ నేరాన్ని దర్యాప్తు చెయ్యవలసిన వాళ్లుకదా?

ప్రాథమిక సమాచార నివేదిక స్వీకరించిన మెజిస్ట్రేట్‌గారు కేసులో దర్యాప్తు కనుక సాగకపోయినట్లయితే దర్యాప్తు చెయ్యమని పోలీసులని ఆదేశించవచ్చు. లేదా స్వయంగా విచారణ జరపవచ్చు. ఇలా జరిగినా ఈ విషయంలో కొంత వరకూ న్యాయం జరిగే అవకాశం వుంది. మిగతా వాళ్ల ఆత్మరక్షణ కోసం చేసిన పని పోలీసుల దృష్టిలో నేరం అయినప్పుడు తాము చేసిన పని ఎందుకు నేరం కాదు. కనీసం లోకనిందనైనా తప్పించుకోవడానికి ఇలాంటి విషయాల్లో దర్యాప్తు జరిపి చార్జిషీటుపెట్టి విచారణని ఎదుర్కోవచ్చుకదా?

పోలీసులు ఈ విషయంలో విచారణ ఎదుర్కోకపోతే తమకి తాము నేరస్తులం కామని తీర్పు చెప్పుకొన్నట్లేనని స్పష్టం అవుతోంది. కనీసం వాళ్ల ఆత్మరక్షణ కోసం చేసిన పనిలో ఏమైనా అతిక్రమించారోనని తెలుసుకోవడానికి కూడా అవకాశం లేదు.

## పోస్టుమార్టం-మెజిస్టీరియల్ విచారణ

శివయ్యని పోలీసులు అరెస్టుచేశారు. వారం రోజులైంది. పది రోజులైంది. అయినా అతన్ని కోర్టులో హాజరు పర్చలేదు. రోజూ శివయ్య భార్య పోలీసు స్టేషన్‌కి వెళ్ళి అతనికి అన్నం పెట్టి వస్తూండేది. కనిపించిన వాళ్ళందరి కాళ్ళూ పట్టుకొని శివయ్యని ఎలాగైనా విడిపించమని వేడుకొంది. ఏడ్చింది, మొత్తుకొంది. అయినా పోలీసులు శివయ్యని విడిచిపెట్టలేదు. రాళ్లయినా కరుగుతాయి కానీ పోలీసుల గుండెలు కరగవు అన్నట్లుగా పోలీసులు శివయ్య భార్య ఏడుపు లక్ష్యపెట్టలేదు. పైపెచ్చు శివయ్య చెయ్యని దొంగతనాన్ని అతనిచేత బలవంతంగా ఒప్పించడానికి అతన్ని నానా హింసలూ పెట్టారు. కరెంటు షాకులు ఇచ్చారు. రోకలి బండలు ఎక్కించారు. లాఠీలతో ఇష్టం వచ్చినట్లుగా బాదారు. అయినా శివయ్య పోలీసులకి లొంగలేదు. అతనికి మనస్సంటూ వుంటే అది విరిగి ముక్కలయ్యేలా నానా బూతులూ తిట్టారు. పోలీసుల తిట్లూ దెబ్బలూ శివయ్యకి ప్రతినిత్యం మామూలైపోయింది. ఏదెబ్బ అతనికి తగలకూడని చోట తగిలిందో, ఏ మాట అతని గుండెల్ని పగలగొట్టిందో మనకు తెలియదు. కానీ ఒక రాత్రి శివయ్య ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి. శివయ్యకి భోజనం పెట్టడానికి వెళ్ళిన అతని భార్యకి తోటి ఖైదీలు అతను చచ్చిపోయినట్లుగా, అతని శవాన్ని పోలీసులు లాకప్‌నుంచి బయటకి ఈడ్చేసినట్లుగా చెప్పారు. కాదు మర్యాదస్తుడు కాబట్టి శివయ్య ఆత్మహత్య చేసుకున్నాడు అన్నారు పోలీసులు.

"ఇది ఆత్మహత్య కాదు మీరే మీరే కొట్టి చంపారు" అంటూ ఏడ్చింది శివయ్య భార్య.

శివయ్య శవాన్ని పోలీసులు పోస్టుమార్టం చేయించి పంచనామా జరిపించారు. పోస్టుమార్టం రిపోర్టుని బట్టి, ఇది ఆత్మ హత్య అని తేలిందని పోలీసులు ప్రకటించారు.

పోలీసులు కొట్టి, తిట్టి అక్రమంగా నిర్బంధించి శివయ్య చావుకు ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ బాధ్యులు అయ్యారు. అలాంటప్పుడు శివయ్య హింసకు గురై మరణించాడో, ఆత్మహత్య చేసుకున్నాడో నిర్ధారించే హక్కు పోలీసులకి వుందా? మరొక స్వతంత్ర విచారణ యొక్క అవసరం లేదా? అని సందేహాలు కలుగవచ్చు.

పోలీసు కస్టడీలో ఎవరైనా వ్యక్తి మరణించేట్లైతే సమీపంలో ఉన్న మెజిస్ట్రేట్ విచారణ జరపాలి. ఇక్కడ కస్టడీలో వ్యక్తి మరణించడం అంటే లాకప్‌లో వ్యక్తి మరణించడమో లేదా పోలీసుల అధీనంలో ఉండగా మరణించడమని అర్థం చేసుకోవాలి. పోలీసులు అరెస్టు చెసిన తరువాత వ్యక్తిని లాకప్‌లోనే పెట్టాలని నిబంధన ఏమీలేదు. ఎక్కడైనా సరే తమ ఆధీనంలో ఉంచుకోవచ్చు. అందుకనే కస్టడీలో మరణిస్తే అనేమాట వాడటం జరిగింది. ఈ విచారణ అనేది తప్పనిసరిగా జరపాలని చట్టం నిర్దేశిస్తున్నా లాకప్ మరణాలు సంభవించినప్పుడు ప్రభుత్వం ఏదో జాలితలచి మెజిస్టీరియల్ విచారణకు ఆదేశించినట్లుగా మాట్లాడుతూ వుండటం మనం చూస్తున్నాం. ఈ నిబంధన స్వతంత్రం వచ్చిన తరువాత ఇప్పుడు కొత్తగా ఏర్పడింది కాదు. బ్రిటిష్ కాలం నించే వుంది. ఆనాటి నించే నేరపరిశోధన చేసే పోలీసులే నేరం చేస్తే ఒక స్వతంత్ర దర్యాప్తు అవసరమని మన చట్టంకాదు పరాయి చట్టమే భావించింది. అతి కొద్ది మార్పులతో తిరిగి ఇదే చట్టాలను ఇదే నిబంధనలనీ అమలు పరుస్తున్నా మనం మాత్రం ఏదో జాలిదలచి ప్రసాదించినట్లుగా మాట్లాడుతున్నాం.

అనుమానాస్పద మరణంపట్ల పోలీసులు ప్రకటించే అభిప్రాయాన్ని మాత్రమే సరైంది అని అనుకోకుండా, మెజిస్ట్రేట్‌చే ఒక స్వతంత్ర విచారణ జరిపించి పోలీసుల ప్రకటనలోని నిజానిజాల్ని తేల్చడానికి చట్టం దోహదంచేస్తుంది. కస్టడీ మరణాలు అనుమానస్పదమైనా కాకపోయినా ఈ విచారణ తప్పనిసరిగా జరుగుతుంది. కాబట్టి, కస్టడీలో వున్నప్పుడు ఆ వ్యక్తిని ఏమైనా హింసించారా లేదానని తేలుతుంది. ఆ తరువాత ఆ మరణం - హత్య అని అనుమానించేట్లైతే చర్యతీసుకొనే అవకాశం ఏర్పడుతుంది. దీన్నిబట్టి మెజిస్టీరియల్ విచారణ యొక్క మౌలిక ఉద్దేశ్యం మనకు స్పష్టం అవుతోంది. ఇది ఎవరో జాలి తలిస్తేనో, బిచ్చం వేస్తేనో లభించిన హక్కు కాదు. అనాదిగా పోలీసులకి ఎన్ని అధికారాలు వున్నా, వాటిపైన ఒక నిఘా అవసర మని న్యాయశాస్త్రం భావించడం వల్ల ఏర్పడిన హక్కు. ప్రభుత్వం, పోలీసులే న్యాయం, పోలీసులే చట్టం, పోలీసులే ప్రభుత్వం, పోలీసులే సర్వస్వం అనుకుంటేతప్ప

చట్టప్రకారం తప్పనిసరిగా జరగాల్సిన మెజిస్టీరియల్ విచారణ ఏదో జాలితలచి జరిపిస్తున్నట్లుగా మాట్లాడదు.

మెజిస్టీరియల్ విచారణ జరిపి మెజిస్ట్రేటు, రాష్ట్ర ప్రభుత్వంచే నియమితులైన ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటు ఎవరైనా కావచ్చు. జిల్లా మెజిస్ట్రేటు (జిల్లా కలెక్టరు) మొదలు తాసిల్దార్ వరకూ ఎవరికైనాసరే ఈ విచారణ జరిపే హక్కు వుంటుంది. ఇది పోలీసులు జరుపుతున్న దర్యాపుతో సంబంధం లేకుండా స్వతంత్రంగా జరిపే విచారణ. పోలీసులు దర్యాప్తు జరిపినా జరపకపోయినా ఈ విచారణ జరుగుతుంది. ఈ విచారణ జరుపుతున్న మెజిస్ట్రేటుకి విచారణ జరిపే సందర్భంలో అందరి మెజిస్ట్రేట్లకి వుండే అన్ని అధికారాలు వుంటాయి. సాక్షులకి సమను ఇచ్చి పిలిపించడం, సాక్ష్యం చెప్పినవారి సాక్ష్యం రికార్డు చేసుకోవడం లాటి అనేక అధికారాలు వుంటాయి. ఈ విచారణ జరిపే మెజిస్ట్రేటు అవసరమైన సాక్ష్యాధారాలు తప్పనిసరిగా రికార్డు చెయ్యవలసి వుంటుంది. సాక్ష్యాలు రికార్డు చేసే సందర్భంలో మెజిస్ట్రేట్‌గారు సాక్షితో ప్రమాణం చేయించవచ్చు.

పోలీసులంటే జనానికి భయం లేకుండా పోయినప్పుడే ఇలాంటి విచారణలు స్వేచ్ఛగా స్వతంత్రంగా జరిగే అవకాశం ఉంటుంది. ప్రస్తుత పరిస్థితుల్లో తప్పనిసరిగా జరుగుతున్న విచారణలు ఒక ఫార్స్‌గా తయారైయ్యాయితప్ప వీటివల్ల పెద్దగా ఫలితం వుండటంలేదు. సాక్షులు సాక్ష్యం చెప్పడానికి విచారణ జరుగుతున్న చోటుకి వెళ్ళకుండానే పోలీసులు అడ్డు తగులుతున్నారని మనం అనేకసార్లు వింటున్నాము.

మెజిస్ట్రేటుగారు విచారణ జరుపుతున్నప్పుడు శవ పరీక్ష జరపడం అవసరం అని భావిస్తే శవ పరీక్ష జరిపించవచ్చు. గతంలో పంచనామాఅప్పుడు శవ పరీక్ష జరిపినప్పటికీ తిరిగి అవసరం అనుకొంటే మళ్ళీ పోస్టుమార్టం చేయిస్తారు. మరణానికిగల కారణాలు తెలుసుకోవడానికి మాత్రమే ఈ పరీక్ష చేయిస్తారు. శవాన్ని పూడ్చిపెట్టినప్పటికి తిరిగి బయటికి తీయించి ఈ పరీక్ష జరిపించే హక్కు విచారణ జరుపుతున్న మెజిస్ట్రేట్‌కు వుంటుంది.

మెజిస్టీరియల్ విచారణ జరుగుతున్నప్పుడు మృతుడి తల్లిదండ్రులనీ, భార్యనీ, సోదరుల్నీ పిలిపించాలి. వీలైనంత వరకూ వాళ్ళని విచారణ జరుగుతున్నప్పుడు హాజరు అయ్యేలా మెజిస్ట్రేటుగారు చూడాలి.

ఈ విచారణ జరిపిన తరువాత మెజిస్ట్రేటు రిపోర్టు తయారు చెయ్యవలసిన అవసరం లేదు. కనీసం ఒక అభిప్రాయానికి కూడా రావల్సిన అవసరం లేదు. కేవలం మరణానికి గల కారణాలు మాత్రమే తెలుసుకోవాల్సి వుంటుంది. అందుకని ఈ విచారణని కోర్టుగా భావించాల్సిన అవసరం లేదని సుప్రీంకోర్టు అభిప్రాయపడింది.

ముద్దాయిల్ని శిక్షించడం సంగతి అలావుంచితే కనీసం నివేదికని కూడా తయారుచెయ్యలేని ఈ విచారణవల్ల ఫలితం ఏమీ వుండదు. తిట్టి, కొట్టి, ఏడ్పించి, ఏడ్చేవాడి నోట్లో బెల్లంముక్క పెట్టడం లాంటిదే ఈ విచారణ.

## హత్యా - ఆత్మహత్యా

వేసిన తాళాలు వేసినట్లే వున్నాయి. వేసిన తలుపు తీసిన జాడ లేదు. చీకటి గుహలో సూర్యుడు పత్తాలేడు. బయట కావలి కాస్తున్న మనిషి శిలా ప్రతిమలా కదలకుండా నిల్చున్నవాడు నిల్చున్నట్లే వుండిపోయాడు. కానీ ఆ గదిలో ఒక మనిషి నెత్తుటి గులాబీలా నేలరాలిపోయాడు. కావలి కాస్తున్నవాడు కళ్లుండి చూడలేని, నోరుండి మాట్లాడలేని, చెవులుండి వినలేని రాతిగుండెల వాడిలా వున్నాడు. ఈ పాపం మాకు తెలియదు. ఈ దారుణం మేం ఎరుగం. మమ్మల్ని ఏమీ అడక్కండి, వాడి చావు వాడు చచ్చాడు అన్నారు బాధ్యులంతా. ఇంతకీ ఆ చీకటి గుహ ఏమిటి? అందులో నలిగి పడివున్న రక్తపు గులాబీ ఏమిటి? అని అడిగితే ఎవరైనా సరే అది పోలీసు లాకప్ అనీ అందులో పోలీసుల హింసలకు తట్టుకోలేక ఖైదీ మాంసంముద్దలా నేలకొరిగాడని చెబుతారు. ఒక మనిషిని అరెస్టు చేస్తారు. లాకప్‌లో పడేస్తారు. రోజుల తరబడి నానా హింసలూ పెడతారు. అతను కనుక చచ్చిపోయేట్లైతే ఆ మరణానికి తాము బాధ్యులం కామంటారు. మరెవరు దీనికి బాధ్యులు అంటే? వాడు ఆత్మహత్య చేసుకొన్నాడని కట్టుకథలు చెబుతారు. లేదా వాడు గుండె జబ్బుతోటో లేక మరో రోగంతోటో తీసుకు తీసుకు చచ్చాడంటారు. ఏదేమైనప్పటికీ ఇది అనుమానస్పదమైన మరణమేనని స్పష్టం అవుతోంది. మరలాంటప్పుడు ఇందులో ప్రైవేటు కేసు వెయ్యవచ్చు కదా? అప్పుడు అది రుజువయ్యే అవకాశాలు వుంటాయా? సెక్షన్ మూడువందలరెండు ఐ. పి. సి. పోలీసులకీ ప్రైవేటు వాళ్ళకీ సమానంగా వర్తిస్తుందా? అని అనేక మందికి సందేహాలు కలుగవచ్చు.

### *పోలీస్ కేసు - ప్రైవేట్ కేసు (సెక్షన్ 302 ఐ.పి.సి.)*

చట్టం ముందు పోలీసులైనా ప్రైవేటు వాళ్ళయినా ఒక్కటే, ఎవరు చేసినా నేరం నేరమే అవుతుంది. నేరస్తులని పట్టుకొని శిక్షించే అవకాశం వుంది కాబట్టి పోలీసులు నేరం చేస్తే అది నేరం కాకుండాపోదు. చట్టం ముందు అందరూ సమానమే. న్యాయస్థానాలు ప్రభుత్వం నుంచీ పోలీసుల నుంచీ స్వతంత్రమైనవి. న్యాయస్థానానికి

మాత్రమే నేరస్తులని విచారించి శిక్షించే అధికారం వుంది. కేవలం న్యాయస్థానం ఇచ్చిన తీర్పును అమలు పర్చడం వరకే. కేసు విచారణ పూర్తయిన తరువాత పోలీసులు చేసేపని పరిమితమై వుంటుంది. దీన్నిబట్టి పోలీసులకి ముద్దాయిలని శిక్షించే అధికారం లేదని స్పష్టం అవుతోంది. బోను ఎక్కినప్పుడు మాత్రమే పోలీసులకి చట్టం అంటే ఏమిటో తెలుస్తుంది అన్నారు శ్రీ కె. జి. కన్నాభిరన్ గారు ఒక వ్యాసంలో. ఈ మాట అక్షరాల నిజమని అనేక సందర్భాల్లో స్పష్టం అయింది. జాగ్రత్తగా గమనిస్తే ఈ పోలీసు వ్యవస్థ ఇలాగే వున్నంత వరకూ ఈ మాటలోని నిజం మనకి ఎప్పుడైనా బోధపడుతుంది. కోర్టులో బోను ఎక్కక ముందు పోలీసు వాడు అడవిలోంచి తప్పించుకువచ్చిన మృగం. కొడతాడు, తిడతాడు ఇంకా మాట్లాడితే చంపుతాడు. తాను మాట్లాడిందే రూల్, రెగ్యులేషన్ అంటాడు. కానీ బోను ఎక్కినప్పుడు మాత్రం జడ్జిగార్కి వంగివంగి నమస్కారాలు పెడతాడు. ప్రమాణం చేసి అబద్దాలు చెప్పి తాను చట్టానికి కట్టుబడి వున్నానని స్పష్టం చేస్తాడు. ఎంత నిజం తెలిసిన వాళ్ళకైనా కోర్టులో పోలీసులని చూసినప్పుడు మాత్రం, హమ్మనీ చట్టం అంటే పోలీసులకి ఎంత ప్రేమ అని అనిపించక మానదు. ఇంతలా చట్టమంటే గౌరవించే పోలీసులు, న్యాయస్థానాలని అభిమానించే పోలీసులు ఒక్కసారి కాక పోతే ఒక్కసారి లాకప్ మరణాల విషయంలో నీతిగా, నిజాయితీగా తమకి వ్యతిరేకంగా తాము కేసు పెట్టుకొని విచారణని ఎదుర్కొన్నారా? లేదుకాక లేదు. అంటే పోలీసులకి చట్టమంటే ఎంత గౌరవం వుందో ఇంకా నేను చెప్పాల్సిన పనిలేదు.

మెజిస్ట్రీరియల్ విచారణ జరిగిన తరువాత ఆ నివేదిక ఆధారంగా న్యాయ స్థానంలో కేసు నడవదు. అది కేవలం మరణానికి గల కారణం తెలుసుకోవడం వరకే పరిమితం. ఒక నివేదిక తయారు చెయ్యాల్సిన అవసరం లేదు. కనీసం ఒక్క అభిప్రాయం చెప్పాల్సిన పనికూడా లేదు. విచారణ ఆధారంగా ఒకవేళ ప్రభుత్వం కనుక దర్యాప్తు అవసరమనుకొంటే పోలీసుల తోటో సిబిసిఐడి వాళ్ళతోటో దర్యాప్తు జరిపిస్తారు. ఆ తరువాతనే కేసు పెట్టడం, పెట్టకపోవడమనేది జరుగుతుంది. అంటే దర్యాప్తు చెయ్యడం, నేరస్తులమీద కేసు పెట్టడమనేది లాకప్ మరణాల విషయంలో పూర్తిగా ప్రభుత్వంయొక్క దయాదాక్షిణ్యాల మీద ఆధారపడివుందని అర్థమవుతోంది. దురదృష్టవశాత్తూ ఈ దేశంలో పోలీసులంతా ఒక రేనన్న అభిప్రాయంతో వుంటారు. ఒక పోలీసువాడు నేరంచేస్తే మిగతా వాళ్ళు అతన్ని కాపాడ్డానికి ప్రయత్నం చేస్తు న్నారు. అలాంటప్పుడు పోలీసులకి వ్యతిరేకంగా పోలీసులు దర్యాప్తు జరుపడం ఊహా తీతమైనటువంటి విషయం. ఇహపోతే సిబిసిఐడి లాంటి సంస్థలు కూడా పోలీసులకి అనుబంధ సంస్థలు లాగానే పనిచేస్తున్నాయి. కనుక వీటినుంచి ఈ విషయంలో ఒక

స్వతంత్రమైన నిష్పక్షపాతమైన దర్యాప్తుని ఆశించలేం. ఇహపోతే ప్రైవేట్ కంప్లైంట్ చెయ్యడం. ఇన్ని హంగులూ, ఆర్భాటాలు వున్న పోలీసులే నూటికి తొంభై కేసుల్లో తాము నేరస్తులుగా పేర్కొంటూ ఆరోపించిన వాళ్ళకి వ్యతిరేకంగా కోర్టుకో కేసులు రుజువు చేసుకోలేకపోతున్నారు. మరలాంటప్పుడు సామాన్యులు పోలీసులకి వ్యతిరేకంగా కోర్టులో కేసు రుజువు చెయ్యడమంటే మాటలు కాదు.

## లాకప్ మరణం - సాక్ష్యం

అరెస్టు చేసినప్పుడు చూసిన వాళ్ళు కోర్టులో సాక్ష్యం చెప్పాలి. ఆ తరువాత అరెస్టయిన వ్యక్తి లాకప్‌లో మరణించడానికి ముందు వరకూ అరెస్టయినప్పటి నుంచీ పోలీసు కస్టడీలోనే వున్నట్లుగా సాక్ష్యం వుండాలి. కస్టడీ మృతుడు హింసకు గురైనట్లుగా సాక్ష్యం వుండాలి.

ఆ హింసవల్లే మృతుడు మరణించినట్లుగా పోస్టుమార్టం చేసిన డాక్టరు కనుక చెప్పినట్లయితే లాకప్ మరణం హత్యని రుజువౌతుంది. ఇంతా చేసినప్పటికీ పోలీసు స్టేషన్లో అనేక మంది పోలీసులువుంటారు. కాబట్టి అందులో ఎవరెవరు మృతుణ్ని హింసించారు, ఎవరి హింసవల్ల మృతుడు మరణించాడో రుజువుకావడం దుర్లభం అవుతుంది.

పోలీసు లాకప్‌లో జరిగే సంఘటనలకి పోలీసులూ తోటి ఖైదీలూ తప్ప ఇంకా ఎవరూ సాక్ష్యం వుండరు. తమ కళ్ల ముందు నిర్దాక్షిణ్యంగా చట్టాన్ని అమలుపర్చడం పేరిట ఒక హత్య జరగటం చూసిన తరువాత ఏ ఖైదీ కూడా ధైర్యంగా ముందుకు వచ్చి సాక్ష్యం చెప్పడు. నిజం తెలిసినా పోలీసుల ఆరోపణ తమకి వ్యతిరేకంగా వుంది కాబట్టి నోరు విప్పరు. ఇహ కేసు ఎలా రుజువౌతుంది? సాక్షుల్ని పోలీసులుబెదిరించరని గ్యారంటీ ఏమీ లేదు.

పోలీసు స్టేషన్లో జరిగే ఈ దారుణాలకి ఇహ పరిష్కారం కానీ నివృత్తికానీ లేదా అని ఎవరికైనా అనిపించక పోదు అరెస్టు చేసిన తరువాత ఖైదీ పోలీసుల ఆధీనంలో వుంటాడు కాబట్టి అతనికేమైనా అయ్యేటట్లయితే పోలీసులే దానికి బాధ్యులవు తారు. సంబంధిత పోలీస్‌స్టేషన్ అధికార్ని బాధ్యుణ్ని చేస్తూ పోలీసుల మీద చర్య తీసుకోవడానికి వీలుగా చట్టంలో సవరణ తేవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

తెగ లంచాలు తింటున్నాడని ఒక పోలీసు అధికారి మీద కంప్లయింట్ ఇస్తే, అతన్ని అవినీతి నిరోధక శాఖకి అధికారిగా ట్రాన్స్‌ఫర్ చేస్తున్న ఈ రోజుల్లో ప్రభుత్వాన్నుంచి ఇంతటి సంస్కరణని ఆశించటం దురాశే అవుతుందేమో!

# బెయిల్

రాత్రి పన్నెండు కావస్తోంది. గోవిందయ్య యింటి తలుపులు ఎవరో దబ దబా బాదుతున్నారు. "ఎవరు" అన్నాడు గోవిందయ్య ఖద్దకంగా లేచి మత్తుగా. "మేం పోలీసులం తలుపులు తియి బే" అని అరిచారు పోలీసులు దౌర్జన్యంగా. గోవిందయ్య మత్తు కాస్తా వదిలి పోయింది. నిలువునా గజగజా వణికిపోతూ వెళ్ళి తలుపు తీశాడు. అనాలోచితంగా తలుపు కడ్డంగా నిల్చున్న గోవిందయ్యని నెట్టేస్తూ పోలీసులు లోపలకి జొరబడ్డారు. "గోవిందయ్య ఎక్కడ రా" అని అడిగారు పోలీసులు గోవిందయ్యని. "నేనే సార్ గోవిందయ్యని" అని చెప్పాడు గోవిందయ్య భయంతో. "నడవరా పోలీసు స్టేషన్‌కి" అంటూ ఒక కానిస్టేబుల్ వచ్చి అతని రెక్క పట్టు కొన్నాడు. గోవిందయ్యకి ఎందుకు, ఏమిటి అని అడగటానికి ధైర్యం చాలలేదు.

పోలీసులకి చెప్పే ఓపికాలేదు.

ఆ సాయంత్రం గోవిందయ్య కిరాణా షాపు వాడితో ఘర్షణ పడ్డాడు. ఆ ఘర్షణలో షాపువాడికీ గోవిందయ్యకీ దెబ్బలు తగిలాయి. షాపువాడు, గోవిందయ్య వేరు వేరుగా పోలీసు కంప్లైంట్స్ యిచ్చారు. షాపువాడు యిచ్చిన కంప్లైంట్ మీద పోలీసులు గోవిందయ్యని అరెస్టు చేశారు. పోలీసులు మర్యాదగా అరెస్టు చేశారనడం బాగుండదేమో. కట్టుకున్న లుంగీ బనీనుతోటే పోలీసు స్టేషన్‌కి ఈడ్చుకు వెళ్ళారు.

ఈ విషయం తెలవగానే ఏలూరులో లా చదువుతున్న గోవిందయ్య కొడుకు మర్నాడు ప్రొద్దున్నే పోలీసు స్టేషన్‌కి వచ్చి తన తండ్రిని ఏ కేసులో అరెస్టు చేశారో ఏమిటో వాకబు చేశాడు. గోవిందయ్యని అరెస్టు చేసింది బెయిలబుల్ కేసులో అని తెలవగానే "ఈ కేసులో మీరు బెయిల్ యివ్వవచ్చు గదా? బెయిల్ ఇవ్వండి కావలిస్తే జామీను నేను తీసుకు వస్తాను" అని పోలీసుల్ని అడిగాడు. ఆ మాట తనకి కొత్తైనట్లుగా ఎప్పుడూ విననట్లు మొఖం పెట్టి గోవిందయ్య కొడుకు్కేసి కోపంగా చూస్తూ "మేం బెయిల్ యివ్వం" అన్నాడు ఇన్‌స్పెక్టర్. ఇన్‌స్పెక్టర్ వాలకం చూసి ఇంకా ఏమైనా మాట్లాడితే తనని కూడా అరెస్టు చేస్తారేమోనని భయపడి వెనక్కి తగ్గాడు గోవిందయ్య కొడుకు.

గోవిందయ్య పెట్టిన కేసులో మాత్రం షాపువాడు ముందస్తు బెయిలు తెచ్చుకున్నాడు. అతని మీద ఈగైనా వాలలేదు. రెండు రోజుల తరువాత గోవిందయ్యని కోర్టులో హాజరు పర్చినప్పుడు, అతను జామీను యిచ్చుకోగలడని తెలుసుకొని మెజిస్ట్రేటుగారు అతన్ని బెయిల్‌పై విడుదల చేశారు. అరెస్టైనవాళ్ళు నరకాన్ని చూస్తారు. కాని ఈ బెయిల్ మీద విడుదలవ్వడం ఏమిటి?

పోలీసులు అరెస్టు చెయ్యగానే అరెస్టయిన వ్యక్తికి బెయిల్‌మీద విడుదలయ్యే అవకాశాల్ని గురించి తెలియచెయ్యాల్సిన బాధ్యత పోలీసులదే. చట్టబద్ధంగా పోలీసులు తప్పనిసరిగా చెయ్యాల్సిన చాలా బాధ్యతల్ని విస్మరించినట్లే, ఈ విషయంలో కూడా బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తారు. అసలు ముద్దాయిని బెయిల్ మీద విడుదల చెయ్యడ మనేమాట పోలీసులకి కొత్తగా వింతగా ఆశ్చర్యంగా వుంటుంది. ఎందుకంటే పోలీసులు ఎవర్నైతే అరెస్టు చేస్తారో వాళ్ళే నేరస్తులు. ఆ నేరస్తుల్ని శిక్షించేది కోర్టు కాదు పోలీసులే. నేరం ఋజువు కావడంతో పోలీసులకి ఏమీ సంబంధం లేదు. తాము నేరస్తులు అనుకొన్న వాళ్ళని తాముకాక యింకొకళ్ళెవరూ శిక్షించడానికి వీల్లేదు. చట్ట బద్ధంగా కేసు పెట్టి ముద్దాయి మీద నేరం ఋజువు చెయ్యడం సాధ్యంకాకపోవచ్చు. ఏ విచారణా లేకుండా ముద్దాయిని శిక్షించాలంటే అతనికి బెయిల్ ఇవ్వవద్దు. పైపెచ్చు కస్టడీలో నరకం చూపించాలి. బెయిల్ మీద విడుదల చెయ్యకుండా ఒక ముద్దాయిని

ఏ విచారణా లేకుండా దీర్ఘకాలం జైల్లో వుంచటమంటే అతన్ని విచారణ లేకుండా శిక్షించడమనే కదా అర్థం. అందుకని అరెస్టు చేసిన వెంటనే బెయిలు మీద విడుదలయ్యే అవకాశాల్ని గురించి పోలీసులు ఉద్దేశపూర్వకంగా ముద్దాయికి చెప్పరు. తాము ఏ న్యాయ వ్యవస్థనైతే పరిరక్షిస్తామని చెబుతున్నారో ఆ న్యాయ వ్యవస్థ మీద పోలీసులకి విశ్వాసం వుండేట్లయితే, ఏ చట్టాన్నైతే పరిరక్షిస్తున్నామని చెబుతున్నారో ఆ చట్టం మీద ఏమైనా గౌరవం వుండేట్లైతే ఏ మనుషుల హక్కులని తాము కాపాడతామని చెబుతున్నారో, ఆ హక్కుల పరిరక్షణ గురించి కొంతైనా జ్ఞానవంతంగా వ్యవహరించేట్లైతే పోలీసులు చట్టానికి కట్టుబడి వుండేవారు. ఇప్పుడు ఇక్కడ ఒక మామూలు మనిషి హక్కులకి మాత్రమే భంగం వాటిల్లడం లేదు. మొత్తం న్యాయ వ్యవస్థ యొక్క ఉనికికే ప్రమాదం వాటిల్లుతోంది. చట్టాన్ని ధిక్కరించడం వల్ల, మనిషి హక్కుల్ని కాలరాస్తూండటం వల్ల ఇవాళ పోలీసువాడు జడ్జి అయి కూర్చున్నాడు.

బెయిల్ అనే మాట గుర్తుకు వచ్చినప్పుడల్లా అదేదో కోర్టుకి సంబంధించిన వ్యవహారం అనుకొంటాం. బెయిల్ అనేది ముద్దాయికి వుండే ప్రాథమిక హక్కు. ఈ హక్కుని గురించి పోలీసులు అరెస్టు చేసినప్పుడే అతనికి తెలియ చెయ్యాలి. ఈ హక్కుని గురించి తెలుసుకొన్న తరువాత ముద్దాయి నిర్బంధం నుంచి బయటపడి తన మీద వచ్చిన ఆరోపణకి సంజాయిషీ చెప్పుకోవడానికి ఏర్పాట్లు చేసుకొనే అవకాశం వుంటుంది. సుప్రీం కోర్టూ, లా కమీషన్, బెయిల్ మీద విడుదల కావడమనేది ముద్దాయి హక్కనీ, బెయిలు నిరాకరించడమనేది, ఈ హక్కుకి మినహాయింపు మాత్రమేనని స్పష్టం చేశాయి.

చట్టంలో బెయిలబుల్ నేరం, నాన్ బెయిలబుల్ నేరం, ముందస్తు బెయిలు అనే మూడు రకాల బెయిల్స్ వున్నాయి.

1. బెయిలబుల్ నేరంలో కనుక ముద్దాయిని పోలీసులు అరెస్టు చేస్తే పోలీసులు అతన్ని తప్పనిసరిగా జామీనుపై విడుదల చెయ్యవలసి వుంటుంది. వ్యక్తిగత పూచీపైన గానీ లేక మరొకరి పూచీకత్తుపై కానీ విడుదల చేయవచ్చు ముద్దాయి జామీనుపై విడుదల కావడానికి నిరాకరించేట్లైతే తప్ప పోలీసులు జామీనుపై విడుదల చెయ్యడానికి నిరాకరించడానికి వీల్లేదు. ఒకవేళ ముద్దాయిని కోర్టుకు తీసుకువచ్చినప్పుడైనా, కోర్టు తప్పనిసరిగా ముద్దాయికి బెయిలు మంజూరు చెయ్యవలసి వుంటుంది. భారత శిక్షాస్మృతి మొదటి షెడ్యూల్‌లో బెయిలబుల్ నేరాలుగా పేర్కొన్న నేరాలు కానీ మరి యితర చట్టంలోనైనా బెయిలబుల్ నేరాలుగా పేర్కొన్న నేరాలన్నిటికీ ఈ నిబంధన వర్తిస్తుంది.

2. నాన్ బెయిలబుల్ నేరాల విషయంలో బెయిలు ఇవ్వడం ఇవ్వక

పోవడమనేది మెజిస్ట్రేటుగారి ఇష్టాకష్టాల మీద ఆధారపడి వుంటుంది. అంటే తప్పని సరిగా ముద్దాయిని బెయిలు మీద విడుదల చెయ్యాలని లేదు. ఉరిశిక్ష లేక జీవిత ఖైదు విధించడానికి అవకాశం వున్న కేసులో నిందితుడైనప్పుడు మాత్రం నిందితుడికి మెజిస్ట్రేటు బెయిలు ఇవ్వడానికి వీల్లేదు. సెషన్సుజడ్జి, హైకోర్టు, సుప్రీం కోర్టులకి మాత్రమే యిలాటి కేసుల్లో బెయిలు యిచ్చే అధికారం వుంది.

3. అరెస్టు చెయ్యడానికి అవకాశం వుందని ముద్దాయి భావించి అరెస్టుకు ముందే బెయిలు తీసుకోవడాన్ని ముందస్తు బెయిల్ అంటారు. (ఆంటిసిపేటరీ బెయిల్) ఈ బెయిల్ ఇవ్వడానికి కేవలం సెషన్స్ జడ్జికీ, హైకోర్టు, సుప్రీం కోర్టులకి మాత్రమే అధికారం ఉంది.

## బెయిలబుల్ కేస్

అప్పారావుని వారంరోజులపాటు పోలీసుస్టేషన్లో ఉంచి చావ చితకబాది అతని ఒంటిమీద ఆ దెబ్బలు మానిన తరువాత తీసుకువచ్చి కోర్టులో హాజరుపర్చారు పోలీసులు. మేజిస్ట్రేటుగారు అప్పారావుని ఎగాదిగాచూసి పదిహేను రోజులు జైలు రాశారు. "బాబ్బాబూ! నేను ఏ పాపం ఎరుగను. పెళ్లాంబిడ్డలున్నోడిని, నాకు సిచ్చ ఎయ్యకండి" అని భోరున ఏడుస్తూ మేజిస్ట్రేట్ గారికి దండం పెట్టాడు అప్పారావు. మేజిస్ట్రేటుగారు పోలీసులకి ఏమాత్రం తీసిపోకుండా రిమాండ్ చెయ్యకుండా ఏకంగా శిక్షేవేశాడను కొన్నాడు. మేజిస్ట్రేట్‌గారు అప్పారావుకేసి కోపంగా చూశారు. వారం రోజుల గడ్డంతోటి మాసిన గుడ్డలతోటి పుట్టినప్పటినుంచీ అసలు స్నానం చేయించని వాడిలా దుమ్ము కొట్టుకుపోయివున్న అప్పారావు ఆయనకి బస్సుస్టాండ్‌లో హడా విడిలోఉన్న ప్రయాణీకుల దగ్గర్నించి నిద్రలో కునికి పాట్లుపడే ముసలీ ముతకా దగ్గర్నుంచి డబ్బులు కొట్టేసే కేడీలా కనిపించినట్టున్నాడు. "తీసుకువెళ్లండి" అన్నారు చికాగ్గా. అసలు అప్పారావుని తీసుకువచ్చింది ఒక బెయిలబుల్ కేసులోనా కాదా? ఒకవేళ బెయిలబుల్ కేసు అయితే తను తప్పనిసరిగా బెయిలు ఇవ్వవలసి వుంటుందని కూడా ఆలోచించకుండా యాంత్రికంగా అప్పారావుని రిమాండ్‌కు పంపారు. వాస్తవానికి అప్పారావుని తీసుకువచ్చింది బెయిలబుల్ కేసులోనే. ఈ కేసులో సాధారణంగా పోలీసులే బెయిల్ ఇవ్వవలసి ఉంటుంది. అలాంటిది కోర్టు కూడా ముద్దాయికి బెయిల్ ఇవ్వకపోవడం విచిత్రం. ముద్దాయి బెయిల్ అడిగినా అడ గకపోయినా బెయిలబుల్ కేసులో కోర్టు బెయిల్ ఇవ్వవలసివుంటుంది. ముఖ్యంగా బెయిలబుల్ కేసుల్లో బెయిల్ తప్పనిసరిగా ఇవ్వాలనే బాధ్యత కోర్టుమీదే ఉందని

ముద్దాయికి కోర్టు తెలియజెయ్యాలి. ఈ రకమైన బెయిలబుల్ కేసుల్లో ముద్దాయి బెయిల్ కోరేట్లయితే మేజిస్ట్రేటుగాని పోలీసులు కానీ బెయిల్ నిరాకరించడానికి వీల్లేదు. బెయిల బుల్ కేసుల్లో ముద్దాయి తనకు తానుగా కోర్టుముందు హాజరైనప్పుడు కూడా కోర్టు అతనికి తప్పనిసరిగా బెయిల్ ఇవ్వాలి. అతన్ని పోలీసులు అరెస్టుచేసి హాజరుపర్చ లేదు కాబట్టి అతనికి బెయిల్ ఇవ్వడం ఏంటి అని అనుకోవడానికి వీల్లేదు. చట్టప్రకారం బెయిలబుల్ కేసుల్లో ముద్దాయి కోర్టుముందు హాజరైతే సరిపోతుంది.

ముద్దాయిని బెయిలుమీద విడుదలచెయ్యడం అనేది ఎందుకు జరుగుతుందంటే ఏ అనుమానానికీ ఆస్కారం లేకుండా నేరం ఋజువైతే తప్ప ముద్దాయిని నేరస్తుడని అనుకోవడానికి వీల్లేదు. బెయిలబుల్ నేరం ఆరోపించినప్పుడు అంటే చట్టంలో ఏ నేరాన్నయితే బెయిలబుల్‌గా పేర్కొంటారో ఆ నేరంలో కనుక ఒక వ్యక్తిని అరెస్టు చేసేట్లయితే పోలీసుస్టేషన్ అధికారి ముద్దాయిని జామీనుపై విడుదల చెయ్యవలసి వుంటుంది. ఈ రకంగా విడుదల చేసేప్పుడు పోలీసుస్టేషన్ అధికారి ముద్దాయిని వ్యక్తిగత పూచీ మీద విడుదల చెయ్యవచ్చు. లేదా తగినంత పూచీకత్తు (హామి) మీద విడుదలచెయ్యాలి. ముద్దాయి కస్టడీలో ఉన్నప్పుడు ఏ దశలోనైనా విడుదల కాదలిస్తే స్టేషన్ అధికారి అతన్ని తప్పనిసరిగా విడుదల చెయ్యాలి. ఏ కారణం చేతనైనా ముద్దాయిని పోలీసులు విడుదల చెయ్యకపోయేట్లయితే కోర్టు అతన్ని ఏ దశలోనైనా బెయిలు మీద విడుదల చెయ్యవచ్చు. కోర్టు ముద్దాయికి బెయిలబుల్ నేరం విషయంలో తప్పని సరిగ్గా విడుదలయ్యే అవకాశాన్ని గురించి చెప్పాల్సివుంటుంది. పోలీసుస్టేషన్ అధికారి ముద్దాయిని బెయిల్ మీద విడుదలచేసేట్లయితే అతను కోర్టుకు ఎప్పుడు రావాల్సి వుంటుందో వివరించాలి.

కోర్టులో హాజరవుతానన్న హామీ కనుక ముద్దాయి ఉల్లంఘించినట్లతే కోర్టు ముద్దాయికి బెయిలు నిరాకరించవచ్చు. కోర్టులో హాజరు అవుతామని హామీయిచ్చిన రోజు ముద్దాయి కోర్టు ముందు హాజరుకాక పోయేట్లయితే కోర్టు అతని అరెస్టు గురించి వారంట్ ఇస్తుంది. ఈ వారంట్ ఆధారంగా ముద్దాయిని పోలీసులు అరెస్టు చేసి కోర్టులో హాజరుపరిచేట్లయితే కోర్టు బెయిలబుల్ నేరం అయినప్పటికి బెయిల్ నిరాకరించవచ్చు. బెయిలబుల్ నేరానికి సంబంధించిన కేసుల్లో ముద్దాయికి శిక్ష పడేట్లయితే అతన్ని బెయిలు మీద విడుదలచేసే అవకాశం ఉండదు. కానీ అదే శిక్ష పెనాల్టీ రూపంలో కనుక ఉండేట్లయితే మాత్రం ముద్దాయిని బెయిలుమీద విడుదల చెయ్యాలి.

ఏ కోర్టు అయితే కేసులో విచారణ జరుపుతుందో ఆ కోర్టు మాత్రమే బెయిలు ఇవ్వడానికి అర్హత కలిగివున్న కోర్టు అవుతుంది. బెయిలు మంజూరు చెయ్యడమనేది వీలైనంత తొందరగా పూర్తి చేయాలి. బెయిలబుల్ కేసుల్లో పిపిఓకి నోటీసు ఇవ్వాల్సిన

అవసరం లేదు. కోర్టు తప్పనిసరిగా మంజూరు చెయ్యాలి కాబట్టి ప్రతివాది సమాధానంతో సంబంధం లేకుండానే ముద్దాయిని విడుదల చేస్తారు. ఈ బెయిలబుల్ కేసుల్లో పూచీకత్తు తప్ప మరే రకమైనటువంటి నిబంధనలు విధించడానికి వీల్లేదు. రోజూ పోలీసు స్టేషన్ ముందు హాజరుకమ్మనడమో, లేదా ఇంకొక రకమైన నిబంధనో విధించడానికి వీల్లేదు.

ముద్దాయి తప్పించుకు పారిపోయే అవకాశంలేదని కోర్టు భావించినప్పుడు ముద్దాయిని వ్యక్తిగత పూచీమీద విడుదల చేయవచ్చు. ఒకవేళ పూచీకత్తు కోరినప్పటికీ అదే జిల్లాకి సంబంధించిన పూచీకత్తులేదా పూచీకత్తును డబ్బు రూపంలోనో జమ చెయ్యమని అడగడానికి వీల్లేదు. వీలైనంతవరకూ ముద్దాయికి అందుబాటులోఉండే స్థాయిలోనే పూచీ అడగవలసి వుంటుంది. పూటకి ఠికాణాలేనివాడిని ఏ పదివేల రూపాయలో డిపాజిట్ కట్టమంటే ఎక్కడినుంచి తెచ్చి కట్టగలడు.

కోర్టుకి బెయిలు ఇచ్చే అధికారం అన్ని దశల్లోనూ ఉంటుంది. కోర్టుముందు ముద్దాయిని హాజరుపర్చినప్పుడు మాత్రమే బెయిలు ఇవ్వవచ్చుననుకోవడం పొరపాటు. ముద్దాయిని పోలీసులు అరెస్టు చేసినప్పుడు పోలీసు నిర్బంధంలో ముద్దాయి ఉన్నప్పుడు (లాకప్‌లో ఉన్నప్పుడు కూడా) కోర్టు ముద్దాయికి బెయిల్ ఇవ్వవచ్చు. ఆ తరువాత కోర్టులో కేసు ఏ దశలో ఉన్నప్పుడైనా సరే ముద్దాయిని బెయిలుపై విడుదలచేసే అధికారం కోర్టుకు ఉంటుంది. బెయిలు ఉత్తర్వులు ఏ మాత్రం ఆలస్యం చెయకుండా వెంటనే అమలు అయ్యేలా చూడాలి. పోలీసుకస్టడీలో ఉన్న ముద్దాయికి కోర్టు బెయిల్ మంజూరు చేస్తే, పోలీసుస్టేషన్ అధికారి ముద్దాయిని వెంటనే విడుదల చేయాల్సి వుంటుంది.

బెయిలుమీద విడుదలైన వ్యక్తి కోర్టులో చార్జిషీటు (ఆరోపణ పత్రం) దాఖలయ్యేంతవరకూ కోర్టుకు హాజరుకావాల్సిన అవసరం లేదు. ఒకవేళ కోర్టు అతని హాజరుగురించి తేదీ నిర్ణయించినప్పటికీ అతను హాజరుకాని పక్షంలో బెయిల్ ఉత్తర్వులు ధిక్కరించినట్లు కాదు. బెయిలుబాండులు ఇవ్వడానికి కోర్టు ఫీజు కట్టాల్సిన అవసరం లేదు. కోర్టు ఫీజునించి బెయిల్ బాండ్లు మినహాయించబడ్డాయి.

ముందు జాగ్రత్త చర్యల క్రింద అరెస్టు చేసినప్పుడు కూడా ముద్దాయికి ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్ తప్పనిసరిగా బెయిలు యివ్వాలి. బెయిలబుల్ నేరాల్లో ముద్దాయికి బెయిల్ మంజూరు చేసిన తరువాత అది కాన్సిల్ చేసే అధికారం మేజిస్ట్రేట్‌కు లేదు. జిల్లాకోర్టుగానీ, హైకోర్టుకానీ అవసరం అనుకుంటేనే ఈ నేరాల విషయంలో ముద్దాయికి ఇచ్చిన బెయిల్ కాన్సిల్ చెయ్యగలుగుతాయి. (సెక్షన్ 436 P.L)

# నాన్‌బెయిలబుల్ కేసు

లింగయ్యని పోలీసులు ఒక ఖూనీ కేసులో అరెస్టు చేశారు. పోలీసులు లింగయ్యకి బెయిలు ఇవ్వలేదు. అతన్ని మెజిస్ట్రేటుగారి ముందు హాజరు పర్చినప్పుడు, అతను మెజిస్ట్రేటుగారి కాళ్ళ మీదపడి బోరుబోరుమని ఏడ్చి తను ఏ పాపం ఎరుగననీ తనని విడుదల చెయ్యమనీ వేడుకొన్నాడు. మేజిస్ట్రేటుగారు బెయిలు పిటీషను పెట్టుకోమని సలహా చెప్పారు. లింగయ్య ఆ విషయమై అతని భార్యకి చెప్పి, ఎలాగైనా సరే ఒక అడ్వకేటుని మాట్లాడి బెయిలుపెట్టి విడిపించుకున్నాడు. ఒక్కపూట అయినా కడుపు నిండా తింటానికి తిండిలేని కుటుంబం లింగయ్యది. అలాంటి వాళ్ళకి ఈ కేసు నెత్తి మీద వడగళ్ళ వానలావచ్చి పడింది. ప్లీడర్ని మాట్లాడదామంటే ఒంటి మీద గుడ్డలు, చిన్నమెత్తు బంగారమూ తప్ప, ఏమీలేని అతని భార్య పుస్తెలతాడు రూపంలో

వున్న ఆ చిన్నమెత్తు బంగారం కాస్తా ఆయిదువందలరూపాయలకి అమ్మేసి ప్లీడరు ఫీజు యిచ్చేసి ఎలాగైనా తన భర్తని విడిపించి పుణ్యం కట్టుకోమని వేడుకొంది. ప్లీడరుగారు కనికరించి కేసు తీసుకొన్నారు. కానీ మెజిస్ట్రేటుగారు మాత్రం కనికరించ లేదు. లింగయ్య హత్యకేసులో నిందితుడు కాబట్టి, ఆ కేసులో ఒకవేళ లింగయ్యకి శిక్ష కనుక పడేట్లయితే జీవితఖైదు కానీ మరణశిక్ష కానీ పడే అవకాశం ఉంది కాబట్టి బెయిల్ నిరాకరిస్తున్నానని బెయిలు నిరాకరించేశారు. మరి ఈ కేసులో పోలీసులూ బెయిలు యివ్వక మెజిస్ట్రేటుగారూ బెయిలు ఇవ్వకపోతే మరెవరిస్తారు?

భారత శిక్షా స్మృతి (ఐ.పి.సి.) లో కానీ మరే ఇతర చట్టంలో కానీ ఒక నేరాన్ని నాన్‌బెయిలబుల్ నేరంగా పేర్కొని మేజిస్ట్రేటు కోర్టుచే విచారించాలని నిర్దేశించ బడ్డ కేసుల్లో మాత్రమే మేజిస్ట్రేటుగారు బెయిలు మంజూరు చెయ్యవచ్చు. ఇతర కేసులు అంటే ముఖ్యంగా సెషన్స్ కోర్టుచే విచారించబడే కేసుల్లో మాత్రం మేజిస్ట్రేటుగారు ఒక వేళ ముద్దాయి మరణశిక్షకానీ జీవిత ఖైదుకానీ విధించడానికి అవకాశం వున్న నేరానికి పాల్పడ్డట్లుగా ఆధారం వుందని భావించినప్పుడు విడుదల చెయ్యడానికి వీల్లేదు. అయితే దీనికి కొన్ని మినహాయింపులు వున్నాయనుకోండి. వాటిని ముందు ముందు వివరిస్తాను. ఏ మేజిస్ట్రేటు అయితే కేసు విచారణ జరపవచ్చో, ఏ మేజిస్ట్రేటు అయితే కేసు సెషన్స్ కోర్టుకి పంపవచ్చో ఆ మేజిస్ట్రేటు మాత్రమే ముద్దాయిని బెయిలు మీద విడుదల చెయ్యవచ్చు.

వారెంటు లేకుండా ఒక వ్యక్తిని నాన్‌బెయిలబుల్ నేరం చేశాడన్న అనుమానంతో అరెస్టు చేసినా, ముద్దాయిగా భావించి అరెస్టు చేసినా కోర్టుకి బెయిలు యిచ్చే అధికారం వుంది. బెయిలు మీద విడుదల చెయ్యడానికి కేవలం అరెస్టు చేస్తే సరి పోతుంది. కానీ ముద్దాయిని కోర్టు ముందు తప్పని సరిగా హాజరు పర్చాల్సిన అవసరం లేదు. అంతేకాక ముద్దాయిని అరెస్టు చేసి నిర్బంధంలో వుంచి నప్పుడు కూడా కోర్టు అతన్ని బెయిలు మీద విడుదల చెయ్యవచ్చు. చివరగా కోర్టు ముందు ముద్దాయి తనకు తానుగా హాజరైనా లేక హాజరు చెయ్యబడ్డాకూడా కోర్టుకి అతన్ని బెయిలుమీద విడుదల చేసే అధికారం వుంటుంది. చాలా సందర్భాల్లో ముద్దాయిని అరెస్టు చేసిన తరువాత కోర్టు ముందు హాజరు పర్చలేదు కాబట్టి బెయిలు పిటీషన్ పెట్టుకోవడానికి వీల్లేదని కోర్టు అభిప్రాయపడుతూ వుండడం చూశాను. బెయిలు కోరడానికి కేవలం అరెస్టు అయ్యాడంటే సరిపోతుంది. అసలు పోలీసులు అరెస్ట్ చెయ్యలేదంటే బెయిలు ఇచ్చి లాభమేమి వుంటుందని కోర్టు అభిప్రాయపడవచ్చు. ఒక మనిషిని పోలీసులు అరెస్టు చేసినప్పుడు సాధారణంగా అతన్ని అక్రమ నిర్బంధంలో వుంచే అవకాశం వుంటుంది. అసాధారణంగా అదపా తదపా పోలీసులు కూడా చట్ట ప్రకారమే నడుచుకొంటారేమో

ననే భ్రమలు కల్పించడానికిగాను అక్రమ నిర్బంధంలో వుంచకుండా ముద్దాయిని కోర్టుకి హాజరు పర్చడం జరుగుతుంది. ఇది సాధారణ పద్ధతికి మినహాయింపుమాత్రమే. అక్రమ నిర్బంధం విషయంలో సెర్చ్‌వారెంట్ తీసుకోవడం వల్ల పెద్దగా ఫలితం వుండటం లేదు. ఇహ పోతే హైకోర్టుకి వచ్చి హెబియస్ కార్పస్ పిటిషన్ దాఖలు చేసుకోవాల్సి వుంటుంది. ఈ పిటిషన్ దాఖలు చేసినప్పుడు కోర్టు పోలీసులకి నోటీసు ఇస్తుంది. ఆ నోటీసుపైన పోలీసుల జవాబు విన్నమీదట కోర్టు తన నిర్ణయం గైకొంటుంది. పోలీసులు ముద్దాయిని అరెస్టు చేశామంటే ఎప్పుడు అరెస్టు చేసిందీ ఏ కోర్టులో హాజరు పర్చిందీ చెబుతారు. లేదా అసలు అరెస్ట్ చెయ్యలేదని చెప్పవచ్చు. అలాంటప్పుడు సాక్షులను ప్రవేశ పెట్టవలసి వుంటుంది. బెయిలు పిటిషన్ కనుక దాఖలు చేస్తే కొంతవరకూ హెబియస్‌కార్పస్ దాఖలు చేస్తే పొందే ఫలితం పొందే అవకాశం వుంటుంది. ఇక్కడ కూడా నాన్‌బెయిలబుల్ కేసుల్లో కోర్టు పోలీసులకి నోటీసు ఇస్తుంది. ఈ నోటీస్ పై కూడా బెయిలు ఇవ్వాలా? లేదా? ఒకవేళ ముద్దాయిని అరెస్టు చేశాం అంటారా లేదా? వగైరా ప్రశ్నలకి పోలీసుల్నించి సమాధానం లభిస్తుంది. ఒకవేళ పోలీసులు కనుక అసలు ముద్దాయిని అరెస్టు చెయ్యలేదంటే అప్పుడు అక్రమ నిర్బంధం క్రింద పోలీసుల మీద కేసు పెట్టి సాక్ష్యం పెట్టుకోవాల్సి వుంటుంది. దీన్ని బట్టి హెబియస్ కార్పస్ యొక్క ఉద్దేశం కొంతవరకూ అరెస్టు కాగానే దాఖలు చేసుకొనే బెయిలు పిటిషన్ ద్వారా నెరవేరే అవకాశం వుందని స్పష్టం అవుతోంది. ఇక్కడ ఇంకొక అనుమానం కూడా కలిగే అవకాశం వుంది. బెయిలు పెట్టుకోవాలంటే ఒక నిర్దిష్టమైన కేసు ముద్దాయి మీద వుండాలి కదా? నిజమే. ముద్దాయికి వ్యతిరేకంగా కనీసం పోలీసు స్టేషన్లోనైనా ఒక రిపోర్టు వుండాలి. ఆ రిపోర్టుని గురించి పోలీసులు ముద్దాయికి తెలియజేసిన తరువాతనే అతన్ని అరెస్టు చెయ్యవలసి వుంటుంది. పోలీసులు ఈ బాధ్యత నెరవేర్చకుండా ముద్దాయిని అరెస్టు చెయ్యడమే చట్టవిరుద్ధం. అలాంటప్పుడు ముద్దాయి తాలూకు వాళ్ళు కేసు వివరాలు ఎక్కడి నుంచి సంపాదించగలరు. కాబట్టి న్యాయస్థానంలో బెయిలు పిటీషన్ దాఖలు చేసినప్పుడు కూడా కేసు వివరాలు రాయనవసరం లేదు. పైగా చట్టంలోకూడా ఎక్కడా ముద్దాయి కేసువివరాలు ఇవ్వాలని లేదు. అందుచేత న్యాయస్థానాలు తమకున్న విస్తృత అధికారాల్ని ముద్దాయి స్వేచ్ఛనీ స్వతంత్రతనీ కాపాడటానికి ఉపయోగించవలసి వుంటుంది.

కోర్టు సమన్లు జారీచేసి ఒక ముద్దాయిని తన ముందు హాజరు కమ్మని ఆదేశించినప్పుడు కూడా అతనికి బెయిలు ఇచ్చే అవకాశం వుంటుంది. అలాగే ఏ సమన్లు ఇవ్వకపోయినా ముద్దాయి కనుక తనకు తానుగా కోర్టులో హాజరైనప్పుడు కోర్టుకు బెయిలు మీద అతన్ని విడుదల చేసే హక్కు వుంటుంది. కేసు ఒకవేళ సెషన్సు

కోర్టులో వుండేట్లయితే మెజిస్ట్రేటుకు ముద్దాయిని బెయిలు మీద విడుదల చేసే అధికారం వుండదు. కానీ సెషన్స్ కోర్టుకో నడిచే కేసు అయినప్పటికీ ముద్దాయిని కనుక మేజిస్ట్రేటు కోర్టులో హాజరు పర్చినప్పుడు మాత్రం ముద్దాయికి కోర్టు బెయిలు ఇవ్వ వచ్చు.

నాన్‌బెయిలబుల్ కేసుల్లో ముద్దాయికి తప్పనిసరిగా కోర్టు బెయిలు ఇవ్వాలని ఏమీ లేదన్న విషయం మర్చిపోవద్దు. బెయిలు ఇవ్వాలా లేదానన్న విషయంలో కోర్టుకు పూర్తి స్వేచ్ఛ వుంటుంది. అలాగని అన్ని కేసుల్లోనూ కోర్టుకు బెయిలు ఇచ్చే అధికారం లేదు.

ఇంతకుముందు చెప్పుకున్నట్లుగా నాన్‌బెయిలబుల్ కేసుల్లో బెయిలు ఇవ్వడం ఇవ్వకపోవడం అనేది కేవలం కోర్టు ఇష్టాయిష్టాల మీద ఆధారపడి వుండదు. కోర్టు తన ఇష్టానుసారంగా వ్యవహరించడం అంటే న్యాయబద్ధంగా వ్యవహరించడమని అర్థం చేసు కోవాలి. సాధారణంగా కోర్టు బెయిల్ ఇచ్చేముందు నాన్‌బెయిలబుల్ కేసుల్లో జరిగిన నేరం ఎలాంటిది? జరిగిన నేరానికి సంబంధించి లభించిన సాక్ష్యాధారాల స్వరూపం ఎలాంటిది? ఆ నేరానికి కోర్టు ఎంతటి శిక్ష విధించే అవకాశం వుంది? ముద్దాయి యొక్క గుణం నడవడిక ఎలాంటివి? అతని రాబడి స్థిరత్వానికి సంబంధించిన వివరాలు ఏమిటి? అని పరిశీలిస్తుంది. సాధారణ నియమం ప్రకారం జైల్లో వుంచడం కాదు బెయిలు మీద విడుదల చెయ్యడమనేది కోర్టు ఉద్దేశం అయినప్పటికీ కోర్టుకి పైన చెప్పిన ఆదేశిక సూత్రాలు న్యాయం చెయ్యడానికి తోడ్పడతాయి.

బెయిలుమీద విడుదల చేసేప్పుడు మొత్తం సామాజిక బాధ్యతని కోర్టు దృష్టిలో పెట్టుకోవలసి వుంటుంది. హత్యా,చోరీ,దోపిడీలాంటి తీవ్రమైన నేరానికిపాల్పడి లాభపడ్డ ముద్దాయికి కోర్టు కనుక బెయిలు ఇచ్చేటట్లయితే ఆ ముద్దాయి విచారణకి హాజరు కాకుండా పారిపోవచ్చు. ఇలాంటి కేసుల్లో కోర్టు బెయిలు మంజూరు చేసేప్పుడు ముద్దాయికి కోర్టుకి హాజరు అవుతాడా లేదా అనే విషయాన్ని పరిశీలించాలి. ముద్దాయి సాక్షుల్ని బెదిరించి సాక్ష్యం చెప్పనివ్వకుండా చేసే అవకాశం వున్నప్పుడు కోర్టు ముద్దాయికి బెయిలు ఇవ్వకపోవడమే మంచిది. అలాగే బెయిలు మీద విడుదలై తిరిగి అలాంటి నేరాలు చేసే అవకాశం వున్న పక్షంలో కోర్టు బెయిలు నిరాకరించవచ్చు.

ఒక నేరస్తుడు నేరం చేశాడని అనుమాన రహితంగా రుజువైనప్పుడు మాత్రమే కోర్టులు అతన్ని నేరస్తుడుగా నిర్ణయించి శిక్షించవచ్చు. మరి అలాంటప్పుడు ముద్దాయికి బెయిలు ఇవ్వకుండా జైల్లో వుంచడం అంటే ఏ విచారణా లేకుండా అతన్ని శిక్షించడమే అవుతుందికదా? అంతేకాక ఇంతవరకూ చెప్పిన విషయాన్ని బట్టి కోర్టుకేసు పెట్టిన వారివైపే వుంటుంది. కానీ నిందితుడి గురించి ఆలోచించదా? నిందితుడు

మాత్రం తనకి అనుకూలమైన సాక్ష్యాన్ని సంపాదించుకోవాల్సి వుంటుంది కదా? రకరకాల ప్రశ్నలు తలెత్తుతాయి. తన కేసు సంగతి తను చూసుకోడానికి వీలుగా బైటకి వచ్చి తను నిర్దోషినని రుజువుచేసుకోడానికి వీలుగా సాక్ష్యాధారాలు సంపాదించుకోవడానికిగాను కోర్టు సాధారణంగా ముద్దాయిని బెయిలుమీద విడుదల చేస్తుంది. బెయిలు నిరాకరణ కేవలం ఒక మినహాయింపు మాత్రమే. ప్రతికేసులోనూ కోర్టు ఆయా సందర్భాల్లో ఏర్పడిన పరిస్థితుల్ని బట్టి బెయిలు ఇవ్వడం ఇవ్వక పోవడాన్ని నిర్ణయిస్తుంది.

దీర్ఘకాలం ఏ కారణం లేకుండా కేసు విచారణ జరపకుండా ముద్దాయిని జైల్లో వుంచేట్లయితే బెయిలు ఇవ్వడాన్ని గురించి ముద్దాయికి అనుకూలంగా కోర్టులు ఆలోచించే అవకాశం వుంది. కొన్ని కొన్ని కేసుల్లో ముద్దాయి మీద ఆరోపణ కనుక రుజువైయ్యేట్లయితే ఏ ఆర్నెల్లో శిక్ష పడుతుంది. అలాంటి కేసుల్లో ముద్దాయి మీద ఏ చార్జిషీటు దాఖలు చెయ్యకుండా ఏ సంవత్సరం వరకో పోలీసులు కనుక వుండేట్లయితే అతను శిక్షకాలం కన్నా అధికంగా జైల్లో వున్నట్లే కదా, ఇలాంటి కేసుల్లో కోర్టు చొరవ తీసుకొని బెయిలు మంజూరు చేసే అవకాశం వుంది.

అంత పెద్ద భయంకరమైన నేరం కాకుండా సాధారణ నేరం జరిగినప్పుడు కోర్టు కనుక ప్రధాన నిందితుణ్ణి బెయిలుపై విడుదల చేసిన పక్షంలో మిగిలిన ముద్దాయిల్ని కూడా బెయిలుపై విడుదల చెయ్యడానికి కోర్టు నిరాకరించడానికి వీల్లేదు. ముద్దాయి మీద ఈ కేసే కాక ఇంకా చాలా కేసులువిచారణలో వున్నాయన్న కారణంగా బెయిలు నిరాకరించడానికి వీల్లేదు.

మేజిస్ట్రేట్ గారికి నాన్‌బెయిలబుల్ కేసులన్నిటిలోనూ బెయిల్ ఇవ్వడానికి వీల్లేదు. మరణశిక్షకానీ జీవితఖైదు విధించడానికి అవకాశం వున్న కేసుల్లో కానీ కోర్టుకి బెయిలు ఇచ్చే అధికారం లేదు. కేసు విచారణ జరక్కముందు బెయిలు తీసుకుంటారు కదా మరి అలాంటప్పుడు ఆ కేసులో ముందే ముద్దాయికి జీవిత ఖైదు విధించే అవకాశం వుందని కోర్టు ఎట్లా ఒక నిర్ణయానికి వస్తుంది? అన్న అనుమానం కలగవచ్చు. కోర్టు ముందు వున్న రికార్డుని బట్టి సహేతుకంగా ఆలోచించిన మీదట ముద్దాయికి అంత శిక్ష విధించడానికి అవకాశం వుందని కోర్టు భావించినప్పుడు అతన్ని బెయిలుమీద విడుదల చేసే అవకాశంలేదు. ఉదాహరణకి ఒక హత్యకేసులో నిందితుడుగా జైల్లో వున్న వ్యక్తిని బెయిలు మీద విడుదల చెయ్యాల్సివచ్చినప్పుడు, రికార్డుని బట్టి అతని మీద కేసు రుజువయ్యే అవకాశం వుందని కోర్టు సహేతుకంగా భావించేట్లయితే అతన్ని విడుదల చెయ్యడానికి వీల్లేదు ఎందుకంటే హత్యకేసులో నిందితుడికి యావజ్జీవ కారాగార శిక్ష కానీ మరణశిక్షకానీ విధించవచ్చు. అలాగే కేవలం ఒక వ్యక్తి మీద ఇంతటి

తీవ్రమైన నేరానికి పాల్పడ్డాడని ఆరోపణవుంటే సరిపోదు కోర్టు ఈ విషయం పట్ల తన దృష్టిని కేంద్రీకరించి నిందితుడు అలాంటి నేరానికి పాల్పడ్డాడా లేదా అని తేల్చుకోవాల్సి వుంటుంది. ఉదాహరణకి పైన చెప్పిన హత్య కేసులో నిందితుడు కనుక ఉద్దేశపూర్వకంగా హత్యచేయక యాక్సిడెంటల్‌గా తన కారు క్రింద మనిషిని చంపాడనుకుందాం అలాంటప్పుడు కోర్టు అతనికిబెయిలు ఇవ్వవచ్చు. యాక్సిడెంట్ హత్యతో సమానమైన నేరం కాదు. అంతకంటే చాల చిన్న నేరం కూడా.

పోలీసులు (ఇక్కడ ప్రాసిక్యూషన్ బదులుగా ఈ మాట వాడుతున్నాను) ముద్దాయి క్రూరమైన నేరానికి పాల్పడ్డాడన్న చార్జిషీటు దాఖలు చేసినా కోర్టుకి బెయిలు మీద విడుదల చేసే అధికారం లేకుండా పోదు. నాన్ బెయిలబుల్ కేసుల్లో బెయిలు ఇచ్చేప్పుడు బెయిలు ఎందుకు ఇస్తున్నదీ లేదా నిరాకరించిన పక్షంలో ఎందుకు నిరాకరించిందీ సూచిస్తూ కోర్టు తన ఆదేశాల్లో పేర్కొనాలి. అప్పుడు మాత్రమే సెషన్స్ కోర్టు కానీ హైకోర్టుకానీ క్రింద కోర్టు నిర్ణయం మీదఒక అభిప్రాయానికి రాగలుగుతాయి చాలా సందర్భాల్లో మేజిస్ట్రేట్లు వెనకాముందూ ఆలోచించకుండా కేసు సెషన్స్ కోర్టులో నడిచేదైతే బెయిలు ఇవ్వడానికి నిరాకరిస్తారు. ఒక మనిషి స్వేచ్ఛా స్వాతంత్ర్యానికి సంబంధించిన ఏ విషయంలోనూ ఇలా యాంత్రికంగా నడుచుకోవడానికి వీల్లేదు. వీలైనంతవరకూ ముద్దాయికి అనుకూలంగా ఆలోచించాల్సిన అవసరం వుంది.

మేజిస్ట్రేట్ కోర్టు బెయిలు ఇవ్వడానికి వీల్లేని కేసుల్లో మరే కోర్టూ బెయిలు ఇవ్వడానికి వీల్లేదని అనుకోకూడదు. సెషన్స్‌కోర్టు, హైకోర్టు ఏ కేసులోనైనా బెయిలు ఇవ్వవచ్చు. మరణశిక్షకానీ యావజ్జీవ కారాగార శిక్షకాని విధించడానికి అవకాశం వున్న కేసుల్లో కూడా కొన్ని సందర్భాల్లో మేజిస్ట్రేట్ కోర్టుకి బెయిల్ ఇచ్చే అధికారం వుంటుంది. పదహారు సంవత్సరాలలోపు పిల్లలకి స్త్రీలకి రోగిష్టి వాళ్ళకి ఎంతటి హీనమైన నేరానికి పాల్పడ్డారని ఆరోపణ వున్నప్పటికీ మేజిస్ట్రేట్ కోర్టు బెయిలు ఇవ్వవచ్చు. జైల్లో వైద్యసౌకర్యాలు లేక ముద్దాయి మరణించే ప్రమాదం వుందన్నప్పుడు కోర్టు బెయిలు మీద విడుదల చేస్తుంది.

సాక్షుల చేత ముద్దాయిని గుర్తించడానికిగాను పోలీసులు జరిపే ఐడెంటిఫికేషన్ పరేడ్ గురించి ముద్దాయి జైల్లో వుండటం అవసరం అన్న కారణంగా బెయిలు నిరాకరించడానికి వీలులేదు.

కొన్ని కొన్ని కేసుల్లో ముద్దాయి నాన్‌బెయిలబుల్ నేరం చేసినా కోర్టు ముందు తగినన్ని సాక్ష్యాధారాలు లభించాయి అని రికార్డు లేనప్పుడు కోర్టు అతన్ని బెయిలు మీద విడుదల చెయ్యాలి. అలాగే నాన్‌బెయిలబుల్ కేసు పెట్టినప్పటికీ రికార్డుని బట్టి బెయిలబుల్ కేసు మాత్రమే ముద్దాయి మీద వుందని భావిస్తే కోర్టు అతనికి బెయిలు

మంజూరు చేస్తుంది. అంతేకాక ముద్దాయి మీద పెట్టిన ఆరోపణ రుజువు కావడానికి తగినన్ని ఆధారాలు లేవన్నప్పుడు కూడా కోర్టు అతన్ని బెయిలుమీద విడుదల చెయ్యవచ్చు. ఉదాహరణకు ఒక దొంగతనం కేసులో కేవలం దొంగసొత్తు మాత్రమే ఒక వ్యక్తి వద్ద స్వాధీనమైనంత మాత్రాన అతను దొంగతనం చేశాడు అనడానికి సాక్ష్యాధారాలు ఏమీ లేనప్పుడు దొంగతనం నాన్ బెయిలబుల్ కేసు అయినా కోర్టు ముద్దాయిని బెయిలుపై విడుదల చెయ్యాలి. ఇలా కనుక మేజిస్ట్రేటు బెయిలు ఇవ్వడం పట్ల తన అధికారాన్ని ముద్దాయికి అనుకూలంగా వాడుకున్నప్పుడు ఎందుకు అలా వ్యవహరించారో కారణాలు వివరించాలి.

ముద్దాయి రిమాండులో వున్నప్పుడు కానీ, కేసు విచారణ జరుగుతున్నప్పుడు కానీ, కేసు దర్యాప్తు జరుగుతున్నప్పుడు కానీ ఏ దశలోనైనా సరే కోర్టుకి ముద్దాయి మీద నాన్‌బెయిలబుల్ నేరం ఆరోపించబడలేదని అనిపించేట్లయితే అతన్ని బెయిలు మీద విడుదల చెయ్యవచ్చు.

ముద్దాయిని ఒకసారి కోర్టు ముందు హాజరు పర్చేట్లయితే అప్పటినించి అతని ప్రాణమానాల్ని కాపాడే బాధ్యత కోర్టు మీదే వుంటుంది. కాబట్టి కోర్టు ముద్దాయిని బెయిలు మీద విడుదల చేసేప్పుడు అతని భద్రత కూడా దృష్టిలో వుంచుకోవాల్సి వుంటుంద. అందుకని న్యాయబద్ధంగా వుండే ఏ కండిషన్స్‌నైనా కోర్టు విధించవచ్చు. తిరిగి అదే రకమైన నేరానికి పాల్పడకుండా వుండేలా కోర్టు ముద్దాయిని విడుదల చేసేప్పుడు తగిన నిబంధనలు విధించవచ్చు. ఏ నిబంధనైనా అది న్యాయంగా జరగటానికి ఉపయోగపడే విధంగా మాత్రమే ఉండాలి.

బెయిలు మంజూరు చేసిన తరువాత దాన్ని రద్దుచేసి ముద్దాయిని అరెస్టు చెయ్యమని కూడా ఆర్డర్ వేసే అధికారం కూడా కోర్టుకి వుంది. ముద్దాయిని విడుదల చేసిన తరువాత అతని స్వేచ్ఛ న్యాయం చెయ్యడానికి వీలుకాని పక్షంలో హైకోర్టు అతని బెయిలు రద్దు చేస్తుంది. ఉదాహరణకి కొందరు ముద్దాయిలు బెయిలు మీద విడుదలైన తరువాత సాక్షుల్ని బెదిరించే అవకాశం వుంటుంది. హత్యా ప్రయత్నం కేసులో నిందితుడు బెయిలు మీద విడుదలైన తరువాత "సాక్ష్యం చెప్పావంటే ఈసారి మర్డరే పోతావ్"ని సాక్షిని బెదిరించే ప్రమాదం వుంది. అప్పుడు బతికుంటే బలుసాకు తినవచ్చునని సాక్షి భయపడిపోయి రేపొద్దున్న కోర్టులో సాక్ష్యం చెప్పకపోవచ్చు. అలాంటప్పుడు ఆ కేసులో న్యాయం జరిగే అవకాశం లేకుండా పోతుంది.

బెయిలు రద్దు చేసేప్పుడు కోర్టుచాలా జాగ్రత్తగా వ్యవహరించవలసి వుంటుంది. బెయిలు మీద విడుదలైన ముద్దాయి తన స్వేచ్ఛని దుర్వినియోగ పరుస్తున్నాడని కోర్టు భావిస్తే తప్ప బెయిలు రద్దు చెయ్యడానికి వీల్లేదు. బెయిలు మంజూరు చేసిన తరువాత

ముద్దాయి అసలు జైలు నుంచి విడుదల కాకుండానే బెయిలు రద్దు చేయడానికి వీల్లేదు. హైకోర్టు కానీ సెషన్స్‌కోర్టుకానీ బెయిలు మంజూరు చేసినప్పుడు మేజిస్ట్రేటుకోర్టుకి బెయిలు రద్దుచేసే అధికారం వుండదు. అలాగే సెషన్సుకోర్టు లేదా హైకోర్టు బెయిలు ఇచ్చినప్పుడు కేసు సెషన్స్ కోర్టుకి పంపుతున్న సమయంలో మేజిస్ట్రేటుగారు ముద్దాయి బెయిలు రద్దుచేసి జైలుకి పంపకూడదు. చాలా సందర్భాలలో ఇలా జరుగుతున్నది. ప్రత్యేకించి బెయిలు ఉత్తర్వులలో కేసు కమిట్ చేసేప్పుడు (అంటే కేసు పై కోర్టుకి పంపేప్పుడు) బెయిలు రద్దు చెయ్యాలన్న నిబంధన కనుక వుండేట్లయితే మేజిస్ట్రేటుకు బెయిలు రద్దు చేసే అధికారం వుంటుంది.

బెయిలు మీద విడుదల చేసిన తరువాత, కేసుకు సంబంధించిన ఆస్తి స్వాధీనం చేసుకోవడానికి బెయిలు రద్దు చేసేట్లయితే అది చట్ట విరుద్ధమైన చర్య అవుతుంది. క్రిమినల్ కేసులో ముద్దాయి పోలీసుల ముందు నేరం ఒప్పుకొంటే, అది కన్ఫెషన్‌గా భావించరు. (అంటే ఒప్పుదలగా భావించరని అర్థం) అయితే ఈ నిబంధనకి ఒక మినహాయింపు వుంది. పోలీసుల ముందు ఒప్పుదల సందర్భంలో చెప్పిన విషయాల ఆధారంగా పోలీసులు నేరానికి సంబంధించిన ఆస్తి (నేరం చెయ్యడానికి ఉపయోగించిన వస్తువులూ, దొంగ సొత్తూ వగైరా) ని కనుక స్వాధీనం చేసుకొనేట్లయితే ఆ మేరకు ముద్దాయి పోలీసుల ముందు ఇచ్చిన వాంగ్మూలం చెల్లుతుంది. ఎవరైనా సరే అతనికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పుకోవటానికి చట్టం ఆమోదించదు. కాబట్టి ఆస్తి స్వాధీనం గురించి ముద్దాయిని జైలుకు నెట్టడానికి వీల్లేదు.

బెయిలబుల్ నేరంగా భావించి మేజిస్ట్రేట్ ముద్దాయిని నాన్ బెయిలబుల్ కేసులో విడుదల చేసినప్పుడు ఆ తరువాత మారుతున్న పరిస్థితుల ననుసరించి ముద్దాయి బెయిలు రద్దు చెయ్యవచ్చు. ఉదాహరణకి ఒక చిన్న దెబ్బలాట కేసులో ముద్దాయి బెయిలు మీద విడుదలైయ్యాడనుకొందాం. దెబ్బలు తిన్నవాడు హాస్పిటల్లో తగిలిన దెబ్బల కారణంగా మరణించినట్లైతే పరిస్థితులు మారాయనేకదా అర్థం, అలాంటప్పుడు ఈ కేసులో ముద్దాయికి బెయిలు రద్దు చేసే అధికారం మేజిస్ట్రేటుకి వుంది. మొదట్లో ఉత్త దెబ్బలాట కేసులో ముద్దాయిగా వున్న వ్యక్తి ఇప్పుడు హత్యకేసులో నిందితుడు కదా! బెయిలు రద్దు చేసే అధికారం మేజిస్ట్రేటుకి ఎప్పటికీ వుంటుంది, చార్జిషీటు దాఖలు చెయ్యకుండా వున్నప్పుడు కొన్ని కేసుల్లో ముద్దాయికి అరవై రోజులు పూర్తికాగానే మేజిస్ట్రేటు తప్పని సరిగా బెయిలు ఇస్తారు. కొన్నింటిలో తొంభై రోజుల్లో చార్జిషీటు దాఖలు చెయ్యనప్పుడు కూడా మేజిస్ట్రేటు బెయిలు ఇస్తారు. (వివరాలు వేరే వ్యాసంలో) ఈ సందర్భంలో విడుదల చేసినప్పుడు కూడా మేజిస్ట్రేటుకి బెయిలు రద్దు చేసే అధికారం వుంది,

బెయిలు రద్దు చేసేప్పుడు వీలైనంత వరకూ ముద్దాయికి నోటీసు ఇవ్వాలి. నోటీసు ఇవ్వలేని అనివార్యమైన పరిస్థితుల్లో తప్ప నోటీసు ఇవ్వకుండా బెయిలు రద్దు చెయ్యకూడదు.

సాక్ష్యాలు తీసుకోవడానికి నిర్ణయించిన మొదటి తేదీ తరువాత ఒకవేళ కేసు విచారణ పూర్తయి అరవై రోజుల్లో తీర్పు చెప్పకపోతే మేజిస్ట్రేటు ముద్దాయిని బెయిలు మీద తప్పనిసరిగా విడుదల చెయ్యాలి. ఈ నిబంధన సెషన్స్ కోర్టులో నడిచే కేసులకి వర్తించదు.

కేసు విచారణ పూర్తయిన తరువాత తీర్పుకు ముందు మేజిస్ట్రేటు నిందితుడి మీద కేసు ఋజువు కాలేదని భావించినప్పుడు వ్యక్తిగత పూచీ మీద తీర్పు వినడానికి గానూ అతన్ని విడుదల చెయ్యాలి.

బెయిలు కోరడానికి ముద్దాయి ప్రత్యేకించి దరఖాస్తు పెట్టుకోనవసరం లేదు. మౌఖికంగా కూడా బెయిలు కోరవచ్చు. బెయిలు దరఖాస్తుకి కోర్టు ఫీజు వుండదు. ఎన్ని మార్లయినా బెయిలు కోరే హక్కు ముద్దాయికి వుంటుంది. వీలైనంత తొందరగా కోర్టు బెయిలు ఇచ్చేదీ లేందీ తేల్చాలి.

## సెషన్స్, హైకోర్టులచే బెయిలు

"నన్ను బెయిలు మీద వదిలెయ్యండి" అన్నాడు కోటేశ్వరరావు ఇన్స్పెక్టర్ గారితో. కోటేశ్వరరావుని ఒక హత్యకేసులో నిందితుడుగా అరెస్టు చేసి తీసుకువచ్చి లాకప్‌లో పెట్టారు. "ఇది మర్డర్ కేసు కాబట్టి మేము బెయిలు యివ్వడానికి వీల్లేదు" అని చెప్పారు ఇన్స్పెక్టర్‌గారు.

మర్నాడు కోటేశ్వరరావుని కోర్టులో హాజరు పర్చారు. మెజిస్ట్రేటుగారి ముందు బెయిలు కోసం దరఖాస్తు పెట్టుకొన్నాడు కోటేశ్వరరావు. అతనిపై వున్న ఆరోపణకిగానూ జీవితఖైదు విధించే అవకాశం వుందని భావించి మెజిస్ట్రేటుగారు అతన్ని బెయిలుమీద విడుదల చెయ్యడానికి నిరాకరించారు.

మెజిస్ట్రేటు కోర్టు కనుక ముద్దాయిని బెయిలుమీద విడుదల చెయ్యడానికి నిరాకరించేట్లయితే సెషన్స్‌కోర్టు కానీ హైకోర్టు కాని బెయిలుమీద ముద్దాయిని విడుదల చెయ్యవచ్చు. తీవ్రమైన నేరాలకి పాల్పడ్డారని అభియోగం వున్న వాళ్ళని సులభంగా అనాలోచితంగా బెయిలుమీద విడుదల చేసేట్లయితే వారు వాళ్ళకి వ్యతిరేకంగా సాగుతున్న దర్యాప్తుకి అడ్డుపడే అవకాశం వుంటుంది. అలాంటప్పుడు బెయిలు కోరుతున్న నిందితుడి పక్షాన మాత్రమే విని అతన్ని బెయిలుమీద విడుదల చెయ్యడం సరైంది

కాదు. మెజిస్ట్రేట్ కోర్టు శిక్ష విధించిన తరువాత కూడా అపీల్‌లో సెషన్స్ కోర్టు హైకోర్టులో బెయిలు యివ్వవచ్చు.

సాధారణంగా ఏ ముద్దాయికైనా బెయిలు యివ్వాలి అయితే బెయిలు నిరాకరించడం మాత్రం సాధారణ నియామకానికి ఒక మినహాయింపు మాత్రమే. ఒక తీవ్రమైన నేరానికి పాల్పడ్డాడన్న అభియోగం వున్నంత మాత్రాన ముద్దాయికి బెయిలు నిరాకరించడం ఒక రకంగా ముద్దాయిని శిక్షించడమే అవుతుంది. ఇలా జరక్కుండా వుండాలనే సెషన్స్‌కోర్టుకీ హైకోర్టుకీ బెయిలుయిచ్చే అధికారం కల్పించడం జరిగింది.

ప్రధానంగా ముద్దాయిని బెయిలు మీద విడుదల చేసేప్పుడు కోర్టు రెండు విషయాల్ని మాత్రమే గమనంలోకి తీసుకుంటుంది ముద్దాయి విచారణ సమయంలో కోర్టుకు హాజరవుతాడా లేదా? రెండు ముద్దాయి సాక్షుల్ని లొంగదీసుకొనే ప్రమాదం వుందా? ఈ రెండు విషయాల్లో కోర్టు ముద్దాయిని విశ్వసించేట్లయితే అతన్ని బెయిలు మీద విడుదల చేస్తుంది. మౌలికంగా కేసు లేనప్పుడు కూడా ముద్దాయిని బెయిలు మీద విడుదల చెయ్యవచ్చు. యిలా విడుదల చేసే అధికారం మెజిస్ట్రేటు కోర్టుకే వుంది. అలాంటప్పుడు సెషన్స్ హైకోర్టులు మౌలికంగా ముద్దాయి మీద కేసు వున్నదా లేదానని చూడనవసరం లేదు. బెయిలు మంజూరు చేసే విషయంలో సెషన్స్, హైకోర్టులకి విస్తృత అధికారాలు వున్నాయి.

పోలీసులు మాత్రమే, ముద్దాయిలుగా వున్న కేసుల్లో సాక్షుల్ని బెదిరించడానికి వాళ్ళకి కావల్సినన్ని అవకాశాలు వుంటాయి. అలాంటప్పుడు కోర్టు నిష్పక్షపాతంగా వ్యవహరించి పోలీసులు అక్కడ వుండేట్లయితే కలిగే మానసిక వత్తిడిని కూడా దృష్టిలో వుంచుకోవాలి.

కోర్టు ప్రాసిక్యూషన్ని, వాదినీ (అంటే యిక్కడ ముద్దాయిని) సమాన దృష్టితో చూడాలి. కేవలం సాక్షుల్ని బెదిరించే అవకాశం వుందన్న కారణంగా ముద్దాయికి బెయిలు నిరాకరించడానికి వీల్లేదు, పోలీసులు ముద్దాయి సాక్షుల్ని బెదిరించే అవకాశం వుందన్నంత మాత్రాన కోర్టు బెయిలు నిరాకరించ కూడదు ఈ విషయంలో ముద్దాయి సాక్షుల్ని గెల్చుకోవడానికి ప్రయత్నించాడనో, ప్రయత్నించే అవకాశం వుందనో తగిన సాక్ష్యాలు వున్నప్పుడు మాత్రమే కోర్టు బెయిలు నిరాకరించవచ్చు. అలాగే నేరం జరిగిన ప్రాంతంలో శాంతిభద్రతలు క్షీణించాయన్న కారణంగా కోర్టు బెయిలు నిరాకరించడానికి వీల్లేదు. దర్యాప్తుకి సంబంధించినంతవరకూ అకారణమైనటువంటి ఆలస్యం జరిగిందన్న కారణంగా బెయిలు మంజూరు చెయ్యవచ్చు.

ఒకసారి హైకోర్టు కానీ సెషన్స్ కోర్టు కానీ బెయిలు నిరాకరించినంత మాత్రాన మళ్ళీ బెయిలు కోరకూడదనుకోవడానికి వీల్లేదు. బెయిలు దరఖాస్తు ఎన్ని

సార్లయినా పెట్టుకోవచ్చు. అయితే ఒకసారి బెయిలు నిరాకరించిన కోర్టే మారిన పరిస్థితుల్ని బట్టి బెయిలు మంజూరు చెయ్యవచ్చు.

బెయిలు మంజూరు చేసినప్పుడు అవసరాన్ని బట్టి కోర్టు తగిన ఆంక్షలు విధించవచ్చు. వీలైనంత వరకూ ఈ ఆంక్షలు ముద్దాయి స్వేచ్ఛ దెబ్బతినకుండా ప్రాసిక్యూషన్ లక్ష్యం దెబ్బతినకుండా చూడాల్సిన బాధ్యత కోర్టు మీద వుంటుంది.

జైల్లోవున్న ముద్దాయిని కోర్టుబెయిలుమీద విడుదల చేసేట్లయితే అతన్ని మరోకేసులో హాజరుపర్చడానికి వారెంట్ వుంది. కాబట్టి విడుదల చెయ్యడంలేదని జైలుఅధికార్లు అనడానికి వీల్లేదు. వేరే కేసులో ముద్దాయి రిమాండులో వున్నప్పుడు మాత్రమే జైలు వాళ్లు ముద్దాయిని విడుదల చెయ్యకపోతే చట్టబద్ధం అవుతుంది. లేక పోతే అక్రమ నిర్బంధానికి కోర్టుధిక్కారణ నేరానికి పాల్పడ్డ వాళ్లు అవుతారు.

బెయిలబుల్ కేసుల్లోనైనా, నాన్‌బెయిలబుల్ కేసుల్లోనైనా జీవితఖైదుకానీ, మరణశిక్షకానీ విధించడానికి అవకాశమున్న తీవ్రమైన నేరాలకి సంబంధించిన కేసుల్లో అయినా, శిక్షపడ్డ ముద్దాయి అపీల్ చేసుకొన్నప్పుడైనా, సెషన్స్ కోర్టు హైకోర్టులకి బెయిలు యిచ్చే అధికారం వుంది. ఈ విషయంలో కోర్టు చూసేది బెయిలు పెట్టుకొన్న వ్యక్తి నిందితుడు అవునా కదా? అతను కస్టడీలో వున్నాడా లేదానని మాత్రమే.

### బెయిలు రద్దు

హైకోర్టు సెషన్స్ కోర్టులకి బెయిలు రద్దు చేసే అధికారం వుంది. తాము యిచ్చిన బెయిలును మాత్రమే గాక క్రింది కోర్టులు యిచ్చిన బెయిలును కూడా రద్దు చేసే అధికారం ఈ కోర్టులకి వుంది. బెయిలు మీద విడుదలైన తరువాత ముద్దాయి తన స్వేచ్ఛని దుర్వినియోగ పర్చుకొని సాక్షుల్ని బెదిరించడమో, చార్జిషీటు దాఖలు చేసిన తరువాత పారిపోవడానికి ప్రయత్నం చెయ్యడమో, బెయిలు ఉత్తర్వులలో పేర్కొన్న నిబంధనలకి కట్టుబడి వుండకపోవడమో చేసినప్పుడు బెయిలు రద్దు చెయ్య వచ్చు.

కేసు సెషన్స్‌కోర్టుకి పంపుతున్నప్పుడు బెయిలు రద్దు చెయ్యాలని బెయిలు ఆర్డర్‌లో వుంటే తప్ప క్రింద కోర్టు మెజిస్ట్రేటు బెయిలురద్దు చెయ్యడానికి వీలులేదు. ఒకే కేసులోవున్న కొందరుముద్దాయిలు పరారీలో వున్నారన్న కారణంగా ముద్దాయికి బెయిలురద్దు చెయ్యడానికి వీల్లేదు. బెయిలు రద్దు చెయ్యమని పోలీసువర్గాలు మాత్రమే కోరనవసరం లేదు. ప్రైవేటువ్యక్తి కూడా కోర్టుని కోరవచ్చు. బెయిలు రద్దు చేసే ప్పుడు ముద్దాయికి నోటీసు యిచ్చి అతను ఏం చెప్పుకొంటాడో విన్న తరువాత ఒక నిర్ణయం తీసుకోవాల్సి వుంటుంది.

సాధారణంగా బెయిలు ముందు సెషన్స్‌కోర్టులో పెట్టుకొన్న తరువాత, సెషన్స్ కోర్టు బెయిలు నిరాకరించిన పక్షంలో హైకోర్టుకి దరఖాస్తు చేసుకోవచ్చు. సెషన్స్ కోర్టులో విచారణ జరిగే కేసుల్లో, మరణశిక్షకానీ యావజ్జీవ ఖైదు కానీ విధించే అవకాశం వున్న కేసుల్లో బెయిలు పెట్టుకొంటే తప్పని సరిగా పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి నోటీసు యివ్వాలి. ఒక వేళ నోటీసు యివ్వకపోతే అందుకు గల కారణాలు కోర్టు రికార్డు చెయ్యవలసుంటుంది.

## సాధారణ సమస్యలు

చాలామందికి బెయిలబుల్ కేసుల్లో పోలీసులు బెయిలు తప్పనిసరిగా ఇవ్వాలన్న నిజం తెలియదు. తెలిసినా పోలీసుల ముందు నోరు మెదిపే ధైర్యం వుండదు. కనీసం బెయిలు మీద విడుదలయ్యే అవకాశం గురించైనా ముద్దాయికి తెలియజేయరు. బెయిలబుల్ కేసుల్లో ముద్దాయి పోలీసు కస్టడీలో వున్నప్పుడు అతన్ని పోలీసులు తమకి తాముగా బెయిలు మీద విడుదల చెయ్యని పక్షంలో ముద్దాయి తరఫున పోలీసు స్టేషన్ అధికారి ముందు న్యాయవాది దరఖాస్తు చెయ్యవచ్చు. కానీ సాధారణంగా చెయ్యరు. (బెయిలు కోసం అరెస్టు చేసిన వెంటనే కోర్టులో కూడా దరఖాస్తు పెట్ట వచ్చుననుకోండి). పోలీసుస్టేషన్ అనేది ఒక పబ్లిక్ ఆఫీసు అయినప్పుడు పబ్లిక్ ఆఫీసుని హక్కులు అడిగే అధికారం ఉంటుంది. ఈ అధికారాన్ని హక్కునీ చేజేతులా మనం ఎందుకు కాదనుకోవాలి. ఇలా మనం మన హక్కులను వినియోగించుకోకపోతే వాటిని కోల్పోవడమే అవుతుంది. మనము రోజూ నడిస్తే బాటకానిది కూడా బాట అయి నట్లుగా మనము పోలీసులని మన హక్కులను అడగకపోయినట్లయితే తాము ఎవరికీ జవాబుదారులం కామని పోలీసులు అనుకుంటారు. ఈ పరిస్థితి ఇప్పటికే ఉంది. ఇప్పటికైనా పోలీసులని ప్రశ్నించడం అలవాటు చేసుకోకపోతే న్యాయవాదులు కూడా పోలీసుల దురాగతాలకు బలైపోయే అవకాశముంది. అరెస్టు చేసిన వెంటనే పోలీసులు ముద్దాయిని ఏ కేసులో అరెస్టు చేశారో చెప్పరు. అది తెలుసుకోడానికైనా న్యాయవాదులు అరెస్టు అయిన వ్యక్తి తరఫున పోలీసుస్టేషనుకు వెళ్ళవలసి ఉంటుంది. అప్పుడే కదా! న్యాయవాదికైనా సరే తెలిసేది. పోలీసులు ముద్దాయిని బెయిలబుల్ కేసులో అరెస్టు చేశారో నాన్‌బెయిలబుల్ కేసులో అరెస్టు చేశారోనని. కాబట్టి న్యాయవాదులు తప్పని సరిగా పోలీసు స్టేషనుకు వెళ్ళవలసి ఉంటుంది. పోలీసుస్టేషన్ అధికారి ముందు న్యాయ వాదులు బెయిలబుల్ కేసులో బెయిల్ పెట్టినపుడు పోలీసుస్టేషన్ అధికారి బెయిల్ నిరాకరించిన పక్షంలో ఆ విషయం కోర్టు దృష్టికి తెచ్చే అవకాశాలు వుంటాయి.

ముద్దాయి హక్కు

ముద్దాయిని కోర్టులో హాజరుపరిచినపుడు అతను బెయిల్ మీద విడుదల కావడానికి కోర్టువారు కూడా ముద్దాయికి బెయిలు మీద విడుదలయ్యే అవకాశాల గురించి తెలియచేయరు. బెయిలబుల్ కేసులో బెయిల్ మీద విడుదల కావడంతప్పనిసరి. కాబట్టి కోర్టువారు పోలీసులు చెప్పే విషయాన్ని విశ్వసించకుండానే ముద్దాయిని జామీనుపై విడుదల చేయమని ఆదేశించవచ్చు. అంతేకాక వీలైనంత వరకూ కోర్టులో ముద్దాయికి అతని హక్కులేమిటో తెలియజేయవలసిన అవసరముంది.

నాన్ బెయిలబుల్ కేసుల్లో బెయిలు ఇవ్వడం ఇవ్వకపోవడం కోర్టు ఇష్టాయిష్టాల మీద ఆధారపడి ఉంటుంది. అలాంటపుడు కోర్టు తన ఇష్టాన్ని వీలైనంత వరకు ముద్దాయికి అనుకూలంగా వినియోగించాలి. కేవలం పోలీసు రికార్డులని ఆధారం చేసుకొని వ్యవహరించటానికి వీలులేదు. తోటి ముద్దాయిలు అరెస్టు కాలేదు కాబట్టి అరెస్టయిన ముద్దాయిని విడుదల చెయ్యడానికి వీలులేదన్న కారణంగా కూడా కొందరి ముద్దాయిలకి కోర్టు బెయిల్ నిరాకరించడం గమనార్హం. ఎంతవరకూ ఆ ముద్దాయికి నేరంతో సంబంధముంది? అతను నేరం చేశాననిఅమోదిస్తున్నాడా, లేదా? మిగతా ముద్దాయిలకు అతనికి ఉన్న సంబంధం ఏమిటి? అన్న కనీస విచక్షణతో కేసులని పరిశీలించవలసి ఉంటుంది. ఉచితంగా కూడా బెయిల్ ఇవ్వమని కోరవచ్చు. అలాంటప్పుడు కోర్టు వారు ముద్దాయి బెయిల్ కోరినట్టుగా రికార్డు చేయవలసి ఉంటుంది. అవసరమనుకొంటే కోర్టే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి నోటీసు ఇచ్చి బెయిల్ ఇచ్చే అవకాశాల గురించి పరిశీలించాలి. ఆచరణలో ముద్దాయి కోర్టువారిని మౌఖికంగా బెయిల్ కోరినప్పుడు కోర్టులు పెడచెవిన పెడుతున్నాయి. మీ న్యాయవాది చేత దరఖాస్తు చేయించమని సలహా చెబుతున్నారు. ఒక్కొక్కసారి సెక్షన్ సరిగ్గా పేర్కొనలేదన్న కారణంగా కూడా బెయిల్ నిరాకరించడం జరుగుతోంది. అసలు మౌఖికంగానే బెయిల్ కోరడానికి అవకాశం ఉన్నపుడు సెక్షన్ తప్పు వ్రాశారన్న కారణంగా బెయిలు నిరాకరించడంలో అర్థం లేదు. దీన్నిబట్టి సెక్షన్ వ్రాయకుండానే బెయిలు కోరవచ్చని స్పష్టమవుతోంది.

నాన్ బెయిలబుల్ కేసుల్లో కోర్టు ముందున్న రికార్డునుబట్టి మౌలికంగా ముద్దాయి మీద కేసు ఉందా లేదా అని పరిశీలించాలి. ఉన్న రికార్డునిబట్టి మౌలికంగా కేసు లేని పక్షంలో కోర్టులు ముద్దాయిని బెయిలు మీద విడుదల చేయవచ్చు. కొన్నిసార్లు కేసు సెషన్స్ కోర్టులో నడుస్తుందన్న కారణంగా మేజిస్ట్రేటులు బెయిలు నిరాకరించడం చూస్తున్నాము. సెషన్స్ కోర్టులో నడిచే కేసయినప్పటికి మౌలికమైన ఆరోపణ ఏమీ లేనపుడు ముద్దాయిని బెయిలుమీద విడుదల చేయవచ్చు. మరణ శిక్షగాని,

యావజ్జీవ ఖైదుగానీ విధించడానికి అవకాశమున్న కేసుల్లో కూడా నేరం రుజువవుతుం దనడానికి పెద్దగా ఆధారలేమి లేనపుడు అతన్ని బెయిలు మీద విడుదల చేసే అధి కారం మేజిస్ట్రేటు కోర్టుకి ఉంటుంది. స్త్రీలు, పదహారు సంవత్సరాలు లోపు పిల్లలు, రోగిష్టి వాళ్ల విషయంలో కూడా మేజిస్ట్రేటు కోర్టుకి వాళ్లు ఎంత తీవ్రమైన నేరానికి పాల్పడ్డారన్న ఆరోపణ ఉన్నప్పటికి బెయిల్ మీద విడుదల చేసే అధికారం ఉంది. జైలు నించి కూడా ముద్దాయి ఉత్తరం ద్వారా కోర్టు వారిని బెయిల్ కోరవచ్చు. ఆ ఉత్తరాన్నే కోర్టు బెయిల్ దరఖాస్తుగా భావిస్తుంది. ఈ విషయం తెలియక చాలా మంది నెలలు, సంవత్సరాల తరబడి కేసు చేయడానికి న్యాయవాదిలేక జైలులో మగ్గుతూ ఉంటారు. ఏ అనుమానానికి ఆస్కారం లేకుండా ఒక మనిషి మీద నేరం రుజువైతే తప్ప అతనిని కోర్టులు నేరస్థుడుగా భావించవు. అంతవరకూ బెయిలు విషయంలో కోర్టు లిబరల్‌గా వ్యవహరిస్తుంది.

## ముద్దాయి - జామీను

కొన్ని కొన్ని కేసుల్లో ముద్దాయి జామీను పెట్టుకోలేక రోజుల తరబడి జైలులో ఉండి పోతాడు అలాంటప్పుడు కోర్టులు సానుభూతితో విషయాన్ని పరిశీ లించి వీలైతే ముద్దాయిని వ్యక్తిగత పూచీకత్తుపై విడుదల చెయ్యాలి. అలాగే ఏకారణం చేతైనా కోర్టులో దీర్ఘకాలంగా విచారణ జరగకుండా ఉన్న కేసుల్లో కూడా ముద్దాయిని బెయిలు మీద విడుదల చేయవలసిన అవసరముంది.

జామీను మీద విడుదల చేసేప్పుడు కోర్టులు డబ్బు జామీనుగా కట్టమని ఆదే శించ కూడదు. ఆ కోర్టు పరిధిలో ఉన్న ప్రాంతానికి సంబంధించిన ఆస్తినే జామీనుగా చూపాలని కూడా ఆదేశించడం సరైంది కాదు. ఒక్కోసారి ఎక్కడో నివసిస్తున్న ఒక వ్యక్తి మీద ఇంకెక్కడో కేసులు పెట్టే అవకాశం ఉంటుంది. అలాంటపుడు కోర్టు పరిధిలో జామీను తేవడమనేది అసాధ్యం. అలాంటపుడు ముద్దాయి జామీను ఇవ్వలేక అన్యాయంగా జైలులో మగ్గిపోవలసి వస్తుంది.

## బెయిలు - చార్జిషీటు

ముద్దాయి బెయిలు మీద విడుదలైనపుడు చార్జిషీటు దాఖలు చేసేంతవరకు అతను కోర్టుకి ముద్దాయిని అరెస్టు చేయమని వారెంటు ఇవ్వడానికి అధికారం లేదు. సాధారణంగా బెయిలు మీద విడుదలైన తరువాత చార్జిషీటు పెట్టకపోయినప్పటికీ ముద్దాయిని కోర్టుకి హాజరు కావలసిందని కోర్టులు ఆదేశిస్తున్నాయి. ఈ చర్య సరయి నది కాదు. చట్ట విరుద్ధం. ఒక రకంగా ముద్దాయికి ఇది శిక్ష. ఈ సందర్భంగా కోర్టు నుంచి సమను వచ్చిన తర్వాతే కోర్టుకి హాజరు కావాలి.

# యాంటిసిపేటరీ బెయిలు

కోటయ్యకి కామేశ్వరరావుని చూస్తే ఒళ్ళుమంట. కామేశ్వరరావుకి కోటయ్యను చూస్తే పీకల్దాకా కోపం వస్తుంది. కామేశ్వరరావు చెయ్యని వెధవపని లేదు. కోటయ్య చెయ్యని మంచిపనిలేదు. కామేశ్వరరావుకి రెండుమిల్లులూ మూడుసినిమా హాళ్లూ ఊహకి అందనంత ఆస్తి, కడుపునిండా కుళ్ళు బుద్ధులూ, ఒంటినిండా సుఖవ్యాధులూ వున్నాయి. కోటయ్యకి పూరిగుడిసె, దాన్నిండా పిల్లలు, బతుకంతా బాధలూ, భవిష్యత్తు మీద ఆశలూ తప్ప ఇంక ఏమీలేవు. కోటయ్య కామేశ్వరరావు మిల్లులో కార్మికుడు. ట్రేడ్ యూనియన్ నాయకుడు అవడం వలన కామేశ్వరరావు మీద కత్తి కట్టినట్లుగా కామేశ్వరరావు చేస్తున్న అన్యాయాల్ని పనిగట్టుకుని ఎండ గడుతూ ఉంటాడు. అందుచేత కామేశ్వరరావుకి కోటయ్యకీ మధ్య మంచుముక్క వేసినా అది భగ్గున మండి మసిబొగ్గై పోతుంది. ఎలాగైనా సరే కోటయ్య పీడవదలించు కోవాలని కామేశ్వరరావు కోటయ్య మీద ఒక దొంగ కేసు బనాయించాడు.

పోలీసులకి మందు పార్టీ ఇచ్చాడు. మదుపులు పెట్టాడు. కావాలంటే అవసర మైన సాక్ష్యాధారాలుకూడా ఏక్షణాన్నైనా సరే డబ్బుపెట్టి కొనుక్కొనైనా తీసుకొస్తానని హామీ ఇచ్చాడు. దాంతో పోలీసులు కోటయ్యను అరెస్టుచేసి అతని పరువుతీసి యూని యన్‌లో అతని పలుకుబడి దెబ్బతియ్యాలని నిర్ణయించుకున్నారు. సమాజంలో డబ్బూ పలుకుబడీ వున్న వాళ్ళ జేబుల్లో కరెన్సీ నోట్లలాంటి వాళ్లు పోలీసులు. ఎవరి చేతిలో ఐతే డబ్బు వుందో వాళ్ళకి ఆ డబ్బు అన్ని సుఖాలూ సంతోషాలూ కొని తెచ్చిపెట్టగలిగి నట్లుగానే పోలీసుల్ని కూడ తెచ్చి పెడుతుంది. కాబట్టి ఇప్పుడు పోలీసులు కామేశ్వర రావు తరఫున కోటయ్యను అరెస్టు చేసేట్లయితే కోటయ్య పరిస్థితి ఏమౌతుంది? అరెస్టు నించి తప్పించుకోవడానికి కోటయ్యకి మార్గమే లేదా? సాధారణంగా సమాజంలో డబ్బు, పలుకుబడి వున్న వాళ్ళు తమ పలుకుబడిని వినియోగించి దొంగకేసులు పెట్టి అరెస్టు చేయించే అవకాశం వుందికదా, ఇలాంటి పరిస్థితుల్లో మన సోషలిస్టు రాజ్యాంగ చట్టాలు ఏం రక్షణ కల్పిస్తున్నాయి?

సమాజంలో పలుకుబడి కలిగిన వర్గాలు తమ ప్రత్యర్థులని తప్పుడు కేసుల్లో ఇరికించి కొంతకాలం జైల్లో వుంచడమో లేదా వాళ్ళ పరువు ప్రతిష్టలకి భంగం కలిగేలా చెయ్యడానికి అరెస్టు చేయించే అవకాశం వుందని కూడా లా కమీషన్ తన

నలభై ఒకటవ నివేదికలో పేర్కొంది. ఇలాంటి పరిస్థితుల్లో నిందితులని అరెస్టు నించీ అనవసరమైన నిర్బంధాన్నించీ కాపాడ్డానికి వీలుగా వారికి యాంటిసిపేటరీ బెయిలు ఇవ్వ వచ్చునని కూడా లా కమీషన్ అభిప్రాయపడింది. అంతేకాక నిందితుడు పారిపోయే ప్రమాదం కనుక లేక పోయేట్లయితే, అతను బెయిలు నించి లభించే స్వేచ్ఛని దుర్వి నియోగపర్చే అవకాశం లేదనుకొన్నప్పుడూ అరెస్టు అయి జైల్లో కొంతకాలం వున్న తరువాతే బెయిలు కోసం దరఖాస్తు చెయ్యాలనడంలో అర్థంలేదని కూడా లా కమీషన్ అభిప్రాయపడింది. ఈ పరిస్థితుల్లో ముద్దాయికి యాంటిసిపేటరీ బెయిలు ఇవ్వవచ్చునని స్పష్టం చేసింది.

యాంటిసిపేటరీ బెయిలు అంటే ఏమిటి? నాన్‌బెయిలబుల్ కేసుల్లో ముద్దాయికి అరెస్టు అయిన వెంటనే బెయిలు లభించే అవకాశంలేదు. పోలీసులకి ముద్దాయిని బెయిలు మీద విడుదల చేసే అధికారం వుండదు. కోర్టు ఇష్టాఇష్టాల మీద ముద్దాయి విడుదల ఆధారపడి ఉంటుంది. అంటే ముద్దాయి అరెస్టు అయి కొంతకాలం నిర్బంధంలో వున్న తరువాతే విడుదల అవుతాడు. ఇలాంటి కేసుల్లో ముద్దాయిని అరెస్టు అయిన వెంటనే బెయిలు మీద విడుదల చెయ్యమని ఇచ్చేఉత్తర్వులనే యాంటిసిపేటరీ బెయిలు అంటారు. ఈ రకమైన బెయిలు మీద ముద్దాయి విడుదలైనట్లైతే అతను నిర్బంధంలో వుండాల్సిన అవసరంలేదు. ఇది అరెస్టు అయిన వెంటనే అమల్లోకి వస్తుంది. అరెస్టుకు ముందే అరెస్టు అయిన వెంటనే విడుదల అవడానికి అవకాశం కల్పించే బెయిలు ఉత్తర్వులనే యాంటిసి పేటరీ బెయిలు అంటారు.

ఈ విషయంలో చాలామందికి భిన్నాభిప్రాయామే వుంది. అసలు అరెస్టు చేయ కుండానే ఇచ్చే బెయిలు అనే అభిప్రాయంలో ఉన్నారు. న్యాయస్థానాలూ, పోలీస్‌స్టేషన్లు కూడా ఈ విషయంలో మినహాయింపుగా ఏమీ లేవు. అసలు అరెస్టు చేయనప్పుడు బెయిలు తీసుకోవడమనేది ఎట్లా జరుగుతుంది? అరెస్టు చేస్తారన్న సహేతుకమైన అను మానం ఉన్నప్పుడు మాత్రమే బెయిలబుల్ కేసుల్లో మాదిరిగానే అరెస్టయిన వెంటనే విడుదల కావడానికి అవకాశం కల్పించే ఉత్తర్వు మాత్రమే యాంటిసిపేటరీబెయిల్.

కాబట్టి అరెస్టుకి ముందు బెయిలుమీద విడుదల అయ్యాడనడంలో అర్థంలేదు. యాంటిసిపేటరీబెయిలుకి ముందస్తు బెయిలనే తెలుగు అనువాదం కూడా సరియైనదికాదు. యాంటిసిపేటరీ అంటే జరుగబోయేదాన్ని ముందుగానే ఊహించడమనే అర్థం. అరెస్టు చేసే అవకాశాలున్నాయన్న ఊహ ఉన్నప్పుడు అరెస్టయిన తర్వాత వెంటనే విడుదల కావడానికి ఈ రకమైన బెయిలు తోడ్పడుతుందని పేరులోనే స్పష్టంగావుంది. ఇది కేవలం నాన్‌బెయిలబుల్ కేసులకు మాత్రమే వర్తిస్తుంది.

సెషన్స్ జడ్జికి, హైకోర్టుకి మాత్రమే ఈ బెయిలు ఇచ్చే అధికారం వుంది.

తీవ్రమైన నేరాల విషయంలో కూడా యాంటిసిపేటరీబెయిల్ తీసుకోవచ్చు. మరణశిక్ష, యావజ్జీవ కారాగారశిక్ష విధించే అవకాశం వున్న కేసుల్లోగూడా యాంటిసిపేటరీ బెయిల్ పెట్టుకోవచ్చు

చాలా సందర్భాల్లో ముద్దాయిని ఏ కేసుల్లో అరెస్టు చేయనున్నారో ముద్దాయికి తెలిసే అవకాశం తక్కువ. ఇలాంటి సందర్భాల్లో యాంటిసిపేటరీ బెయిల్ పెట్టుకోవచ్చునా? వాస్తవానికి పోలీసులు అరెస్టు చేయదల్చినపుడు ముద్దాయికిగాని అతని తరపు వాళ్లకుగాని ఏ నేరానికి సంబంధించి అరెస్టు చేయనున్నారో తెలియజేయవలసిన బాధ్యత వుంది. ముద్దాయికి అతని తరపు లాయర్‌కి లేదా అతని తరపున మరెవరికైనా సరే వివరాలు తెలుసుకునే హక్కు వుంది. ఐతే ఈ రోజుల్లో పోలీస్ స్టేషన్‌లో అడుగు పెట్టడానికి అందరూ జంకుతున్నారు కాబట్టి ఎవరూ ఈ వివరాలు తెలుసుకునే ప్రయత్నం చేయడంలేదు. కారణం చెప్పకుండా అరెస్టు చేయడం చట్ట విరుద్ధం, ప్రాకృతిక న్యాయానికి కూడా విరుద్ధమని మర్చిపోవద్దు. ఐతే దురదృష్టవశాత్తూ పోలీసులు చట్టాన్ని అతిక్రమిస్తున్నారు. ఐనప్పటికి చట్టం ప్రకారం వాళ్ళని శిక్షించడానికి చాలా తక్కువ అవకాశాలున్నాయి.

ఈ విషయంలో చట్టంలో తగినన్ని మార్పులు తీసుకొస్తే తప్ప ఈ సమస్యకి పరిష్కారం వుండదు. పోలీసులు చాలా మంది మీద అరెస్టుచేసిన తర్వాతగాని కేసు నమోదు చేయరు. ఎందుకనంటే కేసు నమోదుచేసిన పక్షంలో ముద్దాయిలు కోర్టుకే నేరుగా వెళ్ళి సరండరౌతారేమోనని వాళ్లు భయపడతారు. ఎందుకనంటే ఒకవేళ కేసు నమోదు చేసినట్లైతే దాని తాలూకు ప్రథమ సమాచార నివేదిక వెంటనే కోర్టుకి పంపవలసి వుంటుంది.

అప్పుడు ముద్దాయి తరపున ఎవరైనా సరే ఆ రికార్డు చూసే అవకాశం వుంది. దాన్ని బట్టి యాంటిసిపేటరీబెయిలన్నా పెట్టుకోవచ్చు, లేదా ముద్దాయి నేరుగా కోర్టులో సరండరన్నా కావచ్చు.

## యాంటిసిపేటరీ బెయిలు - అరెస్టు

సాధారణంగా పోలీసుస్టేషన్లకి ఆడవాళ్ళు ఎవరూ రారు. ఎవరో కొందరు కొంపలు కూలిపోయిన వాళ్ళో మర్యాద మీద ఖాతరు లేని వాళ్ళో అయితే తప్ప పోలీసు స్టేషన్లకి వచ్చే ఆడవాళ్ళు బహు తక్కువ. అలాంటిది ఆ రోజు టూ టౌన్ పోలీస్ స్టేషన్‌కి బతుకుంతా పదహారేళ్ళకే బుగ్గిపాలై పోయినట్టున్న ఒక అమ్మాయిని వెంట బెట్టుకుని కుళ్ళి కుళ్ళి ఏడ్చినట్టున్న ఆ అమ్మాయి తల్లిదండ్రులు వచ్చారు.

"ఏమిటి?" అన్నారు. ఇన్స్పెక్టర్‌గారు. "ఏముందండి చెప్పుకోవడానికి మా అమ్మాయి బతుకంతా బుగ్గిపాలై పోయిందండి" అని బొలబొలా ఏడ్వడం మొదలు పెట్టింది అమ్మాయి తల్లి.

"ఇది మా అమ్మాయండి." అని కూతుర్ని చూపించి, "దీనికి కాస్త మతి స్థిమితం తక్కువ. అందుచేత మేము యింట్లో లేంది చూసి మా యింటి ప్రక్కన క్రొత్తగా దిగిన ఒక దుష్టుడు దీని మానం దోచేశాడు" అని స్థూలంగా విషయం చెప్పి యింకా ఏమి చెప్పలేక తనలో తానే కుమిలి పోయాడు. యిది వినగానే ఇన్స్పెక్టర్ గారు కోపంతో పళ్ళు పట పట కొరికారు. ఆ తరువాత కంప్లైయింట్ రికార్డు చేసుకొని, అమ్మాయిని వైద్య పరీక్షకైనా పంపకుండా "పదండి ఆ లంజకొడుకు సంగతి యిప్పుడే తేలుస్తాను" అంటూ అమ్మాయినీ ఆమె తల్లిదండ్రుల్ని వ్యాన్‌లో ఎక్కించుకొని నేరస్థుడిని పట్టుకోవడానికి బయలు దేరాడు. నేరస్థుడు పోలీసు జీప్ చూడగానే అయిపూ అజా లేకుండా పారిపోయాడు. నేరస్థుడు దొరక్కపోయేసరికి యిన్స్పెక్టర్ గార్కి చిర్రెత్తుకు వచ్చింది. అతని తమ్ముణ్ణి పట్టుకొని వాని అన్న పోలీస్టేషన్కి వచ్చి సరెండర్ అయితే తప్ప వీడిని వొదిలి పెట్టేది లేదు అని నేరస్థుడి తల్లిదండ్రుల్ని హెచ్చరించారు. తెలివైన ఆ నేరస్థుడు ఒక అతి తెలివైన ప్లీడర్ని పట్టుకొని తన తమ్ముణ్ణి విడిపించుకోవడానికి సెర్చివారెంట్ తీసుకొన్నాడు. కేసు లేకుండా తనని అన్యాయంగా ఒక నాన్‌బెయిలబుల్ కేసులో అరెస్టు చేసే అవకాశం వుందని, కాబట్టి తనకి యాంటిసిపేటరీ బెయిలు యివ్వవలసిందని కోరుతూ కేసు నెంబర్ లేకుండా బెయిలు పిటీషన్ పెట్టుకొన్నాడు. దీనితో నిలువెల్లా కారం పూసినట్లుగా మండిపడ్డారు ఇన్స్పెక్టర్. అతని మీద కేసు ఏమీ రిజిష్టర్ కాలేదని, కాబట్టి యాంటిసిపేటరీ బెయిలు ప్రశ్నే తలెత్తదని చెప్పేరు.

పోలీసు వర్షన్ రికార్డు చేసుకొని యాంటిసిపేటరీ బెయిలు నిరాకరించారు కోర్టువారు. ఛోరవిరుచుకొని సగర్వంగా సిగరెట్ తాగుతూ తిరుగుతున్న ముద్దాయిని నడిరోడ్డు మీద నించి మునిసిపాల్టీ వాళ్ళు చచ్చిన కుక్కని ఈడుచుకు వెళ్ళినట్లుగా బరబరా ఈడ్చుకు వెళ్ళి వాన్‌లో పడేసి పోలీసు స్టేషన్‌కి తీసుకువెళ్ళి రెండు రోజుల వరకూ చావచితకబాది పరాయి ఆడదాని సంగతి అలా వుంచి యిహ పెళ్ళాం మొహం కూడా చూడనని ముద్దాయి ఒట్టు వేసుకొన్న తరువాత తీసుకు వచ్చి కోర్టులో హాజరు పర్చారు ఇన్స్పెక్టర్‌గారు.

ఏ రోజు అయితే ముద్దాయి నేరానికి పాల్పడ్డాడని అభియోగం మోపబడిందో ఆ మర్నాడు స్వయంగా పోలీసులే ముద్దాయి ఏ కేసులోనూ నిందితుడు కాదని కోర్టులో ఒప్పుకొన్నందువల్ల అతన్ని రిమాండ్ చేసుకోవడానికి కోర్టు వారు నిరాకరించారు.

యిక్కడ ఇన్స్పెక్టర్‌గారు సిన్సియర్‌గా నేరస్థుడిని శిక్షించాలని ప్రయత్నం చేశారు. పోలీసులు చట్టాన్ని అతిక్రమించి న్యాయం చెయ్యడమనేది ఆచరణ సాధ్యం కాదని స్పష్టం అవుతోంది. దీని వల్ల పోలీసులు అన్యాయానికి పాల్పడడమే కాక అన్యాయానికి గురైన వాళ్ళకి న్యాయం జరక్కుండా వుండడానికి బాధ్యత వహిస్తారు. ముద్దాయిలకి అక్రమ అరెస్టు నించి తప్పుకోవడానికి గానీ అసలు తమ మీదవున్న ఆరోపణ ఏమిటోతెలుసుకోవడానికి గానీ యాంటిసిపేటరీ బెయిలు పెట్టుకోవడం తప్ప వేరే మార్గం లేదు. దీన్ని బట్టి యాంటిసిపేటరీ బెయిలు పెట్టకోవడానికి కేసు నెంబరు కానీ ఏ ఆరోపణలపై అరెస్టు చెయ్యనున్నారో బెయిలు పెట్టుకొంటున్న వ్యక్తికి తెలిసి వుండాల్సిన అవసరం లేదు. ఈ వివరాలు అరెస్టుకు ముందే పోలీసులకి అతనికి తెలియజెయ్యాల్సిన బాధ్యత వుంది.

యాంటిసిపేటరీ బెయిలు పెట్టుకొన్నప్పుడు సాధారణంగా పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి నోటీసు యివ్వవలసి వుంటుంది. నోటీసు తీసుకొన్న తరువాత పబ్లిక్ ప్రాసిక్యూటర్ పోలీసుల నుంచి వివరాలు తీసుకొంటాడు. ఆ తరువాత యాంటిసిపేటరీ బెయిలు యివ్వాలా, లేదాననే విషయంలో వాదోపవాదాలు జరుగుతాయి. దీనితో ముద్దాయికి తన మీద ఆరోపణ ఏమైనా వుందో లేదో, వుంటే అదేమిటో తెలిసే అవకాశం ఏర్పడుతుంది. ఒక్కొక్కసారి ముద్దాయిని పోలీసులు అరెస్టు చేయాలని ప్రయత్నం చేస్తున్నపుడు అతను సరెండరు కావాలనుకుంటాడు. పోలీసులన్నా, పోలీసు స్టేషనులన్నా భయం కొద్దీ అతను పోలీసుల ముందు సరెండర్ కాలేడు. ఇహపోతే కోర్టులో సరెండరు కావాలంటే అతని మీద ఒక నిర్దిష్టమైన ఆరోపణ కోర్టు ముందు ఉంటే తప్ప కోర్టులో సరెండర్ కావడానికి వీలు లేదు. ఈ పరిస్థితులలో ఇటు బైటఉండలేక జైలుకు వెళ్ళలేక పోలీసులను తప్పించుకొంటూ కొందరు నానాయాతన పడుతుంటారు. ఈ పరిస్థితులలో యాంటిసిపేటరీ బెయిలు పెట్టుకోవడమే తప్ప వేరే గత్యంతరమేమీ లేదు.

యాంటిసిపేటరీ బెయిల్ ఇవ్వడానికి అధికారం కేవలం సెషన్సు కోర్టుకి, హైకోర్టుకి మాత్రమే వుంది. ఏ కోర్టు ముందయినా సరే ప్రథమసమాచార నివేదిక లేకపోయినప్పటికి ఈ కోర్టులు యాంటిసిపేటరీ బెయిల్ మంజూరు చేయవచ్చు. ఎవరినైనా పోలీసులు ఒక నాన్‌బెయిలబుల్ కేసులో అరెస్టు చేసే అవకాశం ఉందని సహేతుకంగా భావించినపుడు యాంటిసిపేటరీ బెయిల్ కోరవచ్చు. యాంటిసిపేటరీ బెయిల్ వల్ల అరెస్టయిన వెంటనే బెయిల్ మీద విడుదల చేస్తారు. బెయిలబుల్ కేసులో కూడా బెయిలు ఒక హక్కుగా, అరెస్టయిన తర్వాత డిమాండు చేయవచ్చు. అయితే చాలా మంది కానిస్టేబుల్ గాళ్ల విషయంలోనూ, దిక్కూ దివాణం లేని వాళ్ళ విషయంలోను

బెయిలబుల్ కేసులో అరెస్టు చేసినప్పటికి పోలీసులు బెయిలు ఇవ్వడానికి నిరాకరించి నట్లుగానే యాంటిసిపేటరీ బెయిలు తీసుకున్న తర్వాత గూడా అరెస్టుచేసిన తర్వాత జామీను ఇవ్వడానికి ముద్దాయి నిరాకరించాడన్న కారణం చూపిస్తూ అతన్ని కోర్టులో హాజరు పరిచే ప్రమాదముంది. అంతేగాక కొన్నిసార్లు యాంటిసిపేటరీ బెయిలు మంజూరు చేసినపుడు కోర్టులు ఒక నిర్దిష్టమైన జామీను నిర్ణయించి అవి పోలీసుల సంతృప్తి మేరకు అరెస్టయిన తర్వాత పోలీసులకు చూపవలసి వుంటుందని ఆదేశి స్తుంది.

యాంటిసిపేటరీ బెయిల్ సెషన్సు కోర్టులో వేసుకొన్న తర్వాత సెషన్సు కోర్టు నిరాకరించేట్లయితే హైకోర్టులో వేసుకోవచ్చు, లేదా నేరుగా హైకోర్టులో కూడా వేసుకోవచ్చు. ఒకసారి యాంటిసిపేటరీ బెయిలు కోర్టు నిరాకరించినంత మాత్రాన మళ్లీ మళ్లీ వేయడానికి వీలులేదని అనుకోవడం సరైంది కాదు. మారుతున్న పరిస్థితు లను బట్టి అరెస్టును ఊహిస్తున్న వ్యక్తి ఎన్ని సార్లయినా కోర్టుని యాంటిసిపేటరీ బెయిలు కోరవచ్చు.

## నిబంధనలు, పరిమితులు, ఫలితాలు

పోలీసులు అరెస్టు చెయ్యడానికి వచ్చారని తెలువగానే సుబ్బయ్య వెళ్లి ప్లీడర్ని మాట్లాడుకొని యాంటిసిపేయిటరీ బెయిలు పెట్టుకున్నాడు. సుబ్బయ్యని కనుక పోలీసులు అరెస్టు చేస్తే ఇంకా ఏమైనావుందా? అసలింతకి సుబ్బయ్యంటే పోలీసులకి ఎందుకింత కోపం? సుబ్బయ్య ఏమైనా కేడీయా? రౌడీయా? డాకూనా? కనీసం జేబు దొంగైనానా? అంటే ఇవేమీకాదు. సుబ్బయ్య చాలా మంచివాడు, చదువుకున్నవాడు, బుద్ధిమంతుడు పెద్దమనిషి అని చెప్పాల్సి ఉంటుంది. పోలీసులు సుబ్బయ్య మీద కేసు బనాయించారు. అసలే అబద్ధపుకేసు, పైగా వాళ్ల చేతికి చిక్కితే చితక్కొట్టేస్తారని తెలిసే సుబ్బయ్య ఈ యాంటిసిపేటరీ బెయిల్ పెట్టుకున్నాడు. కోర్టు వారు సుబ్బయ్యని అరెస్టు చేసిన వెంటనే బెయిల్ మీద విడుదల చేయవలసిందని పోలీసులను ఆదేశించారు. అంతేకాక దర్యాప్తుకోసం పోలీసులు ఎప్పుడు పిలిస్తే అప్పుడు వెళ్లి పోలీసులతో సహకరించాలని సుబ్బయ్యకి కండిషన్ పెట్టారు. అసలు పోలీసులకు చిక్కితే లాభంలేదనుకొనే కదా సుబ్బయ్య యాంటిసిపేయిటరీ బెయిల్ పెట్టుకున్నది? ఇలా పోలీసులు పిలిచినప్పుడల్లా తప్పనిసరిగా అతను పోలీసుస్టేషన్కి వెళ్లాల్సివస్తే ఈ బెయిల్ తీసుకొని లాభమేమిటి? అనుకున్నాడు సుబ్బయ్య.

యాంటిసిపేటరీ బెయిల్ యొక్క ఉద్దేశం అనవసరమైన నిర్బంధాన్నించి

ఒక వ్యక్తిని కాపాడడమే. కానీ దర్యాప్తుని ఆటంక పరిచే విధంగా ఆ వ్యక్తికి పూర్తిగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కల్పించడం కాదు. అందుకని దర్యాప్తు సాఫీగా జరగడానికి వీలుగా కోర్టు యాంటిసిపేటరీ బెయిల్ మంజూరు చేసినప్పుడు కొన్ని నిబంధనలను విధించవచ్చు.

సాధారణంగా ఈ నిబంధనలు ఆ యొక్క కేసు పరిస్థితిమీద ఆధారపడి ఉంటాయి. అంతేగాక ఇంటరాగేషన్ కోసం పోలీసులు కోరినప్పుడు హాజరుకావాలని నిందితుణ్ణి ఆదేశించవచ్చు. కేసుకు సంబంధించిన సాక్ష్యాధారాలు చెప్పగలిగిన వ్యక్తిని చెప్పకుండా నిరోధించే ప్రయత్నం ముద్దాయి చేయకుండా ఉండడానికి అవసరమైన ఆదేశాన్ని కూడా కోర్టు జారీచేయవచ్చు. నిందితుడు దేశం విడిచి వెళ్లడానికి కోర్టు అనుమతి తీసుకోవలసి ఉంటుందని యాంటిసిపేటరీ బెయిల్ ఉత్తర్వులో పేర్కొనే అవకాశం ఉంది.

యాంటిసిపేటరీ బెయిల్ ఉత్తర్వులో దర్యాప్తు నిమిత్తం పోలీసులు కోరినప్పుడు పోలీసులముందు హాజరు కావాలన్న నిబంధన ఉందికాబట్టి అవసరమున్నా లేకపోయినా పోలీసులు ముద్దాయిని పోలీసుస్టేషన్‌కి పిలిపించి వేధించే అవకాశం ఉంది. ఇలాంటి అవకాశం కలిగినప్పుడల్లా పోలీసులు వీలైనంతవరకు వాటిని దుర్వినియోగ పర్చడం మనం గమనిస్తూనే ఉన్నాం. ఐతే లిఖితపూర్వకంగా సమన్ చేయకుండా యాంటిసిపేటరీ బెయిల్ తీసుకున్న వ్యక్తిని ఇంటరాగేషన్ పేర పోలీసుస్టేషన్‌కు పిలువడానికి వీల్లేదు. అంతేకాక ఒకవేళ ఆ వ్యక్తి ఇంటరాగేషన్ తనన్యాయవాది సమక్షంలోనే జరగాలని కోరినట్లయితే న్యాయవాదితో సహా అతను పోలీసుస్టేషన్ ముందు హాజరవ్వడానికి వీలు కల్పించాలి. సాధారణంగా ఈ విషయం చాలామందికి తెలియక పోవడంవలన అనేక ఇబ్బందులకు గురి ఔతున్నారు. అసలు యాంటిసిపేటరీ బెయిల్ తీసుకోవడానికి సాధారణంగా సమాజంలో డబ్బు, పలుకుబడి కలిగిన వాళ్ళు మాత్రమే ముందుకొస్తున్నారు. ఇకపోతే ఎప్పుడో ఒకసారి ఏ అనామకుడో పోలీసుల వేధింపునుంచి తప్పించుకోవడానికి ఈ రకమైన బెయిల్ తీసుకున్నప్పటికీ అది అతనికి పెద్దగా ఫలితాన్నివ్వడం లేదు. ఇలాంటి వాళ్లను పోలీసులు అరెస్టు చేసి హింసించి అసలు అరెస్టే చేయలేదని బుకాయించడం కద్దు. అలాంటప్పుడు ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా న్యాయస్థానాలు పెద్దగా చేయగలిగిందేమీ లేదు.

చార్జిషీటు పెట్టిన తరువాత నిందితుణ్ణి అరెస్టు చేయడానికి కోర్టులు అరెస్టు వారంట్ ఇస్తాయి. ఈ దశలో నిందితుడు యాంటిసిపేటరీ బెయిల్ తీసుకోవచ్చునా? అరెస్టుని ఊహించినప్పుడు యాంటిసిపేటరీ బెయిల్ కోరవచ్చు. అలాంటప్పుడు అరెస్టుచేయడానికి కోర్టు వారెంట్ జారీ చేసినప్పుడు యాంటిసిపేటరీ

బెయిల్ ఎందుకు తీసుకోకూడదూ? తీసుకోవచ్చునని ఇటీవల అనేక కోర్టులు స్పష్టం చేశాయి. అసలు ఏ కోర్టులోనూ ప్రథమ సమాచార నివేదిక లేనప్పటికీ సహేతుకంగా అరెస్టుని ఊహించినప్పుడు యాంటిసిపేటరీ బెయిల్ కోరవచ్చు.

యాంటిసిపేటరీ బెయిల్ దరఖాస్తు కోర్టుముందు విచారణలో ఉండగా కోర్టు మధ్యంతర ఉత్తర్వులుకూడా జారీ చేయవచ్చు అంటే ఈ దరఖాస్తుమీద కోర్టు ఆదేశాలు జారీ చేయనంతవరకు నిందితుడ్ని అరెస్టుచేయడానికి వీల్లేదని ఆదేశించే హక్కు కోర్టుకుంది. యాంటిసిపేటరీబెయిల్ పెట్టుకోవలసిన అవసరం లేదు.

అతని తరపున న్యాయవాది యాంటిసిపేటరీ బెయిల్ పెట్టవచ్చు. యాంటిసిపేయిటరీ బెయిల్ సెషన్స్ కోర్టుగానీ, హైకోర్టుగానీ మంజూరు చేసినప్పుడు నిందితుడి అరెస్టు గురించి కోర్టు వారెంట్ ఇవ్వవలసివుంటే బెయిలబుల్ వారెంట్ మాత్రమే ఇవ్వాలి.

ఒకరాష్ట్రంలోని నిందితుడు మరోరాష్ట్రంలో ఏదైనా కేసులో అరెస్టు అయ్యే అవకాశం ఉన్నప్పుడు ఈ రాష్ట్రపు కోర్టు నుంచి యాంటిసిపేయిటరీ బెయిల్ తీసుకోవడానికి వీల్లేదు. ఐతే ఒక రాష్ట్రపు నివాసిమీద మరో రాష్ట్రపు కేసులో అరెస్టయ్యే అవకాశం ఉన్నప్పుడు నిందితుడు నివసిస్తున్న రాష్ట్రపు హైకోర్టుకు యాంటిసిపేటరీ బెయిల్ ఇచ్చే అధికారం ఉంది.

యాంటిసిపేటరీ బెయిల్ మంజూరైన తర్వాత అది కేసు విచారణ పూర్తయ్యేంతవరకు అమల్లో ఉంటుంది. ఈ మధ్య కాలంలో బెయిల్ క్యాన్సిల్ ఐతేతప్ప ఈ నిబంధనకు ఏవిధమైన మినహాయింపులేదు. ఏ కోర్టయితే బెయిల్ ఇచ్చిందో ఆ కోర్టుకుగానీ, హైకోర్టుకుగానీ బెయిల్ రద్దుచేసే అధికారం ఉంటుంది.

యాంటిసిపేటరీ బెయిల్ తీసుకున్న వ్యక్తిని అరెస్టు చేసినట్లయితే అరెస్టు చేసిన వెంటనే జామీనిచ్చినట్లయితే విడుదల చేయవలసి వుంటుంది. లేదా కస్టడీలో ఉన్నప్పుడు ఏ దశలోనైనా జామీను ఇచ్చినట్లయితే విడుదలచేయాలి. వాస్తవానికి సమాజంలో డబ్బు, పలుకుబడి కలిగిన వర్గాలు తాను ప్రత్యర్థులమీద తప్పుడు కేసులు బనాయించే అవకాశం ఉంది కాబట్టి ఈ సందర్భంలో అవసరమైన నిర్బంధం నుంచి తప్పించడమే యాంటిసిపేటరీ బెయిల్ ఉద్దేశం.

ఆచరణలో ఈ ఉద్దేశం ఎవరి ప్రయోజనాలకు ఉపయోగపడాలో వాళ్ళకు ఉపయోగపడడం లేదు. పారిపోయి కేసు విచారణకి హాజరుకాకుండా ఎగ్గొట్టే అవకాశం లేనప్పుడు కూడా యాంటిసిపేటరీ బెయిల్ ఇవ్వవచ్చు. పూటకి తిండానికి లేక, ఉండటానికి ఇల్లులేకుండా బ్రతికేవాళ్ళంతా సమాజందృష్టిలో పోలీసులదృష్టిలో, న్యాయస్థానాల దృష్టిలో విచారణని ఎదుర్కొంటారని అనుకోవడానికి అవకాశాలు తక్కువ.

# కోర్టులో హాజరు

వీరయ్యను పోలీసులు హత్య కేసులో అరెస్టు చేశారు. అతన్ని కొంతకాలం పాటు అక్రమంగా నిర్బంధించి ఎన్నో పోలీసుస్టేషన్లు తిప్పి చివరికి నిన్న అరెస్టు చేసి నట్లుగా రికార్డుచూపిస్తూ కోర్టులో హాజరుపరచారు. మెజిస్ట్రేటుగారు ముద్దాయి కేసు చూడ

లేదు. కనీసం అతని పేరేమిటని అడగలేదు. అత ఆరోగ్యనిస్థితి ఎట్లాఉందో తెలుసు డానికి ప్రయత్నించలేదు. నిందుతుడేమైనా చెప్పుకో దలుచుకొన్నాడాన్న ఆలోచన చేయ కుండా అతన్నేమీ ప్రశ్నించకుండానే పదిహేను రోజులు జైలు వ్రాసారు. ఇలా అతన్ని జైలుకు పంపేముందు మెజిస్ట్రేటుగారు కేవలం పోలీసు రికార్డు మాత్రమే పరిశీ లించారు. వీరయ్య ఖంగారుపడిపోయాడు. అతనికి పోలీసులు ఏ నేరంక్రింద అరెస్టు చేసిందీ చెప్పలేదు. సింహాచలం దోపిడి కేసు మొదలుకొని ఇందిరాగాంధీ హత్య కేసు వరకూ అన్ని కేసులగురించీ అతన్ని ప్రశ్నించారు. కాబట్టి వీరయ్య తను ఏ కేసులో నిందితుడుగా అరెస్టు చేయబడి కోర్టులో హాజరు పరచబడ్డాడో అర్థం చేసుకోలేక పోయాడు. మెజిస్ట్రేటుగారి ముందు పోలీసులు దాఖలుచేసిన రిమాండు రిపోర్టులో జబ్బార్ అనే మారుపేరుతో వీరయ్య అనబడే ఈ నిందితుడు ఐదు మాసాల క్రితం ఉద్దేశ పూర్వకంగా పాత కక్షలతో అతని ఇంటి ప్రక్కన నివసిస్తున్న గోపాలన్ని హత్య చేశాడు. అయితే ఈ హత్య చేయడానికి ముందు వీరయ్య అనబడే ఈ నింది తుడు తన పేరు జబ్బార్‌గా మార్చుకొని గోపాలం ఇంటి ప్రక్కన ఒక పథకం ప్రకారం ఇల్లు తీసుకొని ఈ నేరానికి పాల్పడ్డాడు. నేరం జరిగిన వెంటనే అతను అక్కడనుంచి ఇల్లు ఖాళీ చేసి పారిపోయాడు. మూడు రోజులక్రితం చార్‌మీనార్ చౌరస్తా ప్రాంతంలో నిందితుడు తాగి ఒక పాన్‌షాప్‌లో రామ్‌ప్యారీ పాన్ కొనుక్కొని పాన్‌షాపతనికి ఇబ్బులివ్వడానికి నిరాకరించి తానే హంతకుడు జబ్బార్‌నని ఇంతా మాట్లాడితే మరో ఖూనీ చేయడానికి వెనకాడనని బెదిరించి వెళ్ళిపోయాడు. ఈ మేరకు తమకు సమాచారం అందగానే వీరయ్యను జబ్బార్‌గా గుర్తించి అరెస్టు చేయడం జరి గిందనీ నిందితుడు పోలీసు స్టేషన్‌లో నేరాన్ని ఆమోదించాడనీ తాను ఏ కత్తితోనైతే హత్య చేశాడో ఆ కత్తిని ఇద్దరు పెద్ద మనుషుల సమక్షంలో పోలీసులకు స్వాధీనపరి చాడని, ఇంకా ఈ కేసులో దర్యాప్తు మిగిలి ఉన్నందువల్ల తాము నిందితుడిని అరెస్టు చేసిన తర్వాత ఇరవై నాలుగు గంటల్లో దర్యాప్తు పూర్తి చేయలేక పోయినందువల్ల అతన్ని రిమాండుకు పంపించవలసిందిగా కోరుతున్నాము అనీ పేర్కొన్నారు.

ఈ రిమాండ్ రిపోర్టులో ఏం రాశారో కూడా వీరయ్యకు తెలియదు. వీరయ్య తనకు మేజిస్ట్రేటు గారు శిక్ష విధించారనుకొని నేనేపాపం చేయలేదు. నాకు అన్యాయంగా శిక్ష వేయకండి బాబూ అంటూ బోరున ఏడ్చాడు. మేజిస్ట్రేటు గారు అతని కేమీ చెప్పలేదు. పైగా తాను అన్యాయంగా ప్రవర్తిస్తున్నానని అతను ఆరోపిస్తున్నా డన్న కోపంతో అతన్నక్కడనుంచి వెంటనే ఓసుకు వెళ్ళిపొమ్మని పోలీసులనాజ్ఞాపిం చారు. పోలీసులతన్ని రెక్కలు పుచ్చుకొని బలవంతంగా బలిపీఠానికి తీసుకుపోతున్న ట్లుగా ఈడ్చుకు పోయారు.

వీరయ్యకి తానెందుకు అరెస్టు చేయబడ్డాడో తెలియదు. ఎందుకు ఏ అధికారంతో పోలీసులు తనని అక్రమంగా నిర్బంధించారో తెలవదు. తాను కోర్టులో ఏ కేసులో హాజరుపర్చబడ్డాడో తెలవదు. మేజిస్ట్రేటుగారు తనని జైలుకు పంపిన వైనం శిక్ష అవుతుందా కాదానన్న విషయం కూడా తెలవదు. అసలు తన మీద పోలీసులు మోపిన అభియోగం ఏమిటో కూడా తెలవదు. మామూలుగా పోలీసులు వివరించాల్సిన విషయాల్ని ఎలాగో వాళ్ళు వివరించరని తెల్సికూడా న్యాయస్థానాలు వాటిని వివరించక పోవడం వలన సామాన్య మానవుడికి పోలీసులకీ న్యాయస్థానాలకీ మధ్యన ఎలాంటి తేడా కనిపించదు. రిమాండ్ చేసే ముందు కోర్టు వారు ముద్దాయి పేరేమిటి, అతని తండ్రి పేరేమిటి, వయిస్సేమిటి, వృత్తేమిటి, అతనికింకా ఏమైనా మారు పేర్లు ఉన్నాయా లాంటి కనీస అవసరమైన విషయాల్ని విచారించి తెలుసుకోవల్సి వుంటుంది. పైన చెప్పిన ఉదాహరణలో వీరయ్యకి ఉరఫ్ జబ్బార్ అనే పేరు ఉందో లేదో తెల్సుకోవడం తప్పనిసరి. ఈ ప్రశ్న అతన్నడిగివుంటే అతను నెత్తినోరూ బాదుకొని తానెప్పుడూ అలాంటి పేరు తగించుకోలేదని ఆ పేరిప్పుడు పోలీసులు తనకు తగిలించారనీ చెప్పుకుని ఉండేవాడేమో, ఇలా గనక జరిగివుంటే మేజిస్ట్రేటుగారు నిందితుడిని రిమాండు చేయడానికి తగిన కారణాలు ఉండేవి కావు. అంతేకాక ఏ మనిషికైనా సరే అతనికి వ్యతిరేకంగా జరుగుతున్న దేమిటో తెలుసుకునే హక్కు వుంటుంది. ఇలా తాను ఎందుకు నిర్బంధంలో ఉంచబడుతున్నాడో తెలవకుండా నిర్బంధించబడేట్లయితే న్యాయస్థానాలు కూడా అక్రమ నిర్బంధానికి పాల్పడ్డట్టే అవుతుంది. ఒక వ్యక్తిని నిర్బంధించే ముందు న్యాయస్థానం అతన్నెందుకు నిర్బంధిస్తున్నదీ అతనికి తెలియజేయాల్సి వుంటుంది. అంతేకాక ఈ విషయంలో నిందితుడికున్న హక్కులు కూడా స్పష్టం చేయాలి. బెయిల్ తీసుకోవడం, న్యాయవాదిని నియమించుకోడం, అంతకుముందు పోలీసు నిర్బంధంలో ఏమైనా హింసకు గురై వుంటే ఆ విషయం కోర్టువారికి విన్నవించుకొనే హక్కు ఇందులో భాగమే. నిందితుడి ఆరోగ్య స్థితి గురించి కూడా మేజిస్ట్రేటు విచారించి తగిన చర్య తీసుకోవాలి. రిమాండుకు పంపే ముందు మేజిస్ట్రేట్ ఈ విధులు నిర్వహించడమే కాకుండా నిందితుడు ఇచ్చే స్టేటుమెంట్‌లో ఎవరి మీదైనా అభియోగం మోపివుంటే అది రికార్డు చేసుకొని వారి మీద తగిన చర్య తీసుకోవాలి.

సాధారణంగా నిందితులు కోర్టులో హాజరుపరచబడగానే పోలీసులు తమని లాకప్ హింసించారని అభియోగం మోపు తుంటారు. ఈ అభియోగాలని కోర్టు వారు రికార్డు చేసుకొని వాటిని ప్రైవేటు కంప్లైంటులుగా భావించి చర్య తీసుకొనే అధికారం వుంది. అంతేకాక నిందితులు రోజులు, నెలల తరబడి లాకప్‌లో అక్రమంగా నిర్బంధించబడ్డామని చెప్పినప్పుడు కూడా అక్రమ నిర్బంధం కింద పోలీసుల మీద కోర్టు

వారు కేసు నమోదు చేయవచ్చు. కేసు నమోదు చేసిన తర్వాత ముద్దాయిని హాస్పిటల్‌కు పంపించడం, వైద్య పరీక్షలు చేయించడం, అతనిచ్చిన స్టేట్‌మెంట్‌ను సమర్థించే సాక్ష్యాలను విచారించడం, అతన్నెవరైతే నేరస్థుడుగా పేర్కొన్నాడో అతన్ని ఈ కేసులో ముద్దాయిని చేయడం వల్ల కోర్టులు ఇరుపక్షాలతో నిష్పక్షపాతంగా వ్యవహరిస్తున్నాయని రుజువౌతుంది. మౌలికంగా పోలీసులు పెట్టిన కేసులో కూడా ఈ దెబ్బతో నిజానిజాలు తెలిసే అవకాశం ఏర్పడుతుంది. ఉదాహరణకి వీరయ్యని పోలీసులు పది రోజుల క్రితమే అరెస్టు చేసి ఉన్నట్లయితే అతను మూడు రోజుల క్రితం తాగినమాట, పాన్ తిన్నమాట, షాపతన్ని బెదిరించిన మాట అబద్ధమని తేలిపోతుంది. అంతేకాక అతన్ని అక్రమ నిర్బంధంలో ఉంచినందుకు గాను పోలీసులు శిక్షార్హులౌతారు. అందుచేత మేజిస్ట్రేటు ముద్దాయిని రిమాండ్ చేసే ముందర అతనేమైనా చెప్పకున్నట్లయితే అనివార్యంగా రికార్డు చేయాలి.

రిమాండు ఛార్జిషీటు దాఖలు చేయకముందు పోలీసులు వారెంట్ లేకుండా అరెస్టుచేసి, దర్యాప్తు నిమిత్తం కోర్టులో హాజరుపరిచినప్పుడు కోర్టు వారు పరిశీలిస్తారు.

## పోలీసు కస్టడీ - రిమాండ్

ఒక ముద్దాయిని పోలీసులు చైనులతో కట్టేసి కోర్టులో హాజరుపర్చారు. "అయ్యా నన్ను పోలీసులు అరెస్టుచేసి ఇరవై రోజులయిపోయింది. అప్పటినుండి ఇప్పటివరకూ ఎన్నెన్నో ఊళ్ళల్లో పోలీసులాకప్‌లో ఉంచి ఇవ్వాళ తీసుకువచ్చి మీదగ్గరవుంచాడు. మీరైనా నన్ను దయచేసి వదిలెయ్యండి" అని బ్రతిమాలుకున్నాడు ముద్దాయి. కోర్టు వారు రికార్డు పరిశీలించారు. అతనికి అనేక హత్యలు, దోపిడీలు, దొంగతనాలతో సంబంధముందని ఇటీవల పెట్రోలు పంపులో కూడా దొంగతనం చేసాడనీ దీన్ని గురించి దర్యాప్తు చేస్తుండగా నిందితుడు చేజిక్కాడనీ ఇంకా అతనికి ఏఏ నేరాలతో సంబంధమున్నదో తెలుసుకోవలసివుందనీ ఇరవై నాలుగుగంటలలో తమ దర్యాప్తు పూర్తి చేయలేకపోయాము కాబట్టి అతన్ని మరో పదిహేను రోజులపాటు పోలీసు కస్టడీకి ఇవ్వవలసిందని పోలీసులు తమ నివేదికలో పేర్కొన్నారు.

మేజిస్ట్రేటుగారు అతన్ని "నీవేమైనా చెప్పుకోదలుచుకున్నావా?" అని అడిగారు. ముద్దాయి "నన్ను పోలీసులు ఇరవైరోజులు చిత్రహింసలు పెట్టారు. అంచేత నన్ను హాస్పిటల్‌కు పంపించి పోలీసులను శిక్షించండి" అని కోరాడు. మేజిస్ట్రేటుగారు అతనికి వైద్య పరీక్ష చేయించమని ఆదేశించడమేకాక వారం రోజులపాటు పోలీసు కస్టడీలో ఉంచమని కూడా ఆదేశించారు. ఇది వినగానే ముద్దాయి నెత్తీనోరూ బాదుకుంటూ

"వాళ్లు రాక్షసులు వాళ్ళు నా రక్తం పీల్చేసారని చెప్పానుకదా స్వామీ, మీరూ నన్ను మాంసం కూర వండుకు తినేయమనేనా వాళ్ళదగ్గరికి పంపించేది'' అని ఏడ్చాడు. పోలీసులు అతన్ని అక్కడి నుంచి అట్లాగే లాక్కుపోయారు.

*కోర్టు హాల్లో బేడీలు*

పోలీసులు అరెస్టుచేసి ఎవర్నైనా కోర్టులో హాజరుపరచేటప్పుడు కోర్టుహాల్లో బేడీలు తగిలించకూడదు. చెయిన్లతో కట్టేసి తీసుకురావడం కూడా సరైందికాదు. పోలీసుల చేతుల్లో ముద్దాయిలు చిత్రహింసలకు గురికాకుండా ఉండాలనే ఉద్దేశంతో చట్టం అరెస్టుచేసిన 24 గంటల్లో కోర్టులో హాజరుపర్చాలని నిర్దేశించింది. ఈ 24 గంటలు అనే మాటని తూ.చ. తప్పకుండా పాటించమని అర్థంకాదు. 24 గంటలు దాటకుండా 24 గంటలలోపే వీలైనంతవరకు కోర్టులో హాజరుపర్చాలి. దర్యాప్తు పూర్తి చెయ్యడానికి ఏ 5, 6 గంటలో సమయం పట్టేట్లైతే దర్యాప్తు పూర్తయిన వెంటనే అంటే ఈ 5, 6 గంటల వ్యవధి ముగిసిన వెంటనే కోర్టుకి హాజరుపర్చాలి. అంతేకాని మాకు 24 గంటల వరకు ఉంచుకునేహక్కు ఉందికదాని ముద్దాయిని లాకప్‌లో ఉంచేసి మాటల్తోటి అతన్ని నానాహింసలు పెట్టే అధికారం పోలీసులకులేదు. దీన్నిబట్టి నిందితుణ్ణి వీలైనంత తొందరగా పోలీసుల కబంధహస్తాల్లోంచి కోర్టుకు తెప్పించడమే చట్టంయొక్క ఉద్దేశమని మనకు అర్థం అవుతుంది.

ఇంకా పోలీసుల చేతుల్లో ముద్దాయి హింసకు గురయ్యే అవకాశం ఉందని భావించే చట్టం ఇలాంటి నిబంధన ఏర్పరిచింది. ఒకవేళ దర్యాప్తు 24 గంటల్లో పూర్తి కాకపోయినా, ముద్దాయిని కోర్టులో హాజరుపరచడంవల్ల అతను కోర్టుకి ఏమైనా విన్నవించుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈ చట్టంక్రింద పోలీసులకు దొరక్కుండా తాను నిందితుణ్ణని తెలుసుకొని నేరుగా కోర్టులో హాజరైనా ముద్దాయిని పోలీసుకస్టడీకి ఇచ్చే అధికారం ఉంటుంది. ఇలా చేయడంలో దర్యాప్తు పూర్తిచెయ్యడానికితోడ్పడాలనే ఉద్దేశం ఇమిడివుంది. అయితే ముద్దాయి తాను ఏ నేరమూ చేయలేదని చెప్పినప్పుడు అతన్ని పోలీసుకస్టడీకి పంపడానికి వీలులేదు.

సాధారణ దర్యాప్తు విషయంలో కోర్టు ముద్దాయిని పోలీసుకస్టడీలో ఉంచడం ఒక ఎత్తుకాగా తాను ఏ నేరం చెయ్యలేదని తనమీద మోపిన ఆరోపణతో ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగాగానీ ముద్దాయి ప్రకటించినప్పుడు కోర్టువారు ఆ నేరం తాలూకు వస్తువులని స్వాధీనపరచుకోడానికి అతన్ని పోలీసులకు అప్పగించడానికి వీలులేదు. భారత సాక్ష్య చట్టం ప్రకారం నిందితుడు పోలీసులముందు నేరంచేసినట్లు ఒప్పుకున్నా అది ఒప్పుదల కాదు. అయితే దీనికి ఒక మినహాయింపు ఉంది. నేరానికి సంబంధించిన

వస్తువులు, ముద్దాయి ఇచ్చిన వాంగ్మూలం ప్రకారం స్వాధీన పర్చుకున్నట్లయితే ఆ స్వాధీనం మేరకు అతని వాంగ్మూలాన్ని కోర్టుఒప్పుదలగా ఆమోదిస్తుంది. ఉదాహరణకి ఒక హత్యకేసులో నిందితుడు హత్యచెయ్యడానికి ఉపయోగించిన ఆయుధాల్ని నేరానికి సంబంధించిన వస్తువులు అంటారు. అలాగే దొంగతనం కేసులో దొంగిలించబడ్డ వస్తువులుకూడా నేరం తాలూకు వస్తువులే అవుతాయి. నిందితుడు పోలీసు కస్టడీలో ఉన్నప్పుడు తాను ఫలానావ్యక్తిని హత్య చేసానని హత్యకు ఆయుధంగా ఉపయోగించిన కత్తిని చూరులో దాచానని చెప్పినట్లయితే అతను చెప్పిన ఈ ఒప్పుదల ఆధారంగా పోలీసులు కత్తిని స్వాధీనపర్చుకున్నట్లయితే కత్తి స్వాధీన పర్చుకోవడం వరకు కోర్టు ఒప్పుదలగా ఆమోదిస్తుంది.

సాధారణంగా పోలీసులముందు ఎవరూ నేరాన్ని ఆమోదించకపోయినా వాళ్ళు ఆమోదించారని పోలీసులు ఆరోపిస్తూంటారు.

ఈ విషయాన్ని కోర్టు దృష్టిలో ఉంచుకోవాలి. అంతేకాక కోర్టు ముందునేరాన్ని ఆమోదించని నిందితుణ్ణి నేరం తాలూకు వస్తువులని స్వాధీన పర్చుకోవడానికి పోలీసులకు అప్పగించకూడదు. ఇట్లా చేయడమంటే నిందితుణ్ణి బలవంతపెట్టడమే అవుతుంది. పోలీసుల హింసాత్మక ప్రవృత్తికి కోర్టు ఆమోదముద్ర వేయడమే.

ఇది క్రిమినల్ ప్రొసీజర్‌కి మాత్రమేకాక భారతరాజ్యాంగానికి కూడా వ్యతిరేకమే. ఎవరైనాసరే తనకి వ్యతిరేకంగా తానే సాక్షి కావడానికి వీల్లేదు. పోలీసులు అరెస్టుచేసి తీసుకొచ్చినప్పుడు కూడా నిందితుడికి అతనిమీద ఉన్న అభియోగం ఏమిటో కూడా కోర్టు వివరించాలి. ఇట్లా వివరించినప్పుడు ముద్దాయికి ఏమైనా చెప్పుకునే అవకాశం ఏర్పడుతుంది. కొన్నిసార్లు నిందితుడు అక్రమ నిర్బంధంలో ఉంచబడ్డాడని తెల్సినప్పుడు కూడా కోర్టు అతన్ని రిమాండు చెయ్యడానికి వీలులేదు. నిందితుణ్ణి కోర్టు ముందు హాజరుపర్చకుండా ఉన్నప్పుడు అతన్ని గుడ్డిగా రిమాండ్ చెయ్యడానికి వీలు లేదు.

## కోర్టులో హాజరుపరిచే అధికారం

కేసు దర్యాప్తు చేసే పోలీసు అధికారి ముద్దాయిని చార్జిషీట్ ఫైల్ చేయక ముందు కోర్టులో హజరు పరిచే అధికారం కలిగివుంటాడు. అయితే ఈ అధికారి సబిన్స్పెక్టర్ కంటే తక్కువ ఉద్యోగి అయివుండ కూడదు. నిందితుని కోర్టులో హజరు పరిచే అధికారి నిందితుడితో పాటు కేసు డైరీలో రాసుకొన్న వివరాలు కాపీ చేసి కోర్టు వారికి సమర్పించాలి. ప్రతి క్రిమినల్ కేసులోను కేసు రిజిస్టరయిన వెంటనే ఆ కేసుకు

సంబంధించిన వివరాలు ఎప్పటికప్పుడు సాగే దర్యాప్తు వెంటనే దర్యాప్తుచేసే అధికారి ఒకడైరీ రూపంలో రాసుకొంటాడు. నిందితుడ్ని కోర్టులో హాజరు పర్చడమనే సమస్య నిందితుడి అరెస్టుతో ప్రారంభం అవుతుంది. అరెస్టు చేసిన తరువాత అరెస్టయిన వ్యక్తిని పోలీసులు యిరవై నాలుగు గంటలకిమించి తమఆధీనంలో వుంచుకొనడానికి లేదు. దర్యాప్తు యిరవై నాలుగు గంటల్లో పూర్తి చెయ్యలేమన్న నిర్ధారణకి వచ్చినప్పుడు ఆ వెంటనే తీసుకు వెళ్ళి కోర్టులో హాజరు పర్చాల్సి వుంటుంది. వాస్తవానికి చట్టం యిలా నిర్దేశిస్తున్నప్పటికి పోలీసులు యిరవై నాలుగు గంటల పాటు వుంచుకొనడం ఖచ్చితంగా తమ అధికారం అన్నట్లుగా మాట్లాడుతారు. ఏ రిమాండ్ రిపోర్టు చూసినా యిరవై నాలుగు గంటల్లో తాము దర్యాప్తు పూర్తి చెయ్యలేక పోయాము కాబట్టి వారం రోజుల పాటో, పదిహేను రోజుల పాటో రిమాండ్ చెయ్యవలసిందిగా కోరుతున్నామని మేజిస్ట్రేటు గారికి విన్నవించుకొంటారు. అరెస్టు చేసిన ఇరవై నాలుగు గంటల్లో దర్యాప్తు పూర్తిచేయలేమన్న నిర్ధారణకు వచ్చినపుడు గాని, ఇరవై నాలుగు గంటల్లో దర్యాప్తు పూర్తి కానపుడు గానీ పోలీసులు వెంటనే నిందితుడిని కోర్టులో హాజరు పరచాలని దీనిని బట్టి స్పష్టమౌతోంది. (అక్రమ నిర్బంధాలు నిరోధించడం కోసం ఈ మాటలు పదే పదే ఇంత వివరంగా చెప్పాల్సి వస్తోంది) ముద్దాయిని కోర్టులో హాజరు పర్చకుండా అతనిని రిమాండుకు పంపడం చట్టవిరుద్ధం. మేజిస్ట్రేటు గారు పోలీసులు దాఖలు చేసిన కేసు డైరీని పరిశీలించి ముద్దాయిని జైల్లో ఉంచాల్సిన అవసరం ఉందని భావించినపుడు మాత్రమే అతన్ని రిమాండ్ చేస్తారు. అంతేకాని పోలీసులు రిమాండ్ కోరారు కాబట్టి ముద్దాయిని రిమాండ్‌కు పంపడం సరయింది కాదు. నిందితుడు నేరం చేశాడని అనుకోడానికి కనీస సాక్ష్యాధారాలు కూడా లేవని భావించినపుడు కోర్టువారు అతన్ని విడుదల చేయవచ్చు.

నిందితుడిని పోలీసులు సమీప మేజిస్ట్రేటు ముందు హాజరు పర్చాలి, ఆ మేజిస్ట్రేటుకి కేసు విచారించే అధికారం ఉన్నదా లేదా అనే విషయంతో సంబంధం లేకుండా హాజరు పర్చవచ్చు. ఒక్కొక్కసారి అధికారం వున్న మేజిస్ట్రేటు అందుబాటులో వుండక పోవచ్చు. కాబట్టే అందుబాటులో వుండే సమీప మేజిస్ట్రేటు దగ్గర హాజరు పరుస్తారు. ఏ పరిస్థితులలోను ఈ పరిస్థితిలో ముద్దాయిని పదిహేను రోజులకు మించి నిర్బంధించమనే అధికారం మేజిస్ట్రేటుకు లేదు. మేజిస్ట్రేటుగారు పోలీసు కస్టడీలోనైనా లేదా జైలు కస్టడీలోనైనా ముద్దాయినుంచమని ఆదేశించ వచ్చు. అయితే పోలీసు కస్టడీలో ఉంచినప్పుడు మాత్రం ఎందుకు తాను ముద్దాయిని ఆ రకమైన కస్టడీలో వుంచిందీ కారణాలు నమోదు చేయాలి. ముద్దాయిని నిర్బంధించిన మొదటి పదిహేను రోజులలోగా అతన్ని జైలు కస్టడీనించి పోలీసు కస్టడీకి మార్చమని

ఆదేశించే అధికారం మెజిస్ట్రేటుకుంది. కాని ముద్దాయికి బెయిల్ ఇచ్చిన తర్వాత అతన్ని పోలీసు కస్టడీలో వుంచమని ఆదేశించే అధికారం మేజిస్ట్రేటుకుండదు.

సమీపంలో జ్యుడీషియల్ మేజిస్ట్రేటు ఎవరూ లేనప్పుడు పోలీసులు ముద్దాయిని ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్ ముందు హాజరు పరచాలి. ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేటుకి ఏడు రోజుల కంటే ఎక్కువ కాలం నిర్బంధించే అధికారం లేదు. అధికారం వున్న జ్యుడీషియల్ మేజిస్ట్రేటు నుంచి ముద్దాయి రిమాండ్ కాలాన్ని పొడిగిస్తూ ఆదేశాలు జారీ కాకపోతే అతన్ని ఏడు రోజులు పూర్తికాగానే ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేటు ముద్దాయిని బెయిల్ మీద విడుదల చేయాలి. తన అధికార పరిధిలో లేని కేసుకి సంబంధించి ముద్దాయిని రిమాండ్ చేసినట్లయితే మేజిస్ట్రేటు అతన్ని రిమాండ్ కాలం పూర్తయిన వెంటనే కేసు వివరాలతో సహా అధికారమున్న మేజిస్ట్రేటు ముందుకు పంపాలి. అధికారమున్న మేజిస్ట్రేటు ముద్దాయి రిమాండ్ కాలం పూర్తయిన తరువాత అతన్ని తిరిగి రిమాండ్ చెయ్యాల్సిన అవసరం వుందనుకుంటే రిమాండ్ కాలం పొడిగించవచ్చు.

మేజిస్ట్రేటు కేసులో దర్యాప్తు సాగుతున్న దశలో రిమాండు కాలా న్ని గుడ్డిగా పొడిగించడానికి వీల్లేదు. అతను ఎందుకు రిమాండు కాలాన్ని పొడిగించవలసి వచ్చిందో రికార్డు చేయాలి. చాలా కేసుల్లో పోలీసులు దర్యాప్తు పూర్తి కాలేదన్న కారణం చూపించి ముద్దాయిని రిమాండ్ పొడిగించమని అడుగుతారు. మేజిస్ట్రేటు కూడా అందుకు వంతపాడి రిమాండ్ పొడిగించేస్తారు. కేసు డైరీలో వున్న విషయాన్ని పరిశీలించి ముద్దాయిని రిమాండ్ చెయ్యాల్సిన అవసర ముందనుకున్నప్పుడు మాత్రమే అతన్ని రిమాండ్ చేసే అధికారమున్న మెజిస్ట్రేటు మొదటి రిమాండ్ కాలం పూర్తయిన తర్వాత రిమాండ్‌ని పొడిగించాలంటే కూడా కేసు డైరీని పరిశీలించాలి. అంతేకాని ఏళ్ళూ పూళ్ళూ గడిచినా దర్యాప్తు పూర్తికాలేదన్న మిషతో ముద్దాయిని నిర్బంధంలో వుంచడం సరైంది కాదు. కొన్ని కొన్నిసార్లు పి.పి ఓ. లు రిమాండ్ కాలం పొడిగించమని కోరిన వెంటనే మేజిస్ట్రేటు రిమాండ్ కాలం పొడిగిస్తుంటారు. అంతేకాక సంబంధిత పోలీసులెవరూ కోర్టుకు రాకపోయినప్పటికి రిమాండ్ కాలాన్ని పొడిగించే మేజిస్ట్రేటు లున్నారు. దీనివల్ల ఒక నిర్దిష్టమైనటువంటి ఆరోపణ ఏమిలేకుండానే వ్యక్తి స్వేచ్ఛని న్యాయం పేరిట పోలీసులు, మేజిస్ట్రేటులూ ఆటంక పరుస్తున్నారని స్పష్టమౌతోంది. కేసు డైరీని పరిశీలించిన తర్వాత రిమాండు కాలాన్ని పొడిగించాల్సిన అవసరం లేదనుకున్నప్పుడు మెజిస్ట్రేటు నిందితుడిని విడుదల చేయవచ్చు. లేదా అవసరమనుకుంటే నిర్బంధ కాలాన్ని పొడిగించనూ వచ్చు.

జైలులో ఉన్న ఖైదీలని హాజరు పర్చడానికి పోలీసులు సాధారణంగా

ఇష్టపడరు. జైల్లో ఉన్న ఖైదీని కోర్టులో హాజరుపరచడం వలన అతను కోర్టు వారికి ఏదైనా విన్నవించుకొనే అవకాశం ఏర్పడుతుంది. అంతేకాక కేసు విచారణ కూడా తొందరగా పూర్తికావడానికి వీలుంది. అసలు జైలు నుంచి కోర్టుకి ఖైదీని తీసుకురాక పోవడం వల్ల ఖైదీని విచారణ లేకుండా శిక్షకు గురిచేసినట్లవుతుంది. ముద్దాయిని హాజరు పర్చకపోయేట్లయితే అతన్ని విడుదల చేయమని ఆదేశించే హక్కు కోర్టుకుంది. మద్రాస్ హైకోర్టు ఈ విషయంలో కోర్టుకు హాజరుపర్చని అనేక మంది ఖైదీలని విడుదల చేయమని ఆదేశిస్తూ ఒక చారిత్రాత్మకమైన తీర్పు చెప్పింది. మన రాష్ట్రంలో జైలు నుంచి ముద్దాయిలని హాజరు పర్చే బాధ్యత పోలీసు అధికార్లది. జైలు అధికార్లకి ఈ బాధ్యత వుంటే వున్నట్లయితే వారు కొంత స్వతంత్రంగా వ్యవహరించి వుండి వుండే వారేమో.

## రిమాండు - బెయిలు

కొమరయ్యను మేజిస్ట్రేట్‌గారు రిమాండ్ చేశారు. ప్రతి పదిహేను రోజుల కోసారి రిమాండ్ పొడిగిస్తూపోతున్నారు. కొమరయ్యను కోర్టుకు తీసుకొనివచ్చినప్పు డల్లా "బాబూ" నన్ను బెయిల్ మీద విడిచిపెట్టండి, ఇంటి దగ్గర నాపెళ్లాం బిడ్డలు పస్తులుంటున్నారు. నేనేపాపం ఎరుగను" అని వేడుకుంటున్నాడు. కొమరయ్య ఒక హత్య కేసులో నిందితుడు. హత్యకేసులో జీవితకాలం శిక్ష విధించే అవకాశం వుంది కాబట్టి మేజిస్ట్రేట్‌గారు తానేమీ చేయలేనని చెబుతున్నారు. "నా కేసైనా తొందరగా నడి పించండి బాబూ, నేనే ఖూనీ చేయలేదు. కేసు తొందరగా పూర్తిచేస్తేనైనా బైటపడ తాను" అని విన్నవించుకుంటున్నాడు కొమరయ్య. "ఛార్జిషీటు దాఖలు చేయందే కేసు నడపడానికి వీలులేదు. అదైనా సెషన్స్ కోర్టులోనే నడుస్తుంది. అంత వరకూ నేనేమీ చేయలేను" అని తన నిస్సహాయతను ప్రకటించారు మేజిస్ట్రేట్‌గారు. కేసులో శిక్షపడటం మాట అటుంచి కొమరయ్యను ఏ విధంగానైనా ఏడిపించాలనుకొన్న పోలీసులు దర్యాప్తు ముగించి ఛార్జిషీటు దాఖలు చేయడంలేదు. అందుకని మేజిస్ట్రేట్‌గారు ప్రతి పదిహేను రోజులకోసారి రిమాండ్ కాలాన్ని పొడిగిస్తూనే వున్నారు. ఇలా కేసుల్లో దర్యాప్తు సాగుతున్నంత కాలం ముద్దాయిని రోజులతరబడి, నెలలతరబడి విచారణ జరపకుండా రిమాండ్‌లో వుంచడం అంటే పరోక్షంగా శిక్షించడమే అవుతుంది. దీనిని న్యాయస్థానం గాని, చట్టంగాని ప్రోత్సహించడానికి వీలులేదు. దర్యాప్తుసాగుతున్నప్పుడు ముద్దాయికి బెయిల్ లభించక పోయేట్లయితే అంతూ పొంతూ లేకుండా అతన్ని రిమాండ్‌లో వుంచ వచ్చునా?

సెక్షన్ 167 (2) క్రింద పది సంవత్సరాల లోపు శిక్ష విధించే అవకాశం వున్న కేసుల్లోని ముద్దాయిని ఛార్జిషీటు దాఖలు చేయనప్పుడు అరవై రోజులకు మించి రిమాండ్‌లో వుంచడానికి వీలులేదు. ప్రతి పదిహేను రోజులకూ పొడిగించే ఈ రిమాండ్ కాలం అరవై రోజులు పూర్తికాగానే ముద్దాయికి మేజిస్ట్రేట్ బెయిల్ ఇవ్వవలసి వుంటుంది. ఇకపోతే జీవితఖైదుగాని, మరణశిక్షగాని విధించే అవకాశం వున్న కేసుల్లో పది సంవత్సరాలుగాని, అంతకు మించిగాని శిక్ష విధించే అవకాశంవున్న కేసుల్లో ఛార్జిషీటు దాఖలు చేయకముందు రిమాండ్ కాలం తొంబై రోజులు పూర్తికా గానే ముద్దాయికి బెయిల్ ఇవ్వాలి. దర్యాప్తు పూర్తికానప్పుడు ముద్దాయి అరెస్టు అయి నప్పుడు నుంచి అరవై రోజులుగాని, తొంబై రోజులుగాని కేసునుబట్టి రిమాండ్ కాలం పూర్తికాగానే ఒక హక్కుగా ముద్దాయి బెయిల్ పొందవచ్చు. జామీను ఇవ్వని పక్షంలో మాత్రమే అతన్ని రిమాండ్‌లో ఉంచవచ్చు.

చాలామంది ముద్దాయిలకి ఈ విషయం తెలవదు. హక్కుగా బెయిల్ పొందే అవకాశంవుందని తెలవనప్పుడు ఏ ముద్దాయి కూడా బెయిల్ మీద విడుదల చేయమని అడగటానికి సాధారణంగా సాహసించడు. కోర్టులో ఏం మాట్లాడితే ఏం కొంపలంటుకు పోతాయోనని భయపడేవాళ్ల సంఖ్యే ఎక్కువ. దానికి తోడు కోర్టు వాతావరణం కూడా భయం గొల్పేలాగవుండి వాళ్లను మాట్లాడనివ్వదు. కొందరు మేజిస్ట్రేట్‌లు కూడా ముద్దాయి ఏమైనా చెప్పుకోదలచుకొన్నప్పుడు ప్లీడరు ద్వారా చెప్పుకోమని మందలిం చడం తరచు చూస్తూనే వున్నాం. ఎవరికడుపు మంట వారికి తెలిసినట్లుగా ఇతరులకు తెలిసే అవకాశం తక్కువ. అందుకని మేజిస్ట్రేట్లు సానుభూతితో ముద్దాయిలు చెప్పేది విని, వాళ్లకవసరమైన న్యాయసహాయం చెయ్యాలి. అనేకసార్లు సుప్రీంకోర్టు కూడా ఈ విషయం స్పష్టంచేసింది. కేసును బట్టి అరవై రోజులు కాని తొంబై రోజులుకాని రిమాండ్ కాలం పూర్తయిన వెంటనే మేజిస్ట్రేట్ ముద్దాయికి అతను బెయిల్ పొందే హక్కువుందని తెలియజేయాలి. అంతేగాక ముద్దాయి న్యాయవాదిని నియమించుకోలే నప్పుడు మేజిస్ట్రేట్ ప్రభుత్వం ఖర్చుమీద తానే న్యాయవాదిని నియమించి బెయిల్‌కు ఏర్పాటు చేయాలి.

ఈ చట్టం క్రింద ముద్దాయిని బెయిల్ మీద విడుదల చేసిన తర్వాత చార్జి షీటు దాఖలైతే తిరిగి అతన్ని రిమాండ్ చేయడానికి వీలులేదు. ఈ చట్టం క్రింద మేజి స్ట్రేట్ బెయిల్ ఇవ్వకపోయేట్లయితే జిల్లా కోర్టుగాని, హైకోర్టుగాని బెయిల్ ఇవ్వవచ్చు. ఈ చట్టం కింద బెయిల్ ఇవ్వమని ముద్దాయి దరఖాస్తు చేయవలసిన అవసరం లేదు. కోర్టు తన బాధ్యతగా భావించి ముద్దాయిని విడుదల చేయాలి. ఈ చట్టం క్రింద విడుదల కావడం సాధారణంగా బెయిల్ మీద విడుదల కావడంతో సమానం.

సెక్షన్ 167 (2) క్రింద బెయిల్ మీద విడుదలైన ముద్దాయికి బెయిల్ రద్దుచేసే అధికారం వుందా? అంతకుముందు బెయిల్ రద్దయిందన్న కారణంగా ముద్దాయికి ఈ సెక్షన్ క్రింద ఇచ్చే బెయిల్‌ను రద్దుచేయడానికి వీలులేదు.

కొన్ని కొన్ని కేసుల్లో దర్యాప్తు సంవత్సరాల తరబడీ చేస్తుంటారు. దర్యాప్తు పేరుమీద ముద్దాయిని అనేక ఇబ్బందులకు గురిచేస్తుండటం మనం గమనిస్తున్నాం. ఇలా ఒక హద్దు, పద్దూ లేకుండా చిన్న చిన్న కేసుల్లో కూడా దర్యాప్తు కొనసాగించవచ్చునా? అని అనుమానం రాకపోదు. సెక్షన్ 167 (5) కింద మేజిస్ట్రేట్‌కి సమన్స్ కేసుల్లో ఆరు మాసాల్లో దర్యాప్తు గనుక పూర్తిగాకపోతే దర్యాప్తు నిలిపివేయమని ఆదేశించే అధికారం వుంది ముద్దాయి అరెస్టయిన నాటినుంచీ ఆరు మాసాల కాల పరిమితిని పరిగణిస్తున్నారు. అయితే దర్యాప్తు చేస్తున్న అధికారి కొన్ని ప్రత్యేక కారణాలవల్ల దర్యాప్తు చేయడానికి ఇంకా కాలపరిమితి అవసరమని మేజిస్ట్రేట్‌ను కోరినప్పుడు ఆయన ఈ గడువు కాలం పొడిగించవచ్చు. దర్యాప్తు చేస్తున్న అధికారి దర్యాప్తు కాలపరిమితి పూర్తయిన తర్వాత పొడిగించమని అడగకుండా ఛార్జిషీటు దాఖలు చేసేట్లయితే కోర్టు దాన్ని గమనంలోకి తీసుకోవలసిన అవసరం లేదు. దర్యాప్తు కాల పరిమితి పూర్తయిన తర్వాత మేజిస్ట్రేట్ అనుమతిలేకుండా కొనసాగించడం చట్ట విరుద్ధం.

ఎలాగూ దర్యాప్తు కాలపరిమితి పెంచుకోవడానికి మేజిస్ట్రేటును కోరే అధికారం వుంది కాబట్టి ముద్దాయిని అరెస్టు చేసిన ఆరునెలల తర్వాత మేజిస్ట్రేట్‌ని కాలపరిమితిని పెంచమని కోరడం ఆ దశలో దర్యాప్తు కాలపరిమితి పెంచడం అక్రమం. దర్యాప్తు చేస్తున్న అధికారి ఆరుమాసాల కాలపరిమితి పూర్తి కాకుండానే దర్యాప్తు కాలపరిమితిని పెంచమని కోరవచ్చు. ఈ నిబంధన అనివార్యంగా మేజిస్ట్రేట్స్ సమన్సు కేసుల్లో పాటించాలి. ఏ కేసులోనైతే రెండు సంవత్సరాలు కాని అంత కంటే తక్కువ గాని శిక్ష విధించడానికి అవకాశముందో ఆ కేసుని సమన్స్ కేసంటారు. దర్యాప్తు నిలిపివేయమని ఆదేశిస్తూ మేజిస్ట్రేట్ ఇచ్చిన ఉత్తర్వులపై సెషన్స్ కోర్టుకి వెళ్ళే అధికారం ప్రాసిక్యూషన్‌కి వుంది.

మామూలు పరిస్థితుల్లో ముద్దాయికి బెయిల్ లభించక పోయినప్పటికీ దర్యాప్తు పేరిట ముద్దాయి ఎక్కువ కాలం నిర్బంధంలో వుండకుండా చూడాలన్నదే, చట్టంయొక్క ఉద్దేశమని స్పష్టమవుతోంది. అలాంటిది పోలీసులు చట్టాన్ని దుర్వినియోగపరుస్తుండటంవల్ల ముద్దాయిలు అనేకసార్లు లాకప్‌ల్లోనే చట్ట విరుద్ధంగా శిక్షలకు గురవుతున్నారు. ఈ పరిస్థితిని దృష్టిలో వుంచుకొని న్యాయస్థానాలైనా ముద్దాయిలకి అనుకూలంగా ఆలోచించాల్సివుంటుంది.

# పోలీసు డైరీ

కోర్టులో సాక్ష్యం చెబుతున్న పోలీసు ఇన్‌స్పెక్టర్ శంకర్రావ్ ఏవో కాగితాలు తిరగేస్తున్నాడు. అసలు ఆయన ఆ కాగితాలు చూసే సాక్ష్యం చెబుతున్నాడంటే బాగుం టుందేమో. అదేమిటి, ఒక సాక్షిగా జరిగింది జరిగినట్లుగా చెప్పాల్సింది పోయి ఇలా రికార్డు చూసి సాక్ష్యం చెప్పడమేమిటి? వేరెవరో తయారుచేసిన రికార్డు ఆధారంగా ఆయన సాక్ష్యం చెబుతున్నాడని అనుకోడానికి ఆస్కారముంది గదా? అసలు ఆయనకి ఈ కేసుతో ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని సంబంధం లేకుండానే కేవలం నామ మాత్రపు సాక్షిగా ఉన్నందువల్ల అతను రికార్డు చూస్తూ సాక్ష్యం చెబుతున్నాడని కూడా అనుకోవచ్చు. ముద్దాయికి ఇది చాలా అన్యాయంగా ఉందనిపించింది. తన తరపునున్న ప్లీడర్ని సైగచేసి పిలిచి "ఏమిటి సార్ ఈ అన్యాయం" అని అడిగాడు. "నువ్వూరుకో నేను చూస్తాను గదా" అని చెప్పి ప్లీడరుగారు వెళ్ళి కూర్చుని ఊరకుండిపోయారు. ఇంకా ఇన్‌స్పెక్టర్‌గారు రికార్డు చూసే సాక్ష్యం చెబుతున్నారు. ముద్దాయికి వళ్ళు మండి పోయింది. విద్యార్థులు కాపీ కొట్టడం, బోనులో సాక్షి రికార్డుచూసి సాక్ష్యం చెప్పడం ఒకటేననిపించిందతనికి . అందుచేత ఈ విషయం కనీసం కోర్టు దృష్టికైనా తేవడం మంచిదనుకొని "అయ్యా ఈ ఇన్‌స్పెక్టరుగారు కాగితాలు చూసి సాక్ష్యం చెప్పడానికి వీల్లేద"ని కోర్టు వారికి విన్నవించుకున్నాడు. ఎందుకు వీల్లేదన్నట్లుగా చూశారు ఇన్‌స్పెక్టర్‌గారు. కేసు డైరీ చూసుకొని మర్చిపోయిన విషయాలు గుర్తు చేసుకుంటూ సాక్ష్యం చెప్పవచ్చునని మెజిస్ట్రేట్‌గారు చెప్పారు.

ఇలా కేసు డైరీలు, జనరల్‌డైరీలు చూసి సాక్ష్యం చెప్పే అధికారం సాక్షు లందరికీ ఉంటుందా? అది కేవలం దర్యాప్తు చేసే అధికారికి మాత్రమే పరిమితమా? అసలు కేసు డైరీ అంటే ఏమిటి? జనరల్‌డైరీ అంటే ఏమిటి? ఆయా డైరీల్లో వున్న విషయాల్ని కేసుకు అవసరమైన సాక్ష్యాధారాలుగా భావిస్తారా? ఏ మేరకు వాటిని కేసులో ఉపయోగించవచ్చు?

జనరల్ డైరీ

ప్రతి పోలీస్ స్టేషన్‌లోనూ జనరల్ డైరీ వ్రాస్తారు. ఈ డైరీలో పోలీస్‌స్టేషన్‌లో జరిగే కార్యక్రమాలనీ, సంఘటనలనీ ఎప్పటికప్పుడు రికార్డు చేస్తారు. ప్రతివిషయాన్ని అంటే కేవలం ఒక కేసుకే పరిమితం కాకుండా ఆ పోలీస్ స్టేషన్‌కు సంబంధించిన అన్ని విషయాలనీ ఎప్పటికప్పుడు ఇందులో వ్రాస్తారు కాబట్టి దీనిని జనరల్‌డైరీ (సాధారణ డైరీ) అంటారు. ఉదాహరణకి ఒక్కొక్కసారి కొందరు పోలీసులుడ్యూటీలో లేకుండానే ఎక్కడైనా ఏదైనా నేరం చేయవచ్చు. లేదా అధికార దుర్వినియోగానికి పాల్పడవచ్చు. లేదా తమకి వ్యక్తిగత కక్షలు ఉన్నవారిని తప్పుడు కేసులలో ఇరికించవచ్చు. అలాంటప్పుడు ఆ కేసు జరిగిన సమయంలో అసలు ఆ పోలీసు డ్యూటీలోనే లేరనడానికి జనరల్ డైరీ ఉపయోగపడుతుంది.

కేసు డైరీ

ఇహపోతే ప్రతికేసుకి పోలీసులొక డైరీ వ్రాస్తారు. ఈ డైరీలో ఆ కేసు రిజిస్టరైనప్పటినుంచి ఆ తర్వాత పోలీసులు జరిపే దర్యాప్తువివరాలన్నీ ఎప్పటికప్పుడు వ్రాస్తూ ఉంటారు. ఈ డైరీ ఏ కేసుకాకేసుకు సంబంధించి ప్రత్యేకంగా ఉంటుంది. కాబట్టి దీన్ని కేసు డైరీ అంటారు. ఇలా ఎప్పటికప్పుడు దర్యాప్తు వివరాలు వ్రాయడం వలన పోలీసు అధికార్లు తాము జరుపుతున్న దర్యాప్తు సజీవంగా ఉంచుకోగలుగుతారు. అంతేగాక ఏఏ సాక్ష్యాలు ముద్దాయికి వ్యతిరేకంగా కేసు రుజువు చేయడానికి ఉపయోగ పడతాయో తేల్చుకోడానికి ఉపయోగపడుతుంది. చార్జిషీటు దాఖలు చేయకముందు దర్యాప్తు ఏ దశలో ఉందో తేల్చుకొని తద్వారా ముద్దాయి రిమాండ్ కాలం పొడి గించాల్సిన అవసరముందా లేదానని మెజిస్ట్రేట్ నిర్ణయించుకోడానికి ఉపయోగపడు తుంది. అలాగే పోలీసులు కూడా కేవలం పోలీసుస్టేషన్‌లో కూర్చుని ముద్దాయి మీద కేసు తయారుచేయడాన్ని నిరోధిస్తుంది. అయితే ఈ ఉద్దేశ్యం ఆచరణలో నెరవేరడం లేదు. ఎందుకనంటే ఈ డైరీని కోర్టులో దాఖలు చేయరు కాబట్టి ఈ డైరీ కేవలం నామ మాత్రంగానే ఉండిపోతుంది. న్యాయంచేయడానికి ఒకవేళ అవసరమనుకుంటే మెజి స్ట్రేట్‌గారు డైరీ తెప్పించి చూడవచ్చు.

కేసుడైరీ అన్ని కేసుల్లోనూ దర్యాప్తు చేసే అధికారి తప్పనిసరిగా వ్రాయాల్సి వుంటుంది. చట్టబద్ధంగా వీట్ని వాడుకునేట్లయితే అవి కోర్టులకివ్వగలిగిన విలువైన సమాచారాన్ని ఈ డైరీ రాయని పక్షంలో అందివ్వలేకపోతాయి. ఈ డైరీ విడివిడి కాగితాల మీద వీలైనంత వరకు వ్రాయకుండా వుండటం మంచిది. ఒకవేళ అలా

వ్రాసినట్లయితే ప్రతి కాగితం మీద ఆ కేసు నెంబరు, కేసుకు సంబంధించిన వివరాలు వ్రాయాలి. డిపార్టుమెంటల్ ఎంక్వయిరీలో ఇలా డైరీ వ్రాయవలసిన అవసరంలేదు. పోలీసులు తీసుకునే పాకెట్ డైరీ, నోట్సులాంటిది ఈ పరిధిలోకి రావు. కేవలం పోలీసు శాఖవారు కేసు దర్యాప్తు చేసేప్పుడు మాత్రమే ఈ డైరీ వ్రాయాలి. ఈ కేసు డైరీలని పరిమితంగా మాత్రమే న్యాయస్థానాల్లో వాడుకోవచ్చు, పోలీసు అధికారి తను జరిపిన దర్యాప్తును గుర్తుచేసుకోడానికి కేసు డైరీ చూసి సాక్ష్యం చెప్పవచ్చు. కేసు డైరీ తయారు చేయకపోయినా చేయాల్సిన పద్ధతిలో చేయకపోయినా విరుద్ధంగా సాక్ష్యంలో ఉపయోగించుకోవచ్చు. అది తక్కువ స్థాయి సాక్ష్యంగా కోర్టు భావిస్తుంది. అయితే అసంపూర్తిగా ఉండే కేసు డైరీ పూర్తిగా విలువలేని సాక్ష్యం అవదు.

జనరల్ డైరీలో రోజువారీ వ్యవహారాలు ఎప్పటికప్పుడు వ్రాస్తుంటారు కాబట్టి ఆ డైరీలోని వివరాలను పెద్దగా అనుమానించడానికి వీలులేదని 1978లో సుప్రీంకోర్టు పేర్కొంది. ఒకవేళ ఈ డైరీలో వ్రాసే వివరాలు నమోదు చేయడానికి జాప్యం జరిగేట్లయితే ఇది అనుమానించదగిందిగా కోర్టు భావిస్తుంది.

కేసు డైరీలో దర్యాప్తు చేసే అధికారి ఏరోజు కారోజు దర్యాప్తు వివరాలు వ్రాస్తారు. ఏ సమయంలో సమాచారం అందింది, ఎప్పుడు తాను దర్యాప్తు ప్రారంభించింది, ఎప్పుడు దర్యాప్తు ముగించిందీ వ్రాస్తారు. దర్యాప్తులో భాగంగా ఏ ఏ స్థలాలను దర్శించిందీ తద్వారా ఏ పరిస్థితులని తాము నిర్ధారించిందీ వివరిస్తారు. ఈ కేసు డైరీలో సాక్షుల వాంగ్మూలాలేగాక నేరస్థలానికి సంబంధించిన ప్లాను తయారుచేసి అదికూడా అందులో పొందుపరుస్తారు. ఇంకా దర్యాప్తు చేసే అధికారి తయారుచేసిన ఇతర పత్రాలని రిపోర్టుల్నీ పై అధికార్లు గమనించిన విషయాల్ని కూడా ఈ డైరీలో వ్రాస్తారు.

సాక్ష్యంగా ఈ డైరీలను ఏ మేరకు ఉపయోగించవచ్చు? డైరీలో ఉన్న వివరాలు కేవలం ఒక రకమైన నోట్సు. వాటిని నిర్ధారించడానికి సాక్షుల్ని నేరుగా కోర్టులో విచారించాల్సి ఉంటుంది కాబట్టి ఇది నేరుగా సాక్ష్యము కాదు. నేరుగా సాక్ష్యానికి బలాన్ని చేకూర్చే ప్రత్యామ్నాయ సాక్ష్యంకూడా కాదు. కోర్టు తమ ముందుకొచ్చిన సాక్ష్యం ఆధారంగా ఈ డైరీలబట్టి ఒక నిర్ధారణకు రావడానికి వీలులేదు. అయితే నేరం జరిగిన వెంటనే వీలైనంత తొందరగా దర్యాప్తులో భాగంగా సాక్ష్యాల్ని రికార్డుచేస్తారు కాబట్టి ఈ డైరీలో వున్న విషయాల్ని ఆ తర్వాత కోర్టులో సాక్షి సాక్ష్యంచెప్పినప్పుడు ఏదైనా వైరుధ్యం ఏర్పడేట్లయితే ఆవైరుధ్యాన్ని దర్యాప్తుచేసే అధికారిని ప్రశ్నించడం ద్వారా పరిష్కరించవచ్చు. ఒక్కొక్కసారి మొదట సాక్షి పోలీసుల ముందు చెప్పిందానికి విరుద్ధంగా కోర్టులో సాక్ష్యం చెప్పవచ్చు.

# నేరం ఒప్పుదల

రాత్రి పన్నెండు కావస్తోంది. చీకటి కొట్టు తలుపులు కిర్రున చప్పుడు చేస్తూ తెరుచుకున్నాయి. ఆరడుగుల భీకరాకారం నల్లటి బూటుకాళ్ళతో అడుగుపెట్టింది. అది ఒక్క ఆకారమో లేక ఇంకా అనేక ఆకారాలో తేల్చుకోలేక లోపల బిక్కుబిక్కుమంటూ పడివున్న రాఘవులులేచి కళ్ళు నలుముకుంటూ చూసాడు. ఇంతలో అతని మొహంమీద చల్లటినీళ్ల విసురుగా పడ్డాయి. అసలే డిసెంబర్ నెల చలిలో కటికనేలమీద పడివున్న అతను ఈ నీటిదెబ్బకు తట్టుకోలేక "అమ్మా" అని అరిచాడు. "చీ నోర్మూయ్ లం.." అని మొదలుపెట్టి లోపలకు వచ్చిన భీకరాకారం ఇన్‌స్పెక్టర్ రూపమై నానాబూతులు తిట్టసాగాడు. "నాకేమీ తెలవదు నన్నొదిలెయ్యండి సామీ" అని ఇంతకుముందు చలిలో గడగడ వణికిన రాఘవులు భయంతో వణికిపోతూ అన్నాడు. ఇన్‌స్పెక్టర్ అతని జుట్టు పట్టుకొని చెత్తకుండీలోనుంచి పాతగుడ్డను లాగినట్టుగా పిడికిలి బిగించి అతని మొహంమీద ఒక గుద్దు గుద్దాడు. "చెప్పు లంజాకొడకా చెప్పు నేరం చేసానని చెప్పు" అంటూ అతన్ని జారవిడిచి బెల్టుతీసుకొని బాదసాగాడు ఇన్‌స్పెక్టర్. "బాబూ నన్నొదిలెయ్యండి, నాయనా నన్నొదిలెయ్యండి. నేను చచ్చిపోతాను, నేనే పాపం ఎరుగను" అని హృదయ విదారకంగా వేడుకుంటూ ఇక్కడా అక్కడా అని తేడాలేకుండా వంటిమీద అనేకచోట్ల పడుతున్న దెబ్బల్ని కాచుకోడానికి విఫలయత్నంచేస్తూ అన్నాడు రాఘవులు. "నిన్నొదలంరా పోలీసుస్టేషనంటే ఏమిటనుకున్నావు. నీతో నేరం ఒప్పించందే నిన్ను చావనిచ్చేది కూడా లేదు ఒప్పుకో ఒప్పుకో ఒప్పుకుంటే నీకే దెబ్బలు తప్పుతాయి" అని చెప్పాడు అక్కడికొచ్చిన హెడ్. చేయని నేరాన్ని ఒప్పుకొని జైలుకెళ్ళడమా ? ఒప్పుకోకుండా ఈ లాకప్ నరకాన్ని అనుభవించడమా అన్నది సమస్య అయి ఘనీభవించింది లాకప్‌జీవికి. అప్పటికతను పోలీసు లాకప్‌లో ఉండబట్టి ఎన్నాళ్ళయిందో గుర్తులేదతనికి. ఆ తర్వాత పోలీసులతనికి రోకలిబండ లెక్కించారు. తిట్టినతిట్టు తిట్టకుండా పోలీసులు తప్ప ఇంకా ఎవ్వరూ కుయ్యలేని కూతలన్నీ కూసారు. అక్కడక్కడా దెబ్బలతో చిట్లిపోయి పుండ్లుపడ్డ వంటిమీద బ్రాందిపోసారు. ఆ మంటకి తట్టుకోలేక అతనరుస్తూంటే "ఉండుండు ఈ ట్రీట్‌మెంట్ అయిపోయాక బ్రాందీ పోయిస్తాం" అని వ్యంగ్యంగా ఓదార్పుగా మాట్లాడుతున్నట్లున్నారు. ఈ పోలీసుబాధలు భరించలేక అతను నేరం ఒప్పుకుంటానన్నాడు. తనకేమాత్రం తెలవని దోపిడీతో తనకు సంబంధంవుందని తానొక గజదొంగనని ఒప్పుకున్నాడు. అప్పుడు పోలీసులు సంతృప్తిపడి అతన్ని కొట్టడం మానేసారు. అతనివంటిమీద దెబ్బలు మానిపోయేవరకూ లాకప్‌లోనే ఉంచి ఆ తర్వాత తీసుకెళ్ళి కోర్టులో హాజరుపర్చారు. రాఘవులు కోర్టులో

తానేపాపం చేయలేదని తనకే నేరంతోటి సంబంధంలేదని చెప్పుకున్నాడు. పోలీసుల ముందు నేరం ఆమోదించి కోర్టులో నేరం ఆమోదించకపోతే నిందితుడికేమైనా లాభం చేకూరుతుందా ? పోలీసులముందు నేరం ఒప్పుకోవడం అనేది కోర్టులో నేరం ఒప్పుకోవడంతో సమానమా ?

సాధారణంగా చాలా కేసుల్లో పోలీసులు ముద్దాయి నేరం ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా తమముందు నేరం చేసినట్లు ఆమోదించాడని కేసు రికార్డుల్లో వ్రాసుకుంటారు. దీన్నిచూసి పెద్దగా కంగారు పడాల్సిన అవసరంలేదు. పోలీసులముందు ఒప్పుకున్నా కోర్టులో గనుక నేరం చేయనట్లు చెబితే కేసు విచారణ సాగుతుంది. అంతకుముందు పోలీసులముందు ఏదైనా ఒప్పుదల ఉన్నప్పటికి దాన్ని కోర్టు పరిగణనలోకి తీసుకోదు. అంటే పోలీసుల ముందు నేరస్తుడనని ఆమోదించడం ఒప్పుదలగా భావించబడదు. అయితే ఈ సాధారణ నియమానికి ఒక మినహాయింపు ఉంది. ఈ విషయం ముందు వ్యాసాల్లో వివరించడం జరిగింది. కేవలం పోలీసుల ముందు నేరం ఆమోదించినప్పుడు ఆ ఒప్పుదల ఆధారంగా కేసుకు సంబంధించిన ఏవైనా వస్తువులు స్వాధీనపర్చుకోగలిగితే ఆ స్వాధీనం మేరకు మాత్రమే ఒప్పుదలని కోర్టు పరిగణనలోకి తీసుకొంటుంది. ఈ విషయంలో న్యాయస్థానాలు చాలాజాగ్రత్తగా వ్యవహరించాలి. చాలా అరుదుగా మాత్రమే ముద్దాయిలు కోర్టులోనేరాన్ని ఆమోదిస్తారు. మరలాంటప్పుడు పోలీసుస్టేషన్‌లో ప్రతికేసులోనూ ప్రతిముద్దాయి నేరాన్ని ఆమోదిస్తున్నాడంటే అది కేవలం బూటకమైనా అయివుండాలి. లేదా చిత్రహింసలకు గురికావడం వల్లనైనా ఉండాలి. అంటే మౌలికంగా ముద్దాయి పోలీసుల ముందేమి ఒప్పుకోలేదన్న ఉద్దేశంతో మొదలై ఆ తర్వాత పోలీసులుతీసుకువచ్చే సాక్ష్యాధారాలను బట్టి కోర్టు ఒక విరుద్ధమైన నిర్ణయానికి రాగలిగితే తప్ప పోలీసుల ముందు నేరం ఆమోదించాడని అనుకోడానికి వీల్లేదు.

మరే ఇతర పరిస్థితుల్లోనూ పోలీసులముందు జరిగే ఒప్పుదల ఒప్పుదలకాదు. కోర్టులో ఏ ప్రమేయమూ ప్రోద్బలమూ లేకుండా ముద్దాయి తనకు తానుగా స్వతఃసిద్ధంగా నేరాన్ని ఆమోదించినప్పుడు కోర్టు చట్టంలో పేర్కొన్న పద్ధతిలో ఆ ఒప్పుదలను రికార్డు చేస్తేనే ఒప్పుదలగా భావిస్తారు. ఒక్కోసారి పోలీసుస్టేషన్‌లోనే గాక కోర్టుల్లోకూడా ముద్దాయితో నేరాన్ని ఒప్పించడానికి గానూ అరెస్టుచేసినప్పుడు శిక్షించే ప్రమాదంవుంది. ఈ విషయాన్ని కూడా కోర్టు దృష్టిలో ఉంచుకొని ఒప్పుదలను రికార్డు చేసేప్పుడు దగ్గరలో పోలీసు లెవరిని ఉండనివ్వకుండా చూడాల్సిన అవసరముంది అంతేగాక ముద్దాయిలో అజ్ఞాతంగా పేరుకొనిపోయే భయాలేమైనావుంటే వాటిని వెలికితీయడానికి ప్రయత్నించడం అవసరం. అంతకుముందు ముద్దాయేమైనా హింసలకు గురైఉన్నాడేమో

తేల్చుకోవడానికి ముద్దాయి చెప్పుకోకపోయినప్పటికీ మేజిస్ట్రేటుగారు అతన్ని వైద్య పరీక్షకి పంపాల్సిన అవసరంవుంది. ఇలా చెయ్యడంవల్ల కోర్టు ముద్దాయిలకి అత్యంత ఆత్మీయంగా మెలిగినట్లు అవుతుంది. ముద్దాయికి కూడా న్యాయస్థానాలంటే పోలీసుస్టేషన్లు కాదని అనిపిస్తుంది. అప్పుడు తను తన మనస్సులో ఉన్న విషయాల్ని స్వేచ్ఛగా స్వతంత్రంగా బయటికి చెప్పుకోగలుగుతాడు. వైద్యపరీక్షలో ముద్దాయికి ఏమైనా దెబ్బలు తగిలినట్లు దాఖలాలువుంటే కోర్టుకూడా ముద్దాయి అంతకుముందు అనుభవించిన హింసకారణంగా బలవంతంగా వాంగ్మూలం ఇస్తున్నాడని నిర్ధారణ చేసుకోవడానికి వీలవుతుంది. క్రిమినల్ లా లో కోర్టులకి విస్తృత అధికారాలున్నాయి. న్యాయశాస్త్రాలు ఈ అధికారాలని వీలైనంతవరకూ నిందితులకి న్యాయం చెయ్యడానికి వీలుగా ఉపయోగించాలి. అందులో ముఖ్యంగా నేరం ఒప్పుదల విషయంలో కోర్టులు అన్ని జాగ్రత్తలూ తీసుకోవాలి. లేకపోతే అన్యాయంగా ఏ నేరం చెయ్యనివాళ్ళుకూడా శిక్షింపబడే ప్రమాదం ఉంది.

పోలీసుస్టేషన్లో నేరం ఒప్పుకుంటే అది న్యాయస్థానంలో ఒప్పుకోవడంతో సమానం కానప్పుడు మరి పోలీసులు ఎందుకు నిందితుల్ని అన్యాయంగా హింసిస్తున్నట్లు? నిందితుడు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా తప్పుడు కేసు బనాయించడానికి వాళ్ళకి కావల్సినన్ని అధికారాలు, హంగులూ ఉన్నాయికదా? అన్న అనుమానాలు కలగవచ్చు: వీలైతే హింసకి తట్టుకోలేక ఎవరైనా బలవంతంగా నేరం చేశానని ఒప్పుకుంటే అతని చేత ఆ మాట మేజిస్ట్రేట్ ముందుకూడా ఒప్పించడానికి ప్రయత్నిస్తారు. లేదంటే హింసించి పరోక్షంగా నిందితుణ్ణి శిక్షించామన్న తృప్తి అయినా మిగుల్చుకుంటారు. అంతేకాక పోలీసులు కోర్టుచుట్టూ తిప్పడమే శిక్షగా భావిస్తారు కాబట్టి అతనిమీద కేసుకూడా బనాయిస్తారు. కొన్నిసార్లు సాక్షుల స్టేట్‌మెంట్స్‌కూడా మేజిస్ట్రేట్ రికార్డు చేస్తారు.

## నేరం ఒప్పుదల-వాంగ్మూలం రికార్డు

పోలీసులు ముద్దాయిని కోర్టు హాలులోకి ప్రవేశపెట్టారు. "జాగ్రత్త నేరం ఒప్పుకోకపోతే ప్రాణాలు తీసేస్తాం" అని నెమ్మదిగా హెచ్చరించారు భయంతో ముద్దాయి నిలువునా వణికిపోయాడు. ఒక కానిస్టేబుల్ కోర్టుబైట కిటికీ దగ్గర నిల్చొని కోర్టు హాలులో వున్న ముద్దాయికేసి గుర్రుగా చూస్తున్నాడు. ఇన్‌స్పెక్టర్‌గారేవో కాగితాలు తీసుకొని బెంచిక్లర్కు కిచ్చారు. బెంచిక్లర్కు నుంచి కాగితాలు తీసుకొని చూసి మేజిస్ట్రేటుగారు "నువ్వు నేరం ఒప్పుకోదల్చుకున్నావా" అని ప్రశ్నించారు. ముద్దాయి

అవుననిగాని కాదనిగాని అనలేదు. కిటికీ దగ్గరున్న కానిస్టేబుల్ మాత్రం ఒప్పుకో మన్నట్లు సైగచేసి లేకపోతే నీ అంతుచూస్తామన్నట్లుగా చూస్తూ లాఠీ చూపించి బెది రించారు. అంతకుముందు ఎన్నెన్నో చీకటిరాత్రిళ్ళు, పగలు తనకు తెలియకుండానే గడిచిపోయినందువల్ల ఒళ్ళంతా పచ్చిపుండులా చేయగలిగిన పోలీసుల ప్రతాపం ఎరి గుండటంవల్ల ముద్దాయి "ఔను నేరం ఒప్పుకుంటున్నాను" అన్నాడు. ఇదేమీ గమ నించని మెజిస్ట్రేటుగారు "నువ్వునేరాన్ని ఒప్పుకోవడంవలన శిక్షించబడే అవకాశముంది తెలుసా" అని అడిగారు. 'తెలుసు' అని చెప్పాడతను. "నువ్వెవరిబలవంతం మీదనైనా ఎవరి ప్రోద్బలం వల్లనైనా ఎవరైనా బెదిరించడంవల్లనైనా నేరం ఒప్పుకుంటున్నావా" అనడిగారు మెజిస్ట్రేటుగారు. ముద్దాయి దిక్కులు చూసాడు. కిటికీ దగ్గర కానిస్టేబులు అలాగే గుర్రుగా చూశాడు. తీసుకువచ్చిన పోలీసులు కూడా కోపంతో పళ్ళుకొరికారు. "ఏమంటావ్" అని రెట్టించారు మెజిస్ట్రేట్‌గారు. "లేదు. నా అంతటనేనే స్వయంగా చెబు తున్నాను" అని చెప్పాడతను. తర్వాత ముద్దాయి తానంతకు ముందు శంకర్రావనే వ్యక్తిని హత్యచేసినట్లుగా ఒప్పుకున్నాడు. ఈ ఒప్పుదల ప్రశ్నలు జవాబుల పరం పరంలో మొత్తం నేరానికి సంబంధించిన సవివరమైన కథనంతో కూడుకొని వుంది.

ఇది సాధారణంగా మనందరికీ తెలిసిన నేరం ఒప్పుదల. ఈ ఒప్పుదల స్వేచ్ఛా స్వంతంత్రాలు, ఇష్టాయిష్టాలతో ప్రమేయంలేదు. చాలాసార్లు ఏ మాత్రం నిజంతో సంబంధం లేకుండా అబద్ధాన్నే నిజంగా ఒప్పుకోవడం మనం చూస్తున్నాం. నేరం చేసినట్లుగా స్వేచ్ఛగా ఆమోదించాలంటే నేరస్థుడి మానసిక పరివర్తన అవసరం. ఏ హింసో భయాలో కారణమైనందువల్ల నేరం ఒప్పుకోవడం జరిగిందంటే నిర్దోషిని కూడా నేరస్థుడిగా మారుస్తున్నామన్న మాట.

సెక్షన్ 164 సిఆర్‌పిసిలో నిందితుడు నుంచి సాక్షులు నుంచి వాంగ్మూలం తీసుకోవలసిన పద్ధతిని గూర్చి పేర్కొనడం జరిగింది. నేరం ఆమోదానికి సంబంధించి ఎన్ని జాగ్రత్తలెలా తీసుకోవాలో అన్ని జాగ్రత్తలు తీసుకోడానికికావలసిన ప్రయత్నం జరిగింది. ఈ సెక్షన్‌లో పేర్కొన్నట్లుగా మెజిస్ట్రేటు వాంగ్మూలాన్ని రికార్డు చేయ నప్పుడు ఆ స్టేట్‌మెంట్ పనికిరాకుండా పోతుంది. దీన్ని సాక్ష్యంగా ఉపయోగించ డానికి ఏ మాత్రం వీలుండదు.

ఈ చట్టంక్రింద జ్యుడిషియల్ మెజిస్ట్రేట్. మెట్రోపాలిటన్ మెజిస్ట్రేట్‌లు మాత్రమే స్టేట్‌మెంట్స్ రికార్డు చేయడానికి అర్హులు. ఏ కేసులోనైతే స్టేట్‌మెంట్స్ రికార్డు చేస్తున్నారో ఆ కేసు ఆ మెజిస్ట్రేటు పరిధిలోనిదై ఉండాల్సిన అవసరం లేదు. అంటే ఏ కేసులోనైనా మెజిస్ట్రేటుకి నేరం ఒప్పుదలకి సంబంధించిగాని మరేరకమైన స్టేట్‌మెంట్‌గాని రికార్డుచేసే అధికారముందని స్పష్టమౌతోంది. అయితే కొన్ని న్యాయ

సూత్రాల ననుసరించి సాధారణంగా కేసు విచారణ జరిపే హక్కున్న మెజిస్ట్రేటు నేరం ఒప్పుదలను రికార్డు చేయడం సరయిందికాదు. ఒకసారి ఒప్పుదల రికార్డు చేసారంటే ఆ తర్వాత మెజిస్ట్రేట్ ఈ కేసులో సాక్షిగా మారుతారు. ఒకే కేసులో విచారణ జరిపే న్యాయమూర్తే ఆ కేసులో సాక్షి అవడంవలన న్యాయం చేస్తారన్న విశ్వాసం సన్నగిల్లుతుంది. అందుకని నేరం ఒప్పుదల, సాక్షుల వాంగ్మూలాన్ని రికార్డుచేసే మెజిస్ట్రేట్ ఆ కేసు విచారణ జరపడం సరయిందికాదు. ఈ చట్టంక్రింద పోలీసు అధికారి ఏ పరిస్థితిలోనూ నేరం ఒప్పుదలని రికార్డు చేయడానికి వీలులేదు. ఒకవేళ రికార్డు చేసినా అది భారత సాక్ష్యచట్టం క్రింద చెల్లనేరదు. దానికెలాంటి విలువాలేదు. కొన్ని కేసుల్లో మెజిస్ట్రేట్ స్వయంగా దర్యాప్తు చేసే అవకాశం ఉంది. అలాంటప్పుడు ఆయనముందు నేరం ఒప్పుకొనేట్లయితే అది ఒప్పుదలగా భావించబడుతుంది.

సెక్షన్ 164 క్రింద కేవలం ముద్దాయిలనుంచి మాత్రమే నేరం ఒప్పుదల రికార్డు చేయడం మాత్రంగాక సాక్షుల వాంగ్మూలం కూడా రికార్డుచేసే అధికారం మెజిస్ట్రేట్ కుంది. కొన్నిసార్లు కేసుల్లో సాక్ష్యులు నేరం జరిగిన వెంటనే చెప్పే విషయం ఒకటి. ఆ తర్వాత కోర్టులో మొదట చెప్పిందాన్ని బదలాయించేసి పూర్తి విరుద్ధంగా చెబుతుంటారు. ముఖ్యంగా మానభంగం కేసుల్లో మానభంగానికి గురైన స్త్రీ పోలీసు రిపోర్టులో చెప్పే విషయం ఒకటిగా ఉంటుంది. ఆ తర్వాత ఆమె ప్రవర్తన మంచిది కాదని అంతకుముందే చాలామందితో తిరిగేదని రకరకాల పుకార్లు సాధారణంగా పుడుతూ వుంటాయి. అంతేగాక ఆమె నెరుగున్న వాళ్లు, భర్త, కుటుంబసభ్యులు "ఎందు కొచ్చిన గొడవ జరిగిన అవమానంతో కృంగిపోతుంటే ఈ కేసులూ అవీ" అని రకరకాల మాటలతో ఆ స్త్రీని కృంగదీస్తారు. ఈ బాధ తట్టుకోలేక తన మీద వచ్చిన రకరకాల పుకార్లని అబద్ధం చేయడానికి ఆ స్త్రీ కోర్టులో తాను మానభంగానికే గురి కాలేదని చెప్పినా ఆశ్చర్యపోవాల్సిందేమీలేదు. ఇలా చేసినప్పటికి కూడా వాస్తవానికి ఆమె మచ్చ మాసిపోదు. అసలది మచ్చనుకోవడమే అర్థంలేనిమాట. నిర్భయంగా కోర్టులో సాక్ష్యంచెప్పి నేరస్తులకు శిక్షవేయించగలితేనే ఆమె ఈ సమస్యను ధైర్యంగా ఎదుర్కొండమౌతుంది. ఈ బాధ్యత కేవలం అన్యాయానికి గురైనవాళ్ళకి మాత్రమే గాకుండా చట్టానికి న్యాయస్థానాలకు కూడా వుంది. అందుకనే మెజిస్ట్రేట్‌కి సాక్షుల వాంగ్మూలం రికార్డుచేసే అధికారం వుంది. ఇలా సాక్షుల స్టేట్‌మెంట్ మెజిస్ట్రేట్ రికార్డు చేసిన తర్వాత సాక్షి బదలాయించినట్లయితే అది శిక్షార్హమైన నేరమౌతుంది.

నేరం ఒప్పుదలకు సంబంధించిన విషయాన్నేగాకుండా ముద్దాయి చెప్పే ఏ విషయాన్నయినా మెజిస్ట్రేట్ ఈ చట్ట ప్రకారం రికార్డు చేసుకోవాలి. అది ఒప్పుదల కానంతవరకు మెజిస్ట్రేట్, ముద్దాయి చెప్పే విషయాన్ని మామూలు సాక్ష్యం రికార్డు చేసు

కున్నట్లుగానే చేసుకుంటారు. ముద్దాయి ఒప్పుదలగాకుండా సాధారణంగా చెప్పే ఏ విషయాన్నయినా అతనికి వ్యతిరేకంగాగాని ఆకేసులోని వేరేముద్దాయిలకు వ్యతిరేకంగా గాని వాడుకోడానికి వీలులేదు. ఈ చట్టం క్రింద ముద్దాయి నేరం ఒప్పుకొనేట్లయితే దాని ఆధారంగా అతన్ని శిక్షించవచ్చు. అయితే ఒప్పుదలకుండే బలమెప్పుడూ ఆ కేసుకు సంబంధించిన విషయాలపైన పరిస్థితుల పైనా ఆధారపడివుంటుంది. కేవలం ముద్దాయి నేరం ఆమోదించిన దాన్ని ఆధారంగా చేసుకుని అతన్ని శిక్షించరు. అతను ఆమోదించిన విషయానికి బలం చేకూర్చే మరే ఇతర సాక్ష్యాధారాలనుబట్టి ఒప్పుదలకు బలమేర్పడుతుంది. నేరం ఒప్పుదలకు సంబంధించి మెజిస్ట్రేట్ రికార్డు చేసే పద్ధతిలో ఏమైనా లోపాలుండేట్లయితే ఆ ఒప్పుందాలను పరిగణలోనికి తీసుకోరు.

మెజిస్ట్రేట్ ముందు నిందితుడు నేరం ఒప్పుకునేట్లయితే అది సెక్షన్ 164 సి ఆర్ పి సి క్రింద కేసు దర్యాప్తు జరుగుతున్నప్పుడుగాని కోర్టులో కేసు విచారణ జరగడానికి ముందుగాని రికార్డు చేస్తారు. అంటే కేసు విచారణ జరుగుతుండగా ముద్దాయి నేరం ఒప్పుకునేట్లయితే అది సెక్షన్ పరిధిలోకి రాదు. ఒక్కోసారి నేరం ఒక ప్రాంతంలో జరిగి ముద్దాయి మరోచోట అరెస్టయినపుడు అతను అరెస్టయిన ప్రాంతంలోని మెజిస్ట్రేటు ముందు నేరం ఒప్పుకోవచ్చు. ఇలా జరిగిన పక్షంలో కేసు దర్యాప్తులో భాగంగానే నిందితుడి నేరాన్ని ఆమోదించడంగా భావిస్తారు. కొన్నిసార్లు కేసులో ఛార్జిషీటు దాఖలు చేసినప్పటికి మెజిస్టీరియల్ విచారణలో ముద్దాయి నేరాన్ని ఆమోదిస్తే అదిచట్టం పరిధిలో ఒప్పుదలే అవుతుంది. అలాగే ఇద్దరు ముద్దాయిలున్న కేసులో అరెస్టయిన ఒక ముద్దాయికి సంబంధించి పోలీసులు దర్యాప్తు పూర్తిచేసి ఛార్జిషీటు దాఖలు చేసినందువల్ల కోర్టులో విచారణ జరుగుతుండగా అదే కేసులోని మరో ముద్దాయి అరెస్టయి మెజిస్ట్రేట్ ముందర నేరం ఒప్పుకునేట్టయితే అది నేరాన్ని ఆమోదించినట్లవుతుందా? అన్న అనుమానం కలగవచ్చు. నిస్సందేహంగా అది ఒప్పుదలే అవుతుంది. ఎందుచేతంటే రెండో ముద్దాయికి సంబంధించి నంతవరకు అతను అరెస్టు కాలేదు. కాబట్టి కేసులో ఇంకా దర్యాప్తు పూర్తి కాలేదు.

## స్వేచ్ఛందమైన ఒప్పుదల - ఒత్తిడివలన ఒప్పుదల

నేరం ఒప్పుదల రికార్డు చేసేటప్పుడు కానీ విచారణకు ముందు సాక్షుల వాంగ్మూలం రికార్డుచేసేటప్పుడు గానీ మెజిస్ట్రేట్ తప్పనిసరిగా చట్టం నిర్దేశించిన పద్ధతి నవలంబించాలి. వీలైనంతవరకు నిందితులుకాని, సాక్షులుకాని చెప్పే విషయాన్ని వారు చెప్పే భాషలోనే వ్రాయాలి కాని తరచు మెజిస్ట్రేట్లు విషయాన్ని తమ భాషలోనే వ్రాస్తూ ఉండటం జరుగుతోంది. నేరం ఒప్పుకొన్నపుడు అది మెజిస్ట్రేట్

రికార్డు చేసిన తర్వాత దానిపైన ముద్దాయి సంతకం తీసుకోవాలి. అలా తీసుకోనప్పుడు ఆ వాంగ్మూలాన్ని స్వచ్ఛందంగా ఇచ్చినట్లుగా కోర్టు భావించదు. కాని ముద్దాయి ఆ తర్వాత కోర్టులో తాను అంతకు ముందు మెజిస్ట్రేట్ సమక్షంలో నేరం అమోదించినట్లు ఒప్పుకొనేట్లయితే మెజిస్ట్రేట్ రికార్డుచేసిన ఒప్పుదలమీద ముద్దాయి సంతకం లేకపోయి నప్పటికీ కోర్టు విశ్వసిస్తుంది. మెజిస్ట్రేట్ ముందు నేరం అమోదించిన తర్వాత సంతకం చేయడానికి నిరాకరించేట్లయితే అతను నేరానికి పాల్పడ్డట్లు కాదు. మెజిస్ట్రేట్ అతని వాంగ్మూలం రికార్డు చేసినప్పటికీ దాన్ని కోర్టు విశ్వసించదు. నేరం ఒప్పుదల రికార్డు చేసేప్పుడు మెజిస్ట్రేట్ ముద్దాయిని అనేక రకాలుగా ప్రశ్నించి జవాబులు రాబట్టుకోవాలి. ఈ ప్రశ్నలన్నీ నిందితుడు ఎవరి ప్రోద్బలమో, ప్రమేయమో, భయమో కారణంగా నేరం అమోదిస్తున్నాడో తెల్చుకోడానికిగాను ఉద్దేశించబడాలి. ఇలా ప్రశ్నించిన తర్వాత ముద్దాయి తనకు తానే నేరాన్ని ఒప్పుకుంటున్నట్లు భావించినపుడే మెజిస్ట్రేట్ ఒప్పుదల రికార్డు చేస్తారు. నేరం ఒప్పుదల ఆదివారాల్లోనూ సెలవుదినాల్లోనూ రికార్డు చేయటానికి వీల్లేదన్న అభిప్రాయం చాలా మందికి ఉంది. మెజిస్ట్రేట్ విధులు ఇరవై నాలుగు గంటలూ వుంటాయి. అందుకని అతనెప్పుడైనా సరే సెలవుదినాల్లో కూడా స్టేట్‌మెంట్లు, కన్‌ఫెషన్సూ (నేరం ఆమోదించడం) రికార్డు చేయవచ్చు. సెలవు దినాల్లో నేరం ఒప్పుదల రికార్డు చేస్తే అది సక్రమంగానే భావిస్తారు. నిందితుడు నేరం ఆమో దించినప్పుడు మెజిస్ట్రేట్ ఆ ఆమోదాన్ని కోర్టు హాల్లోనే కోర్టు సమయంలోనే రికార్డు చేయాలి. ఏ కారణంచేతైనా అలా రికార్డు చేయటం కుదరనప్పుడు దానికిగల కారణాల్ని ప్రాసిక్యూషన్ వివరించాలి. నిందితుడు నేరం ఒప్పుకుంటు న్నప్పుడు మెజిస్ట్రేట్ కాక అతన్ని ఎవరూ ప్రశ్నించడానికి వీల్లేదు. మెజిస్ట్రేట్ కేసు డైరీ పరిశీలించి దాని ఆధారంగా ముద్దాయిని ప్రశ్నించి ముద్దాయిచ్చిన సమాధానాలు రికార్డు చేసేట్లయితే అది ఒప్పుదలగా భావించరు. ఇలా స్టేట్‌మెంట్స్ కాని, నేరం ఒప్పుదల కాని రికార్డు చేసిన తర్వాత దాన్ని వెంటనే ఏ కోర్టులోనైతే ఆ కేసు విచారణ జరుగుతుందో ఆ కోర్టుకు పంపిస్తారు.

నిందితుడు మెజిస్ట్రేట్ ముందు నేరం ఒప్పుకోదల్చినప్పుడు మెజిస్ట్రేట్ అత నికి అలా నేరం ఒప్పుకోవలసిన అవసరంలేదని స్పష్టం చేయాలి. ఒకవేళ నిందితుడు నేరం ఆమోదించేట్లయితే అతనలా నేరం ఆమోదించిన పక్షంలో ఆ ఒప్పుదలని అతనికి వ్యతిరేకమైన సాక్ష్యంగా ఉపయోగించుకుంటారని మెజిస్ట్రేట్ వివరించాలి. ఈ రకంగా ముద్దాయికి వివరించినట్లుగా మెజిస్ట్రేట్ స్టేట్‌మెంట్ రికార్డు చేయడానికి ముందు వ్రాయాలి. మెజిస్ట్రేట్ వివరించలేదని ముద్దాయి నేరం స్వచ్ఛందంగా ఆమోదించ లేదని కోర్టు భావించినప్పుడుగాని, అనుమానించినపుడు గాని ఆ ఒప్పుదలని కోర్టు

నేరం ఆమోదంగా భావించదు.

ముద్దాయి తన ఇష్టానుసారంగా స్వచ్ఛందంగా నేరాన్ని ఆమోదించినప్పుడే అది ఒప్పుదలగా భావిస్తారు. ఇలా స్వచ్ఛందంగా నిందితుడు నేరం చేసినట్లు ఒప్పుకున్నట్లుగా మెజిస్ట్రేట్ భావించినప్పుడే ఆ వాంగ్మూలాన్ని రికార్డు చేస్తారు స్టేట్‌మెంట్ రికార్డు చేసే ముందు మెజిస్ట్రేట్ అతన్ని ప్రశ్నించి స్వచ్ఛందంగా చెబుతోంది, లేనిది తెలుసుకోవాలి.

పోలీసు స్టేషన్లో పోలీసులు తనని నేరం చేసినట్లుగా ఒప్పుకొమ్మని హింసించారని నిందితుడు ఆరోపించేట్లయితే మెజిస్ట్రేట్ ఆ ఆరోపణ ఆధారంగా అతన్ని వైద్య పరీక్షకు పంపించాలి. అంతేగాక మెజిస్ట్రేట్ వాంగ్మూలం రికార్డు చేసేటప్పుడు ముద్దాయి ఎవరి కస్టడీలో ఉన్నాడు అతను మొట్టమొదటిసారి ఎవరి ముందు తాను నేరం చేసినట్లు ఆమోదించనున్నట్లుగా చెప్పాడో తెలుసుకొని రికార్డు చేయాలి. పోలీసుల సమక్షంలో మెజిస్ట్రేట్ నేరం ఒప్పుదలను రికార్డు చేయడం సరయిందికాదు. ఒకోసారి అవసరమనుకుంటే మెజిస్ట్రేట్ నిందితుల్లో ఏర్పడిన భయాన్ని, మరొక ప్రోద్బలమేదైనా ఉందనుకుంటే ఆ ప్రోద్బలాన్ని దూరం చేయడానికి కొంత కాలం జాప్యం చేసిన మీదట ఒప్పుదల రికార్డు చేయాలి.

ఈ చట్టం క్రింద సాక్షుల వాంగ్మూలాన్ని రికార్డు చేసేప్పుడు అతను స్వచ్ఛందంగా చెబుతున్నాడో లేదో కూడా తెలుసుకోవాలి. కొన్నిసార్లు పోలీసులు సాక్షి గనుక న్యాయస్థానంలో సాక్ష్యం చెప్పేప్పుడు బదలాయిస్తారని అభిప్రాయ పడతారు. అలాగే కొందరు సాక్షుల్ని నిందితులు భయాన్నో, భక్తినో లొంగదీసుకునే అవకాశముందని పోలీసులు భావిస్తారు. అలాంటప్పుడు పోలీసులు వారి సాక్ష్యాన్ని మెజిస్ట్రేట్‌చేత కేసు విచారణ జరగడానికి ముందే రికార్డు చేయిస్తారు. ఈ విషయంలో కూడా మెజిస్ట్రేట్ తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

పోలీసు కస్టడీ నుంచి ముద్దాయిని మెజిస్ట్రేట్ ముందు హాజరు పర్చినతర్వాత నేరం ఒప్పుదల రికార్డు చేయదలచేట్లయితే తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. అంతేగాక న్యాయస్థానాలు వీలైనంతవరకు ఆ ఒప్పుదలని గూర్చి సహేతుకంగా ఆలోచించిన మీదటే ఒక నిర్ణయానికి రావాలి. అలాగే నేరం ఆమోదించిన తర్వాత ముద్దాయిని గనుక పోలీసు కస్టడీకి పంపేట్లయితే ఆ ఒప్పుదలని అనుమానాస్పదమైనదిగా భావించాలి.

ఒక కేసులో ఇద్దరు నిందితులున్నపుడు అందులో ఒకరు నేరం గనుక ఒప్పుకునేట్లయితే ఆ నేరంలో తనుపాలు పంచుకోడం గురించి చెప్పినప్పుడు మిగతా ముద్దాయి విషయంలో ఆ ఒప్పుదలని సాక్ష్యంగా భావిస్తారు.

# ఛార్జిషీట్

ఛార్జిషీట్ అంటే పోలీసుల కట్టుకథ. చార్జిషీట్ దాఖలు చేయడమంటే నిందితుణ్ణి కోర్టు చుట్టూ తిప్పడానికి పోలీసులు విధించే శిక్ష అని మనలో చార్జిషీట్‌ను గురించి రకరకాల అభిప్రాయాలున్నాయి. ఈ అభిప్రాయా లేర్పడటానికి పోలీసు లవలంబిస్తున్న విధానాలే కారణం. పోలీసులు పెట్టిన కేసులు కోర్టులో సాధారణంగా రుజువుకావు. నిందితుడి మీద నేరం రుజువుకావడమనేది ఒక్క మినహాయింపు మాత్రమే. అలాంటప్పుడు సాధారణంగా పోలీసులు పెట్టే కేసులు కేవలం కట్టు కథలు, పూర్తిగా కల్పితం అనే అభిప్రాయం ఏర్పడుతుంది. ఒక్కోసారి పోలీసులు పెట్టే కేసుకి ఆ తరువాత కోర్టులో జరిగే తతంగానికి ఏ మాత్రం సంబంధం లేకుండావుంటుంది. పోలీసు కేసులో ముద్దాయి నేరంచేసినట్లు, ఒప్పుకొన్నట్లు వ్రాస్తారు. సాక్షి తానుముద్దాయి నేరం చేస్తుండగా స్వయంగాచూశానని చెప్పినట్లు రాస్తారు. కానీ కోర్టులో కేసు నడుస్తుండగా ముద్దాయి నేరం ఒప్పుకోడు. కనీసం పోలీసుల ముందర తాను ఒప్పు కున్నట్లుగా కూడా అతను ఆమోదించడు. సాక్షులు కూడా తాము ప్రత్యక్షంగా నిందితుడు నేరం చేస్తుండగా చూసినట్లు చెప్పరు. పోలీసుల ముందు అలా చెప్పినట్లుగా కూడా ఒప్పుకోరు. ఇలా జరిగినపుడు పోలీసు కేసుకి, కోర్టులో నడుస్తున్న కేసుకి అసలు సంబంధం లేదని తేటతెల్లమౌతుంది.

కొన్ని సార్లు నేరం జరిగినపుడు నేరంజరుగుతుండగా చూసినా చూడకపోయినా ఆ నేరానికి గురైన వారి సమీప బంధువులు ఏ ఆధారం లేకుండానే కొన్ని ఆరోపణలు చేస్తారు. వాటిని ఆసరాచేసుకుని పోలీసులు కేసు పెట్టేట్టయితే కూడా అది వాస్తవానికి సంబంధంలేకుండా పోతుంది. కోర్టులో జరిగే తంతుకి భిన్నంగా వుంటుంది. ఇలాంటి సందర్భంలో పోలీసులు కేసు దర్యాప్తు చేయడానికి బద్ధకించి నేరానికి గురైన వారి ప్రత్యర్థుల మీద కేసు తగిలించేస్తారు. ఎలాగూ శత్రువే గదాని నిందితుడికి వ్యతిరేకంగా నేరానికి గురైన వారి తాలూకు వారు సాక్ష్యం చెప్పక పోరన్న ధీమా కూడా పోలీసులకుంటుంది. కాబట్టి వాళ్ల ఆధారాలు లేని ఆరోపణని ఆసరా చేసుకుని కేసులు పెడతారు.

కోర్టులో కేసులు రుజువు అయ్యే అవకాశాలు లేవని తెలిసి కూడా కొన్నిసార్లు

పోలీసులు ఏదో ఒక కేసు తగిలించేస్తారు. ఇలా చేయడంలో వారికి కావలసింది ఫలితంకాదు. కోర్టు చుట్టూ తిరగడమే పనిష్మెంట్ అని భావిస్తారు కాబట్టే ఇలాంటి కేసులు పెడతారు.

పోలీసులు దర్యాప్తు పూర్తి చేసిన తర్వాత ఒక నిర్ధారణకు వచ్చి కోర్టు వారికి ఒక నివేదిక సమర్పిస్తారు. ఆ నివేదికనే మనం చార్జ్‌షీట్ అంటున్నాం. చార్జిషీట్ దాఖలు చేసేముందర కేసు దర్యాప్తు పూర్తి చేసి కావలసిన సాక్ష్యాధారాలు లభించాయన్న నిర్ధారణకి పోలీసులు రావలసి వుంటుంది. కొన్ని నేరాలు భారత శిక్షాస్మృతిలో పేర్కొన్న మినహాయింపు పరిధిలోకి వచ్చినపుడు పోలీసులు చార్జిషీట్ దాఖలు చేయనవసరం లేదు. ఉదాహరణకి ఒక స్త్రీ తన మానరక్షణకై నేరస్థుడి తల పగలకొడుతుంది. ఆ గాయం కారణంగా నేరస్థుడు మరణిస్తాడు. ఆ స్త్రీ హత్య చేసినట్లా? కావా? నిజంగా ఉద్దేశ్య పూర్వకంగా హత్య చేసి వుంటే ఆమెపైన విచారణ జరిపి శిక్షించాలి. న్యాయస్థానంలో విచారణ జరిపే ముందు పోలీసులు దర్యాప్తు జరిపి నిజానికావిడ నేరానికి పాలుపడిందో లేదో ఒకవేళ నేరం చేసుంటే అది ఏ పరిస్థితుల్లో చేసిందో దర్యాప్తులో నిర్ధారించుకోవాలి. ఒకవేళ ఆమె కేవలం మాన రక్షణ నిమిత్తమే అనివార్యంగా ఈ చర్యకు పాల్పడిందని నిర్ధారించుకొన్నపుడు పోలీసులు కేసులో చార్జిషీట్ దాఖలు చేయనవసరంలేదు. ఎందుకంటే ఆమెచేసిన పని భారత శిక్షాస్మృతిలో పేర్కొన్న ఆత్మ రక్షణ కోసం చేసే చర్యలో భాగమైంది. కాని సాధారణంగా అవసరమున్నా లేకపోయినా ప్రతి కేసులోను చార్జిషీట్ పెట్టడం దాని ఆధారంగా సంవత్సరాల తరబడి కోర్టులో విచారణ జరగడం పార్టీలు ఆర్థికంగా చితికి పోవడం కోర్టుల చుట్టూ తిరగడంతో తమ విలువైన కాలాన్ని కోల్పోవడం జరుగుతూంటుంది. కొన్ని సివిల్ కేసుల విషయంలోకూడా పార్టీలు కక్ష సాధింపుగా ప్రత్యర్థులమీద పోలీసు కేసు పెడుతుంటారు. ఇలాంటి విషయాల్ని పోలీసులు జాగ్రత్తగా పరిశీలించి అది తప్పుడు కేసో కాదో తెలుసుకోకపోతే అనవసరంగా కొందరు మానసికాందోళనకు గురయ్యే ప్రమాదముంది.

పోలీసులు ప్రతి కేసులోను చార్జిషీట్ దాఖలు చేయాల్సిన అవసరం లేదు. కేసులో తగిన సాక్ష్యాధారాలు లభించనపుడు ఒకవేళ నిందితుడు జైల్లో వుండేట్లయితే కోర్టువారికి ఈ విషయం తెలియజేసి అతన్ని విడుదల చేయించవచ్చు. ఏదశలోనైనా పోలీసు కేసు విరమించుకునే అవకాశముంది. కొన్నిసార్లు ఎఫ్.ఐ.ఆర్ జారీచేసిన తరువాత కేసు ముందుకు సాగకపోవచ్చు. అలాంటప్పుడు కూడా పోలీస్ శాఖవారు తగినసాక్ష్యాధారాలు లభించలేదని రిపోర్టు చేస్తారు. పోలీసులకి వున్న ఈ విస్తృత అధికారాలు అన్ని విషయాల్లోనూ ఉపయోగించుకోరు. అదే పోలీసు నిందితులైన కేసుల్లో

ఈ అధికారాలని ఉపయోగించుకొని తప్పించుకొంటూ వుంటారు. లాకప్ మరణాన్ని ఆత్మహత్యలుగా చిత్రిస్తారు. దానికెవరూ బాధ్యులు కారు, ఎవరూ ఆత్మహత్యకు పురికొల్పలేదని వ్రాసి కేసు క్లోజ్ చేస్తారు. అలాగే ఎన్‌కౌంటర్ల విషయంలో కూడా ఆత్మరక్షణ కోసమే కాల్పులు జరిగాయని నివేదిక వ్రాసుకొని దర్యాప్తు ముగిస్తారు. ఈ రెండు విషయాల్లోనూ నేరస్తులుండరు. కేవలం హతులు మాత్రమే ఉంటారు. ఇలాంటి అనుమానాస్పదమైన మరణాల విషయంలో స్వచ్ఛంద విచారణ అవసరం. ఇక్కడ అనుమానితులు పోలీసులు. కాబట్టి పోలీసులే కేసులో దర్యాప్తు జరపడం సరైందికాదు.

ఏ వ్యవస్థలోనైనా నిందితులే, అనుమానితులే న్యాయమూర్తులు కావడానికి వీలులేదు. పోలీసుల మీద వచ్చిన ఆరోపణలని తేల్చడానికి పోలీసులే దర్యాప్తు జరపడం హాస్యాస్పదం. ఇది పరోక్షంగా పోలీసులు న్యాయస్థానాల పాత్ర వహించడమే అవుతుంది. మనకి పోలీసు వ్యవస్థగాక మరొక స్వచ్ఛందమైన దర్యాప్తు సంస్థ ఏదీ లేదు. ఒకవేళ మెజిస్టీరియల్ విచారణో, జ్యుడిషియల్ విచారణో జరిగినప్పటికి న్యాయస్థానాల్లో కేసులు నడపటానికి నిందితులను శిక్షించడానికి ముందు పోలీసు దర్యాప్తు అనివార్యమౌతుంది. సిబిసిఐడి ఎంక్వయిరీ అని, సిఐడి ఎంక్వయిరీ అని ఏ పేరు పెట్టినప్పటికీ అది పోలీసు శాఖకు సంబంధం లేకుండా స్వచ్ఛందంగా జరిగే విచారణలు కావు.

భారత శిక్షాస్మృతిలో వున్న సాధారణ మినహాయింపుల పరిధిలోకి వచ్చిన కేసులో కూడా పోలీసులు కేసు చార్జిషీట్ దాఖలు చేస్తున్నారు బహుశా ఇలా చేయడంలో వారి ఉద్దేశం కేసు మినహాయింపు కిందికి వస్తుందోరాదో న్యాయవ్యవస్థకే వదిలేద్దామనే అయివుండవచ్చు. అలాగే లాకప్ మరణాలలోను, ఎన్‌కౌంటర్ల విషయంలోను ఒకవేళ అవి మినహాయింపు క్రిందికి వచ్చినప్పటికీ పోలీసులు చార్జిషీట్ ఎందుకు దాఖలు చేయడం లేదు. దాఖలుచేసి తమ నిజాయితీని రుజువు చేసుకోవచ్చుగదా? అన్న సందేహాలు ఎవరికైనా కలగనచ్చు.

## చార్జిషీటు - బెయిలు

అవేళ్టికి అతను జైల్లో వుండబట్టి తొంభైరోజులయి పోయింది. జైల్లోవున్న వాళ్ళకి సాధారణంగా చట్టమంటే ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలం వుంటుంది. అలాగే అతనికి కూడా చట్టం తెల్సుకోవాలనే కోరికుండింది. కాస్తోకూస్తో చట్టం తెల్సిన వాళ్ళు రిమాండ్ కాలం తొంభైరోజులు పూర్తయిన తర్వాత ముద్దాయికి తప్పనిసరిగా

బెయిలిస్తారు అని అతనికి చెప్పారు. వాస్తవానికి కూడా చార్జ్‌షీట్ దాఖలు చేయకపోయే ట్లయితే పది సంవత్సరాలలోపల జైలుశిక్ష నిర్ధేశించబడ్డ కేసుల్లో ముద్దాయికి అరవై రోజుల రిమాండ్ కాలం పూర్తయిన తర్వాత కోర్టు అనివార్యంగా ముద్దాయిని విడుదల చేస్తుంది. అలాగే పదిసంవత్సరాలుగానీ, ఆ పైనగానీ, జీవితఖైదు, మరణశిక్ష విధించడానికి అవకాశం వున్న కేసుల్లో నిందితుణ్ణి రిమాండ్ చేసిన నాటినుండి తొంభై రోజుల్లో చార్జ్‌షీట్ దాఖలు చేయకపోతే విడుదల చేస్తారు. హత్యకేసులో నిందితుడుగా వున్నతను అనేకసార్లు బెయిల్ పిటీషన్ పెట్టుకున్నాడు. హైకోర్టు వరకూ వెళ్లాడు, అయినా కోర్టు అతనికి భెయిల్ ఇవ్వడానికి నిరాకరించింది. తనేపాపం చేయకపోయినా. ఏ నేరం చేయకపోయినా కేవలం ముఠాతగాదాల మూలంగా ఈ కేసులో ఇరికించారు. కేవలం అక్రమంగా చేసిన ఓ ఆరోపణ కారణంగా జైల్లో మగ్గిపోతున్న తనకి బెయిల్ దొరికే అవకాశముందని తెలవగానే మహదానందంగా వుంది. మామూలుగానే ఎస్కార్టు పోలీసులు వచ్చి అతన్ని జైలునుంచి తీసుకు వెళ్ళి కోర్టులో హాజరుపర్చారు. అతని కేసు పిలవగానే పోలీసులు ఆ కేసులో చార్జిషీట్ దాఖలు చేశారు. 'నేను జైల్లో వుండబట్టి తొంభై రోజులయిపోయిందిసార్. దయచేసి నాకు బెయిలిప్పించండి' అని కోర్టువారిని వేడుకొన్నాడతను. చార్జ్‌షీట్ దాఖలు చేసినందువల్ల అతనికి బెయిలివ్వలేనని స్పష్టం చేస్తూ మెజిస్ట్రేట్‌గారు అతని అభ్యర్ధనని కొట్టివేశారు.

ఇలా చార్జిషీట్ దాఖలు చేయడం పోలీసులు దాగుడుమూతలాట లాగా చేస్తుంటారు. దీన్ని బట్టి కేసులో దర్యాప్తుతో సంబంధంలేకుండా భవిష్యత్‌లో కేసు నిలబడుతుందా లేదానని యోచించకుండా కేవలం నిందితుల్ని ఇబ్బంది పెట్టాలనే కారణంగానే పోలీసులు తమకవసరమనుకున్నపుడు చార్జిషీట్ దాఖలు చేస్తున్నారని స్పష్టమౌతోంది.

### *ప్రథమ సమాచార నివేదిక*

ఎఫ్.ఐ.ఆర్. కోర్టులో దర్యాప్తుకు ముందు దాఖలు చేస్తారు. ఇందులో తమకందిన రిపోర్టుయొక్క సారాంశాన్ని వివరిస్తారు. అంటే పోలీసులకి నేరానికి సంబంధించిన సమాచారం అందగానే ఆ సమాచారాన్ని ప్రథమ సమాచార నివేదిక రూపంలో కోర్టుకి సమర్పిస్తారని అర్థం చేసుకోవాలి. ముందు పోలీసుల ముందొకరు అభియోగం మోపుతారు. ఆ అభియోగంలోని నిజానిజాలను తేల్చుకొనతగిన సాక్ష్యాధారాలు లభించాయనుకొన్నపుడు పోలీసులు చార్జ్‌షీట్ రూపంలో కోర్టులో అభియోగం మోపుతారు. అంటే ఇక్కడ మొదట పోలీసులకందే సమాచారంలో ఖచ్చితంగా ఎవరో ఒకరిమీద ఆరోపణ ఉండాల్సిన అవసరం లేదు. కేవలం నేరానికి సంబంధించిన సమాచారం వుంటే సరిపోతుంది. కానీ పోలీసులు కోర్టుకో దాఖలుచేసే చార్జిషీటులో స్పష్టమైన

ఆరోపణలుంటాయి. ఇక్కడ ఇంకో విషయం కూడా గమనించాలి. ఇక్కడ ఆరోపణ చేస్తున్నది ప్రభుత్వం. (వారి తరపున పోలీసు వ్యవస్థ) ప్రభుత్వానికి నేరానికి గురైన వాళ్ళపట్ల ఎంత బాధ్యత అయితే వుంటుందో అంత బాధ్యత నిందితుల పట్లకూడా వుంటుంది. ఈ విషయంలో ప్రభుత్వంగానీ, ప్రభుత్వం తరపున వ్యవహరిస్తున్న పోలీసులుగానీ నిష్పక్షపాతంగా వుండాలి. కానీ దానికి భిన్నంగా వ్యక్తిగత కక్ష సాధింపు చర్యగా పోలీసు వ్యవస్థ వ్యవహరిస్తున్నందు వల్ల దర్యాప్తుకి సరైన ప్రాముఖ్యత ఇవ్వకుండానే దర్యాప్తు అసంపూర్తిగా పూర్తి చేసి తొంభై రోజుల్లోనే చార్జి షీట్ దాఖలు చేస్తుంటారు. లేదా అంతకుముందు ముద్దాయి బెయిల్‌మీద విడుదలై వుంటే నెలలూ సంవత్సరాలూ గడిచినా చార్జ్‌షీట్ దాఖలు చేయరు.

చట్ట ప్రకారం పోలీసులు దర్యాప్తు పూర్తయిన తర్వాత చార్జ్‌షీట్ దాఖలు చేయాలి. కాని అసంపూర్తిగా చార్జిషీట్ దాఖలుచేసి దానికనుబంధంగా కోర్టులో కేసు నడుస్తుండగా అనేక చార్జిషీట్‌లు దాఖలుచేయడం సరైందికాదు. కేసులో ముద్దాయిపై విచారణ జరగాల్సిన అవసరముందని నిర్ధారించుకున్న తర్వాతే దర్యాప్తు చేస్తున్న అధికారి చార్జిషీట్ దాఖలు చెయ్యాలి. చార్జ్‌షీట్ దాఖలు చేయడం వల్ల నిందితుడిపై విచారణ చేయడానికి తగిన కేసుందని అర్థం.

కొన్నిసార్లు చార్జిషిట్ దాఖలు చేసిన తర్వాత కేసుకు సంబంధించిన విషయాలు కొన్ని కొత్త విషయాలు బైట పడవచ్చు. అలాంటప్పుడు ఇలా బైటపడ్డ కొత్త విషయాలనాధారం చేసుకొని మొదట దాఖలుచేసిన చార్జిషీట్ కనుబంధంగా కొత్తగా రిపోర్టు దాఖలు చేయవచ్చు. అయితే కేసు విచారణ ప్రారంభమైన తర్వాత కొత్తగా చార్జి షీట్ కనుబంధంగా ఏమీ చేర్చటానికి వీలుకాదు.

ముఠా తగాదాల కారణంగా వ్యక్తిగత వైషమ్యాల కారణంగా ఒకోసారి తప్పుడు కేసులు బనాయించడం మనం చూస్తూనే వుంటాం. అలాంటప్పుడు నిందితులు దర్యాప్తు పేరుమీద వేధించబడటం ఎంతవరకు సరైంది? అంటే అరెస్టుకావడం ఇంటరాగేషన్ పేరుమీద పోలీసులెప్పుడు పిలిపిస్తే అప్పుడు వెళ్లి వాళ్ళడిగిందానికి సమాధానం చెప్పడం లాంటివి. కొన్నిసార్లు సివిల్ కేసులు పెట్టడానికి అవకాశం వున్నప్పుడు కూడా కొందరు కావాలని వాటిని క్రిమినల్ కేసులుగా చిత్రీకరిస్తారు.

## ఎఫ్.ఐ.ఆర్. కొట్టివేత

అనవసరమైన కేసులు పెట్టినప్పుడు ప్రథమ సమాచార నివేదిక దశలోనే రిట్ పిటిషన్ దాఖలుచేసి ప్రథమ సమాచార నివేదికను కొట్టి వేయించవచ్చు. రిట్‌పిటిషన్ హైకోర్టు, సుప్రీం కోర్టులలో మాత్రమే దాఖలు చేయాలి.

దర్యాప్తు ఏమాత్రం జాప్యం చేయకుండా వీలైనంత తొందరగా పూర్తి చేయాలి. దర్యాప్తు దశలోనే నిందితుడు గనుక జైలులో ఉండేట్లయితే దర్యాప్తులో జాప్యం జరుగుతుందన్న కారణంగా అతని విడుదల గురించి హెబియస్ కార్పస్ పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు. అలాగే మరోవైపు దర్యాప్తులో జరుగుతున్న జాప్యం వల్ల కేసుకి కావల్సిన సాక్ష్యాధారాలు కోల్పోయే ప్రమాదముంది. వృద్ధులైన సాక్షులు మరణించడం, వేలు ముద్రలలాంటి ఆధారాలు చెరిగి పోవడం, ముద్దాయి గాని అతని తరపు వాళ్ళుగాని సాక్షుల్ని బెదిరించో ప్రతిమాలో ఏదైనా ఆశ చూపి లొంగదీసుకోవడం లాంటివి దర్యాప్తు ఆలస్యంగా జరిగినప్పుడు సంభవించే అవకాశం ఉంది. చార్జిషీట్ పోలీసులు కాగ్నిజబుల్, నాన్‌కాగ్నిజబుల్ కేసుల్లో దాఖలు చేస్తారు. అంటే ఏఏ కేసుల్లోనైతే మేజిస్ట్రేట్ అనుమతి లేకుండా పోలీసులు తమకు తాముగా దర్యాప్తు చేస్తారో ఏఏ కేసుల్లోనైతే మెజిస్ట్రేట్ అనుమతితో దర్యాప్తు ప్రారంభిస్తారో ఈ అన్ని కేసుల్లోనూ పోలీసులు చార్జిషీట్ దాఖలు చేయడంలో అవలంబించే పద్ధతులొకటే. ఛార్జిషీట్, దానితోపాటు దాఖలు చేసే ఇతర పత్రాలని పెన్సిల్‌తో వ్రాయడానికి వీలులేదు. స్పష్టంగా అర్థమయ్యేలా కలంతో వ్రాయాలి.

దర్యాప్తు పూర్తయిన వెంటనే చార్జిషీట్ దాఖలు చేయాలి. అంతేకాని దర్యాప్తు ముగిసింది, సకాలంలో దర్యాప్తు పూర్తయింది కాబట్టి చార్జిషీట్ ఇష్టం వచ్చినప్పుడు దాఖలు చేస్తామనడానికి వీలులేదు. చార్జిషీట్ దాఖలు చేసిన తర్వాత మాత్రమే కోర్టులో విచారణ ప్రారంభమౌతుంది. అంచేత కోర్టులో విచారణ తొందరగా పూర్తి కావాలంటే అనివార్యంగా చార్జిషీట్ దర్యాప్తు పూర్తయిన వెంటనే దాఖలు చేయాలి.

పోలీసు స్టేషన్ అధికారి మాత్రమే చార్జిషీట్ కోర్టుకు పంపిస్తాడు. పోలీసు స్టేషన్ అధికారి కంటే క్రిందిస్థాయి ఉద్యోగి గనక కేసును దర్యాప్తు చేసినట్లయితే పోలీసు స్టేషను అధికారి ఆ దర్యాప్తును పరిశీలించి చార్జిషీట్ దాఖలు చేయాలా లేదానని నిర్ణయించాలి. ఒకసారి కోర్టులో విచారణ ప్రారంభమయినాక పోలీసు స్టేషన్ అధికారి కోర్టువారితో ఉత్తర ప్రత్యుత్తరాలు గాని, సంప్రదింపులుగాని జరపడానికి వీలులేదు చార్జిషీట్ పూర్తయిన తర్వాత అది ఏ మేజిస్ట్రేట్ కయితే కేసు విచారణ జరిపే అధికారం వుందో ఆ మేజిస్ట్రేట్‌కు పంపిస్తారు. ఏ పరిస్థితిలోను మేజిస్ట్రేట్‌కి నిందితులకి వ్యతిరేకంగా చార్జిషీట్ దాఖలు చేయమని పోలీసుల నాదేశించే అధికారం లేదు. మేజిస్ట్రేట్ చార్జిషీట్ స్వీకరించిన తర్వాత అందులో పేర్కొన్న, గతంలో అరెస్టు కాకుండా ఉన్న నిందితుల అరెస్టు గురించి వారెంట్ ఇవ్వవచ్చు.

ఒక కేసు తప్పుడు కేసని నిర్ధారించుకొన్న తర్వాత పోలీసులు ఆ విషయం పేర్కొంటూ ఒక నివేదిక సమర్పించవచ్చు. లేదా దర్యాప్తులో కేసు రుజువైనట్లయితే

పోలీసులు అనివార్యంగా చార్జ్‌షీట్ దాఖలు చేస్తారు. చార్జ్‌షీట్‌లో ప్రభుత్వం నిర్దేశించినట్లుగా పార్టీల పేర్లు, పోలీసుల కందిన సమాచార వివరాలు, సాక్షుల పేర్లు, అరెస్టయిన నిందితుల పేర్లు, అరెస్టు కానివారి పేర్లు పేర్కొంటారు. మొత్తం మీద చార్జ్‌షీట్ పూర్తయిన తర్వాత దర్యాప్తు చేసిన అధికారి చార్జ్‌షీట్ దాఖలు చేసినట్లుగా పోలీసు రిపోర్టు ఇచ్చిన వ్యక్తికి తెలియ జెయ్యాలి. అట్లా తెలియ జెయ్యడం వలన పోలీసు రిపోర్టు ఇచ్చిన వ్యక్తి పోలీసులు కేసు దర్యాప్తు చేయలేదనుకుని కోర్టులో ప్రైవేటు కంప్లైట్ వేసే అవకాశం వుండదు.

చార్జ్‌షీట్‌తోపాటు దర్యాప్తుకు సంబంధించిన అన్ని పత్రాలని కోర్టుకి సమర్పించాలి. సెక్షన్ 161 సిఆర్‌పిసి క్రింద పోలీసులు రికార్డు చేసిన సాక్షుల వాంగ్మూలాలని కోర్టుకి పంపించాలి. చార్జ్‌షీట్ దాఖలు చేసిన తర్వాత కూడా ఏదైనా క్రొత్త విషయం వెలుగులోకి వస్తే పోలీసులు తిరిగి దర్యాప్తు కొనసాగించవచ్చు.

చార్జ్‌షీట్ దాఖలయిన తర్వాత కోర్టు అందులో నిందితులుగా పేర్కొన్న వారికి గూడా నోటీసు ఇవ్వవచ్చు ఒక్కొసారి పోలీసు రిపోర్టులో అసలెవరి మీదా ఎలాంటి చార్జ్ (ఆరోపణ) లేనప్పటికీ మేజిస్ట్రేట్ కేసును పరిగణనలోకి తీసుకొని నిందితులకు వారెంట్ లివ్వవచ్చు. 1980లో సుప్రీంకోర్టు ఈ విషయం స్పష్టం చేసింది. దీన్నిబట్టి లాకప్ మరణాలకు సంబంధించిన కేసుల్లో ఎన్‌కౌంటర్లకు సంబంధించిన కేసుల్లో పోలీసు రిపోర్టు ఎల్లా ఉన్నప్పటికీ కోర్టు తనకు తానుగా విచారణ జరపవచ్చునని స్పష్టమౌతోంది.

ఛార్జిషీట్, దానితోపాటు దాఖలు చేసే ఇతర పత్రాల యొక్క ప్రతులను ముద్దాయికి తప్పనిసరిగా ఇవ్వాలి. అంతేగాక కోర్టులోవున్న ఆ కేసుకు సంబంధించిన మరే పత్రాలైనా ముద్దాయికి చూసే అధికారంవుంది. పోలీసులు తప్పుడు ఛార్జ్‌షీట్ దాఖలు చేసేట్లయితే వారు శిక్షార్హమైన నేరానికి పాల్పడ్డట్టే. సెక్షన్ 218 భారత శిక్షాస్మృతి సెక్షన్ 29 పోలీసు చట్టం క్రింద తప్పుడు కేసు దాఖలు చేయడంగాని కేసు దాఖలు చేసేప్పుడు అశ్రద్ధగా వుండటంగాని శిక్షార్హమైన నేరం. పోలీసు రిపోర్టును బట్టి నిందితుల మీద కేసు లేదని భావించినప్పుడు మేజిస్ట్రేట్ అతనిని డిశ్చార్జి చేయవచ్చు. అలాగే అవసరమనుకుంటే ఆయన కేసులో ఇంకా దర్యాప్తు జరిపించవచ్చు. ముద్దాయిని డిశ్చార్జి చేసినంత మాత్రాన అతనిపై విచారణ జరపడానికి వీల్లేదు అనుకోవడం సరైంది కాదు. ఇదే విషయంపై ఏదైనా ప్రైవేట్ కాంప్లైంట్ దాఖలు చేస్తే దాన్ని కోర్టు పరిగణనలోకి తీసుకొని విచారణ జరిపించవచ్చు. పోలీసులు దాఖలు చేసిన ఛార్జ్‌షీట్ పై మేజిస్ట్రేట్ సంతృప్తి చెందని పక్షంలో ఆయన తిరిగి దర్యాప్తు జరపమని ఆదేశించడం లేదా కేసు పరిగణనలోకి తీసుకొని విచారణ ప్రారంభించడం చేయవచ్చు.

# ప్రైవేట్ కంప్లైంట్

రాజశేఖరంగారి కారు రోడ్డుమీద ఎప్పుడూ వేగంగా వెళుతుంది. అది బ్రేకులేని కారేమోననుకుంటారందరు. ఆ కారుమాదిరిగానే ఆయనకి కూడా ఏ అడ్డూ అదుపూ లేదు. ఆయన మాట రూల్‌గా చలామణీ అవుతుంది. ఊళ్లోకల్లా ఆయన డబ్బున్న మనిషి. జిల్లా కలెక్టర్ మొదలుకొని యస్. పి. వరకు అందరూ ఆయనకి కావలసిన స్నేహితులే. ఇంకా చిన్నచిన్న ఉద్యోగులందరూ ఆ ఇంట్లో పనిచేసే నౌకర్లలా ఆయన చెప్పడేపని ఉందన్నా ఆయనింటి కొచ్చి మరీ చేసిపెడతారు. అంత వేగంగా వెళ్ళే ఆయన కారుకి ఏక్సిడెంట్ జరగలేదాని ఎవరికైనా అనుమానం రావచ్చు.

జరక్కేం చాలాసార్లు ఏక్సిడెంట్ జరిగింది. అయితే ఆ కారుక్కాని రాజశేఖరానిక్కాని ఏ నష్టమూ జరగలేదు. అది ఎవరినైతే ఢీ కొందో వాళ్ళకే కావలసినంత నష్టం జరిగింది. రాజశేఖరంగారు తన కుక్క బిచ్చగాణ్ణి కరచినందుకు, పనివాడి మీద మొరిగినందుకు సంతోషించినట్టుగానే ఈ విషయంలో కూడా చాలా ఆనందించాడు. ఇవాళ ప్రొద్దున కూడా రాజశేఖరం గారి కారు ఒక రిక్షాని ఢీకొంది. ఆరిక్షా నుగ్గు నుగ్గయిపోయింది. కాని రిక్షావాడు మాత్రం బతికాడు. రిక్షా లేకుండా బ్రతుకలేనని తెలిసిన రిక్షావాడు రిక్షా పోయినందుకు మనిషి పోయినంత బాధపడ్డాడు. రాజశేఖరం గారిని కనీసం రిక్షా అన్నా కొనిపెట్టమని వేడుకున్నాడు. రాజశేఖరంగారు కనికరించ లేదు. కోపంతో రిక్షావాడు పోలీసులకు రిపోర్టిచ్చాడు. పోలీసులు ఆ రిపోర్టు వాడి ముందే చింపేసి రాజశేఖరంగారి మీద కేసు పెట్టడానికి వచ్చినందుకుగాను వాణ్ణి లాకప్‌లో పడేసి చితగ్గొట్టి దిక్కున్న దగ్గర చెప్పుకొమ్మని వదిలేశారు.

### అన్యాయం జరిగినప్పుడు

ఇలా పోలీసులకు బీదాబిక్కి ఎవరైనా తమకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకుంటే వాళ్ళు ఏ రకమైన చర్యా తీసుకోరు. పైపెచ్చు గాయాన్ని ఆసరా చేసుకొని బతికే క్రిముల్లా ఒక్కోసారి అన్యాయానికి గురైన వాడి నుంచే ఇంతో అంతో వసూలు చేసి లాభపడుతూ ఉంటారు. పోలీసులు రిపోర్టు తీసుకొని కేసు పెట్టనప్పుడు నేరుగా కోర్టులోనే కేసు దాఖలు చేసుకోవచ్చునా?

పోలీసులు రిపోర్టు తీసుకొని కేసు పెట్టక పోయినా అసలు రిపోర్టు తీసుకోవ డానికి నిరాకరించినా నేరుగా కోర్టులో కేసు దాఖలు చేసుకోవచ్చు. ఇలా దాఖలు చేసే కేసుల్ని ప్రైవేట్ కాంప్లైంటు అంటారు. ప్రైవేట్ కాంప్లైంట్ ప్లీడరు ద్వారా మాత్రమే గాక నేరుగా దాఖలు చేసుకునే అవకాశముంది. అన్యాయానికి గురి అయిన వాళ్ళు తమకు జరిగిన అన్యాయాన్ని పోలీసులకి, పెద్దలకి చెప్పుకునేట్లుగానే నేరుగా కోర్టుకి వచ్చి మెజిస్ట్రేట్‌కి విన్నవించుకోవచ్చు. ఎవరిమీదైనా స్పష్టమైన నేరారోపణ కనుక చేసేటట్లయితే అది కంప్లైంట్ అవుతుంది. కంప్లైంట్ కోర్టులో చేసినప్పుడు అది లిఖితంగా ఉండాల్సిన పనిలేదు. చాలామంది చదువురానివాళ్ళు ఉన్న మన దేశంలో కంప్లైంటు లిఖితంగా ఇవ్వడం అంత సులభం కాదు. మనిషి నుంచి మనిషికి మనం చెప్పే విషయాలే మారుతూ ఉంటాయి. అలాంటప్పుడు కంప్లైంట్ మరొకరిచేత రాయించడంవల్ల విషయ వక్రీకరణ జరిగే ప్రమాదం ఉంది. అందుకని రాయగల్గితే స్వయంగా రాసి కంప్లైంటు దాఖలు చేయడం లేదా మౌఖికంగా కోర్టులో కంప్లైంటు ఇవ్వడం మంచిది. చాలాసార్లు ముద్దాయిల్ని కోర్టుకి పోలీసు కస్టడీ నుంచి తీసుకు

వచ్చినప్పుడు వారు పోలీసులు తమను కొట్టారని ఆరోపించడం జరుగుతుంది. ముద్దాయి కోర్టులో చెప్పుకునేప్పుడు కోర్టువారు తమకిష్టమైతే రికార్డు చేస్తుంటారు. ఇలా రికార్డు చేయడంవల్ల ఏమీ ఫలితం ఉండదు. రికార్డు చేసుకొని ఆరోపణ చేసిన ముద్దాయి చేత సంతకం తీసుకొన్నట్లయితే కోర్టువారికి కంప్లైంటుగా భావించే అధికారం ఉంది. ఒకసారి కంప్లైంటు అంటూ రిజిస్టర్ చేస్తే దాని ఆధారంగా సాక్ష్యాధారాల్ని బట్టి నిందితుల్ని శిక్షించే అవకాశం ఉంది. ప్లీడరు లేకుండా నేరుగా కోర్టుకు వచ్చిన వాళ్ళని బయటుండే బంట్రోతులే తరిమి వేస్తారు. ఎవరైనా ఏదైనా కాంప్లైంటు ఇచ్చినప్పటికీ కొందరు మెజిస్ట్రేట్లు స్వీకరించారో లేదో తెలియచేయక ప్లీడరును పెట్టుకొమ్మని చెపుతూ ఉంటారు. మౌఖికంగా ఇచ్చే కంప్లైంటు కూడా రికార్డు చేయాలి. ఈ విషయం తెలియక చాలాసార్లు కోర్టువారు మౌఖికంగా చేసే ఆరోణపల్ని రికార్డు చెయ్యడానికి నిరాకరిస్తారు.

ఒక్కోసారి ప్రైవేట్ కంప్లైంటు దాఖలు చేసినప్పుడు అది తీసుకోవడానికి కోర్టు నిరాకరించవచ్చు. అలాంటప్పుడు కోర్టుకి, పోలీసుస్టేషనుకి ఉన్న తేడా ఏమిటో అర్థంకాదు. అయితే ఈ విషయంలో కోర్టు ప్రైవేటు కంప్లైంటు రికార్డు చేసినప్పుడు అందులో మౌలికంగా ఆరోపణ అంటూ ఏది లేదనుకున్నప్పుడు దాన్ని స్వీకరించి విచారణ జరపకపోవడం సరైనదే. కొన్నిసార్లు చీటికి మాటికి తగవులు పెట్టుకునే వాళ్ళు ఏదో ఒక మిషమీద కోర్టుకివచ్చి ప్రైవేట్ కంప్లైంట్ దాఖలు చేస్తుంటారు. వీరు రామప్పపంతుల్లానే ఇతరులను కోర్టు చుట్టూ తిప్పి బాధపెడుతుంటారు. కోర్టులో ముద్దాయికి శిక్ష పడ్డాన్ని వీరు నిజంగా వాంఛించరు. కోర్టు చుట్టూ తిప్పడమే వాళ్ళు వేయించ గలిగిన శిక్ష అనుకుంటారు. అందుకని ప్రైవేట్ కంప్లైంట్ విచారణ జరుపుతున్నప్పుడు కోర్టు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవల్సిన అవసరం ఉంది.

సాధారణంగా పోలీసులు చేసే నేరాల్ని కూడా పోలీసులు దర్యాప్తు చేసే అవకాశం లేదు. అలాంటప్పుడు కోర్టులో ప్రైవేట్ కంప్లైంట్ వేయడం వినా మరో గత్యంతరం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో న్యాయస్థానాలు కేసు విచారణ జరిపే యంత్రాంగం గానే కాక పరోక్షంగా దర్యాప్తుచేసే బాధ్యత స్వీకరిస్తుంది. ఉదాహరణకు హత్య కేసుకు సంబంధించిన ప్రైవేట్ కంప్లైంట్ ఏదైనా దాఖలైతే అందులో కంప్లైంట్ ఇచ్చిన వ్యక్తినే కాక ఇతర సాక్ష్యాల్ని కూడా విచారిస్తుంది. అంతేకాక కోర్టు స్వతసిద్ధంగా అవసరమనుకుంటే శవాన్ని తిరిగి పోస్టుమార్టం జరిపించడం పంచనామా చేయడం తదితర చర్యల్ని గైకొనడం చేస్తుంది. దీన్ని బట్టి మనకి న్యాయస్థానం ఒక దర్యాప్తు వ్యవస్థగా కూడా వ్యవహరిస్తుందని మనకు స్పష్టమవు తోంది. ఇలాంటి విషయాల్లో న్యాయస్థానాలు న్యాయంచేయడమే తమ ఉద్దేశ్యమనేది

మర్చిపోకుండా న్యాయం చేయడానికి అవసరమైన చర్యల్ని తమ అధికారాల్ని వినియోగించి గైకొనాల్సి ఉంటుంది.

***పోలీసులు తప్పుడు కేసులు పెట్టినపుడు***

పోలీసులు తప్పుడు కేసులు పెట్టినప్పుడు కూడా ప్రైవేట్ కంప్లైంట్ దాఖలు చేయవచ్చు. నేరం చేసిన వారు ఒకరైతే ముద్దాయిలుగా వేరొకరు కోర్టు చుట్టూ తిరగడం మనం చూస్తూనే ఉన్నాం. అలాంటప్పుడు ముద్దాయేగాక నేరాలకు గురి అయిన వారు కూడా చాలా నష్టపోతారు. నిజమైన నేరస్తుడు తప్పించుకొని దర్జాగా తిరుగుతుంటాడు.

## పోలీసులచే హింసకు గురైనపుడు

"దేవుని ఎదుట ప్రమాణం చేసి అంతానిజమే చెబుతాను. అబద్ధం చెప్పను" సాక్షిబోనులో నిల్చున్న అతనితో బెంచి క్లర్కు ప్రమాణం చేయించాడు. "ఏం జరిగింది చెప్పండి" అన్నారు మెజిస్ట్రేటు గారు "సార్ మూడు రోజుల క్రితం ఏ కారణం చెప్ప కుండానే పోలీసులు పట్టుకెళ్ళారండి. పోలీసు స్టేషన్‌లో నేను చేయని దొంగతనం గురించి ప్రశ్నిస్తూ హింసించారండి. మూడు రోజుల పాటు పోలీసు లాకప్‌లో అక్రమంగా నిర్బంధించారు. కాబట్టి అక్రమంగా నిర్బంధించినందుకు గాను, హింసించినందుకు గాను పోలీసుల మీద చర్య తీసుకోండి" అని చెప్పాడు బోనులో ఉన్న తను. "నిన్ను అరెస్టు చేసిన పోలీసుల పేర్లు, హింసించిన వాళ్ళ పేర్లు చెప్పగలవా" అని అడిగాడు మేజిస్ట్రేట్ గారు "శంకర్రావనే సబిన్‌స్పెక్టర్, మల్లయ్య 403 కానిస్టేబుల్ ఇంకా కొందరు పోలీసు కానిస్టేబుల్స్ అంతా కనిసి తెల్లారుగట్ల నాలుగింటికి వచ్చి మా ఇంట్లోనే పట్టుకొన్నారండి, వీళ్ళందరూ ఇంకా పోలీసు స్టేషన్‌లో వుండే వేరే కానిస్టేబుల్స్ అంతా ఎవరిష్టం వచ్చినట్లు వారు కొట్టారు". "నిన్ను అరెస్టు చేసినప్పుడు ఎవరైనా చూశారా" అని అడిగారు మెజిస్ట్రేట్ గారు.

"చూశారండీ, మా ఇంటిల్లిపాదీ చూశారు. నా పెద్దకొడుకు చూశాడు. నా భార్య చూసింది. మంచంలో ఉన్న మా అమ్మ చూసింది. మా వీధిలో మున్సిపల్ కుళాయి దగ్గర నీళ్ళు పట్టుకోనేవాళ్ళు చూశారు" అని చెప్పాడు. పోలీసులు నిన్ను హింసించేప్పుడెవరైనా చూశారా" అని అడిగారు మెజిస్ట్రేట్ గారు. చూశారండి, పోలీసు లంతా వినోదంగా చూసి నవ్వారండి, అయితే వాళ్ళు సాక్ష్యం చెప్పరు గదండి" అని అమాయకంగా అడిగాడతను. ఇలా అతను చెబుతున్న విషయాలన్నీటిని మెజిస్ట్రేట్ గారు

తనకొచ్చిన అనుమానాలు తీర్చుకొంటూ కంప్లైంట్ రికార్డు చేసుకున్నారు.

ప్రైవేట్ కంప్లైంట్ పై విచారణ జరిపే ముందర కంప్లయింట్ ఇస్తున్న వ్యక్తి తోటి ఇంకా ఎవరైనా సాక్షులుండేటట్లయితే వారితోటి ప్రమాణం చేయించి మెజిస్ట్రేట్ స్టేట్‌మెంట్ రికార్డు చేస్తారు. స్టేట్‌మెంట్ రికార్డు చేసేటప్పుడు లిఖితంగా ఇచ్చిన కంప్లైంట్‌లో లేని విషయాలు వెలుగులోకి తీసుకురావడానికి కోర్టు ప్రయత్నం చేస్తుంది. అలాగే ఏవైనా అనుమానాస్పదమైన విషయాలుండేట్లయితే వాటి వివరణ కోరి విషయాన్ని స్పష్టం చేసుకొంటారు. ఇలాంటప్పుడు మెజిస్ట్రేట్ ఆరోపణ చేస్తున్న వ్యక్తిని అతను చేస్తున్న ఆరోపణలేమిటో స్పష్టం చేయమని కోరే అధికారముంది. కొన్నిసార్లు ఆరోపణ చేసేవాళ్ళు ఆవేశానికి గురై కొందరిని అనవసరంగా నిందితులుగా పేర్కొనే ప్రమాదముంది. అలాంటప్పుడు ఇలా ప్రమాణం చేయించుకొని స్టేట్‌మెంట్ రికార్డు చేసుకోవడం వల్ల అనవసరమైన వ్యక్తులను కేసుల్లో ఇరికించే ప్రమాదం తప్పుతుంది. అంతేగాక మెజిస్ట్రేట్‌కంప్లైంట్ పైన దర్యాప్తు అవసరమనుకొనేట్లయితే దర్యాప్తు చేయించమని ఆదేశించ వచ్చు. ప్రైవేటు కంప్లైంట్‌లో ఒకసారి కంప్లయింట్ ఇస్తున్న వ్యక్తి ప్రమాణం చేసి విషయం చెప్పేట్లయితే ఆతరువాత కేసు విచారణ జరుగుతునప్పుడు పోలీసు కేసుల్లో మాదిరిగా కేసును గురించి నాకేమి తెలియదని బుకాయించడానికి వీలుండదు. మొదట చెప్పిందానికి విరుద్ధంగా గనక తరువాత సాక్ష్యం చెప్పేట్టయితే అతను శిక్షార్హుడౌతాడు. ప్రైవేట్ కంప్లైంట్ ఇచ్చేప్పుడు కంప్లైంట్‌లో సెక్షన్స్ తప్పుగా వ్రాశాడన్న కారణం చేత మొత్తానికే కంప్లైంట్ చెల్లదనడం సరైంది కాదు. కంప్లైంట్ రికార్డు చేసే న్యాయస్థానం సెక్షన్ సరిదిద్దాల్సి వుంటుంది. ఒకోసారి కొందరు చదువు రాని వాళ్ళు ప్రైవేట్ కంప్లైంట్ దాఖలు చేయవచ్చు. అలాంటప్పుడు వాళ్ళకి చట్టమేమిటో సెక్షన్స్ ఏమిటో తెలియకుండా తమకు జరిగిన అన్యాయం కోర్టుకు విన్నవించుకుంటారు మీకు చట్టం తెలియదు కాబట్టి మీకు జరిగింది అన్యాయం కాదు అనడం సరైంది కాదు. చట్టం తెలిసిన న్యాయస్థానమే దీనికి తగిన న్యాయం చేయాలి.

ప్రైవేట్ కంప్లైంట్ విచారణకు స్వీకరించే మెజిస్ట్రేట్ మాత్రమే రికార్డు చేయాలి. విచారణకు స్వీకరించే ముందు మెజిస్ట్రేటు కంప్లైంట్‌లోని విషయాల్ని సరిగ్గా అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేయాలి. అప్పుడే అతను కంప్లైంట్ సరైన పద్ధతిలో స్వీకరించినట్లవుతుంది.

కోర్టులో ప్రైవేట్ కంప్లైంట్ దాఖలు చేయాలా లేదా పోలీసు రిపోర్టు ఇవ్వాలా అని నిర్ణయించుకొనే హక్కు ఆరోపణ చేస్తున్న వ్యక్తికే ఉంటుంది. అతను కోర్టులో రికార్డు చేసినప్పుడు మాత్రమే దాన్ని కోర్టు ప్రైవేటు కంప్లైంట్‌గా భావిస్తుంది. కొన్ని సార్లు పోలీసు రిపోర్టు ఇచినప్పుడు సంతృప్తి చెందని పరిస్థితుల్లో కూడా ప్రైవేటు

కంప్లైంట్ దాఖలు చేసుకొనే హక్కు ఆరోపణ చేసిన వ్యక్తికి ఉంటుంది.

కొన్నిసార్లు ఒకే నేరానికి సంబంధించి అనేక కంప్లైంట్స్ దాఖలయ్యే అవకాశముంది. అలాంటప్పుడు మేజిస్ట్రేట్ అన్ని కంప్లైంట్‌లను విలీనం చేసి ఒకే కాంప్లైంట్‌గా భావించి విచారణ జరపవచ్చు. నేరానికి సంబంధించి ప్రత్యక్ష జ్ఞానము ఉన్నవాడు మాత్రమే కంప్లైంట్ దాఖలు చేయాలి. అసలు విషయానికే మాత్రం సంబంధం లేని వాళ్ళు కంప్లైంట్ దాఖలు చేయడానికి వీల్లేదు.

కంప్లైంట్ విచారణకు స్వీకరించిన తరువాత ఆరోపణ చేసిన వ్యక్తిని, సాక్షుల్ని విచారించిన మీదట మౌలికంగా కేసంటూఏదైనా వుందనుకుంటే నిందితుడిని హాజరు కమ్మని సమన్లు ఇవ్వడమో లేదా హాజరు కమ్మని వారెంట్ లివ్వడమో చేస్తారు.

ఘోషాస్త్రీలు ఏవైనా ఆరోపణ చేయదలచు కొంటే ఎవరిద్వారా నైనా కంప్లైంట్ కోర్టుకు పంపించవచ్చు. అలాగే ఉత్తరాలను, టెలిగ్రాములను కూడా మెజిస్ట్రేట్ కంప్లైంట్‌గా భావించ వచ్చు. అయితే అనివార్యంగా మెజిస్ట్రేట్ కంప్లైంట్ చేస్తున వ్యక్తిని, సాక్షుల్ని విచారించాలి.

న్యాయస్థానాలు కంప్లైంట్ దాఖలు చేసినప్పుడూ, ప్రజోద్యోగులు కంప్లయింట్ దాఖలు చేసేప్పుడూ వారిని విచారించాల్సిన అవసరం లేదు. అలాగే మెజిస్ట్రేట్ కేసు ట్రాన్స్‌ఫర్ చేసేప్పుడు కూడా సాక్షుల్ని, అభియోగిని విచారించాల్సిన అవసరం లేదు.

కంప్లైంట్ రికార్డు చేసిన తర్వాత కంప్లైంట్ ఇచ్చిన వ్యక్తితో దానిపై సంతకం చేయించు కోవాలి. అలాగే సాక్షుల సంతకాలు తీసుకొని మెజిస్ట్రేట్ కూడా సంతకం చేయాలి. కేసువేరే మెజిస్ట్రేట్‌కు ట్రాన్స్‌ఫర్ చేసినప్పుడు ఆ మెజిస్ట్రేట్ తిరిగి అభియోగం రికార్డు చేయవలసిన అవసరం లేదు.

## అక్రమ నిర్బంధానికి వ్యతిరేకంగా

కొమరయ్యను పోలీసులు పిలిచి రెండురోజులపాటు అక్రమంగా నిర్బంధించారు. ఆ తర్వాత అతన్ని ఒక దొమ్మికేసులో తీసుకువచ్చి కోర్టులో హాజరుపరిచారు. పోలీసులు హింసించిన విషయం, అక్రమంగా నిర్బంధించిన సంగతి. మెజిస్ట్రేట్‌కు చెప్పుకున్నాడు కొమురయ్య. కొమురయ్య చెప్పింది విని మెజిస్ట్రేట్ ఏమీ చలించలేదు. పోనీ కొమురయ్య చెప్పిన విషయాన్ని రికార్డు కూడా చేయలేదు. పోలీసులు మోపిన అభియోగాన్ని పురస్కరించుకుని కొమురయ్యను రిమాండ్ చేశారు. అప్పుడు కొమురయ్య తరఫున న్యాయవాది లేచి కొమురయ్య చెప్పిన విషయాన్ని రికార్డ్‌చేసి

దానిని ప్రైవేటు కంప్లైంట్‌గా భావించాలని కోరారు. మౌఖికంగా చేసిన ఆరోపణను ప్రైవేటుకంప్లైంట్‌గా భావించడానికి వీల్లేదని మెజిస్ట్రేట్ అభిప్రాయపడ్డారు.

మెజిస్ట్రేట్ అభిప్రాయం సరైనదికాదని కొమురయ్య తరపున న్యాయవాది వాదించినా ఫలితం లేకపోయింది. దానితో ఆయన కోర్టువారి అనుమతి తీసుకుని లిఖితంగా కొమురయ్య చేత ఆరోపణ దాఖలు చేయించారు. ఈ ఆరోపణపై దర్యాప్తు చేయవలసిందని ఆదేశిస్తూ మెజిస్ట్రేట్ కొమురయ్య దాఖలుచేసిన కంప్లైట్‌ను పోలీసులకు పంపారు. పోలీసులు కొట్టారు మొర్రో అంటుంటే వినిపించుకోకుండా దాన్ని అదే పోలీసులకు పంపడంలో అర్థంలేదు.

మెజిస్ట్రేట్ స్వయంగా విచారణ జరపాల్సింది, లేదా ఏదైనా స్వతంత్ర దర్యాప్తు సంస్థకి దర్యాప్తుచేయమని ఆదేశిస్తూ కంప్లెయింట్ పంపితే ఏమైనా అర్థం ఉండేది. ప్రైవేట్ కంప్లైట్ చేసినప్పుడు మెజిస్ట్రేట్ దాన్ని పురస్కరించుకొని విచారణ జరపవచ్చు. అవసరమనుకుంటే ముందుగానే సాక్షులను పిలిపించి సాక్షుల వాంగ్మూలాన్ని రికార్డుచేసే అధికారం ఉంది. అంతేకాక అవసరమనుకుంటే ఈ కంప్లైంట్ పైన దర్యాప్తుచేయమని పోలీసులను ఆదేశించవచ్చు. లేదా స్వయంగా దర్యాప్తుచేయడమో, లేదా ఇతరత్రా పోలీసులు కాక ఎవరితోనైనా దర్యాప్తుచేయించవచ్చు. చాలాసార్లు ప్రత్యర్థులను ఏడిపించడానికీ, కోర్టులచుట్టూ తిప్పడానికి కొందరు ప్రైవేట్ కంప్లైంట్ దాఖలు చేస్తుంటారు. అంతేకాక అసలు మౌలికంగా ఏ నేరమో ఇమిడి వుందని ఆరోపణలు చేసే అవకాశంకూడా వుంది. అలాంటప్పుడే అసలు మౌలికంగా ఏదైనా ఆరోపణ ఉందో, లేదో తేల్చుకోవడానికి గాను మెజిస్ట్రేట్‌కు కొన్ని అధికారాలున్నాయి. ఈ అధికారపరిధిలో మెజిస్ట్రేట్ ఆరోపణ చేసిన వ్యక్తి వాంగ్మూలాన్ని రికార్డు చేసిన తర్వాత కానీ, అంతకుముందు కానీ పోలీసు దర్యాప్తు అవసరమనుకుంటే పోలీసులను దర్యాప్తు చేయమని ఆదేశిస్తారు. ఒక్కోసారి అసలు ఆయనకే ఏమైనా అనుమానాలున్నట్లయితే సాక్షులందరినీ పిలిపించి విచారణ జరిపి అసలు మౌలికంగా కేసు అంటూ ఏదైనా ఉన్నదీ, లేనిదీ తెల్చుకుంటారు. ఇలా మెజిస్ట్రేట్ ఒక నిర్ధారణకు వచ్చిన మీదటే ఆయన నిందితులను హాజరుకమ్మని ఆదేశాలు జారీచేస్తారు. వచ్చిన ఆరోపణల్లో అసలు నిజం లేదనో, మౌలికంగా కేసు అంటూ ఏదీ లేదనో భావిస్తే ఆ ఆరోపణను పురస్కరించుకొని మెజిస్ట్రేట్ ఎలాంటి చర్యలూ తీసుకోరు. ఈ నిబంధన కేవలం ప్రైవేట్ కంప్లైంట్ల విషయంలోనే కాక పోలీసులు దాఖలుచేసే అరెస్టులకు కూడా వర్తిస్తుంది. సాధారణంగా పోలీసులు దాఖలుచేసే కేసుల్లో మౌలికంగా కేసు అంటూ ఏదీ ఉండదు. నూటికి యాభైనుంచి అరవై శాతం కేసుల్లో సాక్షులు ప్రాసిక్యూషన్

కథనానికి భిన్నంగా చెప్పడం అనుభవంలోని విషయం. అసలు సాక్షులకు పోలీసులు తమని ఫలానా కేసులో సాక్షులుగా పెట్టారన్న విషయం కూడా తెలియదు. కోర్టునుంచి వచ్చిన సమన్లు తీసుకుని తీరా కోర్టుకు వచ్చాకగాని, తాము ఆ కేసులో సాక్షులమన్న సంగతి తెలియదు. అసలు విషయమే తెలియని వారు సాక్ష్యమేం చెబుతారు. పోనీ మాకేం తెలియదని చెబుదామన్నా పోలీసులు వూరుకోరనే భయం ఒకవైపు పీడిస్తుంటుంది. పోలీసులను కాదనడమంటే కొరివితో తలగోక్కోవడంతో సమానమని భావించి పబ్లిక్ ప్రాసిక్యూటర్ చెప్పిందంతా విని తలూపి అదే విషయం కోర్టులో చెప్పేక ముక్కు చీదుకున్నట్టుగా బయటికి వెళ్ళి పోతారు.

ఇలా అన్యాయంగా ఏమాత్రం అధారం లేకుండా పెట్టే కేసులను కోర్టులు విచారిస్తున్నందువల్లే కోర్టుల్లో కేసుల సంఖ్య రోజురోజుకూ పెరిగి పోతోంది. అంతేగాక ప్రతీ పోలీసువాడూ రామప్ప పంతులై కోర్టుచుట్టూ తిప్పడమే శిక్షలు విధించడంగా భావిస్తున్నారు. పోలీసు కేసుల్లో కూడా మెజిస్ట్రేట్ అవసరమనుకుంటే ముందే సాక్షు లందరినీ పిలిపించి వాంగ్మూలం రికార్డుచేసుకుని మౌలికంగా కేసు అంటూ ఏదైనా వుందా లేదా తెలుసుకోవచ్చు. లేదా అసలు చార్జిషీట్‌లోనే ఆరోపణ అంటూ ఏమీ లేదనుకుంటే ఎలాంటి విచారణ జరిపించకుండా కంప్లైంట్ త్రోసిపుచ్చే అధికారం కోర్టుకు వుంది.

సెషన్స్‌కోర్టులో విచారణ జరిగే కేసులకు సంబంధించిన కంప్లైంట్ల విషయంలో మెజిస్ట్రేట్ ఆ కంప్లైయింట్‌ను దర్యాప్తు నిమిత్తం పోలీసులకు పంపే అధికారం లేదు. అంతేకాక ఈ కేసులో సాక్షులనందరినీ ముందే పిలిపించి వాంగ్మూలం రికార్డు చేసుకోవాల్సొంటుంది. మెజిస్ట్రేట్ ప్రైవేట్ కంప్లైయింట్‌లను కేవలం పోలీసులతో కాక ఇతరులతోకూడా దర్యాప్తు చేయించవచ్చు. ఇతరులు దర్యాప్తు చేసేప్పుడు వారికి వారెంటు లేకుండా అరెస్టుచేసే అధికారం మినహా పోలీసులకుండే అన్ని అధికారాలుంటాయి. పోలీసుల మీద ఆరోపణలు వున్నప్పుడు ఆ ఆరోపణలపై పోలీసులనే దర్యాప్తు చేయమనడం హాస్యాస్పదం. అవసరమనుకుంటే ఇతరులు ఎవరితోనైనా దర్యాప్తు చేయించాలి లేదా మెజిస్ట్రేట్ స్వయంగా విచారణ జరపాలి.

ప్రైవేటు కంప్లైంట్ దాఖలైన తర్వాత దర్యాప్తు చేయించేస్లయితే దర్యాప్తు నివేదిక అందిన తర్వాత మౌలికంగా కేసు ఏమీ లేదనుకుంటే మెజిస్ట్రేట్ త్రోసి పుచ్చుతారు. అలాగే ఆరోపణ చేసిన వ్యక్తి వాంగ్మూలం, సాక్షుల వాంగ్మూలం రికార్డు చేసుకుని ఆ రికార్డు ఆధారంగా కేసు విచారణ జరపాల్సిన అవసరం లేదనుకుంటే మెజిస్ట్రేట్ ప్రాథమిక దశలోనే కొట్టేస్తారు.

# కేసు విచారణ

షేర్‌సింగ్ ముఠాని చూస్తే, వూర్లో అందరికి భయమే. అతను నలుగురూ చూస్తుండగా నడిరోడ్డు మీద ఏదైనా నేరం చేస్తే దాన్ని గురించి ఎవరూ పట్టించుకోరు. అలాంటిది ఈ మధ్యన షేర్‌సింగ్ ముఠాలోని రంగయ్య ఓ కాలేజీ అమ్మాయికి కన్ను కొట్టాడు. ఆ అమ్మాయి ఆ విషయాన్ని వాళ్ళ తల్లిదండ్రులకి చెప్పింది. మర్నాడు వూరి నుంచి వచ్చిన వాళ్ళబావ పెద్ద హీరోయిక్‌గా ఫోజుపెట్టి వాడెవడో చూపించు, వాడి సంగతి నేను తేలుస్తాను అంటూ ఆ అమ్మాయికి ధైర్యం చెప్పి ఆమె వెంట కాలేజికి బయదేరాడు.

కన్ను కొట్టి కసిరికొట్టని పిల్ల చెయ్యి పట్టుకుంటే ఏం చేస్తుందో చూద్దామను కొని ధీమాగా వచ్చి ఆమె చెయ్యి పట్టుకున్నాడు రంగయ్య. అది చూసి ఆ అమ్మాయి బావ రంగయ్యమీద చెయ్యి చేసుకొన్నాడు. అంతే ఆ వెనకేవున్న అతని వర్గం విరుచు కుపడి ఆ అమ్మాయి బావని నడిరోడ్డుమీద నలుగురూ చూస్తుండగా కత్తులతో పొడిచి దారుణంగా హత్య చేశారు. ఆ షాక్‌తో నోటిమాట పడిపోయిన ఆ అమ్మాయిని బల వంతంగా అక్కడి నుంచి వాళ్ళు తీసుకుపొయ్యారు. ఆ తర్వాత ఆ అమ్మాయిని రేప్ చేసి రోడ్డు మీద వదిలేశారు. ఇంత జరిగినా అంతా చూస్తూ వూరుకొన్నారే తప్ప ఇదే మిటన్న పాపాన పోలేదు. కడుపు మండి పోయిన ఆమె తండ్రి మాత్రం పోలీస్ కేస్ పెట్టాడు. పోలీసులు కేసుదర్యాప్తు చేసి, నిందితుల మీద కోర్టులో ఛార్జిషీట్ దాఖలుచేశారు.

కోర్టు కొచ్చి సాక్ష్యం చెబితే ఖతం చేస్తామని బెదిరించారు షేర్‌సింగ్ వర్గం వాళ్ళు సాక్షులని ఈ వూళ్ళో కేసు నడిస్తే కోర్టు కెళ్ళి సాక్ష్యం చెప్పలేమని వాపొయ్యారు. సాక్షులంతా ఇక్కడ కాక మరెక్కడా కేసు విచారణ జరపడానికి వీల్లేదని కోర్టు వారు తమ నిస్సహాయతని వెలిబుచ్చారు.

*నేరం జరిగిన ప్రాంతం-కేసు విచారణ*

కేసు విచారణ నేరం జరిగిన చోట ఆ ప్రాంతంపై ఆధిపత్యం వున్న కోర్టు లోనే జరుగుతుందా లేక మరే ప్రాంతంలోనైనా విచారణ జరపవచ్చునా? సాధార ణంగా నేరం జరిగిన ప్రాంతంపై ఆధిపత్యం వున్న న్యాయస్థానాల్లోనే ఆ నేరానికి సంబంధించిన కేసు విచారణ జరుగుతుంది. అంటే నేరం జరిగిన ప్రాంతం అని మాత్రమే అర్థం చేసుకోవాలి. నేరస్తుడు దొరికిన ప్రాంతంపై వేరే న్యాయస్థానానికి ఆధి పత్యం వున్నట్లైతే ఆ న్యాయస్థానంలో ఈ నేరానికి సంబంధించిన విచారణ జరపడానికి వీల్లేదు. అంతేకాక నేరస్తుని జాతీయతతో సంబంధం లేకుండా కేవలం నేరం ఎక్కడ జరిగిందన్న విషయం యొక్క ప్రాతిపదికపైన మాత్రమే విచారణ ఎక్కడ జరపాలో నిర్ధారిస్తారు.

కరాచీలో వున్న నేరస్తుడు బొంబాయిలో వున్న ఒక వ్యాపారస్తుడికి తప్పుడు ఉత్తరాలు రాసి, ఏజంట్ల ద్వారా తప్పుడు సమాచారం పంపి తద్వారా బొంబాయిలోని వ్యాపారస్తుణ్ణి మోసగించేట్లయితే ఆ నేరం ఎక్కడ జరిగినట్లుగా పరిగ ణించాలి. ఒకవైపు నేరస్తుడు కరాచీలో వున్నాడు. మరో వైపు మోసపోయిన వాడు బొంబాయిలో వున్నాడు. ఈ విషయంలో కరాచీలో వున్న నేరస్తుడు బొంబాయిలో వున్నతనికి ఉత్తరాలు రాసాడు కనుక కేసు బొంబాయిలో జరిగినట్టుగానే పరిగణిం చాలని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది.

విచారణ ఎక్కడ జరపాలన్నది నిందితుణ్ని శిక్షించాలా లేదా అని నిర్ధారిం చుకోక ముందే కోర్టు నిర్ధారించాలి. విచారణెక్కడ జరపాలన్న సమస్య తలెత్తినప్పుడు ఆ మేరకు సాక్ష్యాధారాలు స్వీకరించి కోర్టు ఒక నిర్ణయానికి రావాలి, అంతే కాని ఈ దశలో అంతకుమించి సాక్ష్యాధారాలు స్వీకరించడానికి వీల్లేదు. అయితే నిందితుడు ఏ దశలోనైనా సరే కోర్టు విచారణా పరిధిని ప్రశ్నించ వచ్చు.

మనోవర్తి కోసం వేసుకొనే కేసులు ఈ పరిధిలోకి రావు. మనోవర్తి కోరే వారు ఏ ప్రాంతంలో నివసిస్తే ఆ ప్రాంత పరిధిలోని న్యాయస్థానంలో మనోవర్తి దర ఖాస్తు దాఖలా చేసుకోవచ్చు.

సాధారణంగా నేరం జరిగిన ప్రాంతంపై ఆధిపత్యం వున్న కోర్టుల్లోనే కేసు విచారణ జరుగుతుంది. అయితే శాసనకర్తలు నూతన శాసనాల ద్వారా మరో ప్రాంతా నికి మార్పించవచ్చు.

కుట్ర కేసులు విచారణ జరుపుతున్న న్యాయస్థానం ఆ కుట్రకి సంబం ధించి వేరొక న్యాయస్థానం పరిధిలో నేరాలు జరిగినట్లైతే ఆ నేరాల్ని కూడా విచారించ వచ్చు. వేర్వేరు నేరాలై వుండి వాటి మధ్యన ఎలాంటి సంబంధమూ లేనప్పుడు ఆయా కేసుల్లో విచారణ నేరుగానే జరుగుతుంది.

ఓ మేజిస్ట్రేట్‌కి ఆ జిల్లాలోని ఒక ప్రాంతంపై మాత్రమే ఆధిపత్యం వుండే ట్లయితే ఆ ప్రాంతంలో జరిగిన నేరాలకి సంబంధించిన కేసులని విచారించాలి. అలా కాక ఆ మేజిస్ట్రేట్‌కి ప్రత్యేకమైన అధికార పరిధి నిర్ణయించక పోయేట్లయితే ఆ ప్రాంతం మొత్తం మీద జరిగే నేరాలన్నిట్లోనూ విచారణ జరిపే అధికారం వుంటుంది.

బహుభార్యాత్వం నేరారోపణ చేసినపుడు రెండో పెళ్ళి జరిగిన ప్రాంతాన్ని నేరం జరిగిన స్థలంగా పరిగణిస్తారు. కాబట్టి ఆ ప్రాంతంపై ఆధిపత్యం వున్న కోర్టు ల్లోనే ఆ కేసు విచారణ జరుపుతారు.

ఒక మోసం జరిగినప్పుడు ఆ మోసం జరిగిన ప్రాంతంలో కానీ, నష్టం జరిగిన ప్రాంతంలోనే వున్న కోర్టుల్లో కేసు విచారణ జరుగుతుంది.

పరువునష్టం జరిగిన కేసుల్లో ఏ ప్రాంతంలోనైతే పరువు నష్టం జరిగిన అంశం ప్రచురించబడిందో ఆ ప్రాంత పరిధిలోవున్న న్యాయస్థానాలకి మాత్రమే అధి కారం వుంటుంది. అయితే వార్తాపత్రికల్లో ప్రచురించిన అంశాలు పరువునష్టం కలిగిం చేట్టుగా వున్నట్లైతే ఆ పత్రికలు వేరు వేరు ప్రాంతాలకి వెళ్తాయి కనుక ఆయా ప్రాంతాల్లో వున్న న్యాయస్థానాల్లో ఎక్కడైనా కేసు చెయ్యవచ్చు.

అక్రమ అరెస్టులు జరిగినప్పుడు ఆ అరెస్టులకి కేసు విచారణ జరిపే అధి కారం వున్న న్యాయస్థానానికి ఎలాంటి సంబంధం వుండదు. అలాగే నేరం ఒక చోట

జరిగేట్ల నిందితుణ్ని వేరే కోర్టులో లొంగిపోయిన కోర్టుకి కేసు విచారణ జరిపే అధికారం వుండదు.

విచారణ జరిపే అధికారం వున్న ప్రాంతంలో వున్న కోర్టులో విచారణ జరుగకుండా, పొరపాటున వేరొక న్యాయస్థానంలో విచారణ జరిగినట్లైతే ఆ విచారణ చెల్లనేరదనడానికి వీల్లేదు. అయితే ఇలాంటి విచారణ జరగడం వల్ల జరిగిన అనర్థాన్ని చూపించగలిగినప్పుడే మాత్రమే ఆ విచారణ చెల్లకుండా పోతుంది.

అధికార పరిధిలో లేని ప్రాంతంలో జరిగిన నేరాన్ని విచారిస్తున్నదు హైకోర్టుకనుక ఆ కేసుని ఈ కోర్టుకిబదిలీ చేసినట్లైతే అప్పుడు ఎలాంటి పరిస్థితుల్లోనూ ఆ కేసు విచారణ చెల్లకుండా పోదు.

## వేరు వేరు ప్రాంతాల్లో జరిగిన ఒకే నేరం

కొన్నికొన్ని నేరాలు ఎక్కడ జరిగాయన్నది స్పష్టంగా చెప్పలేము. అనేక ప్రాంతాల్లో ఆ నేరం జరిగి వుండొచ్చు. అలాంటప్పుడు నేరం ఎక్కడ జరిగిందన్న విషయం నిర్ధారించడం కష్టం. అలాగే ఏ న్యాయస్థానం ఆ నేరాన్ని విచారించాల్సి వుంటుందో కూడా తేల్చుకోలేము. ఉదాహరణకి ఒక నేరం కొంత వరంగల్లులోనూ కొంత హైదరాబాద్‌లోనూ జరిగివుంటే, ఆ నేరానికి సంబంధించిన కేసు విచారణ వరంగల్‌లో జరగలా హైదరాబాదులో జరగాలా అన్న సందిగ్ధస్థితి ఏర్పడుతుంది. అలాగే ఒక షాపు యజమాని సేల్స్ రిప్రజంటేటివ్‌ను విశ్వసించి, అతనికి కొన్ని వస్తువులు ఇచ్చి అమ్మి పెట్టమన్నాడనుకొందాం. ఆ రిప్రజంటేటివ్ ఆ వస్తువుల్ని తీసుకొని వెళ్ళి కలకత్తా, బొంబాయి, మద్రాసు ప్రాంతాలు తిరిగి అమ్ముకుని వచ్చాడు. అవి అమ్మగా వచ్చిన డబ్బుని అతను కాజేసినట్లయితే ఆ పని యజమాని విశ్వాసాన్ని దగా చెయ్యడం అవుతుంది. ఇది చట్ట ప్రకారం శిక్షించదగిన నేరం. ఈ నేరం రిప్రజంటేటివ్ ఎక్కడ చేసినట్లు కలకత్తాలోనా, మద్రాసులోనా, బొంబాయిలోనా అన్న విషయం నిర్ధారించడం సాధ్యం కాకపోవచ్చు. అలాంటప్పుడు ఈ మూడు ప్రాంతాల్లో ఏ న్యాయస్థానంలో కేసు విచారణ జరుగుతుంది?

ఇలాంటి కేసులు ఆయా ప్రాంతల్లోని ఏ ప్రాంతంపై అధిపత్యం వున్న న్యాయస్థానంలోనైనా విచారణ జరపవచ్చు. ఈ విషయం ఛార్జిషీటులోని అంశాల్ని బట్టి నిర్ధారిస్తారు. ఒక ప్రాంతంలో ఒక భాగమూ, మరో ప్రాంతంలో మరో భాగమూ ఇలా అంచెలంచెలుగా నేరం అనేక ప్రాంతాల్లో జరిగివుంటే ఏ ప్రాంతంలో విచారణ జరగాలన్న సందిగ్ధం ఏర్పడుతుంది. ఉదాహరణకి గోవింద్‌సింగ్ వి.ఫి.ఫి.లో ఢిల్లీ

నించి ఒక టేప్ రికార్డర్ పార్సిల్ చేసి పంపుతున్నట్లుగా చెప్పి హైదరాబాద్‌లోని కాశికి పార్సిల్ పంపుతాడు. పార్సిల్ తెరిచి చూసుకుంటే అందులో చెత్త కాగితాలు తప్ప ఏమీ ఉండవు. గోవింద్‌సింగ్ కాశిని మోసం చేశాడు. ఈ నేరం ఎక్కడ జరిగినట్టు ఢిల్లీలోనా? హైదరాబాదులోనా ఈ రెండు ప్రాంతాల్లోని ఏ ప్రాంతంలోని న్యాయస్థానంలో విచారణ జరపవచ్చు!

హైదరాబాద్‌లో వున్న యాదయ్య వరంగల్‌లో వున్న రంగారావుకి పరువునష్టం కల్గించే ఒక ఉత్తరం పోస్టు చేస్తాడు. ఇప్పుడు యాదయ్య నేరం హైదరాబాద్‌లో చేసినట్టా? వరంగల్‌లో చేసినట్టా? విచారణ ఎక్కడ జరిపించాలన్న సందిగ్ధం ఏర్పడుతుంది. ఇలాంటి పరిస్థితులలో ఈ రెండు ప్రాంతాల్లో అధిపత్యం వున్న ఏ న్యాయస్థానంలోనైనా విచారణ జరిపించవచ్చు. ఎందుచేతంటే నేరం రెండు ప్రాంతాల్లోనూ జరిగింది కాబట్టి. అయితే ఇక్కడ ఒక విషయాన్ని పరిగణనలోకి తీసుకోవాల్సి వుంటుంది. ఒక ప్రాంతంలో నేరస్తుడుండి అక్కడి నించి అతను మరో ప్రాంతంలోని వ్యక్తిని మోసగించేట్లయితే సాధారణంగా నేరానికి గురైన వారు నివసించే ప్రాంతంలోని న్యాయస్థానంలోనే విచారణ జరుగుతుంది. ఇలా జరగని పక్షంలో నేరానికి గురైన వారు మరింత నష్టపోయే ప్రమాదం వుంది.

కొన్ని నేరాలు అప్పటికప్పుడు జరిగిపోతాయి. గాయపర్చటం, హత్య చేయడం, రేప్ వంటి నేరాలు ఈ కోవలోకి వస్తాయి. మరికొన్ని నేరాలు కొనసాగుతూ వుంటాయి. క్షణ క్షణానికీ, నిమిష నిమిషానికి, రోజురోజుకి విడివిడిగా నేరంజరిగినట్లుగా పరిగణించాల్సి వుంటుంది. ఎప్పటికప్పుడు జరిగిపోయే నేరం విషయంలో నేరం జరిగిన చోటే విచారణ జరుగుతుంది. అంటే ఆ ప్రాంతంపై అధిపత్యం వున్న న్యాయ స్థానంలోనే విచారణ జరుగుతుంది. అయితే నిరంతరం కొనసాగే నేరాల విషయంలో విచారణ ఎక్కడ జరుగుతుందన్న సందేహం కలగవచ్చు. ఇలాంటి కేసుల్లో నేరం సాగిన ఏ ప్రాంతంలోనైనా విచారణ జరగవచ్చు. ఉదాహరణకి అమ్మాయిని ఇష్టా ఇష్టాలతో సంబంధం లేకుండా ఎత్తుకు వెళ్ళైతే అది కొనసాగే నేరం అవుతుంది. హైదరాబాద్ నించి అమ్మాయిని వంగల్ తీసుకువెళ్ళారనుకోండి, ఆ తరువాత అక్క డ్నించి విజయవాడ, అటు తరువాతే మద్రాస్ తీసుకెళితే హైదరాబాద్‌లోనూ, వంగల్ లోనూ, విజయవాడలోనూ, మద్రాస్‌లోనూ విడివిడిగా నేరం జరిగినట్లవుతుంది. కాబట్టి ఈ ప్రాంతాల్లో ఎక్కడైనా సరే ఉన్న న్యాయస్థానంలో కేసు విచారణ జరపవచ్చు. సాధారణంగా మొట్ట మొదట ఏ ప్రాంతలోనైతే కేసు రిజిష్టర్ చేశారో ఆ ప్రాంతం లోని న్యాయస్థానమే విచారణ జరుపుతుంది.

ఒకే ప్రాంతంలోకాక అనేక ప్రాంతాల్లో నేరం జరగవచ్చు. అలాంటప్పుడు ఆ

నేరం యిదమిద్ధంగా ఫలానాచోట జరిగిందని చెప్పలేం. మరి ఇలాంటి కేసుల విచారణ ఎక్కడ జరుగుతుందన్న సందేహం కలుగుతుంది. ఒక మనిషిని ఒక ప్రాంతంలో పట్టుకొని వేరొక ప్రాంతంలోని పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్ళి అక్కడ నిర్బంధించి, హింసించి కొంతకాలంపాటు అక్రమనిర్బంధంలో వుంచి ఆ తరువాత మరొక ప్రాంతంలోని అడవికి తీసుకెళ్ళి కాల్చేసేస్తైతే అది ఈ కోవకి చెందిన నేరం అవుతుంది. ఇక్కడ ఒక ప్రాంతంలో అరెస్టు చేయడంతో నేరం ప్రారంభం అయ్యింది, ఆ తరువాత ఇంకొకచోట నిర్బంధించడంతో అక్కడికీ నేరం కొనసాగింది. చివరికి అడవికి తీసుకెళ్ళి కాల్చేయడంతో నేరం అంతం అయ్యింది.

ఇలాంటి కేసుల్లో నేరం జరిగిన ఏ ప్రాంతంలోనైనా వున్న న్యాయస్థానానికి కేసు విచారించే అధికారం వుంటుంది.

ఒక చర్య నేరంలో భాగమైనప్పుడు మాత్రమే ఇలాంటి కోవకి చెందిన నేరంగా భావించాలి. అంతేకానీ నేరం చేయడానికి నేరస్థుడు సంసిద్ధుడయ్యే క్రమంలోని చర్యల్ని ఇందులో భాగంగా అభివర్ణించడానికి వీల్లేదు.

హైదరాబాద్‌లో నేరం చేయడానికి కుటపన్ని ఆ తరువాత కుట్రలో భాగంగా వరంగల్‌లో నేరం చేసేస్తైయితే అది ఈ కోవకి చెందిన నేరం అవుతుంది. కాబట్టి విచారణ హైదరాబాద్‌లోనైనా వరంగల్లోనైనా జరగవచ్చు. అలాగే దోపిడీలు చేయడానికి అలవాటు పడిన దొంగలు ముఠాలుగా ఏర్పడినట్లయితే, వాడు ముఠాకట్టిన ప్రాంతంలోనైనా, ఆ తరువాత దోపిడీచేసిన మరే ప్రాంతంలోనైనా సరే వున్న న్యాయస్థానాల్లో కేసు విచారణ జరగవచ్చు.

ఒకే నేరానికి సంబంధించి కోర్టు పరిధిని అధిగమించి నిందితుడువేరే ప్రాంతాల్లో నేరం చేసినప్పుడు ఆయా ప్రాంతాల పరిధిలో జరిగిన నేరాలని కూడా విచారించే అధికారం ఈ న్యాయస్థానానికి వుంటుంది. ఉదాహరణకి హైదరాబాద్ నించి ఒక అమ్మాయిని ఎత్తుకుపోయి మద్రాస్‌లో రేప్ చేసినట్లయితే హైదరాబాద్ కోర్టు మద్రాస్‌లో జరిగిన రేప్‌ని కూడా విచారించవచ్చు.

## కేసు విచారణ జరపాల్సిన కోర్టు

నలుగురు గూండాలు కేశవరావు వెంట పడ్డారు. కేశవరావు పరిగెత్తుకుంటూ వెళ్ళి కరీంనగర్ వెళుతున్న బస్ ఎక్కబోయాడు. గూండాలు అతన్ని పట్టుకుని కత్తితో పొడిచారు. కేశవరావు వాళ్ళను విదుల్చుకుని గాయంతోటే బస్ ఎక్కేసి, వాళ్ళ నుంచి తప్పించుకున్నాడు. గాయంనుంచి రక్తం బాగాకారింది. కరీంనగర్‌లో బస్ దిగగానే

బస్‌లోవాళ్ళంతాకలసి అతన్ని తీసుకెళ్ళి హాస్పటల్లో చేర్చారు. హాస్పటల్‌లో కేశవరావు గాయంతో మరణించాడు. పోలీసులు కేసు రిజిస్టర్ చేసి హైద్రాబాద్ బస్టాప్‌లో కేశవరావుని గాయపర్చిన గూండాల్ని అరెస్టు చేశారు. ఇప్పుడు కేశవరావు హత్య కేసు హైద్రాబాద్ కోర్టులో నడవాలా, కరీంనగర్ కోర్టులో నడవాలా అన్న సందేహం కలుగుతుంది. సాధారణంగా నేరం జరిగిన చోటే కేసు నడవాలంటారు. మరి ఈ కేసులో నేరస్తులు కేశవరావుని హైద్రాబాద్‌లో గాయపర్చారంటే నేరం హైద్రాబాద్‌లో జరిగినట్లా? కేశవరావు కరీంనగర్‌లో చనిపోయాడు కాబట్టి కరీంనగర్‌లో జరిగినట్లా?

ఇలాంటి కేసుల్లో నేరం జరిగిన చోటుకానీ పర్యవసానం సరిసమానమైన చోటుకాని నేరం జరిగినట్లుగా పరిగణించి రెండు ప్రాంతాల్లో ఎక్కడైనాసరే విచారణ జరపవచ్చు.

ఒక నేరం జరగడానికి దాని పర్యవసానంతో ఎలాంటి సంబంధంలేనప్పుడు ఎక్కడైతే నేరం జరిగిందో అక్కడే విచారణ జరగాల్సి వుంటుంది. ఒక చర్య జరగడమూ అది అక్కడితో నేరం పరిసమాప్తం అవడమూ, అయితే చర్య ఎక్కడైతే జరిగిందో అక్కడే నేరం జరిగినట్లుగా భావించాలి. భావించి విచారణ జరుపుతారు. ఓ చోట నేరం జరగడమూ తిరిగి అదే నేరం మరోచోట జరగడమూ పూర్తిగా వేర్వేరు నేరాలుగా పరిగణించాలి.

ఉదాహరణకు మద్రాస్‌కి చెందిన ఒక వ్యక్తి కలకత్తాకు చెందిన వ్యక్తి డబ్బుని మద్రాస్‌లో దుర్వినియోగపర్చినట్లయితే కలకత్తాలోని వ్యక్తి కలకత్తా కోర్టులో కేసు వెయ్యడానికి వీలులేదు. ఈ నేరానికి సంబంధించిన కేసు మద్రాస్ కోర్టులోనే విచారణ జరగాల్సి వుంటుంది.

ఢిల్లీలో ఒక వ్యక్తి మరో వ్యక్తిని మోసగించాడనుకుందాం. పర్యవసానంగా నాగపూర్‌లోని ఒక వ్యక్తి నష్టపోయాడు. అలాంటప్పుడు ఢిల్లీ మోసగాడి మీద నాగపూర్‌లో కేసు నడపడానికి వీల్లేదు. నేరం ఢిల్లీలోనే జరిగింది కనుక దర్యాప్తు ఢిల్లీ పోలీసులే జరిపి, విచారణ ఢిల్లీ కోర్టులోనే జరపాల్సి వుంటుంది.

సహజ పర్యవసానంగా నష్టం జరిగినప్పుడు మాత్రమే ఇలా రెండు ప్రాంతాల్లోని న్యాయస్థానాలకు విచారణ జరిపే అధికారం వుంటుంది. అలా కానిపక్షంలో నేరం జరిగిన ప్రాంతంలోని న్యాయస్థానమే కేసు విచారణ జరుపుతుంది.

పరువునష్టం కేసుల్లో ఎక్కడైతే పరువునష్టం కలుగుతుందో అక్కడ వున్న న్యాయస్థానంలోగాని ఎక్కడైతే నేరస్తుడు పరువునష్టానికి పాల్పడ్డాడో అక్కడా విచారణ జరపవచ్చు.

కుట్ర కేసుల్లో కూడా కుట్ర ఒకచోట వుండి పన్నడమూ ఆ తర్వాత దాన్ని

వేరొకచోట అమలుపర్చడమూ జరుగుతుంది. ఒక నేరం చెయ్యడానికి కుట్ర పన్నడం నేరం. అలాగే నేరానికి పాల్పడడం కూడా నేరమే అవుతుంది. అయితే కుట్ర పర్యవసానంగా నేరం జరిగినప్పుడు నేరం జరిగిన ప్రాంతంలోగాని, కుట్ర జరిగిన ప్రాంతంలో గాని ఎక్కడైనా సరే నేరవిచారణ జరపవచ్చు.

భారతదేశంలో కాకుండా మరేదైనా దేశంలో నేరం జరిగేటట్లయితే అప్పుడు ఏ పరిస్థితుల్లోనూ భారతదేశంలోని న్యాయస్థానానికి ఈ నేరానికి సంబంధించిన విచారణ జరపడానికి అవకాశం వుండదు. అయితే ఈ విషయంలో కొన్ని మినహాయింపులు వున్నాయి.

హైద్రాబాద్‌లో వున్న ఒక నాయకుడు బొంబాయిలో వున్న ఒక వ్యక్తిని హత్య చేయాల్సిందిగా జనాన్ని పురిగొల్పుతాడు. పర్యవసానంగా బొంబాయిలో హత్య జరిగింది. ఇలాంటప్పుడు పురికొల్పినందుకు హైద్రాబాద్ నాయకుడి మీద ఎక్కడ విచారణ జరపాలి ? హైద్రాబాద్‌లోనా ? బొంబాయిలోనా ? అన్న సందేహాలు కలుగుతాయి.

పురికొల్పినందుకుగాను ఈ రెండు ప్రాంతాల్లో ఎక్కడైనాసరే నాయకుడి మీద విచారణ జరపవచ్చు.

ఒక వ్యక్తి వరంగల్‌లో దొంగతనం చేస్తే, హైద్రాబాద్‌లోని మరో వ్యక్తి ఆ దొంగసొమ్ము అమ్మాడు; అది దొంగ సొత్తు అని తెలిసికూడా హైద్రాబాద్ నివాసి అది కొని దగ్గర వుంచుకోవడం నేరం. మొదట జరిగిన దొంగతనంనేరంతో ఇతనికి సంబంధంలేదు. తదుపరి దొంగసొత్తు వుంచుకోవడం ద్వారా ఇతను మరో నేరానికి పాల్పడ్డాడు. ఇలాంటప్పుడు ఇతని మీద కేసు వరంగల్‌లో నడుస్తుందా? హైద్రాబాద్‌లో నడుస్తుందా అన్న సందేహం కలగవచ్చు. ఈ రెండు ప్రాంతాల్లో ఎక్కడైనా సరే వున్న న్యాయస్థానాల్లో ఈ కేసు విచారణ జరపవచ్చు.

విజయవాడ నుంచి ఒక మైనర్ బాలుడిని అంకయ్య అపహరించి గుంటూరులోని అతని స్నేహితుని ఇంట వుంచాడు. గుంటూరులోని అతని స్నేహితుడికి అతను అపహరించి తెచ్చిన బాలుడని తెలుసు. గుంటూరులోని వ్యక్తిపైన విచారణ విజయవాడలో జరుపుతారా? గుంటూరులో జరుపుతారా? ఈ కేసు విచారణ గుంటూరులోకాని, విజయవాడలోకాని ఎక్కడైనా సరే జరపవచ్చు.

ఒకే విషయానికి సంబంధించి రెండు భిన్నమైన నేరాలు సంభవించినప్పుడు ఎక్కడైనా సరే విచారణ జరపవచ్చు. అలాగే మొదటి ఘటన నేరంకాకపోయినా ఆ తర్వాత జరిగేది నేరమైనప్పుడు కూడా ఈ నిబంధనను వర్తింపజెయ్యవచ్చు.

ఒక నేరం చెయ్యడానికి పురికొల్పడం కూడా నేరమే అవుతుంది.

అలాంటప్పుడు కూడా ఈ నిబంధన వర్తిస్తుంది. ఉదాహరణకు 'బి'ని చంపమని పురికొల్పాల్సిందిగా హైదరాబాద్‌లోని 'జెడ్'నిపురికొల్పాడమనుకుందాం. పర్యవసానంగా 'జెడ్' 'సి'ని పురికొల్పి 'బి'ని హత్య చేయించాడనుకుందాం. మొదట పురికొల్పిన ప్రాంతం ఒకటీ ఆ తర్వాత పురికొల్పిన ప్రాతం మరొకటీ, హత్య జరిగిన ప్రాంతం వేరొకటీ అయినప్పుడు ఈ మూడుప్రాంతాల్లో ఎక్కడైనాసరే కేసు విచారణ జరపవచ్చు. ఈ మూడుచర్యలుకూడ విడివిడిగా చూసినప్పుడు విడివిడి నేరాలే అవుతాయి. అందుచేత ఈ మూడు ప్రాంతాల్లో ఎక్కడైనాసరే విచారణ జరిపించవచ్చు.

### *దొంగతనం, ఎత్తుకుపోవడంలాంటి నేరాలు*

అనివార్యంగా కొందరు నేరాలు చేస్తారు. కొందరిలో క్రూరత్వం గూడుకట్టుకుని పోయినందువల్ల నేరాలు చేస్తారు. క్రూరత్వం తోటే, దుర్మార్గంతోటే నేరాలు చేసే వారిని మనం నిత్యం చూస్తూవుంటాం. "నీ మెడలోవున్న నగలు ఇచ్చెసెయ్ కాదంటే నీ పీక తప్పించేస్తా'నని కత్తి చూపించి బెదిరించి నగలు దోచుకుపోయిన వారిని చూశాం. నగలు ఇవ్వనందుకు పీక తప్పించేసిన దుర్మార్గులనూ చూశాం. అలాగే క్రూరంగా, మహా దుర్మార్గంగా హత్యలు చేసేవారిని, దోపిడీలు చేసేవారిని, దోపిడి ముఠాల్లోని వారిని, చట్టబద్ధంగా నిర్బంధించగా తప్పించుకు పోయినవాళ్ళనూ చూస్తున్నాం. ఇలాంటి వారి దుర్మార్గానికి, క్రూరత్వానికి అంతూ పొంతూ వుండదు. వాళ్ళు ఎక్కడపడితే అక్కడ ఎప్పుడుపడితే అప్పుడు క్రూరులుగానే, దుర్మార్గులుగానే వుంటారు. ఇలాంటి వారు చేసే నేరాలకు సంబంధించిన కేసులు దర్యాప్తు ఎక్కడని చేస్తారు. ఏ న్యాయ స్థానాలకు ఈ కేసులు విచారించే అధికారం వుంటుంది? వంటి ప్రశ్నలు తలెత్తుతాయి.

కొన్ని నేరాలకు సంబంధించిన కేసులు దర్యాప్తు ఎక్కడ జరగాలి? విచారణ ఎక్కడ జరగాలి? అన్న అంశాలపై చట్టం కొన్ని స్పష్టమైన నింబంధనలు విధించింది. ఇంతకు ముందు ఉదాహరించిన కేసుల్లో దర్యాప్తు, విచారణ నిందితుడు దొరికిన చోటకాని, నేరం జరిగిన చోటకాని జరుపుతారు.

ఎవరినైనా ఎత్తుకుపోవడంగానీ, బలవంతంగా తీసుకెళ్ళడంగాని నేరం. ఇలా ఎత్తుకు వెళ్ళిన వాళ్ళనుకాని, తీసుకెళ్ళిన వాళ్ళనుగాని వుంచుకునేటట్లయితే అలా వుంచుకున్నంతకాలం నేరమే అవుతుంది. ఇలాంటి కేసుల్లో నేరం నిరంతరం కొనసాగుతుంది. అలాగే ఒకతను ఒక అమ్మాయిని ఎత్తుకుపోయి వేరొకతని వద్ద వుంచాడనుకుందాం. అలా ఆ అమ్మాయిని తెలిసి వుంచుకున్న వ్యక్తి ఆ అమ్మాయిని అమ్మెయ్యాలని ప్రయత్నం చేసినట్లయితే అది వేరే నేరం అవుతుంది. ఈ వ్యవహారం మొత్తంలో ఆ అమ్మా

యిని ఎత్తుకురావడం, నిర్బంధంలో వుంచడమూ, అమ్మాలని చూడడమూ అన్న మూడు విడివిడి నేరాలు ఇమిడివున్నాయి. ఈ మూడు నేరాలు వేర్వేరు ప్రాంతాల్లో జరిగే టట్లయితే అప్పుడు ఈ కేసు విచారణ ఎక్కడ జరుగుతుంది. సాధారణంగా ఇలాంటి కేసుల్లో నేరం జరిగిన చోటగాని, ఎత్తుకుపోబడిన వారు లభించిన చోటగాని, నిర్బంధించిన చోటగాని వున్న న్యాయస్థానాల్లో విచారణ జరుగుతుంది. ఒకవేళ అమ్మాయి అమ్మకం జరిగితే ఈ నేరం జరిగినచోటే విచారణ జరగాలి.

దొంగతనం, ఎత్తుకుపోవడంవంటి నేరాలు నేరం జరిగినచోటగాని, నేరస్తుడు దొంగ సొత్తుతో దొరికిన చోటగాని, దొంగ సొత్తని తెలిసినా కూడా అది వుంచుకున్న వ్యక్తి దొరికిన చోటగాని విచారణ జరుపుతారు.

అక్రమంగా దొంగ లెక్కలు చూపి సొమ్ము స్వాహా చేసే నేరాలకు సంబంధించిన కేసుల్లోనూ, విశ్వాసరాహిత్యానికి సంబంధించిన నేరాలకు సంబంధించిన కేసుల్లోనూ దొంగిలించిన చోటగాని, నేరం జరిగిన చోటగాని విచారణ జరువుతారు.

దొంగ సొత్తు వుంచుకోవడానికి సంబంధించిన నేరాల విచారణ నేరం జరిగిన చోటకాని, దొంగ సొత్తు అని తెలిసీ వుంచుకున్న వ్యక్తి వున్న చోటగాని, అది లభించిన చోటగాని జరుపుతారు.

చట్టం నిర్దేశించిన చోట విచారణ జరగనంత మాత్రాన ఆ విచారణ చెల్లకుండా పోదు. అయితే కేసులో ఈ కారణంగా న్యాయం జరగలేదని తేలినప్పుడు మాత్రమే విచారణ చెల్లదు.

కొన్నిసార్లు కొన్ని నేరాలు ఫోన్ల ద్వారా, ఉత్తరాల ద్వారా, టెలిగ్రామ్‌ల ద్వారా జరుగుతాయి. అలాంటప్పుడు ఈ నేరాలకు సంబంధించిన విచారణ ఎక్కడ జరపాలన్న సమస్య తలెత్తవచ్చు. అలాంటప్పుడు మోసంతో సహా ఇలా జరిగే అన్ని నేరాలు ఎక్కడనుంచైతే ఆ సమాచారం, ఉత్తరాలు, టెలిగ్రాములు, ఫోన్లు పంపబడ్డాయో అక్కడినుంచిగాని ఎక్కడైతే వాటిని అందుకుని నష్టపోవడం జరిగిందో అక్కడగాని కేసు విచారణ జరపవచ్చు. బహుభార్యాత్వ నేరానికి పాల్పడ్డ వారి విషయంలో ఎక్కడైతే నేరం జరిగిందో అక్కడగాని, మొదటి పెళ్ళి జరిగిన చోటగాని, మొదటి భార్యతో శాశ్వత నివాసం ఏర్పర్చుకున్న చోటగాని, చివరిగా నివసించిన చోటగాని వున్న న్యాయస్థానాల్లో ఎక్కడైనా సరే విచారణ జరపవచ్చు.

ప్రయాణాల్లో నేరాలు జరిగేటట్లయితే ఆ నేరం ఏ ప్రాంతంలో జరిగిందో అక్కడే విచారణ జరుపుతారు. ఉదాహరణకు హైద్రాబాద్ నుండి ఢిల్లీ వెళుతున్న రైలులో నాగాపూర్‌కు సమీపంలో హత్య జరిగిందనుకుందాం. ఈ హత్య కేసు విచారణ నాగపూర్ ప్రాంతంలోని న్యాయ స్థానంలోనే జరుగుతుంది. అలాగే హైద్రాబాద్

నుంచి వరంగల్ వెళ్ళే రైల్లో మధ్యన దొంగతనం జరిగేటట్లయితే ఆ కేసు వరంగల్ లోని న్యాయ స్థానంలో విచారణ జరపవచ్చు.

సాధారణంగా ఇలాంటి నేరాలు జరిగినప్పుడు అది ఖచ్చితంగా ఫలానా చోట జరిగాయని చెప్పలేం. అందుచేత చట్టం విచారణకు సంబంధించి ఇలాంటి నిబంధనలను విధించింది.

*ఒకే వ్యక్తిపై అనేక కేసులు విచారణ*

ఒకే వ్యక్తి మీద చాలా కేసులు వున్నప్పుడు వాటినన్నింటిని కలిపి విచారణ జరపాల్సిన అవసరం వచ్చినప్పుడు ఈ నేరాలు విచారణ జరపడానికి అధికారమున్న ఏ న్యాయస్థానం లోనైనా అన్ని కేసులు కలిపి విచారణ జరపవచ్చు. అలాగే అనేక మంది మీద దాఖలైన విడివిడి కేసులు సంయుక్తంగా విచారించాల్సి వచ్చినప్పుడు ఆ నేరాలు జరిగిన ప్రాంతల్లో వున్న ఏ న్యాయస్థానమైనాసరే అన్ని కేసుల్ని సంయుక్తంగా విచారించవచ్చు.

## కేసు విచారణ, అధికార పరిధి

చట్టం విధించిన నిబంధనలకు సంబంధం లేకుండా రాష్ట్ర ప్రభుత్వం ఒక జిల్లాలోని కేసుల్ని మరో జిల్లాలో విచారింపజేయవచ్చు. అయితే ప్రభుత్వ ఉత్తర్వుల్లో ఈ విషయానికి సంబంధించి ఇంతకుముందు హైకోర్టుకాని, సుప్రీంకోర్టుకాని ఇచ్చిన ఆదేశాలకు భిన్నంగా వుండడానికి వీలులేదు.

ఒకే నేరానికి సంబంధించి రెండు మూడు న్యాయస్థానాలు విచారణ తలపెట్టి నప్పుడు హైకోర్టు కల్పించుకుని ఏ కోర్టు విచారించాలో నిర్ణయించవచ్చు. ఒకవేళ వేర్వేరు హైకోర్టుల పరిధిలోని న్యాయస్థానాలు విచారణ తలపెట్టినప్పుడు ముందుగా ఏ హైకోర్టు పరిధిలో న్యాయస్థానం విచారణ తలపెట్టిందో ఆ న్యాయస్థానికే విచారించే హక్కు వుంటుంది. తన అధికార పరిధిలో నివసించే వ్యక్తి తన అధికార పరిధి బయట నేరం చేసినట్లు తెల్సినప్పుడు ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్ ఆ వ్యక్తిని సమన్ చేసి అతని పైన కేసు విచారణ జరపవచ్చు. అయితే ఎప్పుడయితే మెజిస్ట్రేట్ తన పరిధిలో లేని ప్రాంతంలో నేరం జరిగిందని నిర్ధారించుకుంటాటో అప్పుడు ఆ వ్యక్తిని విచారణ జరిపే అధికారమున్న మెజిస్ట్రేట్ ముందు హాజరుకమ్మని ఆదేశిస్తారు. సాధారణంగా ఇలాంటి కేసుల్లో వ్యక్తుల హాజరుకోరినప్పుడు ఇంతకు ముందు చెప్పినట్లుగానే సమన్లు మామూలు కేసుల్లో జారీ చేసినట్లుగానే చేస్తారు. ఎవరికైతే సమన్లు జారీ చేస్తారో అతను

ఆ సమన్లను పురస్కరించుకొని కోర్టుకు హాజరుకాని పక్షంలో కోర్టు అతనికి వారంటు ఇస్తుంది. అప్పుడు అతన్ని మామూలుగానే పోలీసులు అరెస్టు చేసి కోర్టుముందు హాజరుపరుచుతారు.

సమన్లు తీసుకోవడానికి నిరాకరించినట్లయితే వాటిని సమన్లు ఎవరికైతే ఉద్దేశించబడ్డాయో వారు చూసి తెల్సుకోవడానికి వీలుగా గోడమీద అతికిస్తారు. ఇలా చేయడం ద్వారా సమన్లు అందినట్లు కోర్టు పరిగణిస్తుంది. ప్రాథమికంగా విచారణ జరిపి నేరం జరిగిన ప్రాంతం తన పరిధిలోదని నిర్ధారించుకున్న తర్వాత మెజిస్ట్రేటు అధికార పరిధిలోనున్న కోర్టులో నిందితుణ్ని హాజరుపరిచే ఏర్పాటు చేస్తారు. జరిగిన నేరానికి జీవితఖైదు కాని మరణశిక్ష కానీ విధించడానికి అవకాశం ఉన్నప్పుడు మెజిస్ట్రేటు నిందితుడికి బెయిలు మంజూరు చేయరు. ఇహ మిగిలిన నేరాల విషయంలో మెజిస్ట్రేటు నిందితుడు కోరేట్లయితే అతనికి బెయిలు మంజూరు చేస్తూ నిందితుడ్నించి అవసరమనుకుంటే మెజిస్ట్రేటు జామీను కోరతారు. అంతేకాక నిందితుడ్నించి అధికార పరిధిలోని మెజిస్ట్రేటు ముందు హాజరవుతానన్న హామీని కూడా మెజిస్ట్రేటు తీసుకుంటారు.

ఇలాంటి కేసుల్లో అధికార పరిధి ఉన్న మెజిస్ట్రేటులు ఒకరికి మించి ఉన్నారని విచారణ జరిపిన మెజిస్ట్రేటు భావించేట్లయితే ఏ మెజిస్ట్రేటు ముందు నిందితుడ్ని హాజరుపరచాలని నిర్ధారించుకోవడానికి విషయాన్ని హైకోర్టుకు నివేదిస్తారు. ఆ తర్వాత హైకోర్టు ఆదేశం మేరకు నిందితుడ్ని వేరే మెజిస్ట్రేటు సమక్షంలో హాజరుపరుస్తారు.

భారత పౌరులు భారతదేశం వెలుపల సముద్రం మీద కాని మరెక్కడైనా కాని నేరం చేసేట్లయితే అతడు భారతదేశంలోనే నేరం చేసినట్లుగా పరిగణించి విచారణ జరుపవచ్చు.

అలాగే భారతపౌరులు కాని వాళ్ళుకూడా భారత విమానాల్లోనూ, ఓడల్లోనూ నేరానికి పాల్పడినట్లయితే వాళ్ళమీద కూడా విచారణ జరుపవచ్చు. అయితే ఈ రెండు కోవలకి చెందిన నేరస్తుల మీద విచారణ జరిపేముందు కేంద్రం ప్రభుత్వం నుంచి అనుమతి పొందాల్సి ఉంటుంది. ఇలా భారతదేశం వెలుపల జరిగిన నేరాలలో విచారణ జరుపుతున్నప్పుడు అవసరమనుకుంటే కేంద్ర ప్రభుత్వం ఆయా ప్రాంతాలలోని న్యాయాధిపతులు రికార్డు చేసిన సాక్ష్యాల్ని, తదితర లిఖితపూర్వక ఆధారాల్ని భారత ప్రతినిధిముందు ఉంచవలసిందిగా కోరతారు. ఈ ఆధారాలన్నింటిని విచారణ జరుపుతున్న కోర్టు సాక్ష్యాలుగా పరిగణిస్తుంది. అవసరమనుకుంటే కోర్టు ఈ సాక్ష్యాధారాల్ని విచారించడానికి కమీషన్‌ని నియమిస్తుంది.

# హాజరు మాఫీ

సోమశేఖరాన్ని బెయిల్ మీద విడుదలచేశారు. అతనొక యాక్సిడెంట్ కేసులో ముద్దాయి. మోటార్‌సైకిల్‌ను వేగంగా నడిపి అశ్రద్ధవల్ల యాక్సిడెంట్ చేశాడని, ఆ యాక్సిడెంట్ కారణంగా ఒక ముసల్ది చనిపోయిందని అతని మీద పోలీసులు కేసు

బనాయించారు. ఆ యాక్సిడెంట్‌లో ముసల్ది చనిపోయిందనేసరికి సోమశేఖరానికి ముచ్చెమటలు పోశాయి. రోడ్డుమీద పోయే జనం రెచ్చిపోయి తనని కొట్టి చంపుతారనే భయంతో అతను పారిపోయి పోలీసులకు లొంగిపోయాడు. పోలీసులు విషయమంతా విని అతడ్ని కస్టడీలోకి తీసుకున్నారు. ఆ తర్వాత ముసల్దాని కొడుకు దగ్గరనుండి కంప్లైంట్ తీసుకొని అతనిమీద యాక్సిడెంట్ కేసుపెట్టి మరునాడు కోర్టులో హాజరు పరిచారు. కోర్టువారు అతనికి బెయిల్ ఇచ్చారు. జామీను గనుక ఇవ్వకపోయేట్లయితే అతన్ని 14 రోజులపాటు రిమాండ్‌లో వుంచవలసిందని కూడా కోర్టు ఆదేశించింది.

జామీను పెట్టుకొని సోమశేఖరం బెయిల్ మీద విడుదలైన తర్వాత అతను 14వ రోజు కోర్టుకు హాజరయ్యాడు. అతన్ని కోర్టు వారేమీ అడగలేదు. ఇరవైరోజుల వరకు కేసు వాయిదావేశారు. ఆ వాయిదాకు కూడా సోమశేఖరం హాజరయ్యాడు. కోర్టువారు మళ్ళీ వాయిదా వేశారు. ఇలా కోర్టు వాయిదా వేస్తూనే వుంది. సోమశేఖరం కోర్టుచుట్టూ తిరుగుతూనే వున్నాడు. పోలీసులు చార్జిషీట్ దాఖలు చేయనందువల్ల కేసు ముందుకు సాగడంలేదు.

ఇలా పోలీసులు చార్జిషీట్ దాఖలు చేయకపోయినప్పటికీ ముద్దాయి కోర్టుచుట్టూ తిరగవలసిందేనా? చార్జిషీటు దాఖలు చేసినప్పుడే కేసులో ఆరోపణ చేసినట్లవుతుంది. అలాంటప్పుడు ఆరోపణ అంటూ ఏమీ లేకుండా కోర్టుచుట్టూ తిప్పడం అర్థంలేనిపని. దీనివల్ల కోర్టుకీ ముద్దాయికీ కూడా అసౌకర్యం. నడవని కేసులు వాయిదా వేస్తుండటం వల్ల కోర్టు వారికి పని భారం పెరుగుతుంది. అలాగే ముద్దాయికి కోర్టు చుట్టూ తిరగడం పరోక్షంగా శిక్షగా పరిణమిస్తోంది.

వాస్తవానికి ఇంతకుముందు చెప్పిన ఉదాహరణలో సోమశేఖరం మీద పెట్టిన యాక్సిడెంట్ కేసు బెయిలబుల్ నేరం. కాబట్టి ఈ కేసులో ముద్దాయికి పోలీసులే బెయిలివ్వాలి. ఒకవేళ సోమశేఖరానికి మామూలుగా పోలీసులు బెయిలిచ్చివుంటే కోర్టునుంచి హాజరు కమ్మని సమన్లు వచ్చినప్పుడు మాత్రమే అతను కోర్టుకు హాజరు కావల్సి వుండేది. అంటే పోలీసులు చార్జిషీటు దాఖలు చేసేంత వరకు అతను కోర్టుచుట్టూ తిరిగే అగత్యం పట్టేదికాదు. దీనిని బట్టి ఒక విషయం స్పష్టమవుతోంది. చార్జిషీటు పెట్టేంత వరకు పోలీసులు బెయిలిచ్చినప్పుడు నిందితుడు కోర్టుకు హాజరుకానవసరంలేదు అయితే ఈ సూత్రం కోర్టువారు బెయిల్ మీద విడుదల చేసినప్పుడు ఎందుకు వర్తించదు?

నిజానికి చార్జిషీటు దాఖలై కోర్టు నించి సమన్లు వచ్చేంతవరకూ ఏ కేసులో ముద్దాయి అయినా సరే బెయిల్ మీద విడుదలైన తర్వాత కోర్టుకు హాజరుకానవసరం లేదు. కోర్టులకు కూడా చార్జిషీటు దాఖలు చేయడానికి ముందు నిందితుల హాజరుగురించి

సమన్లుగాని వారెంట్‌గాని ఇచ్చే అధికారం లేదు. ఒక్కోసారి దర్యాప్తులో ముద్దాయి మీద అసలు కేసేలేదని తెలితే పోలీసులు ఆ విషయం పేర్కొంటూ తుదినివేదిక కోర్టు వారికి సమర్పిస్తారు. అలాంటప్పుడు ముద్దాయిమీద ఆరోపణ ఏమీలేదు కాబట్టి అతన్ని హాజరుకమ్మని కోర్టు ఆదేశించదు. బెయిల్‌మీద విడుదలైన ముద్దాయికి హాజరు మాఫీ గనక ఇవ్వకపోయేట్లయితే ఈ పరిస్థితుల్లో వృధాప్రయాసే అవుతుంది. చార్జిషీటుదాఖలు చేయనప్పుడు కూడా ముద్దాయిని కోర్టు చుట్టూ తిప్పడమేగాక అసలు ఏ పరిస్థితుల్లో నైనా కోర్టుకు రాలేకపోయేట్లయితే వారెంటిచ్చి అతన్ని అరెస్టు చేయించి కొన్నిసార్లు కోర్టు బెయిల్ రద్దుచేస్తున్నది. ఇది పూర్తిగా అన్యాయం. అసలు వారెంట్ ఇవ్వడానికి కోర్టుకి అధికారం లేనప్పుడు ఇలాంటి చర్యకు పూనుకోవడం పూర్తిగా చట్టవిరుద్ధం. ఒకవేళ కోర్టు వారెంట్ ఇవ్వదలచినప్పటికీ చార్జిషీటు ఇచ్చే వరకూ వేచిచూడాల్సిందే తప్ప అంతకు ముందివ్వడానికి అధికారం లేదు.

బెయిల్ పై విడుదల చేసేప్పుడు ఇచ్చే పూచీకత్తు బాండ్‌లపై గానీ వ్యక్తిగత పూచీ బాండ్‌పైగానీ తనపై ఆరోపించిన ఆరోపణలకి సమాధానం చెప్పుకోడానికిగాను ఫలానా తేదీన (కోర్టు నిర్దేశించిన) హాజరుకాగలదని హామీ ఇస్తున్నట్టుగా వుంటుంది. అంటే ఆరోపణలకి సమాధానంగా మాత్రమే ముద్దాయి కోర్టుకు హాజరవుతాడని అర్థం. అసలు ఆరోపణ అంటూ ఏదీలేని దశలో ముద్దాయి దేనికి సమాధానం చెప్పుకోడానికి కోర్టుకు హాజరు కావాలి. కాబట్టి అతను కోర్టుకి ఈ దశలో హాజరుకానవసరం లేదని స్పష్టమవుతోంది.

1982లో ఒకకేసులో సుప్రీం కోర్టు తీర్పు చెబుతూ ఈ విషయాన్ని ధృవీకరించింది. బెయిల్‌మీద విడుదల చేసేప్పుడు చార్జిషీటు దాఖలై కోర్టునించి సమన్లుకాని, వారెంట్‌గాని అందేంతవరకూ ముద్దాయి కోర్టుకు హాజరుకానవసరంలేదని సుప్రీంకోర్టు తన తీర్పులో పేర్కొంది. అంతేగాక కోర్టు ఈ దశలో ముద్దాయిని హాజరుకమ్మని ఆదేశించడం మంచిది కాదని సుప్రీంకోర్టు వివరించింది. ఒకవేళ చట్టం ఇలా చెబుతున్నప్పటికీ చాలా వరకు మెజిస్ట్రేట్ కోర్టులు ఈ విషయాన్ని అమలుపరచడంలేదు. కొందరు మెజిస్ట్రేట్‌లు చార్జిషీటు దాఖలైన తర్వాత ముద్దాయి దొరుకుతాడో దొరకడోనని అతనికి సమన్లు బట్వాడా చేయడానికి పోలీసులకనవసరమైన శ్రమనిభావించి ముద్దాయికి హాజరు మాఫీ ఇవ్వరు. దాంతో ముద్దాయి అనవసరంగా కోర్టుచుట్టూ సంవత్సరాల తరబడి తిరగాల్సి వస్తుంది. అసలు పోలీసులు కోర్టు ముందుకు తెచ్చే ప్రతివాదినీ నేరస్థుడుగా భావించే ఇలాంటి మెజిస్ట్రేట్‌లు కేసుల్లో నిష్పక్షపాతంగా వ్యవహరించి న్యాయం చేస్తారని భావించలేం.

చార్జిషీట్ దాఖలైన తర్వాత మాత్రమే కేసు విచారణ ప్రారంభమవుతుంది.

కేసు విచారణ సాగుతున్నంత కాలం నిందితులు కోర్టుకు హాజరుకావాలి. నిందితుడికి వ్యతిరేకంగా సాగే తతంగమంతా అతనికి తెలువకుండా సాగడానికి వీల్లేదు. ఇవన్నీ ముద్దాయికి తెలవడం వలన అతడు ఎప్పటికప్పుడు సంజాయిషీ చెప్పుకొనే అవకాశం, విషయాలని విశదపరచి వివరించే వీలు కలుగుతుంది. అంతేగాక సాక్షులతన్ని గుర్తించడానికి కూడా అవకాశం ఉంటుంది. ముద్దాయి ఎవరో అనుకొని పోలీసు దర్యాప్తులో సాక్ష్యం చెప్పిన వాళ్లు తీరా అతన్ని చూడగానే ఇతను కాదని గుర్తించ వచ్చు. లేదా అతనే అయివుంటే గుర్తించడానికి వీలవుతుంది. దీన్నిబట్టి ఒక అనుమానం రావచ్చు. కోర్టులో జరుగుతున్న తతంగమంతా మామూలు వాళ్ళకు అర్థం కాని భాషలోనే సాగుతుంది కదా? మరలాంటప్పుడు ముద్దాయిని తప్పనిసరిగా హాజరు కమ్మని అనడంలో అర్థంలేదు. అతనికి వ్యతిరేకంగా జరుగుతున్నదేమిటో అతనికి తెలవక కేవలం ఉత్సవ విగ్రహంలా నిలబడి పోతాడు. ఈ వాదన వాస్తవమైనదే, ఈ వాదంలో నిజం లేకపోలేదు. మామూలు ముద్దాయికి అర్థంకాని భాషలోనే కోర్టులో వ్యవహారమంతా సాగుతోంది. షుమారుగా అన్ని కోర్టుల్లోనూ ఇంగ్లీషే మాట్లాడతారు. అయితే కోర్టు అవలంబిస్తున్న పద్ధతులు ముద్దాయికి వ్యతిరేకంగా జరిగే విచారణ అతని సమక్షంలో అతనికి అర్థమయ్యేలా జరగాలన్న మౌలిక న్యాయశాస్త్ర నిబంధనకి వ్యతిరేకం. కొందరెకడమీషియన్‌లు ముద్దాయి తరపు న్యాయవాది అతని తరపున కేసు నడుపుతాడు కాబట్టి కోర్టులో జరిగేది ముద్దాయికి తెలవక పోయినా నష్టం లేదని, అది ముద్దాయికి తెలిసి నట్లుగానే భావించవచ్చునని వాదిస్తారు. ఇది అత్యంత హాస్యాస్పదమైన వాదన. న్యాయవాదిని పెట్టుకోలేని ముద్దాయి తనకు తానుగా కేసు నడుపుకోవాలని అనుకోవచ్చు. అలాంటప్పుడు అర్థంకాని భాషలో కోర్టు విధానాలన్నీ కొనసాగవచ్చన్న వాదనలో అర్థం ఉండదు. అసలు కోర్టు వ్యవహారం మొత్తం న్యాయవాదులకి న్యాయమూర్తులకి సంబంధించిన వ్యవహారంగా ఉన్నప్పుడు పార్టీలు కోర్టుకు హాజరుకానవసరం లేదు. మరయితే ఇదివరకు చెప్పిన రెండు కారణాలు కాక నిందితుల్ని కోర్టుకు హాజరు కమ్మనడంలో ఇంకొక ఉద్దేశం కూడా ఉందని అర్థమవుతుంది. నిందితుడికి శిక్ష విధించేట్లయితే అది అమలు పరచడం సులభం. కాబట్టి అతడు కోర్టుకు హాజరుకావాలి. ప్రతి నిందితుడూ నేరస్థుడే అనే దృక్పథంతో కేసు విచారణ గనుక సాగేట్లయితే న్యాయస్థానాల నుంచి ఎవరూ ధర్మాన్ని ఆశించాల్సిన పనిలేదు. అంతేగాక జామీను మీద ముద్దాయిని విడుదల చేసేప్పుడు జామీను తీసుకోవడంలో ఒక ఉద్దేశం ఉంది. ముద్దాయి విచారణని తప్పించుకోకుండా చూడాలనేది దీనిలో ఆంతర్యం. అలాంటప్పుడు నిందితుడికి శిక్ష గనక పడేట్లయితే అతను తప్పించుకోడమనేది తలఎత్తదు. అలాగనక జరిగేట్లయితే కోర్టు వారు జామీనుగా ఇచ్చిన ఆస్తినిగాని, సొమ్మునుగాని జప్తు

చేసుకుంటారు. వీటన్నిటిని బట్టి ముందుగా చెప్పిన కారణం తప్ప మరే ఇతర కారణంచేత నిందితుడు కోర్టుకు హాజరుకానవసరంలేదు. అయితే చట్టం విచారణ జరుగుతున్న కాలంలో ముద్దాయి తప్పనిసరిగా కోర్టుకు హాజరు కావాలన్న నిబంధనను విధించింది. ఈ సాధారణ నిబంధనకి కొన్ని మినహాయింపు లున్నాయి. ఏదైనా కారణం చేత ముద్దాయి వాయిదా నాడు కోర్టుకు హాజరుకాలేని పరిస్థితి ఉంటే ఆ వాయిదాకి అతను హాజరు మాఫీ పొందవచ్చు. అలాగే కొన్ని సందర్భాల్లో తగిన కారణం ఉందను కొనేట్లయితే మెజిస్ట్రేట్ ముద్దాయికి హాజరు మాఫీ ఇచ్చి అతని తరపున అతని న్యాయవాది కోర్టుకు హాజరు కావడానికి అనుమతి ఇస్తారు. ఇలా హాజరు మాఫీ ఇచ్చే అధికారం కేవలం మెజిస్ట్రేట్ కోర్టుకి మాత్రమే ఉంటుంది. అయితే హైకోర్టు తనకున్న విస్తృతాధికారాల పరిధిలో ఏ కేసులోనైనా సరే ముద్దాయికి హాజరు మాఫీ ఇవ్వవచ్చు. ఇలా హాజరు మాఫీ ఇచ్చే అధికారం మెజిస్ట్రేట్‌కి సమన్లు జారీ చేసిన వెంటనే ఉంటుంది. హాజరు మాఫీ ఇవ్వడం అనేదిమెజిస్ట్రేట్ ఇష్టా యిష్టాల మీద ఆధారపడి ఉంటుంది. మెజిస్ట్రేట్ తన ఇష్టాన్ని న్యాయబద్ధంగా మాత్రమే వినియోగించాలి. రోగిష్టి ముద్దాయికి, వృద్ధులకి, కార్మికులకి, కూలీలకి, పారిశ్రామిక వేత్తలకి, బిజీగా ఉండే వ్యాపారస్తులకి, దూరంగా ఉండే నిందితులకి, కొన్ని ఇతర కారణాల చేత హాజరు మాఫీ కోరిన ముద్దాయిలకి మెజిస్ట్రేట్ హాజరు మాఫీ ఇవ్వవచ్చు. అంతేగాక ఘోషాలో నివసించే స్త్రీలకు కూడా హాజరుమాఫీ కలిగించాలి.

మొదటిసారి ముద్దాయి కోర్టుకు హాజరైనపుడు మాత్రమే హాజరుమాఫీకి దరఖాస్తు చేసుకోవచ్చునని కొందరు మెజిస్ట్రేట్‌లు భావిస్తున్నారు. ఇది సరైంది కాదు. సమన్లు జారీ చేసిన తర్వాత ముద్దాయి హాజరుతో సంబంధం లేకుండా ఏ దశలోనైనా హాజరు మాఫీ ఇచ్చే అధికారం మెజిస్ట్రేట్‌కి ఉంది.

కేసు విచారణలోవుండగా అవసర మనుకుంటే మెజిస్ట్రేట్ ఎప్పుడైనాసరే హాజరు మాఫీతో సంబంధం లేకుండా నిందితుడిని కోర్టుకు హాజరుకమ్మని ఆదేశించ వచ్చు. కోర్టు హాజరు మాఫీ నిరాకరించేట్లయితే నిందితుడు మెజిస్ట్రేట్ ఉత్తర్వులను సవాల్ చేస్తూ రివిజన్ పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు.

ముద్దాయికి హాజరు మాఫీ ఇచ్చిన తర్వాత అతని తరపున న్యాయవాది కోర్టుకు హాజరుకాని పక్షంలో కోర్టువారు నిందితుడికిచ్చిన జామీనుని జప్తు చేసుకుంటారు. ముద్దాయి అరెస్టును గురించి వారెంట్ కూడా జారీ చేసే అవకాశముంది. హాజరుమాఫీ ఇచ్చే ముందు మెజిస్ట్రేట్ ముద్దాయి హాజరు కావల్సిన అవసరముందా లేదానని రికార్డు చూసి మాత్రమే నిర్ధారించాలి. అంతే కాని గుడ్డిగా ముద్దాయి పెట్టిన దరఖాస్తును త్రోసిపుచ్చరాదు.

# న్యాయవాది నియామకం

స్త్రీలకోసం చట్టం అనే పుస్తకంలో కోర్టులో జరిగే తతంగంమీద మంచి కార్టూన్ వుంది. ఆ కార్టూన్‌లో ముద్దాయి బోనులో నుంచొని వుంటుంది. ముద్దాయి తరఫున న్యాయవాది, ప్రభుత్వం తరపు న్యాయవాది వాదిస్తూ వుంటారు. మధ్యన జడ్జి కల్పించుకొని ఏదో మాట్లాడుతూ వుంటాడు. ఈ వాదోపవాదాలు న్యాయమూర్తి వ్యాఖ్యలు అర్థంగాం. ముద్దాయి బెదిరిపోయి మూర్ఛ పోతుంది. (ఇది నందితాహక్సర్ వ్రాసిన పుస్తకంలోని కార్టూన్) ఈ కార్టూన్‌లో ఒక భయంకరమైన వాస్తవం వుంది. కోర్టు వ్యవహారాలు తెలిసిన వాళ్ల కెవరికైనా, సరదగా కోర్టు చూసివద్దామని వెళ్లిన వాళ్లకైనా సరే ఇందులో నిజం అర్థం కాకుండా పోదు. కోర్టుకెళ్ళిన పార్టీ మూగవాడు కానవసరంలేదు. చెవిటి వాడు కానక్కరలేదు. పిచ్చివాడై యుండాల్సిన పనిలేదు. ఒక మామూలు మనిషైనప్పటికీ అతనికి కోర్టులో జరిగేతంతేమీ అర్థం కాదు. ఇది అర్థం చేసుకోడానికి ఆ పీడవదిలించుకోడానికి అనివార్యంగా అతనికి ఒక దుబాసీ అవసరం. ఆ దుబాసీ ఎవరో కాదు. కోర్టు కెళ్లే వాళ్లు పెట్టుకునే ప్లీడరు.

ఎంత చదువుకున్న వాళ్లయినప్పటికీ చట్టం తెలిసివుంటుందనుకోవడం పొరపాటు. చట్టం తెలుసుకోడానికి ప్రత్యేకమైన శాస్త్రం వుంది. అది అధ్యయనం చేసిన వాళ్లకి, పట్టభద్రులకి మాత్రమే తెలిసివుండే అవకాశం వుంది. చట్టం తెలిసిన వాళ్లకి మిగతా శాస్త్రాలు తెలిసుండే అవకాశం లేనట్లుగానే మిగతా శాస్త్రాల్లో ప్రావీణ్యులకి చట్టం తెలిసుండే అవకాశం కూడాలేదు. అయితే చట్టం తెలిసినా తెలియకపోయినా ప్రతివాళ్ళకి చట్టం తెలిసినట్లుగానే న్యాయస్థానాలు భావిస్తాయి. తెలియక తప్పు చేసినా అది నేరం కాకుండా పోదు. దీనికి శిక్ష అనుభవించకా తప్పదు. అలాంటప్పుడు ప్రతి వాళ్లకు చట్టం తెలిసైనా వుండాలి, లేకపోతే చట్టం తెలిసినవాళ్ల సహాయ సహకారాలైనా తీసుకోవాల్సిన అవసరముంది. ముఖ్యంగా కోర్టుకు వెళ్లినప్పుడు ఇది అనివార్యమైన స్థితి.

క్రిమినల్ కేసుల్లో కేసు పెట్టిన వాళ్లవైపు (ప్రైవేట్ కంప్లైంట్‌ల విషయంలో తప్ప) ప్రభుత్వమే బాధ్యత తీసుకుంటుంది. ప్రభుత్వం తరపున పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను గాని పి.పి.ఓ.లను గాని ఎ.పి.ఓ. లను గాని నియమిస్తారు. సాధారణంగా ప్రైవేట్ కంప్లైంట్‌లు అన్నీ ఎవరో ఒకరు న్యాయవాదిసహాయంతో మాత్రమే వేస్తారు. ఇహపోతే నిందితుల విషయంలో ప్రభుత్వం న్యాయవాదిని నియమించే బాధ్యత తీసుకోదు. నిందితుడు తనడిఫెన్స్‌ని తనే ఏర్పాటు చేసుకోవాలని అలాంటప్పుడు న్యాయవాది సహాయం లేకుండా కేసు నడుపుకోవాల్సివస్తే చట్టం తెలవకపోవడం వలన ముద్దాయికి అన్యాయం జరిగే ప్రమాదం ముంది. అందుకని ముద్దాయి వాదనను సమర్థించుకునేందుకు వీలుగా అతనికి న్యాయవాదిని నియమించుకునే హక్కువుంది. నిందితుడు న్యాయవాదిని నియమించుకోవడానికి కేవలం చట్టం అనుమతించడమేగాక భారత రాజ్యాంగం దాన్నొక ప్రాథమిక హక్కుగా గుర్తించింది.

నిందితుడికి ఛార్జ్‌షీట్ దాఖలు చేసిన త్వరాత న్యాయవాదిని నియమించుకునే హక్కువుందా? లేక అరెస్టు అయిన వెంటనే న్యాయవాదిని నియమించుకోవచ్చునా? అన్న సందేహం తలెత్తవచ్చు. చట్ట ప్రకారం ముద్దాయిని అరెస్టు చేయగానే పోలీసులు అతన్ని ఎందుకు అరెస్టు చేసిందీ, ఏమిటని వివరించాల్సిన అవసరముంది. అంతేకాక అతని కవసరమైన న్యాయ సహాయాన్ని కూడా ఏర్పాటు చేయడానికి సహాయపడాలి. అతని సమీప బంధువులకు గాని, స్నేహితులకు గాని అరెస్టుని గురించి తెలపాలి. ముద్దాయి గనుక కోరేట్లయితే అతని న్యాయవాది సమక్షంలోనే ప్రశ్నించాలి. దీన్ని బట్టి ముద్దాయికి న్యాయవాదిని నియమించుకునే హక్కు అతను అరెస్టు అయిన వెంటనే ఏర్పడిందని స్పష్టమవుతోంది. అంతేగాక నిందితుడు మెజిస్ట్రేట్ ముందు నేరాన్ని ఆమోదించదలచినట్లయితే ఒప్పుదలను రికార్డు చేసేముందర మెజిస్ట్రేట్ అతను న్యాయవాదిని నియమించుకొని సలహా తీసుకోవచ్చునని వివరించాల్సివుంటుంది. అంటే నేరం ఒప్పుకోదల్చినా న్యాయవాదిని సంప్రదించవచ్చునని స్పష్టమవుతోంది. వాస్తవానికి చట్టం ఇంత విస్తృతమైన అవకాశం కల్పించినప్పటికీ చాలామంది ముద్దాయిలకు అందుబాటులో లేకుండా పోయింది. పోలీసులే గాక మెజిస్ట్రేట్‌లు కూడా ముద్దాయికున్న హక్కుల్ని తెలియజేయడం లేదు. అందుకనే చాలా మంది పోలీసు హింసలకు జడిసిపోయి మెజిస్ట్రేట్ ముందు పోలీసులు చెప్పమన్నది చెప్పి అన్యాయానికి బలైపోతున్నారు. న్యాయవాదిని నియమించుకొని వుండివుంటే వాళ్లల్లో ఏర్పడిన అనేక భయాలు తొలగిపోయే అవకాశం వుంది. అలాంటప్పుడు వారు స్వేచ్ఛందంగా వారు చెప్పదలచిందేదో చెప్పేస్తారు. పరిస్థితులు కొంతలో కొంత మెరుగుపర్చడానికి న్యాయస్థానాలు బాధ్యతాయుతంగా వ్యవహరించి ఎప్పటికప్పుడు కోర్టుకు వచ్చిన వారికి న్యాయసహాయాన్ని

అందించాల్సిన అవసరముంది.

కేవలం కేసు విచారణ సాగుతున్నప్పుడేగాక అపీలులో, రివిజనల్ లో కూడా ముద్దాయి న్యాయవాదిని నియమించుకోవచ్చు.

కోర్టులో ముద్దాయిని హాజరుపర్చిన వెంటనే అతను న్యాయవాదిని నియమించుకునే హక్కువుందని మెజిస్ట్రేట్ తెలియజెప్పాలి. ఈ హక్కును గురించి తెలియక పోవడం వల్లనో న్యాయవాదిని అనుమతించనప్పుడో కేసు విచారణ జరపేట్టయితే అది సక్రమంకాదు. తిరిగి విచారణ జరిపించమని కోరే హక్కు ముద్దాయి కుంటుంది. సాక్షుల విచారణ జరిపేటప్పుడు ముద్దాయి తరపున క్రాస్ ఎగ్జామ్ చేయడానికి వీలుగా అతను న్యాయవాదిని నియమించుకొని సంప్రదించడానికి అవసరమైన సహాయాన్ని కల్పించాల్సిన బాధ్యత న్యాయస్థానానికి వుంది. న్యాయవాదికి కూడా కేసు నడపడానికి వీలుగా తగిన సమయముండాలి. ఒవేళ ముద్దాయి సమయానికి ప్లీడర్ని నియమించుకోలేక పోయినట్లయితే సాక్ష్యుల ప్రధానమైన వాంగ్మూలాన్ని మాత్రమే రికార్డు చేయాలి. అయితే ఒక్కోసారి కేసుకు సంబంధంలేని విషయాలు సాక్ష్యులు తమ వాంగ్మూలంలో చెప్పే అవకాశం వుంది. అలాంటప్పుడు దీన్ని నివారించడానికి వీలుగా సాక్ష్యుల వాంగ్మూలం రికార్డు చేసేముందే న్యాయవాదిని నియమించుకోడానికి అవకాశంకల్పించాల్సిన అవసరం వుంది. అలాంటప్పుడు అనవసరమైన విషయాలు రికార్డు చేయకుండా న్యాయవాది కోర్టుకుతోడ్పడే అవకాశం వుంది.

సాధారణంగా కోర్టువిచారణ, కోర్టునడుస్తున్న సమయంలోనే సాగాలి. కోర్టు వేళ గడిచిపోయిన తర్వాత విచారణ సాగేట్లయితే న్యాయవాదులు హాజరయి కోర్టుకు తోడ్పడే అవకాశాలు సన్నగిల్లుతాయి. నిందితుడు న్యాయవాది లేకుండానే కేసు నడుపుకోవలసిన దుస్థితికి నెట్టబడతాడు.

కొన్ని సందర్భాలలో నిందితులు న్యాయవాది లేకుండానే కేసు విచారణ సాగడానికి ఆమోదించవచ్చు. అలాంటప్పుడు కోర్టు తనకి తానుగా నిందితుడి పక్షాన ప్రధానమైన వైరుధ్యాలను వెలికి తేవడానికి సాక్షులను ప్రశ్నించవచ్చు. అంటే ఇక్కడ న్యాయస్థానం నిందితుడికి న్యాయవాది లేనప్పుడు నిందితుడి తరపు న్యాయవాదిగా వ్యవహరిస్తుందని అర్థం చేసుకోవాలి.

అలాగని న్యాయస్థానాలు పక్షపాతంతో వ్యవహరిస్తున్నాయని అనుకోడానికి వీలులేదు. నూరుమంది నేరస్థులు శిక్షకు గురికాకుండా తప్పించుకున్నా ఫరవాలేదుగాని ఒక నిర్దోషిని శిక్షించడానికి వీలులేదన్న న్యాయశాస్త్రప్రాథమిక సూత్రాన్ని బట్టి చూస్తే ప్రతి న్యాయమూర్తి ముందుగా నిందితుడి పక్షాన ఉండి అతను నిర్దోషి అన్న ఆలోచనతో ప్రారంభమై చివరికి సహేతుకంగా అతను నేరం చేసాడని నిర్ధారణకు

వస్తేవినా అతన్ని శిక్షించడానికి వీల్లేదు. ప్రశ్నిస్తూపోయి దోషరహితంగా ఒక నిర్ధారణకు వచ్చినప్పుడు మాత్రమే న్యాయస్థానాలకు నిందితులను శిక్షించే అర్హత ఉంటుంది.

న్యాయవాది లేకుండా విచారణ సాగినప్పుడు ఉన్నత న్యాయస్థానాలు తిరిగి విచారణ జరపమని ఆదేశించవచ్చు. ప్రభుత్వానికి న్యాయస్థానానికి, నిందితుడు న్యాయవాదిని నియమించుకోడానికి తగినంత అవకాశం కల్పించాల్సిన బాధ్యత వుంది.

ముద్దాయిలను కోర్టులో హాజరుపర్చిన తర్వాత కోర్టు అతన్ని రిమాండుకు పంపుతుంది. రిమాండ్‌లో ఉండగా కూడాముద్దాయి న్యాయవాదిని నియమించుకోవచ్చు. అతను న్యాయవాదిని నియమించుకోడానికి న్యాయవాదితో సంప్రదించడానికి జైలు అధికారులు తగిన సౌకర్యాలు కల్పించాలి. ఒకసారి కోర్టు ముద్దాయిని రిమాండు చేసిన తర్వాత అతను కోర్టు అధీనంలో ఉన్నట్లుగా న్యాయస్థానం భావిస్తుంది. ఈ దశలో నిందితుడు న్యాయవాదిని సంప్రదించకుండా పోలీసులు గనుక అడ్డుపడేట్లయితే వారు కోర్టు విధానాలని అవహేళన చేసినట్లేనని బొంబాయి హైకోర్టు తీర్పు చెప్పింది. బెయిలబుల్ కేసుల్లో ముద్దాయి ఒక హక్కుగా బెయిల్ పొందుతారు. నాన్ బెయిలబుల్ కేసుల్లో సాధారణంగా ముద్దాయి తరపున అతని న్యాయవాదే బెయిల్ పిటిషన్ దాఖలు చేస్తాడు. దీన్ని బట్టి రిమాండ్‌లో ఉండగా ముద్దాయికి న్యాయవాదని నియమించుకొనే హక్కు ఉందని స్పష్టమౌతుంది.

ఇటీవలి కాలంలో రిమాండ్‌లో ఉన్న ఖైదీలు న్యాయవాదితో సంప్రదిస్తున్నప్పుడు పోలీసులక్కడ ఉండి ఆ వ్యవహారాన్ని మొత్తంగా రికార్డు చేస్తున్నారని తరచు వినవస్తోంది. ఇలా చేయడం వలన న్యాయవాదిని స్వేచ్ఛగా సంప్రదించే హక్కును నిందితుడు కోల్పోతున్నాడు. అంతేగాక నిందితుడు పకడ్బందీయైన ప్రతివాదనని తయారు చేసుకోడంలో కూడా విఫలమయ్యే ప్రమాదముంది. చట్టప్రకారం పోలీసులే కాక మరెవరైనా కూడా నిందితుడు న్యాయవాదితో సంప్రదిస్తున్నప్పుడు ఆ చుట్టు ప్రక్కల ఉండటానికి వీల్లేదు.

జైల్లో ఉన్న నిందితులకి వారు కోరుకున్న న్యాయవాదిని నియమించుకొనే హక్కువుంది. ఈ విషయంలో కోర్టులుగాని పోలీసులు కాని ఫలానావారిని మాత్రమే న్యాయవాదిగా నియమించుకోమని నిందితుడ్ని వత్తిడి చేయడానికి వీల్లేదు. కోర్టు నిందితుడికి న్యాయవాదిని నియమించినపుడు నిందితుడుఆ న్యాయవాదినిఇష్టపడక పోయేట్లయితేవిచారణ జరపడానికి వీల్లేదు. ఒక వేళ విచారణ జరిపినట్టయితే ఆ విచారణ చెల్లదు. నిందితుడి తరపు న్యాయవాది నిందితుడితో మాట్లాడటానికి కోర్టు అనుమతించాలి. ఏ పరిస్థితుల్లోనూ అనుమతిని నిరాకరించడానికి వీల్లేదు. అలాగే నిందితుడి తరపు న్యాయవాదిపై ఆంక్షలు విధించడానికి కోర్టుకి అధికారంలేదు.

కేసు విచారణ పూర్తయిన తర్వాత వాదోపవాదాలు వినకుండా కోర్టులు తీర్పు చెప్పడానికి వీల్లేదు. నిందితుడి తరఫు న్యాయవాది వాదించడానికి తగినంత సమయాన్ని కోర్టు అతనికి కల్పించాలి. ఇంత కాలంలో వాదనలు పూర్తి చేయమని ఆదేశించ డానికి వీల్లేదు. మౌఖిక వాదనలు జరిగినప్పుడు వాటి ఆధారంగా కోర్టు నోట్సు తయారు చేసుకోవాలి.

ముద్దాయి తరఫు న్యాయవాదుల మీద వ్యతిరేకతగానీ అసంతృప్తిగాని ఉండేట్లయితే కోర్టు ఆ ప్రభావాన్ని కేసు పైన చూపించడానికి వీల్లేదు. కేసు నడుస్తున్న ప్పుడు నిందితుడ్నిగాని న్యాయవాదిని గానీ బెదిరించడం సరైందికాదు. క్రిమినల్ కేసుల్లో రిపోర్టు ఇచ్చిన వారి తరపున ప్రభుత్వం బాధ్యత తీసుకొని పోలీసుల చేత దర్యాప్తు చేయించుతుంది. అందుకని పోలీసులు, అభియోగాన్ని రుజువుచేయడానికి కంకణం కట్టుకుంటారు. అందుచేత నిందితుడ్ని అతని తరఫు న్యాయవాదిని శత్రువుల్లా పరగణిస్తున్నారు. ఈ కారణంగా అనేక సందర్భాల్లో ప్రతివాది తరఫు న్యాయవాదిని బెదిరించడం అవహేళన చేయడం లాంటి అక్రమాలకు పాల్పడుతున్నారు. డిఫెన్స్ లాయర్లను పోలీసులు హింసించిన ఉదంతాలు, అక్రమంగా నిర్బంధించిన సందర్భాలను గురించి ప్రతి నిత్యం వింటూనే ఉన్నాం. ఇలా డిఫెన్స్ లాయర్లని బెదిరించడం వల్ల హింసించడం వల్ల పోలీసులు నిందితుడు డిఫెన్స్ న్యాయవాదిని నియమించుకొనే హక్కును కాలరాస్తున్నారన్న విషయం మర్చిపోవద్దు. న్యాయవాదిని న్యాయస్థాన అధికార్లుగా కోర్టులు భావిస్తాయి. అంటే న్యాయవాదులు న్యాయమూర్తులతో సమానమైన హోదాలో పని చేస్తున్నారన్న విషయం స్పష్టం అవుతుంది. మొత్తంగా న్యాయవాదులు పోలీసులు న్యాయమూర్తులు పబ్లిక్ ప్రాసిక్యూటర్లు నిష్పక్షపాతంగా వ్యవహరించి వాయవ్యవస్థ సక్రమంగా నడవడానికి తోడ్పడతారని అర్థంచేసుకోవాలి.

నిందితుడి తరఫున న్యాయవాది క్రాస్ ఎగ్జామిన్ చేస్తున్నపుడు మెజిస్ట్రేట్‌లు అతన్ని క్రాస్ ఎగ్జామినేషన్ చాలించి కూర్చోమని ఆదేశించడానికి వీల్లేదు. అసందర్భ మైన ప్రశ్నలేవైనా ఉండేట్లతే వాటిని తొలగించవచ్చు. కేసు విచారణ కొనసాగుతుండగా న్యాయవాదిని మధ్యన తొలగించవచ్చు. కేసు విచారణ కొనసాగుతుండగా న్యాయవాదిని మధ్యన తొలగించడానికి వీల్లేదు. న్యాయమూర్తులు న్యాయవాదులని అవహేళన చేయడం గానీ అగౌరవపరచడంగాని చేయకూడదు. అలాగే న్యాయవాదులు కూడా కోర్టుని గౌరవించాలి. ఏ పరిస్థితుల్లోకూడా ఎవరికీ తగిన అవకాశాలు కల్పించక పోవడం వల్ల న్యాయం జరగలేదన్న అభిప్రాయం కలిగేలా విచారణ సాగకూడదు. వీలైనంత వరకు అందరికీ న్యాయం జరిగిందన్న అభిప్రాయం కలగాలి.

# ఉచిత న్యాయ సహాయం

అతని మీద హత్యారోపణ చేయబడింది. నిందితుడిగా బోనులో నించున్న అతన్ని నువ్వు "నేరం చేశావా" అని ప్రశ్నించారు కోర్టువారు. అతను సమాధానం చెప్పలేదు. నిన్నే అడుగుతోంది. నువ్వు నేరం చేశావా? చేయలేదా? తిరిగి ప్రశ్నించారు కోర్టువారు. అతను ఉలుకు, పలుకూ లేకుండా నిశ్చలంగా నుంచున్నాడు. న్యాయమూర్తిగారికి వళ్లుమండిపోయింది. మేం అడిగిన దానికి సమాధానం చెప్పకపోతే నువ్వు జైలుకు వెళతావు అన్నారు కోపంగా. అతనికి నవ్వొచ్చింది. చచ్చిన వాడ్ని పట్టుకొని నువ్వు చస్తావని చెప్పినట్లుగా జైలునుంచి తెచ్చిన తనను తిరిగి జైలుకు పంపుతామనడంలో అర్థం లేదనిపించింది. కోర్టువారు అతని మౌనాన్ని రికార్డు చేసుకున్నారు. నీ తరపున వాదించడానికి న్యాయవాది ఉన్నారా? అని ప్రశ్నించారు. లేదన్నట్లుగా తల అడ్డంగా ఊపాడు. నీకు న్యాయవాదిని నియమించటానికి ఏర్పాటు చేయాలా? అని ప్రశ్నించింది కోర్టు. అతనేం మాట్లాడలేదు. అతని మౌనాన్ని అనంగీకారంగా భావించి కోర్టు కేసు విచారణ ప్రారంభించింది. అతను కోర్టులో ఏం మాట్లాడక పోవడాన్ని బట్టి అతను చెవిటివాడో, మూగవాడో అనుకోవటానికి వీల్లేదు. అతని కన్నీ తెలుసు. అయితే తన కర్థంగాని భాషలో జరిగే విచారణ పట్ల తీవ్రమైన ఏవగింపు ఉండడంతో నిర్లక్ష్యంగా కోర్టుకేమీ సమాధానం చెప్పలేదు.

ఒకవైపు న్యాయస్థానాల స్థితిగతులు సామాన్యులకర్థంగాని పరిభాషలో వర్ధిల్లుతుండగా న్యాయవాది సహాయ సహకారాలు లేకుండా ఎవరైనా సరే విచారణ

నెదుర్కోవడం దుర్లభం అయిపోతోంది. అలాంటప్పుడు సమాజంలో డబ్బుగలవారు సాధారణంగా న్యాయవాదిని నియమించుకొని తమ తరపున బలమైన ప్రతివాదులను తయారు చేసుకోగలుగుతున్నారు. చాలా పేరు ప్రఖ్యాతులు కలిగిన న్యాయవాదులను దూర ప్రాంతాలనుంచి తీసుకొచ్చి కేసులు నడుపుకొంటుండడం మనం తరచు చూస్తున్నాం. ఈ సౌకర్యం లేకుండా అసలు న్యాయవాదినే నియమించుకోలేని దుస్థితిలో అనేకమంది అన్యాయానికి గురవడం కూడా గమనించవచ్చు. అసలే పలుపు కోసం కోర్టుకు వెడితే గేదె కూడా పోయిందన్నట్లుగా మన న్యాయ వ్యవస్థలో న్యాయం ఖరీదయినదిగా మారి పోయిన ఈ రోజుల్లో పేదవాడికి న్యాయం లభించడం దుర్లభం. అయినా మనిషన్న తరువాత రోగం రొష్టు లేకుండా వుండడం సాధ్యంకానట్టే ఈ రోజుల్లో ఏదో ఒక పరిస్థితిలో కోర్టుకు వెళ్ళక తప్పడం లేదు. సివిల్ కేసులో కోర్టుకు వెళ్ళకపోతే, కోర్టులో న్యాయవాదిని నియమించుకోలేక పోతేనో జరిగేది ఆస్తినష్టమే గాబట్టి అంతగా పట్టించు కోనవసరం లేదు. అయితే క్రిమినల్ కేసుల్లో న్యాయవాదిని నియమించుకొని తద్వారా డిఫెన్స్ గనుక ఏర్పాటు చేసుకోలేకపోతే ఒక్కోసారి ప్రాణాలు కూడా కోల్పోయే ప్రమాదం ఉంది. హత్య తదితర కేసుల్లో నిందితులకు ఉరిశిక్ష వేయవచ్చనే విషయం తెలిసిందే. కాబట్టి క్రిమినల్ కేసుల్లో న్యాయవాదిని నియమించుకోవడం అనివార్యం.

ఉన్నవాళ్లు న్యాయవాదిని నియమించుకో గలగడం, లేని వాళ్ళు న్యాయవాదిని నియమించుకోలేక పోవడం వలన న్యాయం అందరికి సమానం అన్న రాజ్యాంగ ప్రాథమిక హక్కుకు భంగం వాటిల్లుతుంది. రాజ్యాంగ ప్రాథమిక హక్కుల్ని కాపాడ వల్సిన బాధ్యత ఇటు న్యాయస్థానాల మీదా అటు ప్రభుత్వం మీదా సమానంగా ఉందన్న విషయం మర్చిపోవద్దు. ఏ నిందితుడు కూడా డిఫెన్స్ ఏర్పరచుకోకుండా వుండడానికి వీల్లేదు. డిఫెన్స్ ఏర్పరచుకోడానికి తగిన అవకాశాలు కల్పించాలి. ఇందులో భాగంగానే నిందుతుడి తరపున అవసరం అనుకున్నప్పుడు న్యాయవాదిని నియమించే బాధ్యత కూడా ప్రభుత్వానికి, న్యాయస్థానాలకు ఉంది. అలాంటప్పుడు ఒక నిరుపేదకు న్యాయం జరగడానికి పేదరికం అడ్డురాని పరిస్థితి ఏర్పడుతుంది.

సెషన్స్ కేసులో కేసు విచారణ ప్రారంభించే ముందు కోర్టువారు ముందుగా నిందితుడిని తను న్యాయవాదిని నియమించుకోగలడో లేదో తెలియచెప్పమని కోరుతారు. ఒక వేళ న్యాయవాదిని నియమించుకోలేనని నిందితుడు తెలియజేసేటట్టయితే మెజిస్ట్రేటు కోర్టే ముద్దాయి తరపున న్యాయవాదిని నియమిస్తుంది. ఇటీవలికాలంలో ఈ సౌకర్యం మెజిస్ట్రేటు కోర్టులలో జరిగే విచారణకు కూడా వర్తించేలా ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది. న్యాయవాదిని నియమంచుకోలేని నిందితుడి తరపున న్యాయవాదిని నియమించే టప్పుడు ఆ ఖర్చులన్నీ కూడా ప్రభుత్వమే భరిస్తుంది.

ఇలా ప్రభుత్వంకానీ, కోర్టులు కానీ ఉచిత న్యాయ సహాయం ఏర్పరచి నప్పుడు వీలైనంత వరకు సత్తావున్న న్యాయవాదులను మాత్రమే నియమించాలి. అంతేగాక ఈ న్యాయవాదికి ప్రతివాదులను తయారు చేయడానికి వీలుగా అవసరమైన అన్ని పత్రాలను ఇచ్చి తగిన సమయాన్ని కేటాయించాలి. కోర్టు న్యాయవాదిని నియమించేటప్పుడు ముద్దాయి కనుక ఆ న్యాయవాది సహాయం తీసుకోడానికి నిరాక రించేట్లయితే కోర్టు అతనిని బలవంతం పెట్టడానికి వీల్లేదు. కోర్టు నియమించిన న్యాయ వాదికి ముద్దాయితో సంప్రదించడానికి కావలసిన అవకాశాలు న్యాయస్థానం కల్పించాలి. కోర్టుగానీ, ప్రభుత్వం గానీ న్యాయవాదిని నియమించినప్పుడు ఆ న్యాయవాది కేసు సరిగా చేయడం లేదని భావిస్తే కోర్టు కల్పించుకొని నిందితుడి తరఫున సాక్షులను ప్రశ్నించవచ్చు. వీలైనంతవరకు నిందితుడు కోరుకున్న న్యాయవాదిని మాత్రమే కోర్టువారు నియమించాలి.

కొన్ని సందర్భాలలో అసలు మాకు న్యాయవాదే అవసరంలేదని, మా కేసు మేమే చేసుకుంటామని నిందితులు ప్రకటిస్తూ ఉంటారు. అలాంటప్పుడు నిందితుడి తరఫున న్యాయవాదిని నియమించకుండానే కోర్టు నిందితుడు కేసు నడుపుకోవడానికి వీలుగా సహాయపడాలి. ఇలా నిందితుడే కేసు నడుపుకొంటున్నప్పుడు కోర్టువారు అతనికి తెలవని విషయాలు అంటూ ఏమైనా ఉన్నట్లయితే అవి తెలియచెప్పాలి. అవసరం అనుకుంటే మధ్యలో కోర్టు జోక్యం చేసుకుని సాక్షులను ప్రశ్నించడం ఇంకా నిజం రాబట్టడానికి అవసరమయిన చర్యలు తీసుకోవాల్సి వుంటుంది.

ఏ దశనుంచి ఉచిత సహాయం అందించాలి? ముద్దాయి అరెస్టయి నప్పటి నుంచి న్యాయసహాయం అందించాలా? లేక కేసు విచారణ ప్రారంభమయినప్పటి నుంచా? అరెస్టయిన వెంటనే చట్టంలో అరెస్టయిన ముద్దాయికి ఉన్న హక్కులు ఏమిటో తెలియచేయాల్సిన బాధ్యత పోలీసుల మీదుంది. అందులో భాగంగానే పోలీసులు నిందితులకి న్యాయవాదిని నియమించుకోవచ్చనే విషయం తెలియజేయాలి. దీన్ని బట్టి న్యాయవాది నియామకం అరెస్టుతో ప్రారంభమవుతుంది గాబట్టి ఉచిత న్యాయ సహాయం కూడా అరెస్టుతోనే ప్రారంభం కావాలి అని స్పష్టం అవుతుంది. ఎంచేతంటే ఈ బాధ్యత ముందుగా పోలీసులు తీసుకోవాల్సిఉంటుంది. హక్కులను గురించి చట్టాలను గురించి మాట్లాడటం పోలీసులకు గిట్టదు. కాబట్టి ఉచిత న్యాయ సహాయం అన్నది వాళ్ళ డిక్షనరీలో ఉండదు. కాబట్టి న్యాయస్థానాలు ముద్దాయిని కోర్టుముందు హాజరు పరిచిన వెంటనే అతనికి న్యాయవాదిని నియమించుకోవచ్చని తెలిజేయడమేగాక అవసరమయితే ఉచితంగా అతని తరఫున న్యాయవాదిని నియమించడం జరుగుతుందని స్పష్టంచేయాలి అలాంటప్పుడే న్యాయస్థానాలు రాజ్యాంగ ప్రాథమిక హక్కుని కాపాడినట్లవుతుంది.

# కాల పరిమితి

అతన్ని పోలీసులు అరెస్టుచేసి సంవత్సరం అయింది. అరెస్టు చేసిన తర్వాత పోలీసులు అతన్ని ఆ మర్నాడే కోర్టులో హాజరు పర్చారు. నీళ్ళ పంపు దగ్గర గొడవతో పొరుగింటతన్ని ఖాళీ కుండతో కొట్టాడని అతని మీదున్న ఆరోపణ. కుండతో కొట్టడంవల్ల కుండ పగలటం సంగతలావుంచి పొరుగింటతను గాయపడ్డాడు. కాబట్టి పోలీసులు అతన్ని అరెస్టుచేశారు. ఉద్దేశ్యపూర్వకంగా ఎవరైనా మామూలుగా గాయపర్చేట్లయితే బెయిలబుల్ నేరం అవుతుంది. అంటే ఈ కేసులో పోలీసులు ముద్దాయిని జామీనుమీద విడుదల చేయవచ్చు. ఆ పని పోలీసులు చేయలేదు. కోర్టులో హాజరు పరచినప్పుడు కూడా మెజిస్ట్రేట్ ముద్దాయికి అతని హక్కును గురించి తెలుప లేదు. మూడు నెలల తర్వాత మెజిస్ట్రేట్‌గారు వెయ్యి రూపాయలు జామీను ఇచ్చేట్లయితే అతన్ని విడుదల చేయాలని ఆదేశించారు. ముద్దాయి జామీను తెచ్చుకొనే స్థితిలో లేడు. కాబట్టి ఆతను జైలునించి విడుదల కాలేదు. సంవత్సరంగా అతను జైల్లో వుంటున్న ప్పటికీ అతనిపై కేసు విచారణ ప్రారంభంకాలేదు. వ్యక్తిగత పూచీ మీద విడుదల చేయమని కోర్టు వారిని అభ్యర్థించినా కోర్టు అందుకు అనుమతించలేదు. అసలు కేసు విచారణ ప్రారంభం కాకపోవడానికి కారణం ఆ కేసుకు సంబంధించి పోలీసులు చార్జి షీటు దాఖలు చేయకపోవడమే. అంటే నిర్దిష్టంగా ఎలాంటి ఆరోపణాలేకుండా ముద్దాయిని ఇంతకాలం నిర్బంధించారని అర్థం అవుతోంది. ఉద్దేశ్యపూర్వకంగా ఎవరినైనా గాయపరచినట్లయితే నిందితుడి మీద ఆరోపణ రుజువైనట్లయితే ఒక సంవత్సరానికి మించి అతన్ని శిక్షించడానికి వీల్లేదు. ఈ సంవత్సరం కూడా గరిష్ఠ శిక్ష అని స్పష్టమవుతోంది. సాధారణంగా సంవత్సరానికంటె తక్కువ కాలమే అతన్ని శిక్షిస్తారు.

వెయ్యి రూపాయలవరకూ జరిమానా విధించే అధికారం వుంది కాబట్టి ఈ కేసులో ఖైదుకు బదులుగా జరిమానా కూడా విధించవచ్చు. ఈ తతంగమంతా కేసు విచారణ జరిగినప్పుడు మాత్రమే. ఆరోపణ నిస్సందేహంగా రుజువైతేనే అమలులోకి వస్తుంది. అసలు చార్జిషీటు దాఖలు చేయని కేసుల్లో విచారణ జరగడం కేసు రుజువు కావడం అనే ప్రశ్నలే తలెత్తవు. పైనచెప్పిన ఉదాహరణలో శిక్షపడేట్లయితే ముద్దాయికి ఏ పరిస్థితుల్లోను సంవత్సరానికి మించి జైల్లో వుండాల్సిన అగత్యం పట్టేదికాదు. అసలు చార్జిషీట్ దాఖలు చేయకుండానే ఇంతకాలం అతను జైల్లో వుండాల్సివచ్చిందంటే అతని నిర్బంధం అక్రమమనిస్పష్టమవుతోంది. అయితే ఈ పరిస్థితి ఎందుకు తలె

త్తింది. క్రిమినల్ కేసుల్లో దర్యాప్తు ముగించి చార్జిషీటుదాఖలు చేయడానికి కాలపరిమితి లేదా?

క్రిమినల్ కేసుల్లో చార్జిషీటు దాఖలు చేయకుండా దర్యాప్తు పేరిట పోలీసులు న్యాయస్థానాలకు ఉన్న శిక్షించే అధికారాన్ని పరోక్షంగా పొందారు. చార్జిషీటు దాఖలు చేసిన తర్వాత దాన్ని కోర్టు పరిగణనలోకి తీసుకుంటుంది. అంటే మౌలికంగా ఆరోపణలున్నాయని కోర్టు ఒక నిర్ణయానికి వస్తుంది. ఇలా కోర్టు కొన్ని నేరాల్ని పరిగణనలోకి తీసికోవడానికిగాను చట్టం కాలపరిమితిని నిర్ణయించింది.

1974కు ముందు కోర్టు నేరాన్ని పరిగణనలోకి తీసికోవడానికిగాను కాల పరిమితి లేదు. ఎన్ని రోజులకైనా, ఎన్ని నెలలకైనా ఎన్ని సంవత్సరాలకైనా నేరం జరిగిన తర్వాత దాన్ని పరిగణనలోకి తీసుకుని విచారణ జరిపే అధికారం న్యాయ స్థానాలకుండేది. అయితే పోలీసు రిపోర్టు దాఖలు చేయడంలో అలస్యం జరిగేట్లయితేనో. ఆరోపణ దాఖలు చేయడంలో జాప్యం వుండేట్లయితేనో వాటినంతగా విశ్వసించేవారుకాదు. ప్రాసిక్యూషన్ కథనాన్ని అనుమానాస్పదంగా పరిగణించేవారు. అనేక ఇతరదేశాల్లో ప్రాసిక్యూషన్ నిర్వహించడానికి కాలపరిమితిని నిర్ణయించినందువల్ల కోర్టు విధానాన్ని దుర్వినియోగపర్చకుండా చూడాలన్న ఉద్దేశ్యంతో నేరాన్ని పరిగణనలోకి తీసికోవ డానికి చట్టం కాలపరిమితిని విధించింది. అంతేకాక కాలం గడుస్తున్న కొద్దీ ఋసాల జ్ఞాపకాలు కూడా రోజురోజుకి తగ్గిపోయే అవకాశాలున్నాయి. అలాంటప్పుడు సాక్ష్యాలు స్పష్టంగా వుండే అవకాశాలు సన్నగిల్లే ప్రమాదముంది. సంవత్సరాల తరబడి తనపై కేసు వుందనుకున్నప్పుడు రోజూ చస్తూ బ్రతుకుతూ వుంటాడు. ఒక నేరాన్ని కప్పి పుచ్చుకోవడానికి మరో నేరానికి పాల్పడే ప్రమాదం కూడా వుంది. శాంతి భద్రతలకు ప్రమాదం వాటిల్లుతుంది.

సత్వరం దర్యాప్తు జరగకపోయేట్లయితే సాక్ష్యాలను తుడిచి పెట్టడానికి నేరస్థులకు అవకాశం లభిస్తుంది. కాలపరిమితి విధించడం వల్ల నేరస్థుడ్ని కనుగొని సాక్ష్యాధారాల్ని సేకరించడమేగాక అతన్ని శిక్షించి సత్వర న్యాయం చేయడానికి తోడ్పడినట్లవుతుంది.

కాలపరిమితి విధించడం వలన ఇటు ప్రాసిక్యూషన్‌కూ అటు నిందితుడికి చట్టం ఎంతో చేరువయినట్లవుతుంది. దర్యాప్తు పేరిట నిందితుడు సంవత్సరాల తరబడీ కోర్టులు చుట్టూ తిరగాల్సిన ఆగత్యం తప్పింది. కొన్ని కేసులు కోర్టు పరిగణనలోకి తీసుకోడానికి కాలపరిమితి దాటిపోయేట్లయితే నిందితుడు జైల్లోవున్నా అతన్ని విడుదల చేస్తారు. కాబట్టి ఇంతకు ముందు చెప్పిన ఉదాహరణలో మాదిరిగా ఎవరూ దర్యాప్తు పేరిట దీర్ఘకాలం జైల్లో వుండాల్సిన స్థితి వుండదు. అయితే న్యాయస్థానాలు తమ అధి కారాన్ని గుర్తించి ఎప్పటికప్పుడు తగిన చర్యలు తీసుకుంటేవినా చట్టం యొక్క

మౌలిక ఉద్దేశ్యాలు నెరవేరవు.

దీర్ఘకాలం పాటు దర్యాప్తు చేయకుండా కేసులు మూలకిపడేయడం వలన నేరానికి గురైన వారికి కూడా న్యాయం జరిగే అవకాశాలు వుండవు. నేరం జరిగి నప్పుడు నిందితుడ్ని శిక్షించే బాధ్యత సమాజం చేపట్టింది గనుక నేరాన్ని పరిగణన లోకి తీసుకునే విషయంలో కాలపరిమితి పాటించకపోయినట్లయితే సామాజిక ద్రోహానికి పాల్పడ్డమే అవుతుంది.

దొంగలుపడ్డ ఆరునెలలకు కుక్కలు మొరిగినట్లుగా నేరం జరిగిందన్న సమా చారం అందిన తర్వాత తీరికదొరికినపుడు దర్యాప్తు చేయడంవల్ల ఫలితం ఉండదు. ఈ విషయం మనలో చాలా మందికి అనుభవం. పోలీసులకి కంప్లైంట్ ఇచ్చినా లాభం ఉండదనుకొని కొందరు కంప్లైంట్ ఇవ్వడం కూడా మానేస్తున్నారు. తీరికగా దర్యాప్తు చేయడంవల్ల సాక్ష్యాధారాలు మటుమాయమయ్యే ప్రమాదముంది. అంతే కాక నేరస్తుడు సులభంగా కేసులోనుండి తప్పించుకోగలుగుతాడు. కాబట్టి ప్రాసిక్యూషన్ మీద సత్వరం దర్యాప్తు జరపడానికి వీలుగా వత్తిడి తేవడానికని కోర్టులు నేరాన్ని పరిగణనలోకి తీసు కోడానికి కాలపరిమితి విధించబడింది. అలాగే నిందితులు అనవసర ఇబ్బందులకు గురి కాకుండా ఉండడం కోసమని దీర్ఘకాలం దర్యాప్తుపేరిట శిక్షించబడకుండా వుండాలన్న ఉద్దేశంతో కూడా కాలపరిమితి విధించడం జరిగింది. కాలపరిమితి కొన్నినేరాలకు సంబంధించి మాత్రమే చట్టం విధించింది. కేవలం నేరస్తునికి ఫైన్ వేయడానికి మాత్రమే అవకాశం ఉన్న కేసుల్లో ఆరుమాసాలలోగా కోర్టు నేరాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. నేరం జరిగిన నాటినుంచి ఈ విషయంలో ఆరుమాసాల్లోగా కోర్టు ఆ నేరాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. అంటే ఈలోగా దర్యాప్తు ముగించి పోలీసులు చార్జి షీట్ దాఖలు చేయాలి. ఆ చార్జిషీట్ ఆధారంగా మౌలికమైన ఆరోపణలున్నాయని నిర్ధా రించుకొన్న తరువాత కోర్టు నేరాన్ని పరిగణనలోకి తీసుకొని నిందితులకు సమన్లు ఇవ్వడం, వారెంట్ లివ్వడం ప్రారంభిస్తుంది. ఈ కాలపరిమితిలోగా దర్యాప్తు ముగించి చార్జిషీట్ దాఖలుచేయని పక్షంలో నిందితుడిపై కేసు కొట్టివేసినట్టుగానే కోర్టు పరిగణి స్తుంది. విచారణలోనున్న ఖైదీలపై కాలపరిమితిలోగా నేరాన్ని పరిగణనలోకి తీసుకోని పక్షంలో వారిని విడుదల చేస్తారు.

నేరానికి సంవత్సరకాలంలోగా శిక్షని చట్టం నిర్దేశించేట్లయితే సంవత్సరం లోగా ఆ నేరాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. ఉదాహరణకి ఒక వ్యక్తి మరో వ్యక్తిని మోసం చేసేట్లయితే నేరస్తుడికి ఒక సంవత్సర కాలంపాటు జైలుశిక్ష విధించవచ్చు. లేదా జరిమానాతో సరిపెట్ట వచ్చు. కాదనుకుంటే జైలుశిక్ష విధించడమే కాక జరిమానా కూడా వేయవచ్చు.

ఈ కేసులో సంవత్సరకాలంపాటు నిందితుడ్ని శిక్షించే అవకాశం ఉంటుంది.

కాబట్టి సంవత్సరంలోగా కోర్టు నేరాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. జైలుశిక్షకాక జరిమానా కూడా విధించే అవకాశాలున్నాయి కాబట్టి, జరిమానా కట్టలేని పక్షంలో జైలుశిక్ష పొడిగించే అవకాశం ఉంది కనుక ఈ కాలపరిమితి వర్తించదేమోనన్న సందేహం కలగవచ్చు. ఈ నేరానికి సంబంధించినంతవరకు మౌలికంగా సంవత్సరం శిక్ష విధించడానికి అవకాశం ఉంది కాబట్టి ఈ కాలపరిమితి వర్తిస్తుంది.

సంవత్సరానికి మించి మూడు సంవత్సరాల్లోగా శిక్ష విధించే అవకాశమున్న కేసుల్లో మూడు సంవత్సరాలలోగా కోర్టువారు నేరాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. పరువునష్టం కలిగించే నేరానికి రెండు సంవత్సరాలు జైలుశిక్షగాని జరిమానాగాని, లేదా జైలుశిక్ష, జరిమానాగాని విధించవచ్చు. అంటే ఈ కేసులో మూడు సంవత్సరాలలోగా కోర్టు నేరాన్ని పరిగణనలోకి తీసుకోవాల్సి వుంటుంది. 1977లో తనకు పరువునష్టం కలిగించాడని ఆరోపిస్తూ 1987లో కేసు కనుక దాఖలుచేసినట్లయితే ఆ కేసుని పరిగణనలోకి తీసుకోవడానికి వీల్లేదు. ఎందుకంటే నేరం జరిగిన నాటి నుంచి పది సంవత్సరాల తర్వాత మాత్రమే ఆరోపణ దాఖలు చేయడం జరిగింది. ఇలా ఇష్టం వచ్చినప్పుడల్లా పాతగోతులు తవ్వడంలో అర్థం ఉండదు. పై పెచ్చు ఇలాంటి కేసులు రుజువయ్యే అవకాశాలుండవు. పైగా నిందితుడ్ని కోర్టులు చుట్టూ తిప్పి విసిగించడమే అవుతుంది.

మూడుసంవత్సరాలకి మించి శిక్ష విధించే కేసులని పరిగణనలోకి తీసుకోవడానికి చట్టం ఎలాంటి కాలపరిమితి విధించలేదు. హత్య కేసుల్లో ఒకోసారి ఏ పది పన్నెండేళ్లకో దర్యాప్తు ముగించి చార్జిషీట్ దాఖలు చేయడం మనం చూస్తున్నాం. ఇలాంటి నేరాన్ని ఎప్పుడైనా సరే కోర్టు పరిగణనలోకి తీసుకోవచ్చు. సాధారణంగా ఇలాంటి తీవ్రమైన నేరాలకి పాల్పడే వాళ్ళు కేసులోంచి తప్పించు కోవడానికికావల్సిన ముందు జాగ్రత్తలన్నీ తీసుకుంటారు. కాబట్టి వీటి దర్యాప్తు అంతసులభంగా ఉండదు. ఒకోసారి దర్యాప్తు చేయలేని నేరాలుగా పరిగణించి ఈ కేసుల్ని వదిలేస్తారు. ఏదో ఒక సందర్భంలో ఏదైనా చిన్న క్లూ దొరికేట్లయితే దాన్ని ఆధారంగా చేసుకొని తిరిగి దర్యాప్తు ప్రారంభించే అవకాశాలున్నాయి. అందుకనే చట్టం తీవ్రమైన నేరాలకి సంబంధించి కఠినమైన శిక్షవిధించే కేసుల్లో కాలపరిమితి విధించలేదు.

కొన్ని కేసుల్లో ఒకేసారి నిందితుడిపై ఎక్కువ ఆరోపణలు చేసే అవకాశాలున్నాయి, ఉదాహరణకి అక్రమంగా ఇంట్లో ఆయుధాలతో జొరబడి నేరస్తుడు ఇంట్లో వాళ్ళని తిట్టాడనీ, యజమానిని చెప్పుతీసుకొని కొట్టి గాయపర్చాడనీ, యజమాని భార్య మెడలోంచి పుస్తెల తాడు తెంపుకుపోయాడని ఆరోపణలుండవచ్చు. ఈ ఉదాహరణలో నాలుగు ఆరోపణలున్నాయి. ఒకటి అక్రమంగా ఇంట్లో జొరబడడం, రెండు యజమానిని కొట్టడం, మూడు ఇంట్లోవాళ్ళని తిట్టడం, నాలుగు యజమాని భార్య మెడ

లోని పుస్తెలతాడు ఎత్తుకుపోవడం.

ఒకొక్క ఆరోపణకి ఒక్కొక్క శిక్షని చట్టం నిర్దేశించింది. అలాంటప్పుడు ఏ ఆరోపణకు సంబంధించిన శిక్షను బట్టి నేరాన్ని పరిగణనలోకి తీసుకోడానికి కాలపరిమితి నిర్ణయించాల్సి వుంటుంది?

ఈ మొత్తం వ్యవహారంలో తీవ్రమైన శిక్ష విధించే అవకాశం ఉన్న నేరాన్ని బట్టి మాత్రమే కాలపరిమితి నిర్ణయించాలి. ఎందుచేతనంటే ఈ అన్ని నేరాలకి సంబంధించి విచారణ ఒకేసారి సాగుతుంది. అన్ని నేరాలు కూడా ఒకే సంఘటనకు సంబంధించినవి. చిన్న చిన్న నేరాలకి సంబంధించి కాలపరిమితి పూర్తయినా ఎక్కువ శిక్షవిధించే అవకాశమున్న నేరానికి సంబంధించిన కాలపరిమితినే కోర్టువారు పరిగణనలోకి తీసుకుంటారు.

నేరాన్ని పరిగణనలోకి తీసుకోవడానికి ముందు నిందుతుడి వాదనలు విన్నప్పటికీ కాలపరిమితి పూర్తయిపోయిన తర్వాత ఏ దశలో నైనాసరే నిందితుడు అభ్యంతరం తెల్పవచ్చు. కాలపరిమితి పూర్తయిన తరువాత నేరాన్ని పరిగణనలోకి తీసుకోవడం చట్టవిరుద్ధం. దాన్ని సవరించుకుంటూ కోర్టు ఏవిధమైన ఆదేశాలూ జారీ చేయడానికి వీల్లేదు.

నేరాన్ని పరిగణనలోకి తీసుకొనే విషయంలో కోర్టులు నిందితుడి పక్షాన ఆలోచించాల్సిన అవసరం ఉంది. చట్టం పేరిట, న్యాయస్థానల పేరిట, విచారణ పేరిట నిందితులకు అనవసరమైన చికాకు కలిగించకుండా ఉండాలంటే నేరాన్ని పరిగణనలోకి తీసుకునే విషయంలో కోర్టులు తప్పని సరిగా కాలపరిమితిని అనుసరించాలి. కాలపరిమితి ఎప్పటినుంచి ప్రారంభమవుతుంది?

ఒకే విషయానికి సంబంధించిన అంశంపై విచారణ జరపడానికి న్యాయస్థానం ముందు విచారణ జరిగినా ఆ తర్వాత అప్పీల్‌గాని, రివిజన్‌గాని అదే నిందితుడిపై దాఖలుచేసిన కాలపరిమితి నించి మినహాయింపు పొందవచ్చును. అయితే ఉద్దేశ్యపూర్యకంగా చేసిన పొరపాటు కాకూడదు. ఒకవేళ అదే విషయానికి సంబంధించని కేసయ్యేటట్లయితే ఈ మినహాయింపు వర్తించదు.

దర్యాప్తు నిలిపివేస్తూ ఏదైనా న్యాయస్థానం మధ్యంతర ఉత్తర్వులు జారీచేసిన పక్షంలో నిలిపివేత ఉత్తర్వులు జారీ అయిన నాటి నుండి అవి రద్దయ్యే నాటి వరకూ కాల పరిమితిని మినహాయిస్తారు.

క్రిమినల్ కేసు దాఖలు చేయనున్నట్లు నోటీసిచ్చివా కొన్ని నేరాలకి సంబంధించి కేసు దాఖలు చేయడానికి ప్రభుత్వాన్నించి అనుమతి పొందాల్సి ఉన్నా ఈనోటీసు కాలాన్ని అనుమతి పొందడానికి పట్టిన కాలాన్ని కాలపరిమితి నుండి మిన

పోయిస్తారు. అనుమతి కోరుతూ ప్రభుత్వానికి దరఖాస్తు చేసిన తేదీని ప్రభుత్వాన్నించి అనుమతి స్వీకరించిన తేదీని కాల పరిమితి నుంచి మినహాయిస్తారు.

కాలపరిమితిని నిర్ణయించే ముందు నేరస్తులు భారతదేశంలో లేని సమయాన్ని నేరస్థులని గుర్తించకుండా ఉన్న కాలాన్ని నేరస్తులు పరారీలో ఉన్న కాలాన్ని కూడా మినహాయిస్తారు.

కోర్టు సెలవుల్లో ఉన్నరోజుతో కాలపరిమితి పూర్తయ్యేట్లయితే కోర్టు తిరిగి తెచ్చిన నాటి కాలపరిమితి చివరి రోజుగా పరిగణిస్తారు.

కొన్ని కొన్ని నేరాలు నేరం జరిగిన నాడే కాక ఆ తర్వాత కూడా ఎప్పటి కప్పుడు నేరం జరిగినట్టుగానే పరిగణిస్తారు. ఈనేరం ఇలాగే కొనసాగుతూనే ఉంటుంది. కొనసాగే నేరాల విషయంలో కాల పరిమితి నిబంధన వర్తించదు. ఎప్పటికప్పుడు కొత్త కాలపరిమితి ప్రారంభ మౌతుంది. కాబట్టి ఈ రకాల నేరాలకి కాలపరిమితి వర్తించదు. మనుష్యుల్ని అపహరించడానికి (కిడ్నాపింగ్) సంబంధించిన నేరం మంచి ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఈ నేరం అపహరించ బడ్డ మనిషి తిరిగి లభించేంత వరకూ కొనసాగుతుంది. కాబట్టి ఇది కొనసాగే నేరంగా పేర్కొంటారు.

కొన్నిసార్లు కొన్ని సాంకేతిక కారణాలవల్ల కొన్ని ఇతర సహేతుకమైన కారణాల వల్ల, నేరం జరిగినప్పటికీ దాన్ని పోలీసులకు రిపోర్టు చేయక పోవచ్చు. లేదా నేరుగా కోర్టుకి నివేదించక పోవచ్చు. అలాంటప్పుడు నేరం జరిగి చాలా కాలంఅయింది కాబట్టి కేసు దాఖలు చేయడం సరైంది కాదనడానికి వీల్లేదు.

నేరం జరిగిన నాటి నుంచి కాలపరిమితి ప్రారంభమౌతుంది. లేదా నేరం జరిగిందని గుర్తించిన నాటినుంచీ కాలపరిమితి ప్రారంభమౌతుంది. లేదా నేరస్తుడిని గుర్తించిన నాటి నుంచి కూడా కాలపరిమితి ప్రారంభం కావచ్చు. అలాంటప్పుడు కాలపరిమితి పూర్తయి పోయిన తర్వాత సాధారణంగా కోర్టు నేరాన్ని పరిగణనలోకి తీసుకో గూడదు. దీనికి మినహాయింపుగా ఒకవేళ సహేతుక మైన కారణంచేత దర్యాప్తు జరగడంలో ఆలస్యం జరిగేట్లయితే కోర్టు కాలపరిమితిని మినహాయించి నేరాన్ని పరిగణనలోకి తీసుకోవచ్చు. ఇలా మినహాయింపు ఇచ్చేప్పుడు కోర్టు విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి ఒక నిర్ణయానికి రావలసి వుంటుంది. కేవలం పోలీసులు కోరారు, కాబట్టి మినహాయించడం సరైంది కాదు.

కాల పరిమితి మినహాయించే అధికారం న్యాయస్థానాలకు వుండటం వలన చాలాసార్లు పోలీసులుఏదో ఒక కుంటిసాకుచెప్పి కేసుల్ని పొడిగిస్తూ పోతున్నారు. ముఖ్యంగా కేసు విచారణ జరగకుండా జైలులో ఉంటున్న నిందితులు దీనికి బలైపోన్నారు. అందుకని ఈ అధికారాన్ని వినియోగించే ముందు న్యాయ స్థానాలు జాగ్రత్తగా వ్యవహరించి న్యాయం చేయడానికి దోహదపడాలి.

# ఖైదీలు కోర్టుకు హాజరు

అది 1968వ సంవత్సరం. ఒక తెల్లవారు జామున సూర్యప్రకాశరావు ఇంటి ముందు పోలీసు జీప్ ఆగింది. పోలీసులు హడావిడిగా సూర్యప్రకాశరావు ఇంటిని చుట్టుముట్టారు. కొందరు పోలీసులు తుపాకులు ఎక్కుపెట్టి అతనిఇంటి తలుపు తట్టారు. 'ఎవరూ' అంటూ ఆవలిస్తూ వచ్చి తలుపు తీశాడు సూర్యప్రకాశరావు. ఎదురుగుండా తుపాకులు పొజిషన్లో పెట్టుకున్న పోలీసుల్ని చూడగానే అతని గుండె ఆగినంతపనైంది నిలువునా చెమటలు పోశాయి అతనికి. భయంతో ఒణికిపోతూ 'ఏం కావాలి సార్'

అన్నాడు.

"సూర్యప్రకాశరావు వున్నాడా" అడిగారు పోలీసులు 'నేనే సార్ సూర్యప్రకాశరావుని' అని చెప్పాడు. అంతేపోలీసులు ఒక్కసారిగా కోపంతో బుసలు కొట్టారు. అతని మెడ పట్టుకొని బలవంతంగా బరబరా బయటికి ఈడ్చుకు పోయారు. "నేను ఏం చేశానండీ" అని అడిగితే అదంతా పోలీసుస్టేషన్లో చెబుతాం పదమన్నారు. ఆగండి లుంగీ మార్చుకొని బట్టలు కట్టుకొని వస్తానంటే కూడా వినిపించుకోకుండా బలవంతంగా ఎత్తి జీప్‌లో కుదేశారు. ఆ తరువాత వారం రోజులకి ఒక మర్డర్ కేసులో నేరస్తుడిగా చిత్రిస్తూ కోర్టుకు పంపారు. కోర్టువారు అతనికి పదిహేనురోజులు రిమాండ్ వేశారు.

పదిహేను రోజుల తరువాత అతన్ని తిరిగి కోర్టుకు హాజరు పర్చలేదు. అతని రిమాండ్ కాలం పొడిగించబడింది. ఇలా ప్రతి పదిహేను రోజులకి ఒకసారి అతని రిమాండ్ కాలం పొడిగించబడుతూనేవుంది. అతన్ని మాత్రం కోర్టులో హాజరు పర్చడం లేదు. ఇదేమిటని కోర్టువారు కూడా అడిగిన పాపాన పోలేదు. అతన్ని రిమాండ్ చేసి తొంభై రోజులు గడిచిపోయింది. అందుచేత కోర్టు వారు అతనికి ఛార్జిషీటు దాఖలు చెయ్యలేదన్న కారణంగా బెయిలు మంజూరు చేశారు.

అతని భార్య నానా అవస్థాపడి జామీనుమీద అతన్ని విడిపించింది. జైలు గేటుదాటి అతను బయటికిరాగానే తిరిగి పోలీసులు అతన్ని అరెస్టు చేశారు. అరెస్టు చేసిన హెడ్ కానిస్టేబుల్ "ఎలా ఉంది మన దెబ్బ" అన్నాడు కొంటెగా.

అతనికేసి సీరియస్‌గా చూశాడు సూర్యప్రకాశరావు. అతన్ని పోల్చుకున్నాడు అతను ఎవరో కాదు. ఆ మధ్య నడిరోడ్డుమీద యాక్సిడెంట్ చేసి పారిపోతుంటే తను వెంటపడి పట్టుకొని తీసుకువెళ్ళి పోలీసులకి అప్పగించిన వ్యక్తి ఇతనే. అతనికేసి చీత్కారంగా చూసి వెళ్ళి వ్యాన్ ఎక్కాడు సూర్యప్రకాశరావు. ఈసారి అతన్ని పోలీసులు ఒక్క దొమ్మి కేసులో ఇరికించారు. కేసులో బెయిలు తీసుకొని విడుదల అయ్యే సమయానికి అతను ఒక దొంగతనం కేసులో ముద్దాయి కాబట్టి ఆ కేసులో హాజరు పర్చమని ఆదేశిస్తూ కోర్టు వారు ఉత్తర్వులు జారీ చేశారు. దీన్ని పురస్కరించుకొని జైలువాళ్ళు అతన్ని విడుదల చెయ్యలేదు.

ఇహ తనకి జైలునుంచి విడుదల లభించదనుకొని పిచ్చిగా రోదించాడు. అలాగ అతను ఒక కేసులో కాకపోతే ఇంకో కేసులో ఏ శిక్షా పడకుండానే ఏళ్ళ తరబడి జైల్లో మగ్గిపోయాడు. భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందువున్న ఖైదీ చట్టాల్నే ఇప్పటివరకూ అనుసరిస్తున్నారు. ఖైదీలకి అవసరమైన చట్టాల్ని రూపొందించాల్సిన అవసరం వుందని స్వతంత్ర భారతదేశంలో ఇంతవరకూ ఏ ప్రభుత్వానికి తోచకపోవడం శోచనీయం.

రిమాండ్‌లో ఉన్న ఖైదీలని అవసరమైనప్పుడు కోర్టులో సాక్ష్యం చెప్పడానికీ, వారిమీద వున్న అభియోగాలపై విచారణ జరపడానికి వారిని కోర్టులో హాజరుపర్చవలసి ఉంటుంది, ప్రతి వాయిదాకీ ఖైదీల్ని కోర్టులో అనివార్యంగా హాజరుపర్చాలి. ఖైదీల్ని హాజరుపర్చినప్పుడే వారిమీద వున్న అభియోగాల్ని న్యాయస్థానాలు విచారించగలుగుతాయి.

సాధారణంగా రాజకీయ నాయకులకీ, ఖైదీలకీ మాత్రమే పోలీస్ ఎస్కార్ట్ (అంటే పోలీసు కాపలా) అవసరమౌతుంది. నాయకులకి వున్న ప్రాధాన్యత మిగతా మనుషులకి వుండనట్లుగానే వూళ్ళోకి రాజకీయ నాయకులు దిగినప్పుడు పోలీసుబలగం అంతా వార్ని వెన్నంటి ఉంటుంది. అలాంటప్పుడు ఖైదీల్ని కోర్టుకు హాజరు పర్చరు. తత్ కారణంగా విచారణ జరగడంలో జాప్యం జరుగుతుంది. కొన్ని సార్లు శాంతి భద్రతలపేరిట ఇలాంటిదే మరేదో కుంటిసాకు కారణంగా ఖైదీల్ని కోర్టుకు హాజరు పర్చారు. అంతేగాక పోలీసులు పగబట్టికూడా ఖైదీల్ని కోర్టుకు తీసుకురారు. అలాంటప్పుడు కోర్టు వారికి కేసులు నడపడం దుర్లభం అవుతుంది. దీంతో ఏళ్ళతరబడి కోర్టులో కేసులు పడి ఉండటమేగాక విచారణ లేకుండానే నిందితులు శిక్షలకి గురౌతారు. పోలీసు అధికార్లే న్యాయమూర్తులై పోతారు.

నిజానికి నిందితుల్ని హాజరుపర్చమని కోర్టు జైలు అధికారుల్ని ఆదేశిస్తుంది. అలాంటప్పుడు నిందితుల్ని హాజరుపర్చడం జైలు అధికార్ల బాధ్యతే అవుతుంది. కానీ పోలీసుల బాధ్యత కాదు.

కోర్టులో ఖైదీల మీద దాఖలైన అభియోగానికి సమాధానం చెప్పుకునేందుకు వీలుగా ఖైదీల్ని కోర్టుకి హాజరుపరుస్తారు. మనిషిని జైల్లోవుంచి విచారణ జరపడంలో అర్థంలేదు. ఖైదీలకి న్యాయవాదులుంటారుకదా, వాళ్ళే అతని తరపున కోర్టులో కేసు నడుపుతారు. అలాంటప్పుడు ఖైదీని కోర్టుకి హాజరుపర్చడం ఎందుకు? అని సందేహం కలగవచ్చు. ఎంత న్యాయవాదులున్నప్పటికీ వారికి ఆ విషయంపట్ల ఆ ఖైదీకున్నంత పరిజ్ఞానం ఉండదు. అందుచేత కేస్‌కి సంబంధించిన విషయాలు ఎప్పటికప్పుడు వారికి తెలియచేయాల్సి వుంటుంది. అంతేకాక కేసు నడుస్తున్నంతకాలం న్యాయవాదికి ఎప్పటికప్పుడు అవసరమైన సమాచారం అందించాలి. కేసులో చార్జిషీట్ దాఖలైన తరువాత కోర్టువారు నిందితుడికి అందులోని ఆరోపణలు వివరించి సమాధానం చెప్పమని అడుగుతారు. అప్పుడు అతను కోర్టువారికి నేరం చేశాననో, చెయ్యలేదనో సమాధానం చెప్పాల్సి వుంటుంది. నేరం చేశానంటే ఏ పరిస్థితుల్లో ఎందుకు చెయ్యవలసి వచ్చిందీ, చెయ్యలేదంటే అందుకు తనవద్ద గల ఆధారాలు ఏమిటీ, అన్నది కూడా తెల్పాలి. ఈ విషయాలన్నీ చెప్పుకోవాలంటే నిందితుడు తప్పనిసరిగా

కోర్టుముందు హాజరు కావాల్సివుంటుంది. ఈ సమాధానం నిందితుడి తరపున అతని న్యాయవాదిచెప్పడం అంత సబబుగా ఉండదు.

న్యాయస్థానాల్లో న్యాయం జరుగుతుండడమే కాక న్యాయం జరిగినట్లుగా అనిపించాల్సిన అవసరం ఉంది. అంతేకాక ఎవరికి వ్యతిరేకంగానైతే విచారణ జరుగుతుందో ఆ విచారణ ఆ వ్యక్తి సమక్షంలోనే జరగాలి. లేకపోతే కోర్టువారు అభియోగి, చేసిన ఆరోపణని ఆధారం చేసుకొని మాత్రమే విచారణ జరిపి శిక్ష విధించినట్టవుతుంది. కోర్టుకు నేరారోపణ చేసినవారూ నిందితులూ సమానమే. అందుచేత నిందితుడికి న్యాయం జరగాలంటే విచారణ జరిపినంతకాలం అనివార్యంగా ఖైదీని జైలునుంచి తీసుకొచ్చి కోర్టులో హాజరుపర్చాలి.

అనేక కేసుల్లో ఖైదీల్ని కోర్టువారు ఆదేశించినపుడు కోర్టుకు తీసుకురాక పోవడం జరుగుతుంది. అందుచేత కేసులు నెలలూ సంవత్సరాల తరబడి వాయిదా పడుతూ వుంటాయి. కొన్నిసార్లు నేరంరుజువై శిక్షపడినా అంతకంటే ఎక్కువ కాలం జైల్లో ఉండాల్సిన పరిస్థితి ఉండక పోవచ్చు.

ఇలా జైల్లో ఉండడం అనేది నేరం రుజువుకాకుండా శిక్షకు గురైనట్లు అవుతుంది. ఖైదీల్ని అవసరమైనపుడు అకారణంగా కోర్టులో హాజరుపర్చనట్లయితే వార్ని బెయిలుపైన విడుదల చెయ్యాలి. అప్పుడు ఎవరి ప్రమేయం లేకుండా నిందితులు కోర్టుకు హాజరు కాగలుగుతారు. ఎస్కార్ట్ లేదా మరేదో కుంటిసాకులతో ఖైదీల్ని కోర్టుకు హాజరుపర్చకపోవడం చట్ట విరుద్ధం.

ఇటీవల కాలంలో ఖైదీలను కోర్టుకు హాజరుపరచకపోవడానికి కారణం ఎస్కార్ట్ లేక పోవడమేనని జైలు అధికారులు అంటున్నారు. ఎస్కార్ట్ అంటే ఖైదీలను కావలికాస్తూ వారిని కోర్టుకు తీసుకువెళ్లే పోలీస్ పార్టీ. ఎస్కార్ట్‌కి అవసరమైన పోలీసులను సాధారణంగా పోలీస్ శాఖవారే సమకూరుస్తారు. జైలు పోలీసులు ఇందులో వుండరు. అందుచేత జైలు అధికారులు పోలీస్ శాఖని కేవలం ఎస్కార్ట్‌కి అవసరమైన ఏర్పాట్లు చెయ్యమని మాత్రమే కోరగలుగుతారు. అంతేకానీ కోర్టు ఆదేశాలను వారు నేరుగా అమలుపరచలేరు.

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. జైలు అధికారులు ఖైదీలను హాజరుపర్చకపోవడానికి బాధ్యులు పోలీసుశాఖవారా జైలుఅధికార్లానన్నది ఇక్కడ సమస్యకాదు. క్రిమినల్ కేసుల్లో నేరానికి గురైన వారి వేపు ప్రభుత్వం బాధ్యత తీసుకుంటుంది. కాబట్టి ఖైదీలను కోర్టుకు హాజరు పర్చాల్సిన బాధ్యత కూడా ప్రభుత్వానిదే. అందుచేత జైలు అధికారులు ఖైదీలను హాజరు పర్చకపోయినట్లయితే కోర్టులు ఏ మాత్రం కనికరం చూపాల్సిన అవసరంలేదు. ఇక్కడ ప్రభుత్వాన్ని కోర్టులు కవి

కరిస్తే ఖైదీలు అనవసరమైన ఇబ్బందులకి గురికావాల్సి వస్తుంది.

కొన్నిసార్లు ఖైదీలు జామీను మీద విడుదల అవాల్సిందిగా కేసు వాయిదా నాడు కోర్టుకు హాజరుపర్చాల్సివుంది కాబట్టి వారిని విడుదల చెయ్యడానికి జైలు అధికార్లు నిరాకరిస్తారు. ఇలా నిరాకరించడం సబబేనా. కోర్టు జామీను మీద విడుదల చెయ్యమని ఆదేశించినప్పుడు ఏ పరిస్థితుల్లోనూ జైలు అధికార్లు ఖైదీని నిర్బంధంలో వుంచడానికివీల్లేదు. అలాగే ఒక్కొక్కసారి నిందితులు ఒక కేసులో నిర్బంధంలోవుండగా మరొక కేసులో హాజరు పర్చాల్సిందిగా కోర్టు ఆదేశిస్తుంది. అలాంటప్పుడు మరో కేసులో కోర్టులో హాజరుపర్చవలసివుంది కాబట్టి అతన్ని విడుదల చెయ్యమని నిర్బంధంలో వుంచడానికి వీల్లేదు. రెండో కేసులో నిందితుడ్ని కేవలం కోర్టులో హాజరుపర్చమని మాత్రమే కోర్టు ఆదేశించింది. అతన్ని నిర్బంధంలో వుంచమని కోర్టు ఆదేశించ లేదు. అలాంటప్పుడు మొదటి కేసులో విడుదలైన తరువాత రెండో కేసులో నిర్బంధంలో వుంచడం చట్టవిరుద్ధమే అవుతుంది. క్రిమినల్ కేసుల్లో నిందితులుగా వున్నప్పుడే కాక సాక్ష్యం కోసం కూడా ఖైదీలను కొన్నిసార్లు కోర్టులో హాజరుపర్చాల్సి వుంటుంది. అలాంటప్పుడు కూడా ఈ నిబంధనలే వర్తిస్తాయి.

ఖైదీలు జబ్బుపడినప్పుడు వారిని కోర్టులో హాజరుపరచలేకపోవచ్చు. అలాంటప్పుడు కోర్టు ఆదేశాలను అమలుపర్చనప్పటికీ అది చట్టవిరుద్ధం కాదు. కోర్టు ఆదేశించినప్పుడు అనివార్యంగా ఖైదీలను కోర్టులో హాజరు పరచాల్సివున్నప్పటికీ దానికి కొన్ని మినహాయింపులున్నాయి. అందులో ప్రధానమైనది రోగిష్టి ఖైదీలను కోర్టుఆదేశించినప్పటికి వారిని కోర్టులో హాజరు పర్చనవసరం లేదు.

ఇకపోతే కేసు విచారణలో వున్నప్పుడు వేరొక కేసులో కాని సాక్ష్యానికి గాని నిందితుడిని కోర్టులో హాజరుపర్చాల్సి వుండేట్లయితే కేసు విచారణ కొనసాగుతోంది గనుక అతన్ని కదిలించాల్సిన పనిలేదు.

జైలునించి నిందితుడిని కోర్టులో హాజరుపరచినప్పుడు అతన్ని నిర్బంధంలో వుంచడానికి కావల్సిన ఏర్పాట్లను కోర్టువారు చేస్తారు. ఖైదీలను కోర్టులో హాజరు పర్చినప్పుడు కేసు పిల్చేంతవరకూ వారిని పోలీసు వ్యాన్‌లలో వుంచడం జరుగుతోంది. ఎప్పుడో ఉదయం పదిగంటలకు కోర్టుకు తీసుకువస్తే తిరిగి జైలుకు తీసుకెళ్లేవరకూ వారికి తిండితిప్పలూ వుండటంలేదు. కనీస అవసరాలు కూడా ఈ మధ్యకాలంలో తీరవు. కోర్టుల్లోనే పరిస్థితులిలా వున్నప్పుడు ఇహ జైళ్లలో పరిస్థితులు ఇంతకంటే మంచిగా వుంటాయని ఊహించనవసరం లేదు. వాస్తవానికి ఖైదీలను కోర్టుకు హాజరు పరచినప్పుడు అక్కడ వారిని నిర్బంధంలో వుంచడానికి కావలసిన పరిస్థితులు సక్రమంగా ఉన్నాయో లేదో చూడాల్సిన బాధ్యత న్యాయస్థానాల మీద వుంటుంది.

# విచారణకు ముందే కేసు కొట్టివేత

గోపాల్రావు పోలీసు వ్యవస్థమీద వ్యాసం వ్రాశాడు. పోలీసులు లంచాలు తిన మరిగారని, సక్రమంగా దర్యాప్తు చెయ్యలేకే మనుష్యుల్ని హింసిస్తున్నారని, ఎన్ కౌంటర్ల పేరిట నిర్దాక్షిణ్యంగా నక్సలైట్లని కాల్చి చంపుతున్నారని గోపాలరావు వ్యాసంలో వివరించాడు.

వ్యాసం చదివిన జనం ప్రతిస్పందించలేదు. కానీ పోలీసులు మాత్రం కోపం తెచ్చుకున్నారు. 'ఈ లంజకొడుకు ఎక్కడైనా దొరికితే క్రైమా కొట్టేయా'లని పళ్ళు నూరుకున్నారు. ఒక అర్థరాత్రిపూట టూటౌన్ పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టర్ మందీ మార్బ లంతో వచ్చి గోపాలరావుని అరెస్టు చేశారు. 'నేనేం తప్పు చేశానన్నా'డు గోపాల్రావు తెల్లబోయి, 'నీ ఇంట్లో బాంబులు తయారు చేస్తున్నావన్నారు పోలీసులు-వచ్చి ఆబద్ధం కావాలంటే వెతుక్కోండి' అన్నాడు గోపాల్‌రావు.

పోలీసులతనిల్లు సోదా చేశారు. అతవ్రాసిన వ్యాసాలు, కథలు, చదువుకొనే పుస్తకాలు అన్నీ తీసుకొచ్చి వీధిలోకుప్పబోసి తగులబెట్టారు. 'ఇదేవిటి, ఆ పుస్తకాల్ని, వ్యాసాల్ని, కథల్ని ఎవరూ నిషేధించలేదు, అని అరిచాడు గోపాల్రావు. 'ఛత్! నోర్మూయ్' అని అతని నోటి మీద బలంగా గుద్దాడు సబ్ ఇన్‌స్పెక్టర్. అతని పళ్ళు కదిలిపోయి చిగుళ్ళ నుంచి రక్తం కారుతోంది.

'వాక్ స్వాతంత్ర్య'మని గొణుక్కున్నాడు గోపాల్రావ్. షటప్పన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్. స్వాతంత్ర్యం నోర్మూసుకొని పోలీస్ కస్టడీలో మౌనంగా అంత మొందింది. వారంరోజుల తర్వాత గోపాల్రావ్ దగ్గర బాంబుల్దొరికాయని అభియోగం మోపి పోలీసులతన్ని కోర్టులో హాజరుపరిచారు. అక్కడికి కక్షతీరని ఒన్‌టవున్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్ పోలీసుల పరువుకు నష్టం వాటిల్లేలా గోపాల్రావ్ వ్యాసం వ్రాసి ప్రచురించాడని గోపాల్రావ్ మీద, వ్యాసం ప్రచురించిన పత్రికాసంపాదకుడి మీద, ప్రచురణ కర్తమీదా కేసు పెట్టాడు.

గోపాల్‌రావు మీద పెట్టిన బాంబుకేసులో అవి బాంబులనడానికి కావలసిన ఆధారాలేమీలేవని నిపుణులు పంపిన నివేదిక ఆధారంగా చేసుకొని క్రింది కోర్టు కేసు విచారణ జరపకుండానే కొట్టేసింది. తన వ్యాసంలో పోలీసుల పరువుకి నష్టం కలిగించే అంశాలేవీలేవని అంచేత పోలీసులు దాఖలుచేసిన చార్జిషీట్ ప్రాథమిక ఆధారాల్లు లేనిదిగా భావించి కోర్టువారు కేసు కొట్టేయాలని గోపాల్‌రావు కోర్టులో వాదించాడు. మెజిస్ట్రేట్

గారు కేసు విచారిస్తే తప్ప ఆ విషయం తేలదని విచారణ నిమిత్తం కేసు వాయిదా వేశారు.

పత్రికా సంపాదకుడూ, ప్రచురణకర్తా హైకోర్టులో పిటీషన్ వేశారు. ఈ కేసు విచారణ జరగడమంటే న్యాయవ్యవస్థా విధానాల్ని దుర్వినియోగ పర్చడమేనని వారు వాదించారు. వ్యాసంలో ప్రత్యేకించి ఏ పోలీస్ అధికారి మీద ఆరోపణ చేయలేదనీ, అందుచేత ఎవరు బడితే వాళ్ళు ఈ వ్యాసం తమను ఉద్దేశించిందేననుకోవడం సరైంది కాదనీ, ప్రాసిక్యూషన్ కేసు నిరాధారమైందనీ పేర్కొంటూ హైకోర్టు పిటీషను అనుమతిస్తూ క్రింది కోర్టులో కేస్ చెల్లదని తీర్పు చెప్పింది.

మన పోలీసులు పెట్టే కేస్‌లు నూటికి డెబ్బయిశాతం నిందితుడిని నేరస్తుడిగా నిర్ధారించడానికి కావలసిన ఆధారాలు లేకుండా ఉంటాయి. ఒక్కోసారి ఇట్లాంటి కేసులు ఎందుకు పెడతారా అని కూడా అనిపిస్తుంది. కేసుల్లో తిరిగే వాళ్ళకి అది పనిష్మెంట్ గానూ, చూసే వాళ్ళకి నవ్వులాటగానూ, కోర్టుల్లో జరిగేదంతా ఒక ఫార్స్‌గాను తయారయ్యాయి పోలీస్‌కేసులు. మన పోలీసుల్లో దుర్మార్గమేగాక కేసులు పెట్టి కసి తీర్చుకొనే రామప్పంతులి వైఖరికూడా వుంది. అంచేతే కేసులు నిలబడవని తెలిసి కూడా ఏదో ఒక్కేసు పెట్టటం, ఒక్కోసారి స్టాటిస్టిక్స్ దృష్ట్యా కేసులు పెట్టడమూ చేస్తున్నారు. నిజానికిలాంటి కేసుల్లోతిరగటం ఒకరకమైన పనిష్మెంట్. ఈ విషయంలో కోర్టులు జాగ్రత్తగా వ్యవహరించి ప్రాథమిక దశలోనే అంటే కేసు విచారణ మొదలుకాక ముందే నిందితుడికి స్వేచ్ఛ ప్రసాదించవలసిన అవసరం ఉంది. లేకపోతే కోర్టులు కూడా పరోక్షంగా పోలీసులకు సహకరించినట్లవుతాయి.

విచారణ జరగటానికి ముందు కోర్టులు రెండు దశల్లో ప్రాథమికాధారాలు లేని కేసుల్ని కొట్టేయడానికి వీలవుతుంది. చార్జ్‌షీట్ దాఖలు చేసిన వెంటనే ఆరోపణలు ప్రాథమికాధారాలు లేనివయితే కేసుని కోర్టు పరిగణనలోకి తీసుకోదు. చార్జ్‌షీట్‌లోని ఆరోపణల్ని నిర్ధారించే సమయంలో మౌలిక ఆరోపణంటూ ఏదీ లేదనుకున్నప్పుడు కోర్టు కేసు కొట్టేయవచ్చు. ఇటీవలికాలంలో న్యాయమూర్తులకి నెలకిన్ని కేసులు తీర్పు చెప్పాలన్న నిబంధన ఏర్పడింది. అంచేత ఆరోపణల్ని నిర్ధారించే సమయంలో సాధారణంగా కేసులు కొట్టివేయడంలేదు. కేవలం యాంత్రికంగా విచారణ జరిపి తీర్పులు చెబుతున్నారు. ఈ వైఖరి వల్ల నిందితులు అనవసరమైన ఇబ్బందులకు గురవుతున్నారు. ఒక విధంగా చూస్తే ఇందులో కోర్టునుకూడా తప్పుపట్టవలసిన అవసరం లేదు. ఎందుకనంటే కేసు పెట్టి పోలీసులు చేతులు దులుపుకుంటారు. ఆ తర్వాత అనేక దశలు గడిచిన పిదప మాత్రమే కేసు విచారణకు వస్తుంది. కేవలం విచారణ ప్రారంభించడానికి ముందు మాత్రమే కోర్టు ఆరోపణలు నిర్ధారించడానికి పూను

కొంటుంది. ఈ దశలో కేసు కొట్టివేస్తే దాన్ని తీర్పు చెప్పినట్టుగా పరిగణించరు. అంచేత సాధారణంగా ఈ దశలో కేసులు కొట్టివేయడానికి కోర్టులు ఇష్టపడటం లేదు.

ఏ దశలో కోర్టు తీర్పు చెప్పినప్పటికీ విచారణ ముగించి తీర్పు చెప్పినట్లుగా పరిగణించేట్లయితే కొంతలో కొంత మేలు జరగవచ్చు.

చార్జిషీట్‌లో మౌలిక ఆరోపణలు లేనప్పుడు హైకోర్టు తనకున్న విస్తృతాధికారాల క్రింద కూడా క్రింద కోర్టులో ఉన్న కేసు కొట్టెయ్యవచ్చు. ఇక్కడ కోర్టుకున్న విస్తృతాధికారాలని గురించి కొంత వివరించాల్సిన అవసరం ఉంది. చట్టం ఎప్పుడు సమగ్రం కాదు. ఎప్పటికప్పుడు తలెత్తే కొత్త సమస్యల్ని పరిష్కరించడానికి కొత్తగా చట్టాన్ని రూపొందించాల్సి ఉంటుంది. చట్టాన్ని శాసన సభలు అనుకున్న వెంటనే రూపొందించలేవు. అందుచేత తగిన న్యాయం చెయ్యడానికి చట్టాన్ని రూపొందించే అధికారం న్యాయస్థానాలకి ఉండాలి. ఒక వేళ ఇలాంటి అధికారం న్యాయాస్థాలకి లేకపోయినా కనీసం న్యాయంగా వ్యవహరించడానికి వీలుగా న్యాయస్థానాలకు విస్తృత అధికారాలు ఉండాలి. ఈ దృష్ట్యేనే సిఆర్‌పిసిలో హైకోర్టుకి విస్తృత అధికారాలు కల్పించడం జరిగింది. ఈ అధికారం క్రింది కోర్టులకి లేదు. సాధారణంగా విచారణ జరిగేది, విచారణకు ముందు తతంగం అంతా జరిగేది క్రింది కోర్టుల్లోనే కనుక కొత్తగా ఏవైనా సమస్యలు ఉత్పన్నం అయితే అవి క్రిందికోర్టుల ముందే ఉత్పన్నం అయ్యే అవకాశం ఉందని స్పష్టం అవుతుంది. అలాంటప్పుడు కేసు నడుస్తున్నప్పుడు ఈసమస్య పరిష్కారానికి సత్వరం అవకాశం లేకపోతే పార్టీలు ఇబ్బందులకి గురికావాల్సిన దుస్థితి ఏర్పడుతుంది. ఈ దృష్ట్యా క్రింది కోర్టులకి విస్తృత అధికారాలు ఉండాల్సిన అవసరం ఉంది.

ప్రాథమిక ఆరోపణలు లేని కేసుల్లో హైకోర్టు కల్పించుకొని విస్తృతాధికారాల క్రింద కేసు కొట్టివేస్తుంది. నిజానికి పోలీసులు పెట్టిన కేసుల్లో చాలావరకు సాంకేతిక లోపాల్తో కూడుకొనో అసలు మౌలిక ఆరోపణలు లేకుండానో ఉంటాయి. ఇలాంటి కేసులు హైకోర్టుకు పంపితే సాధారణంగా నిలవ్వు. ఈ వైఖరి కారణంగానే నూటికి తొంభై క్రిమినల్ కేసులు కొట్టేస్తున్నారన్న విషయం గమనించగలము.

తనమీద దాఖలైన కేసులో ప్రాథమిక ఆరోపణలు లేవనడమంటే నేరాన్ని ఆమోదించడం కాదు. ఉదాహరణకి రామయ్యని భీమయ్య చంపాడని ఆరోపిస్తూ పోలీసులు కేసు దాఖలు చేసారనుకుందాం. ఆ కేసు ప్రథమసమాచారనివేదికలో భీమయ్య పేరు లేదు. ఆ తరువాత భీమయ్యే నేరం చేశాడనడానికి ఛార్జిషీట్‌లో కూడా ఎలాంటి ఆధారాలు లేవు. కేవలం భీమయ్య ఎల్లయ్య దగ్గర తాను నేరం చేసినట్లుగా ఒప్పుకొన్నాడన్న ఆరోపణ వినా, ఈ కేసులో భీమయ్య నేరం చేశాడన

దానికి ఎలాంటి ఆధారంలేదు. ఇకపోతే ఎల్లయ్య ముందు నేరాన్ని ఆమోదించడమంటే కోర్టుముందు నేరాన్ని ఆమోదించడంతో సమానం కాదు. అలాంటప్పుడు ఈ కేసులో నిందితుడైన భీమయ్య మీద ప్రాథమిక ఆరోపణ అంటూ ఏమీ లేనట్లే కదా! భీమయ్యపై కోర్టులో కేసు కొట్టివెయ్యమని పిటిషన్ దాఖలు చేసుకోవచ్చు. ఇలా పిటిషన్ దాఖలు చేసుకోడమంటే భీమయ్య నేరాన్ని ఆమోదించడమని అర్థంకాదు.

ప్రాథమిక ఆరోపణలు లేని కేసులు విచారణ జరపడమంటే న్యాయ వ్యవస్థ విధానాల్ని దుర్వినియోగ పర్చడమేనని అర్థంచేసుకోవాలి. అంతేకాక వ్యక్తి స్వేచ్ఛని హరించడమే అవుతుంది.

సుప్రీం కోర్టుఎప్పుడు పడితే అప్పుడు ఏ కేసులోపడితే ఆకేసులో ఈ అధికారాన్ని ఉపయోగించరాదని చెప్పిన తీర్పుని కోర్టులు శిరోధార్యంగా తీసుకుంటున్నాయి. నిజానికి కేసులు పెట్టేప్పుడు ప్రాథమిక ఆరోపణలతో పెడితే ఈ ఆదేశిక సూత్రాన్ని పాటించవచ్చు. ఒకవేళ క్రింది కోర్టులు కేసు విచారణ ప్రారంభించే ముందైనా ప్రాథమిక ఆధారాలు ఉన్నాయా లేదా అన్న విషయాన్ని పరిగణించినా బాగుంటుంది. తత్ భిన్నంగా కోర్టులూ పోలీసులూ వ్యవహరించినంతకాలం హైకోర్టు, సుప్రీంకోర్టులు విస్తృతాధికారాల ఆయుధాన్ని ఉపయోగించక తప్పదు. కొన్ని కేసుల్లో చార్జిషీట్ దాఖలు చేసే ముందు ప్రభుత్వం నుంచి అనుమతి పొందాల్సి ఉంటుంది. అనుమతి నిచ్చేముందు ఈకేసుల్లో ప్రాసిక్యూషన్ అవసరమా లేదా అన్న విషయాన్ని ప్రభుత్వం క్షుణ్ణంగా పరిశీలించాలి. కేసు పూర్వాపరాల్ని పూర్తిగా పరిశీలించిన తరువాత మాత్రమే ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చి అవసరం అనుకుంటే ప్రాసిక్యూషన్ కు అనుమతిస్తుంది. సాధారణంగా పోలీసులు అనుమతి కోరిన వెంటనే ప్రభుత్వం గుడ్డిగా ప్రాసిక్యూషన్ అనుమతిస్తుంది. అలాంటప్పుడు ప్రాసిక్యూషన్ అక్రమం కనుక కేసు విచారణకి ముందే కొట్టివెయాల్సిన అవసరం ఉంది. ఇలాంటి కేసుల్లో హైకోర్టు తనకున్న విస్తృతాధికారాల్ని పురస్కరించుకొని కేసు కొట్టివేయవచ్చు.

నిర్ణీత కాలపరిమితిలో దాఖలు చెయ్యని కేసులు విచారణ జరపకుండా కొట్టేయ్యాలి. ఒకవేళ క్రింది కోర్టులో ఈ విషయాన్ని పరిగణించకపోతే హైకోర్టు విస్తృతాధికారాల క్రింద కేసు కొట్టివేయవచ్చు.

విచారణ అవసరం లేని కేసుల్లో ముందుగానే కొట్టేయడంవల్ల కేసు గెల్చిన వారిని, ఇంటికొచ్చి ఏడ్చే పరిస్థితి నుంచి తప్పించినట్లవుతుంది. హైకోర్టు తన విస్తృతాధికారాలు విస్తృతంగా ఉపయోగించి న్యాయవ్యవస్థ స్వాతంత్ర్యాన్ని కాపాడుతుందని ఆశిద్దాం.

# రాజీ

మొగుడుపోయి ఇంట్లో కూర్చొని దుఃఖపడుతున్న సరోజిని ఒంటరిగా ఉంటం చూసి ఆమె మీద అత్యాచారం చెయ్యబోయాడు రాఘవులు. రాఘవులు ప్రవర్తనని సరోజిని ఎదిరించడంతో అతను కత్తి బయటకి తీసి ఆమెని చంపుతానని బెదిరించాడు. అయినా బెదరక 'రక్షించండి' 'రక్షించండి' అని చుట్టుపక్కల వాళ్ళకి వినిపించేలా అరిచింది సరోజిని. కత్తితో ఆమెనొసట గాయంచేసి పారిపోయాడు రాఘవులు. సరోజిని పోలీస్ రిపోర్ట్ ఇచ్చింది. పోలీసులు రాఘవులు మీద కేసు పెట్టారు.

సరోజిని ప్రవర్తన మంచిదికాదు, తనని రమ్మని పిలిచి ఏవరో చూశారన్న అనుమానంతో కేకలు వేసిందని పుకార్లు లేపాడు రాఘవులు. సాక్ష్యం చెప్పేట్టయితే మనుష్యుల్ని పెట్టి చంపిస్తానని సరోజినిని బెదిరించాడు. జడ్జి, సిటీ పోలీసులూ అంతా తన పక్షమే ఉన్నారని కేసు గెల్చిన తరువాత నష్టపరిహారం కోసం కేసువేసి చెవులు పిండి వసూలు చేస్తానని హెచ్చరించాడు.

సరోజిని భయపడిపోయింది. అసలే ఒంటరి ఆడది. ఏం చెయ్యగలదు. ఒక వేళ సాక్ష్యం చెప్పినా కేసులో నిందితుడికి శిక్ష పడకపోయేట్లయితే అతను తనమీద చేస్తున్న ప్రచారం నిజమవడమేకాక నష్టపరిహారం కూడా కట్టుకోవాల్సివస్తుందని భయపడి, ఇష్టం లేకపోయినా రాఘవులుతో రాజీ చేసుకొని కేసు ఉపసంహరించుకోవాలనుకొంది.

క్రిమినల్ కేసుల్లో సమాజం బాధ్యత తీసుకుంటుంది అలాంటప్పుడు ప్రైవేట్ వ్యక్తులు రాజీపడి కేసు ఉపసంహరించుకోవచ్చా? అని సందేహం కలుగవచ్చు. నేరస్తుల్తో పోలీసులు రాజీపడిపోయి కేసుల్లోంచి నిందితుల్ని తప్పిస్తున్న రోజుల్లో ఇరు పక్షాలూ రాజీపడ్డంల్లో తప్పేమిటనిపించవచ్చు.

న్యాయస్థానాలూ సమాజం నేరం అనేది సమాజానికి వ్యతిరేకంగా జరిగినట్లు పరిగణిస్తాయి. అందుచేత నేరస్తుడ్ని శిక్షించే బాధ్యత సమాజం తీసుకుంటుంది. కేసులు పెట్టడమైనా ఉపసంహరించుకోవడమైనా సమాజమే చేస్తుంది.

కేవలం కొన్ని వ్యక్తిగత తగాదాలవంటి విషయాల్లో జరిగిన నేరాల్లో

మాత్రమే పార్టీలు రాజీపడ్డానికి అవకాశం ఉంటుంది. అంతేకాని ఒక హత్యకేసులోనో, రేప్‌కేసులోనో పార్టీ రాజీపడినంతమాత్రాన కేసులు కొట్టివేయడం జరగదు. ఇలాంటి నేరాల్లో రాజీపడ్డానికి వీల్లేదు. చట్టం కొన్ని నేరాల్లోనే రాజీపడ్డానికి అవకాశం కల్పించింది. కొన్ని నేరాల్లో కోర్టు అనుమతితో పార్టీలు రాజీ చేసుకోవచ్చు. ఇహ మిగిలిన అన్ని నేరాల్లోనూ రాజీ చేసుకోవడానికి వీల్లేదు. రాజీపడ్డానికి వీల్లేని కేసుల్లో తప్పనిసరిగా విచారణ జరుగుతుంది.

రాజీ చేసుకోవడానికి అవకాశమున్న కేసుల్లో నిందితులూ నేరానికి గురైనవారూ, ఇరుపక్షాలు పరస్పర ఆమోదంతో మాత్రమే రాజీ చేసుకోవచ్చు. ఇందులో ఇతర సాక్షులకి ఎలాంటి ప్రమేయమూ ఉండదు.

సాధారణ ప్రజానీకానికి సంబంధించిన చిన్న నేరాల్లో నిందితుడు నేరస్థుడితో రాజీ చేసుకోవడానికి అవకాశం వుంటుంది. పార్టీలు కోర్టుకు వచ్చిన తమ కేసులో రాజీపడ్డంత మాత్రాన వాళ్ళ విషయం మరుగు పర్చడానికి ప్రయత్నిస్తున్నారనుకోవడానికి వీల్లేదు. అంతూ పొంతూ లేకుండా పోయే పగలూ, ద్వేషాలూ చల్లార్చడానికి రాజీపడ్డానికి అవకాశం కల్పించి కోర్టులు తోడ్పడుతున్నాయని అనుకోవచ్చు.

నిందితుడు నేరం చేశానని ఒప్పుకొనే కేసుల్లోనే కాక నూరుపాళ్ళ నేరం రుజువు అవడానికి అవకాశం వున్న కేసుల్లో రాజీపడ్డంవల్ల నిందితుడు కేసులోంచి శిక్ష పడకుండా బయటపడటానికి అవకాశం ఏర్పడుతుంది. రాజీపడ్డం వల్ల ఇరుపక్షాల మధ్యనా సదవగాహన, సత్సంబంధాలు నెలకొనడానికి కావాల్సిన వాతావరణం ఏర్పడుతుంది.

కేసు ఉపసంహరించుకోవడం, రాజీపడ్డం ఒక దానితో ఒకటి సంబంధం లేని విషయాలు. కేసు ఉపసంహరించుకొనే ముందు నేరారోపణ చేసిన వారు మెజిస్ట్రేట్ నుంచి అనుమతి పొందాలి. ఉపసంహరించుకోవడానికి తగిన ఆధారాలున్నాయని మెజిస్ట్రేట్‌ని సంతృప్తిపరచిన మీదటే మెజిస్ట్రేట్ ఉపసంహరించుకోవడానికి అనుమతిస్తారు. ఉపసంహరణ అన్ని సమన్స్ కేసుల్లోనూ (రెండు సంవత్సరాలకు మించి శిక్ష విధించడానికి వీల్లేని కేసుల్లో) సాధ్యమవుతుంది. రాజీపడ్డానికి అన్ని కేసుల్లో అవకాశముండదు. చట్టం ప్రత్యేకించి నిర్దేశించిన కేసుల్లో మాత్రమే వీలవుతుంది. కేసు ఉపసంహరించుకోవడం పూర్తిగా ఏకపక్షమైంది. నేరారోపణ చేసినవారు మాత్రమే ఉపసంహరించుకోగలరు. అదే రాజీ పడాలంటే ఇరుపక్షాల మధ్య అవగాహన వుండి పరస్పర సహకారంవల్ల మాత్రమే సాధ్యమవుతుంది.

కొన్నిసార్లు నేరారోపణ చేసినవాళ్ళు నిందితుణ్ని ఏదో రకంగా ఇబ్బంది పెట్టాలని తప్పుడు కేసు పెట్టి కోర్టుచుట్టూ తిప్పుతుంటారు. కోర్టులు శిక్ష

వేయడంతో సంబంధం లేకుండా నడిపించింది సరిపోతుందని అనుకొన్నప్పుడు వాళ్ళంతట వాళ్ళే కేసు ఉపసంహరించుకొనే అవకాశం వుంది. అలాంటప్పుడు న్యాయ వ్యవస్థ విధానాల్ని దుర్వినియోగ పరచకుండా చూడటానికి కోర్టు కేసు ఉపసంహరణకి అనుమతించే ముందు తగిన జాగ్రత్తలు తీసుకొంటుంది. అదే రాజీపడ్డం విషయంలో న్యాయవ్యవస్థ విధానాల్ని దుర్వినియోగ పరిచే సమస్య తలెత్తదు.

నేరారోపణ చేసిన వారు, నిందితుల్లోని ఒకరు క్షమాపణ కోరారు కాబట్టి ఆ నిందితుడిపై కేసు ఉపసంహరించుకోదల్చుకుంటేఅది రాజీపడ్డమే అవుతుంది. కాని అది కేసు ఉపసంహరించుకోవడం కాదు. అవసరంఅనుకొంటే నేరారోపణ చేసిన వారు, కేసు ఉపసంహరించుకోదల్చింది, రాజీ పడదల్చిందీ తేల్చుకోవడానికి మెజిస్ట్రేట్ నేరారోపణ చేసిన వారిని విచారించి తేల్చుకోవచ్చు.

నేరానికి గురైన, గాయపడ్డ వారికి నిందితుడికి మధ్యన కుదిరే ఒప్పందమే రాజీపడ్డం అవుతుంది. రాజీపడ్డమంటే అసలు నేరం జరగలేదనుకోవడానికి వీల్లేదు. నేరానికి గురైన, వ్యక్తి నిందితుడ్ని వదిలెయ్యడమో తగిన నష్టపరిహారం తీసుకొని పరిష్కరించుకోవడమే అవుతుంది.

రాజీ విషయంలో ఒప్పందం కుదిరిన మీదట మాత్రం అమల్లోకొస్తుంది. అంతే కాని భవిష్యత్తులో కుదుర్చుకోదల్చుకొన్న ఒప్పందానికి ఇప్పుడు రాజీపడ్డానికి వీల్లేదు.

పెద్దమనుషుల ముందు రాజీ పడ్డానికి ఒప్పందం కుదుర్చుకున్నప్పుడు కోర్టు దాన్ని రాజీపడ్డట్టుగా పరిగణించదు. అయితే ఆ పెద్దమనుషుల ముందు నిజంగా రాజీ పడ్డపుడు మాత్రమే ఆ తరువాత కోర్టు దాన్ని రాజీ పడ్డట్టుగా పరిగణించి కేసుకొట్టి వేస్తుంది.

బయట పెద్దమనుషుల ముందు రాజీపడి ఆ తరువాత కోర్టులో బదలాయించినట్లయితే కోర్టు దాన్ని రాజీగా పరిగణించదు. కేవలం రాజీ పడదగ్గ కేసుల్లో మాత్రమే రాజీ సాధ్యమవుతుంది. భారతశిక్షాస్మృతిలోని ఏ ఏ నేరాల్లో కోర్టు అనుమతి లేకుండా రాజీ పడవచ్చునో చట్టం స్పష్టంగా నిర్దేశించడం జరిగింది. రాజీ పడటానికి వీల్లేని కేసుల్లో రాజీ పడ్డానికి కోర్టులు అనుమతించడానికి వీల్లేదు. అలా అనుమతించినట్లయితే కోర్టులు ప్రజాభీష్టానికి భిన్నంగా వ్యవహరించినట్లవుతుంది.

కొన్ని కేసుల్లో సాక్ష్యాలు తీసుకోక ముందు అది రాజీ పడ్డానికి అవకాశమున్న కేసుగా కనిపించవచ్చు. అయితే సాక్ష్యాలు విచారించిన మీదట అది రాజీ పడ్డానికి అవకాశం లేని నేరారోపణ చేసిన కేసుగా పరిణమించినట్లయితే కోర్టులు పార్టీలు రాజీపడ్డానికి అనుమతించవు. రాజీకి అనుమతించే ముందు కోర్టు అన్ని పరిస్థితులను

పరిగణనలోకి తీసుకొంటుంది.

చార్జిషీట్‌లో ఏ నేరాన్ని ఆరోపించింది ఆ తరువాత ఏ ఆరోపణని నిర్ధారించిందన్న విషయాల్ని ప్రాతిపదికలుగా తీసుకొని కోర్టులు రాజీపడ్డానికి అనుమతి ఇవ్వడమా లేదా నన్న విషయం నిర్ణయిస్తాయి. రాజీపడే కేసుల్లో రాజీపడ్డానికి పార్టీలు దరఖాస్తు చేసుకున్న తేదీని కోర్టు ప్రాతిపదికగా చేసుకుంటుంది. భవిష్యత్తులో సాక్ష్యాధారాల విచారణ తర్వాత ఉత్పన్నం కానున్న పరిస్థితిని ఊహించి రాజీకి అనుమతి ఇవ్వడమో నిరాకరించడమో చెయ్యడానికి వీల్లేదు.

రాజీ పడ్డానికే వీల్లేని కేసుల్లో రాజీ పడ్డానికి అవకాశమున్న నేరంగా కోర్టు నిర్ధారిస్తే ఆ కేసులో రాజీ పడవచ్చు. రాజీ పడ్డానికి అవకాశం లేని కేసుల్లో నిందితుడ్ని శిక్షించినపుడు అపీలులో రాజీపడే నేరంగా దాన్ని పరిగణించేట్లైతే నిందితుడికి రాజీపడ్డానికి హైకోర్టు అవకాశం ఇస్తుంది.

## రాజీకి వీలున్న నేరాలు

"నన్ను రామయ్య కొట్టి గాయపర్చాడ"ని ఆరోపిస్తూ కేసు పెట్టాడు నాయుడు రామయ్యమీద. నాయుడు బాగా ఉన్నవాడు. కేసు కోసము ఎంతైనా ఖర్చు పెట్టగల స్తోమత ఉన్నవాడు. రామయ్య పూటకి ఠికాణా లేనివాడు. "నేను ఏ పాపం ఎరుగను. నా అర ఎకరం భూమి కలుపుకో నివ్వలేదన్న కోపం కొద్ది నా మీద అన్యాయంగా ఈ కేసు పెట్టాడన్నాడు రామయ్య. ఇప్పుడేమీ చెయ్యలేం ఆ మాటేదో కోర్టులో హాజరు పర్చినప్పుడు చెప్పుకో మన్నారు అతన్ని అరెస్టు చేసినప్పుడు పోలీసులు. "విచారణ జరగనివ్వు, ఆతర్వాత నిజనిజాలుతేలుస్తాం" అన్నారు కోర్టువారు అతన్ని కోర్టువారు అతన్ని కోర్టులో హాజరుపర్చగానే. బెయిల్ తీసుకోని బయటపడ్డాడు రామయ్య. కేసు పెట్టిన నాయుడు పైసా ఖర్చులేకుండా నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నాడు. పోలీసు ఖర్చులకీ ప్లీడర్ ఖర్చులకీ రామయ్యకి తడిసి మోపెడైంది. ఈ డబ్బు సంపాదించడానికి అతను భూమి తాకట్టు పెట్టాల్సి వచ్చింది.

వాయిదా వాయిదాకి ఊరుకాని ఊరు వెళ్ళి కోర్టు కేసులో హాజరు కావడానికి కూడా అతనికి ఆ రోజంతా ఖర్చుకావడమే కాక చార్జీలకీ కోర్టుఖర్చులకీ తెగఖర్చయింది. దీన్తో అతని ఆర్థికస్థితి పూర్తిగా అడుగంటి ఉన్న అరెకరం భూమి తెగనమ్మాల్సి వచ్చింది. భూమిఅమ్మితే బాకీలుతీరవచ్చు కాని కేసు పోదుకదా. బాకీ తీరగా మిగిలింది తనకిస్తే కేసులో రాజీ పడ్తానన్నాడు నాయుడు. ఊళ్ళో వాళ్ళని ఎవర్నీ ఆ భూమి కొననివ్వకుండా తక్కువధరకి నాయుడు ఆ భూమి కొనుక్కున్నాడు. ఈ

విధంగా నాయుడికి రామయ్యకి మధ్యన రాజీ కుదిరి పోయింది. కోర్టువారు ఇరుపక్షాల మధ్యన కుదిరిన రాజీని ఆమోదించి కేసు కొట్టేశారు.

రాజీ కుదిరిందంటే నేరారోపణ చేసినవారు ఏదో ప్రతిఫలం పొందారని అనుకుంటాం. ఈ ప్రతిఫలం అనేది డబ్బు రూపేణా ఉండవచ్చు. పెద్దలు కల్పించుకోవడం వలన కావచ్చు. ఊళ్ళో పెద్ద మనుషులు సర్ది చెప్పడం వల్ల అయుండవచ్చు. గ్రామ పంచాయతీలో పరిష్కరించుకోవడంవలనైయుండవచ్చు. ఏదేమైనప్పటికీ పార్టీల మధ్యన సదవగహన కుదిరింది కాబట్టి రాజీకి అనుమతించ వచ్చని కోర్టులు భావిస్తాయి. కొన్నిసార్లు నిందితుడు నేరారోపణ చేసిన వారిని క్షమించమని కోరవచ్చు. అయితే అన్నిసార్లూ క్షమించమని అడగటమో ప్రతిఫలంగా డబ్బు తీసుకోవడమో ఖచ్చితంగా జరగాల్సిన పని లేదు. డబ్బు రూపేణా ప్రతిఫలం పొంది రాజీ పడడానికి సిద్ధపడే కేసుల్లో ఎక్కువ భాగం అన్యాయంగా డబ్బు సంపాదించాలన్న దురుద్దేశంతో కేసులు పెట్టే వారే ఉండే ప్రమాదం ఉంది. ఈ రకమైన వాళ్ళు న్యాయవ్యవస్థని దుర్వినియోగ పర్చకుండా చూడాల్సిన పూచీ న్యాయవ్యవస్థ మీద ఉంది.

పార్టీల మధ్యన రాజీ ఆమోదించే ముందు పార్టీలు ఏ పరిస్థితిలో రాజీ పడ్డానికి సిద్ధపడిందీ కోర్టువారు విచారణ జరిపి తెలుసుకోవాలి. భయపెట్టో బ్రతిమాలో ఇష్టం లేకుండా బలవంతంగా రాజీకి ఒప్పించారా లేదా అన్న విషయం తెలుసుకొని స్వేచ్ఛగా రాజీకి ఒప్పుకున్నట్లు భావిస్తేనే కోర్టు పార్టీలు రాజీపడ్డానికి అనుమతించాలి.

ఏయే నేరాల్లో రాజీ పడవచ్చునో, ఏయేనేరాల్లో రాజీపడడానికి వీల్లేదో ఇప్పుడు చట్టం స్పష్టంగా పేర్కొంది. ఇలా పేర్కొనడానికి అది మొత్తం సమాజానికి వర్తించని నేరమై కేవలం ప్రయివేటు వ్యక్తులకు మాత్రమే వర్తిస్తున్నదనుకోవడాన్ని ప్రాతిపదికగా తీసుకోవడం జరిగింది. క్రిమినల్ ప్రొసిజర్ కోడ్ సెక్షన్ 320లో రాజీపడ దగిన నేరాన్ని వివరించారు.

ఒక్కోసారి కొన్ని కేసుల్లో అనేక నేరాల్ని ఆరోపించవచ్చు. ఉదాహరణకు ఎవరైనా కొట్టారని ఆరోపిస్తూ సెక్షన్ 323 (ఐపిసి) కింద అభియోగం మోపుతూ చట్టవిరుద్ధంగా గుమిగూడి ఈ పని చేశారని కొందరు వ్యక్తుల మీద ఆరోపించవచ్చు. ఇక్కడ రెండు నేరాల్ని ఆరోపించినట్లయింది. ఒకటి కొట్టడం, రెండు అక్రమంగా గుమిగూడడం. కొట్టడం అనే నేరం రాజీపడటానికి వీలున్న నేరం. ఇహపోతే చట్ట విరుద్ధంగా గుమిగూడడం అన్న నేరం రాజీపడటానికి వీలైనది కాదు. అలాంటప్పుడు ఈ కేసులో రాజీ చేసుకోవచ్చునా? కొట్టడం కోసం అక్రమంగా గుమిగూడినట్లయితే ముఖ్యమైన నేరంలో రాజీపడేట్లయితే మిగిలిన నేరం రుజువయ్యే అవకాశం ఉండదు.

అంచేత సాధారణంగా కేసు కొట్టివేయడంతో పరిసమాప్తం అవుతుంది.

చట్టంలో నిర్దేశించిన వ్యక్తులు మాత్రమే రాజీపడ్డానికి అర్హులు. తన భార్య చెడునడవడిక కలిగి ఉందని దుష్ప్రచారం చేస్తున్నారని భర్త ఆరోపించేట్లయితే ఆ కేసులో రాజీ చేసుకోవటానికి భర్తకి అర్హత ఉండదు. భార్యమాత్రమే రాజీచేసుకోవాల్సి ఉంటుంది.

కేవలం కేసులో నేరారోపణ చేసిన వారు, నిందితుడు, సాక్షులు మాత్రమే రాజీ చేసుకోవడానికి అర్హులు అని చట్టం ఎక్కడా చెప్పలేదు. నేరానికి గురై నష్టపడ్డవాళ్ళు, నిందితుడు మాత్రమే పరస్పరం రాజీ చేసుకొనటానికి అర్హులని చట్టం అభిప్రాయపడింది.

గాయపర్చిన నేరానికి సంబంధించిన కేసులో గాయపడ్డ వ్యక్తి మాత్రమే రాజీపడ్డానికి అర్హుడు. అతని బంధువులో, స్నేహితులో హితులో రాజీచేసుకోవడానికి వీల్లేదు. అలాగే ఇతరుల స్థలంలో అక్రమంగా చొరబడ్డారని నేరారోపణకు చెందిన కేసులో ఆ స్థల యజమాని మాత్రమే రాజీచేసుకోవడానికి అర్హుడు. అక్రమ నిర్బంధం కేసులో నిర్బంధితుడు మాత్రమే రాజీ చేసుకోవచ్చు. పార్టీలు పరస్పరం రాజీచేసుకుంటే తప్ప కోర్టు రాజీచేసుకోమని సలహా చెప్పడానికి వీల్లేదు. మైనారిటీ తీరని వ్యక్తులు రాజీ చేసుకోవాల్సివస్తే వారి తరపున తగిన వ్యక్తి ఎవరైనా సరే రాజీ చేసుకోవచ్చు. చిన్న పిల్లల విషయంలో తల్లిదండ్రులు ఆ పిల్లల తరపున రాజీపడవచ్చు.

కోర్టు అనుమతితో సంబంధం లేకుండా పార్టీలు రాజీపడ్డానికి అవకాశం ఉన్న కేసుల్లో మెజిస్ట్రేట్ అనివార్యంగా రాజీని ఆమోదించాలి. ఇందులో నేరారోపణ చేసిన వారు ఇంకా ఆ కేసులో కొనసాగాలా లేదా అనేది తెలుసుకోవాల్సివుంటుంది. అంతేగాని కోర్టు వారికెలాంటి సంబంధమూ ఉండదు. ఒకసారి పార్టీలు పరస్పరం రాజీపడ్డట్లుగా కోర్టువారికి దరఖాస్తు చేసుకున్నప్పుడు కోర్టు ఇరుపక్షాలవారు ఆ దరఖాస్తులోని విషయాలను అర్థంచేసుకొని సంతకాలు చేశారాలేదా అన్న విషయం తేల్చుకుని కేసు కొట్టివేయాల్సి ఉంటుంది. అంతేగాని వాయిదా వేయడానికి వీలులేదు. నేరారోపణ చేసిన వారుగానీ, నిందితుడుగానీ ఇద్దరిలో ఎవరైనా సరే రాజీపడినట్లుగా దరఖాస్తు చేసుకోవచ్చు.

## కోర్టు అనుమతితో రాజీ

కోర్టు అనుమతించిన తరువాత రాజీ పడడానికి వీలైన నేరాలు కొన్ను న్నాయి. ఇలాంటి నేరాల్లో ముందుగా కోర్టు అనుమతి పొందిన తరువాతనే పార్టీలు రాజీ

పడవచ్చు. ఒక్కొక్కసారి ఇలాంటి కేసుల్లో కోర్టు బయట పార్టీలు రాజీ చేసుకొని ఆ తరువాత కోర్టు అనుమతి పొందినట్లైతే కూడా ఆ రాజీని చట్టబద్ధంగా భావిస్తారు.

ఏ కోర్టులోనైతే కేసు వుందో ఆ కోర్టు వారే రాజీపడడానికి అనుమతించాలి. అంతేకాని పోలీసు వారికి ఇందులో ఎలాంటి ప్రమేయమూ వుండదు. ఒకవేళ ప్రాసిక్యూషన్‌వారు కేసు ఉపసంహరించుకోదలచినా అందుకు కోర్టువారి అనుమతి పొందాల్సి వుంటుంది.

రాజీకి అనుమతించడానికి అధికారం వున్న కోర్టు వారు తమకు తాముగా రాజీ పడడానికి అనుమతించాలా లేదానని తేల్చుకోవాలి. అంతేకానీ పోలీసు వారి అభిప్రాయం కోసం వారికి నోటీసు ఇవ్వడానికి వీల్లేదు.

రాజీ పడడానికి అనుమతించే ముందు కోర్టువారు సహేతుకంగా ఆలోచించి ఒక నిర్ణయం గైకొనాలి. పార్టీల మధ్యన సంబంధం ఏమిటి? ఏ పరిస్థితుల్లో నేరం జరిగింది? పార్టీల మధ్య సత్సంబంధాలు నెలకొనడానికి అవకాశం వుందా? వంటి విషయాలని పరిగణనలోకి తీసుకోవాలి. రాజీ పడడానికి అనుమతించడానికి గల కారణాలు వివరించాలి.

రాజీ పడ్డానికి అనుమతించే ముందు కోర్టువారు గాయపడ్డ వారికి నష్ట పరిహారం చెల్లించమని అడగవచ్చు. నేరారోపణ చేసిన వారికి అభ్యంతరం లేనిపక్షంలో రాజీ పడేప్పుడు తక్కువ నష్టపరిహారం చెల్లించినా కోర్టు రాజీకి అనుమతించాలి.

నిందితుడు రాజీపడినట్లు చెప్పినట్లైతే రాజీపడినట్లుగా సాక్ష్యాధారాలు అతనే కోర్టుకు చూపాలి. రాజీపడవలసిన వారితో పడినట్లైతేనే చట్టబద్ధమైన రాజీగా కోర్టు పరిగణిస్తుంది. రాజీ న్యాయమైందా కాదా, చట్ట బద్ధమైనదా కాదానన్న విషయాల్ని కోర్టు గమనిస్తుంది. రాజీ పడ్డట్టుగా ఇరుపక్షాలు ఆమోదించేట్లైతే కోర్టు తగిన నిర్ణయం గైకొంటుంది. రాజీ పడ్డదీ లేనిదీ విచారణ జరిపి తెలుసుకోకుండా కోర్టు రాజీకి అనుమతించేట్లైతే ఆ రాజీ చెల్లదు.

కోర్టు అనుమతితో సంబంధం లేకుండా రాజీ పడ్డానికి వీలయ్యే కేసుల్లో కంప్లైంట్ దాఖలు చెయ్యకముందు రాజీ చేసుకోవచ్చు. తీర్పు వెలువడక ముందు ఏ దశలోనైనా రాజీ చేసుకోవచ్చు. కేసులో నిందితుడికి శిక్ష పడేట్లైతే అపిలేట్ కోర్టు అనుమతితో రాజీపడవచ్చు. అపిలేట్ కోర్టు పునర్ విచారణకి ఆదేశించేట్లైతే తిరిగి విచారణ జరిగే కోర్టులో కేసు రాజీ చేసుకోవచ్చు.

కేసు విచారణ పూర్తయి, రివ్యూ పిటిషన్ విచారణలో వుండగా కూడా పార్టీలు కోర్టు అనుమతితో రాజీపడవచ్చు. సెషన్స్ కోర్టులో రివ్యూ విచారణలో వుండేట్లైతే సెషన్స్ కోర్టులో, హైకోర్టులో వుండేట్లైతే హైకోర్టులో రాజీ చేసుకొనవచ్చు. రాజీకి

ఇరుపక్షాల వారి ఆమోదాన్ని కోర్టు రికార్డు చేసుకొన్న తరువాతే కోర్టు రాజీ పడ్డానికి అనుమతిస్తుంది. కొన్ని కొన్ని సార్లు క్రింద కోర్టులో పార్టీలు కేసు విచారణలో ఉండగా రాజీ చేసుకోవడానికి ఏమైనా ప్రయత్నించారా లేదానన్న విషయాన్ని సెషన్స్ కోర్టు హైకోర్టులు రాజీపడ్డానికి అనుమతించే ముందు పరిగణనలోకి తీసుకొంటాయి.

ఒకసారి రాజీపడ్డ తరువాత తిరిగి ఆ రాజీని ఉపసంహరించుకునేందుకు వీల్లేదు. ఒప్పందానికి విరుద్ధంగా ఏ పక్షమైనా నడుచుకునేటట్లయితే దానికి వేరే ఏ ప్రత్యామ్నాయాన్నైనా ఎన్నుకోవాలి. ఒకసారి రాజీపడ్డ తరువాత మెజిస్ట్రేట్ కేసు కొట్టి వేస్తారు. కాబట్టి తిరిగి ఆ కేసు విచారణ జరపమని కోరడానికి వీల్లేదు.

రాజీపడ్డ తరువాత కేసు కొట్టి వేస్తారు. ఒకవేళ కేసు కొట్టివేయడం సర యింది కాదన్నప్పుడు తిరిగి ఆ కేసు విచారణ జరుగుతుంది. కేసులోని విషయం వేరొక నేరాన్ని చెందినదయి ఆ నేరం రాజీ పడటానికి వీల్లేని నేరమయితే ఆ కేసులో తిరిగి విచారణ కొనసాగవచ్చు. అలాగే అనేకమంది నిందితులున్న కేసులలో నేరారోపణ చేసినవారు, కొందరితో రాజీపడినట్లయితే రాజీపడ్డ నిందితులపై కేసు కొట్టివేస్తారు. మిగిలిన వారిపై కేసు విచారణ కొనసాగుతుంది.

కొన్ని సందర్భాల్లో నిందితుల్లోని కొందరు రాజీ చేసుకునేట్లయితే ఆ రాజీ మొత్తం కేసుకు వర్తించే రాజీగా వున్నప్పుడు మిగిలిన నిందితులపై కూడా కేసు కొట్టి వేస్తారు. రాజీపడ్డ మీదట కేసు కొట్టి వేసినప్పుడు నిందితుడి గుణగణాలు నిర్ణయించ డంలో ఈ కేసుకు ఎలాంటి ప్రాముఖ్యతా వుండదు. రాజీకి దరఖాస్తు చేసుకున్న నాటి నుంచి రాజీ అమల్లోకి వస్తుంది. ఇహ అప్పుడు కోర్టుకి ఈ కేసుల్లో చేయగలిగేదేమీ వుండదు.

చట్టంలో ఏఏ కేసుల్లో కోర్టు అనుమతితో సంబంధం లేకుండా రాజీపడ వచ్చునో ఏఏ కేసుల్లో కోర్టు అనుమతితో రాజీపడవచ్చునో రాజీ ఎవరి మధ్య జరగాలో స్పష్టంగా పేర్కొనడం జరిగింది. అంచేత చట్టంలో పేర్కొన్న నేరాలు వినా మరే కేసులోనూ రాజీచేసుకోవడానికి వీల్లేదు.

సివిల్ కేసులో నష్టపరిహారం పొందిన తరువాత రాజీ పడదగిన కేసైతే క్రిమినల్ కేసు రాజీపడ్డట్లుగా పరిగణిస్తారు.

రాజీపడ్డానికి వీల్లేని కేసుల్లో నేరారోపణ చేసినవారు ఆ కేసులో కొనసాగ డానికి ఇష్టపడక పోయినప్పటికి అనివార్యంగా విచారణ జరుగుతుంది. విచారణ ముగిసిన తరువాత శిక్ష వేయదగిన కేసైతే కోర్టువారు నిందితులకు శిక్షవిధిస్తారు. ఇలాంటి కేసుల్లో పూర్తి బాధ్యత ప్రభుత్వం మీదే వుంటుంది కాబట్టి నేరారోపణ చేసిన వారికి ఎలాంటి ప్రమేయం ఉండదు.

# కేసు ఉపసంహరణ

"నిన్ను నూరు చెరువుల నీళ్ళు తాగిస్తాను చూసుకో. అన్నాడు అప్పారావు కోపంగా, గోవిందయ్యని. పిల్లలతో వచ్చిన పోట్లాట పెరిగిపోయి పెద్దల వరకూ పాకిపోయింది. "నిన్ను తిప్పిన కోర్టు తిప్పకుండా తిప్పుతాను కాచుకో" మని హెచ్చరించాడు ప్లీడరు గుమాస్తా గోవిందయ్య. "ఎందుకయ్యా పిల్లల పోట్లాట యిక్కడతో పోనివ్వక" అని సర్ది చెప్పారు పెద్దలు. అయినా వాళ్ళిద్దరూ వినిపించుకోకుండా చూసుకొందాం అంటే చూసుకొందాం అనుకొని విడిపోయారు. అప్పారావు గోవిందయ్య మీద తన సరిహద్దు గోడ కూలగొట్టాడని అందుకైన నష్టం చెల్లించమని ఆదేశించమని కోరుతూ సివిల్ కేసు పెట్టాడు.

పాత పగలతో తనని ఒంటరి వాడ్నిచేసి బుర్రబద్దలు కొట్టాడని ఆరోపిస్తూ

గోవిందయ్య ఒక దొంగ మెడికల్ సర్టిఫికెట్ పుట్టించి అప్పారావు మీద తప్పుడు కేసు పెట్టాడు. దీన్తో ఊళ్ళో పెద్దలు కల్పించుకొని రాజీచేసి కేసులు ఉపసంహరించు కోమని సలహా ఇచ్చారు.

సివిల్ కేసులు పూర్తిగా పార్టీల మధ్య వ్యక్తిగత విభేదాలకి సంబంధించినవి కాబట్టి పార్టీలు అనుకుంటే ఉపసంహరించుకోవచ్చు. అదే క్రిమినల్ కేసు ఉపసంహరించుకోవడం సాధ్యమవుతుందా? తప్పని సరిగా రాజీపడాల్సిందేనా?

కేసు ఉపసంహరణ కేసువేసిన వారి మీద ఆధారపడి ఉంటుంది. అదే రాజీ అన్నది ఇరు పక్షాలకు సంబంధించినదై ఉంటుంది. రాజీపడాలంటే నిందితుడి ఆమోదాం కూడా అవసరం. అదే కేసు ఉపసంహరించుకోదలిస్తే నేరారోపణ చేసిన వారే ఏకపక్షంగా ఆపనిచెయ్యవచ్చు.

చట్ట ప్రకారం కేసు ఉపసంహరించుకోవాలంటే కోర్టువారి అనుమతి తప్పని సరిగా పొందాలి. అదే రాజీ పడదగిన కేసుల్లో కోర్టు అనుమతి అవసరంలేదు. అంతేకాక రాజీపడ్డ అన్ని కేసుల్లోనూ కేసు కొట్టి వేసినట్లుగా కోర్టు పరిగణిస్తుంది. కానీ కేసు ఉపసంహరించుకొన్నప్పుడు మాత్రం కోర్టువారు ఉపసంహరించుకోవడానికి అనుమతిస్తూ నిందితుడి మీద కేసు కొట్టివెయ్యాల్సి ఉంటుంది. చట్టప్రకారం రెండు సంవత్సరాలకి మించి శిక్ష విధించడానికి వీల్లేని కేసుల్లో కోర్టువారి అనుమతితో నేరారోపణ చేసిన వాళ్ళు కేసు ఉపసంహరించుకోవచ్చు.

నేరారోపణ చేసినవారు కేసు ఉపసంహరించుకోవచ్చంటే పోలీస్ రిపోర్టు ఇచ్చిన వారు కేసు ఉపసంహరించుకోవచ్చునా అన్న అనుమానం కలగవచ్చు. పోలీస్ రిపోర్టు ఇవ్వడం వేరు. నేరారోపణ చెయ్యడం వేరు. పోలీసులకి రిపోర్టు ఇవ్వడం అంటే నేరం జరిగిందని సమాచారం అందివ్వడమే. రిపోర్టుని ఆధారం చేసుకొని పోలీసులు దర్యాప్తు జరిపి దర్యాప్తులో నేరం ఋజువైందనుకొంటే నేరారోపణ చేస్తూ నిందితులపైన కేసు పెడతారు. అంచేత పోలీసు కేసుల్లో ప్రభుత్వమే నేరారోపణ చేసిందిగనుక పోలీసు రిపోర్టు ఇచ్చిన వారికి కేసు ఉపసంహరించుకొనే హక్కు వుండదు. కేవలం ప్రయివేటు కేసుల్లో మాత్రమే నేరారోపణ చేసిన వారికి కేసు ఉపసంహరించుకునే హక్కు ఉంటుంది.

కేసులో తీర్పు వెలువడటానికి ముందు ఏ దశలోనైనా సరే కేసు ఉపసంహరించుకోవచ్చు. రెండు సంవత్సరాలకు మించి శిక్ష విధించే అవకాశమున్న కేసుల్ని ఉపసంహరించుకోడానికి వీల్లేదు.

కేసు ఉపసంహరించుకోడానికి ముందు, అందుకు తగిన కారణాలు ఉన్నట్లుగా మెజిస్ట్రేట్‌ను సంతృప్తిపర్చాలి పోలీసు కేసు విచారణలో ఉంది కాబట్టి

ప్రైవేట్ కేసు ఉపసంహరించుకోడానికి అనుమతించడం సరైంది కాదు. అలాగే పోలీసు కేసు కొట్టేసారన్న కారణంగా ప్రైవేట్ కేసు కూడా కొట్టెయ్యడానికి వీల్లేదు. రెండు కేసులు విలీనం చేసి విచారణ జరపాలి. ఈ చట్టంక్రింద కేసులు ఉపసంహరించుకోడానికి అనుమతించే అధికారం మెజిస్ట్రేట్‌కి మాత్రమే ఉంటుంది. ఈ విషయంలో పోలీసుల కెలాంటి అధికారం ఉండదు. ఉపసంహరించుకోడానికి అనుమతించిన తర్వాత మెజిస్ట్రేట్ నిందితుడు నిర్దోషి అని ప్రకటిస్తూ కేసు కొట్టేస్తారు.

కేసు కొందరి నిందుతులపైనగాని అందరి నిందుతులపైన గానీ ఉపసంహరించుకోవచ్చు. కొందరిమీద కేసు ఉపసహరించుకొన్నంతమాత్రాన మిగతా వారి మీద కూడా కేసు ఉపసంహరించుకొన్నట్లుగా పరిగణించరు. అందుకనే కోర్టు వారు కేసు ఉపసంహరించుకోడానికి అనుమతించిన మీదట నిందితుడు నిర్దోషని కేసు కొట్టేస్తారు. ఏఏ నిందితుడి మీద కేసు ఉపసంహరించుకోడానికి అనుమతించరో, ఏఏ నిందితులపై కేసు కొట్టివేయరో ఆయా నిందితులపై విచారణ కొనసాగుతుంది.

## ప్రాసిక్యూషన్ ఉపసంహరణ

నేరారోపణ చేసినవారు ప్రైవేట్ కంప్లైంట్ విషయంలో ప్రాసిక్యూషన్‌తో సంబంధంలేకుండా వాళ్ళంతట వాళ్ళే కేసు ఉపసంహరించుకోవచ్చు. అయితే పోలీసులు పెట్టిన కేసుల్లో ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకోవచ్చునా అన్న సందేహం కలుగుతుంది. ఫలానా నేరానికి సంబంధించిన కేసులు ఉపసంహరించుకోవచ్చునని రెండు సంవత్సరాలకు మించకుండా శిక్ష విధించడానికి అవకాశంవున్న కేసుల్లోనే నేరారోపణ చేసిన వారు కేసులు ఉపసంహరించుకోవచ్చునని తెలుసుకున్నాం. అయితే శిక్షా కాలంతోగానీ, నేరంతోగానీ సంబంధంలేకుండా ఎలాంటి కేసుల్లోనైనా ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకోవచ్చునాన్న సందేహం కలగవచ్చు.

పోలీసులు పెట్టిన కేసుల్లో ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకోవడానికి అవకాశం లేక పోయేటట్లయితే న్యాయ వ్యవస్థ విధానాల్ని దుర్వినియోగపర్చడానికి పోలీసులకు ప్రత్యేకించి అవకాశం కల్పించినట్లు అవుతుంది. అంతేగాక కేసులు రుజువు కావని, కేసులు నడపడం వల్ల ఖర్చు తప్ప ఫలితం ఏమీ వుండదని అనుకున్నడు ఆయా కేసుల్లో ప్రాసిక్యూషన్ నడిచేటట్లయితే ప్రభుత్వానికి ఆర్థిక భారమే తప్ప మరో ఫలితం ఏదీ వుండదు. ఇలాంటప్పుడు ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకునే అవకాశం ప్రభుత్వానికి వుండడం అవసరం.

డ్యూటీ ధిగి ఇంటికి వెళుతున్న పోలీసు పాపారావుకి భార్యకు మల్లెపూలు

తీసుకెళ్ళాలనిపించింది. రోడ్డుమీద వున్న పూలకొట్టు వాళ్ల దగ్గరికి వెళ్ళి తలాకాసిని మల్లెపూలు కట్టివ్వమని అడిగాడు. డబ్బులివ్వండి కట్టిస్తానన్నాడు అందులో ఒక షాప్ అతను. 'పోలీసోణ్ణి డబ్బులడుగుతావా, నీ సంగతి చూస్తానుండు' అని బెదిరించాడు పోలీసు పాపారావు. అమ్ముకునేవాడు కొనుక్కునేవాణ్ణి ఎవరైనా సరే డబ్బులడుగుతాడని ఖచ్చితంగా చెప్పాడు షాపతను. 'అరేయ్, నువ్వు పూలమ్ముతున్నావో, ఆడపిల్లల్ని అమ్ముతున్నావో నాకు తెలువదనుకున్నావట్రా, నీ అంతు తేల్చేస్తానుండు' అని అరిచాడు పోలీసు పాపారావు. షాపతను కూడా రెచ్చిపోయాడు. 'కష్టపడి బతికేవాళ్ళమీద ఏంటండీ మీ జబర్దస్తీ, మీ ఇష్టమొచ్చిన పని చేసుకోండి, పోండి' అన్నాడు. బుసలు కొడుతూ వెళ్ళిపోయాడు పోలీసు పాపారావు. మర్నాడు పోలీసు బలగంతో వచ్చి పూల కొట్టును కూలగొట్టి కొట్టువాడిని జుట్టు పట్టుకుని ఈడ్చుకుపోయాడు. వారం రోజుల తర్వాత ఆడపిల్లల్ని ఎత్తుకుపోయి అమ్మే వ్యాపారం చేస్తున్నాడని వాడి మీద కేసు పెట్టించాడు పాపారావు. పూలకొట్టువాడు పోలీసు ధాటికి జడిసిపోయాడు. 'బాబూ, కావాలంటే మీ ఇంటికి ప్రతిరోజూ పూలు పంపించుకుంటాను. నా మీద కేసు కొట్టేయించండి' అని పోలీసు పాపారావును బతిమలాడుకున్నాడు. పూలవాడితో ఒప్పందం కుదుర్చుకుని పాపారావు ప్రాసిక్యూటర్‌తో ఎలాగైనా సరే కేసు ఉపసంహరించుకోమని చెప్పాడు. ప్రాసిక్యూషన్ కేసు ఉపసంహరించుకున్న తర్వాత 'పోలీసోడంటే ఏంటను కున్నావ్? తల్చుకుంటే నిన్ను లాకప్‌లో కుళ్ళబొడిసేయగలను. కాదంటే కేసు పెట్టి శిక్ష వేయించి ఉరికంబమెక్కించనూగలను. కాళ్ళ మీద పడితే నీ మీద పెట్టిన కేసు ఇలా కొట్టేయించనూ గలను. అందుకని పోలీసోడంటే ఏమిటో ఇహముందైనాసరే తెలుసుకుని నడుచుకో' అని హెచ్చరించాడు.

ఇలా పోలీసోడు తల్చుకుంటే ఏమైనా చేయగలడు. కేసులు పెట్టనూ గలడు, ఉపసంహరించుకోనూ గలడు. కేసులు ఉపసంహరించుకోదల్చుకుంటే మాత్రం ఆ కేసు పబ్లిక్ ప్రాసిక్యూటర్ ద్వారానే చేయించాల్సి వుంటుంది. పోలీసులు పెట్టిన కేసు లను వారి తరపున పబ్లిక్ ప్రాసిక్యూటర్ ప్రాసిక్యూషన్ నిర్వహిస్తారు. కేసులు ఉప సంహరించుకోవాలంటే ఆ కేసును నిర్వహించే పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాత్రమే ఆ పని చేయాల్సివుంటుంది. అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ గనుక కేసు నిర్వహిస్తు న్నట్లయితే అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ కేసు ఉపసంహరించుకోవాల్సి వుంటుంది.

అయితే ప్రాసిక్యూటర్‌కి ప్రాసిక్యూషన్‌లో సహకరించే న్యాయవాదులకు కేసు ఉపసంహరించుకునే అధికారం లేదు. ఒకవేళ పబ్లిక్ ప్రాసిక్యూటర్ కనుక కేసు నిర్వహించడానికి న్యాయవాదిని నియమించుకునేటట్లయితే అప్పుడు న్యాయవాదికి కూడా కేసు ఉపసంహరించుకునే హక్కు వుంటుంది.

కేసు నిర్వహించని పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి కేసు ఉపసంహరించుకునే అధికారం వుండదు. కేసు విచారణలో వుండగా ప్రభుత్వం కనుక ఆ కేసు విచారణకు కొత్త పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ని నియమించేటట్లయితే ఆ కొత్త పబ్లిక్ ప్రాసిక్యూటర్ కూడా ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకునేందుకు అనుమతిని కోర్టువారిని కోరవచ్చు.

ఎవరి పోలీసు రిపోర్టును ఆధారం చేసుకుని కేసు దాఖలు చేయడం జరిగిందో ఆ వ్యక్తికి ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకునే అధికారం వుండదు. కాని పబ్లిక్ ప్రాసిక్యూటర్ ప్రాసిక్యూషన్‌ని ఉపసంహరించుకునేటప్పుడు అందుకు ఆవ్యక్తికి ఏమైనా అభ్యంతరాలు వుండేటట్లయితే ఆ విషయాన్ని కోర్టు దృష్టికి తీసుకురావచ్చు. కోర్టు ప్రాసిక్యూషన్ ఉపసంహరణకు అనుమతించే ముందు ఈ విషయాన్ని పరిగణన లోకి తీసుకుంటుంది. ఒకసారి పబ్లిక్ ప్రాసిక్యూటర్ కేసు ఉపసంహరించుకున్న తర్వాత ఆ కేసులో ఛార్జిషీట్ దాఖలు చేసిన పోలీసులు తిరిగి ఆ కేసులో విచారణ జరపమని కోరడానికి వీలులేదు. నిజానికి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ని నియమించేది ప్రభుత్వమైనప్పటికీ అతన్ని కోర్టు అధికారిగానే కోర్టు పరిగణిస్తుంది. కాబట్టి ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకోవడానికి పబ్లిక్ ప్రాసిక్యూటర్ కోర్టు వారిని సంప్రదించి ఉపసంహరించుకున్నట్లుగానే భావించాలి.

ప్రాసిక్యూషన్ ఏ పరిస్థితుల్లో ఉపసంహరించుకోవచ్చుననే విషయంలో చట్టం ఎలాంటి నిబంధనల్ని విధించలేదు. కేవలం అది పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఇష్టా ఇష్టాల మీద ఆధారపడి వుంటుంది. అయితే ప్రాసిక్యూటర్ తన నిర్ణయాన్ని అమలు పర్చేముందు జిల్లా మెజిస్ట్రేట్ తదితర అధికార్లను సంప్రదించడం సముచితంగా వుంటుందని భావించారు. పై అధికార్ల సూచనల మేరకో ఆదేశాల మేరకో వ్యవహరించ కుండా ప్రాసిక్యూటర్ స్వయంగా నిర్ణయం తీసుకోవాలి. ఈ విషయంలో కేవలం పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాత్రమే నిర్ణయం తీసుకోవాలి. ఇంకెవరు కల్పించుకున్నప్పటికీ అది న్యాయ వ్యవస్థా విధానాలతో జోక్యం చేసుకున్నట్లు అవుతుంది. రాజకీయవిధానాలు అమలుపర్చే దృష్ట్యా ప్రాసిక్యూటర్‌ని కేసు ఉపసంహరించుకోమని ప్రభుత్వం ఆదేశించడానికి వీల్లేదు. న్యాయ వ్యవస్థా విధానాల్ని సక్రమంగా అమలుపర్చే క్రమంలో కేసు ఉపసంహరించుకోవచ్చు. సాక్ష్యాధారాలు అనుమానాస్పదంగా వున్న కారణంగా కేసు గెలిచే అవకాశం లేదనుకున్నప్పుడు ఉపసంహరణకు అనుమతిని కోరవచ్చు.

ప్రాసిక్యూషన్ కేసులు పెట్టనూ వచ్చు, ఉపసంహరించుకోనూవచ్చు, అది పూర్తిగా ప్రాసిక్యూషన్ ఇష్టాయిష్టాలకి సంబంధించిన విషయం అనుకోవడానికి వీల్లేదు. ప్రాసిక్యూషన్ కేసు ఉపసంహరించుకోవాలంటే అందుకు కోర్టు అనుమతించాల్సి వుంటుంది. కేసు ఉపసంహరించుకొనడానికి అనుమతించాలన్నది పూర్తిగా కోర్టు

ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుంటుంది. ఇందుకు కోర్టు కొన్ని న్యాయసూత్రాల్ని, విధానాల్ని దృష్టిలో ఉంచుకొని నిర్ణయానికి వస్తుంది. ప్రాసిక్యూషన్ కోర్టు ముందు వుంచిన వివరాల్ని పరిశీలించిన తరువాతే కోర్టు అనుమతిస్తుంది. ఇది కేసు ఉపసంహరించుకోవడానికి ప్రాసిక్యూషన్‌కు గల అధికారం మీద ఒక నిఘా వంటిది.

ప్రాసిక్యూటర్ దాఖలు చేసిన దరఖాస్తుని ఆధారం చేసుకుని మాత్రమే కేసు ఉపసంహరించుకోవడానికి అనుమతి ఇవ్వాలా లేదా అనేది కోర్టు నిర్ణయించుకోవాలి. అంతేకాని ఆ కేసు అన్యాయంగా పెట్టారని ఎవరో అభిప్రాయపడుతున్నారనో పబ్లిక్ ప్రాసిక్యూటర్ ప్రభుత్వ నిర్ణయానుసారం కేసును ఉప సంహరించుకుంటున్నారన్న కారణంగానో ఉపసంహరించుకోవడానికి అనుమతించ వీల్లేదు.

ప్రభుత్వంలో జరుగుతున్న లోపాల దృష్ట్యా కేసు విచారణ సత్వరం పూర్తికాక పోయినట్లయితే ప్రాసిక్యూషన్ ఉపసంహరణకి కోర్టు అనుమతించవచ్చు. అలాగే ప్రభుత్వానికి ఆ కేసులో తప్పుడు సాక్ష్యాలు వచ్చాయని విశ్వసనీయంగా సమాచారం అందినా, ప్రజాశ్రేయస్సు దృష్ట్యా అవసరమనుకున్నా కేసు ఉపసంహరించుకోవడానికి అనుమతించడానికి అవకాశముంటుంది. ఎక్కడైతే ఒక నిందితుడ్ని వేరొక నిందితుడికి వ్యతిరేకంగా సాక్షిగా నిలబెట్టాల్సి వస్తుందో అలాంటప్పుడు కేసు ఉపసంహరణకి అనుమతించవచ్చు. అయితే వేరొక సాక్ష్యం ఏదైనా ఉందనుకొన్నప్పుడు ఇలా అనుమతించడం సరైంది కాదు. ప్రాసిక్యూషన్‌కి ప్రభుత్వాన్నించి సరైన అనుమతి పొందాల్సిన కేసుల్లో సక్రమమైన అనుమతి పొందినప్పుడు కేసు ఉపసంహరణకి అనుమతిస్తారు.

కేసు బలహీనంగా వుండి ఆ కారణంగా నిందితులకు శిక్షపడే అవకాశం లేదనుకొని కోర్టు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌తో ఏకీభవించి ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకోవడానికి అనుమతించడం సరైందికాదు. అలాగే నేరారోపణ చేసిన వారికి సమన్లు అందజేయడం సాధ్యం కాదనుకున్నప్పుడు ఎప్పుడో ప్రారంభం కానున్న విచారణ ఇంకా ప్రారంభం కానందుకు ప్రాసిక్యూషన్ ఉపసంహరణకి అనుమతించదు.

డిపార్ట్‌మెంటల్ ఎంక్వయిరీ జరిగిందని ఇంతకుముందు జరిగిన కేసులో నిందితుడితోపాటు ఉన్న నిందితులు శిక్షించబడ్డారని అప్పటినుంచి నిందితుడి జాడ కూడా లేదన్న కారణంగా కేసు ఉపసంహరించుకోవడానికి అనుమతించరాదు.

ప్రాథమికంగా కేసంటూ ఉండి బలమైన ఆధారాలున్నప్పుడు ప్రాసిక్యూషన్‌కి బాగా ఖర్చవుతుందన్న కారణంగా ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకోవడానికి అనుమతించరు. నిందితుడు నేరం ఒప్పుకొన్నప్పుడు ప్రాసిక్యూషన్ ఉపసంహరణకి కోర్టు అనుమతించదు. ఒకసారి పబ్లిక్ ప్రాసిక్యూటర్ కేసు ఉపసంహరించుకోడానికి

దరఖాస్తుచేసి ఆ తర్వాత ఆ దరఖాస్తును ఉపసంహరించుకున్నప్పటికీ కోర్టువారు తమ న్యాయబద్ధమైన నిర్ణయాన్ని తెలుపవచ్చు.

ఒకవేళ మెజిస్ట్రేట్ కేసు న్యాయబద్ధమైనదేనని విశ్వసించినప్పటికీ ఉపసంహరణకి అనుమతించే విషయంగా ఆయన నిర్ణయానికి ఎలాంటి ప్రాధాన్యతా ఉండదు. కేసులో తీర్పు వెలువడ్డానికి ముందే ప్రాసిక్యూషన్ కోసం ఉపసంహరించుకోదలచుకుంటే ఉపసంహరించుకోవచ్చు. ఆ తర్వాత అప్పీల్ దశలోగానీ రివిజన్‌లోగానీ ప్రాసిక్యూషన్ కేసు ఉపసంహరించుకోడానికి వీల్లేదు.

ప్రాసిక్యూషన్ ఏ కేసులోనైనా ఏ కోర్టు ముందు విచారణ జరిగే కేసులోనైనా కేసు ఉపసంహరించుకోవచ్చు. కేసు దర్యాప్తు దశలో ఉన్నప్పుడు ఇంకా కోర్టు సమక్షంలో విచారణ ప్రారంభం కాని దశలో ఉండగా ప్రాసిక్యూషన్ ఉపసంహరించుకొడానికి వీల్లేదు.

ప్రాసిక్యూషన్ కేసు ఉపసంహరించుకొదలచుకుంటే మొత్తంగానైనా లేదా పాక్షికంగా కొన్ని నేరాల మేరకుగాని ఉపసంహరించుకొవచ్చు.

ఉదాహరణకి రామయ్య భీమయ్య ఇంట్లో జొరబడి భీమయ్యను కొట్టి నగలు దోచుకుపోయాడనుకొందాం. ఈ సంఘటనలో రామయ్య భీమయ్య ఇంటిలో అక్రమంగా జొరబడ్డం, బీమయ్యను గాయపర్చడం, నగలు దోచుకుపోవడమూ అన్న మూడు నేరాలు ఇమిడి ఉన్నాయి. ఈ కేస్‌లో ప్రాసిక్యూషన్ మొత్తంగా రామయ్య మీద కేసును ఉపసంహరించుకోవచ్చు. లేదా ఇంట్లోకి అక్రమంగా జొరబడ్డాడన్న నేరాన్ని గానీ లేక ఆరోపించిన మరే ఇతర నేరాన్ని గానీ ఉపసంహరించుకోవచ్చు.

కేసులో ఆరోపణలు నిర్ధారించక ముందు కేసు ఉపసంహరించుకొనేటట్లయితే ఆ కేసులో ఆరోపణలు లేనట్లుగా పరిగణిస్తారు. ఆరోపణను నిర్ధారించిన తర్వాత కేసు ఉపసంహరించుకొనేట్లయితే కేసు కొట్టివేస్తారు.

కేంద్ర ప్రభుత్వ పరిపాలనలో వున్న ప్రాంతాల్లోగానీ, ఢిల్లీ ప్రత్యేక పోలీసుల వ్యవస్థాపక చట్టం, 1946 క్రింద ఢిల్లీ పోలీసులు దర్యాప్తు జరిపిన కేసుల్లో గానీ, కేంద్ర ప్రభుత్వోద్యోగి తన అధికార పరిధిలో చేసిన నేరాలకి సంబంధించిన కేస్‌ని ఉపసంహరించుకోవాలంటే పబ్లిక్ ప్రాసిక్యూటర్ కేంద్ర ప్రభుత్వం నుండి అనుమతి పొందాల్సి ఉంటుంది. కేసు ఉపసంహరణకి అనుమతించిన తరువాత గానీ, నిరాకరించిన తర్వాతగానీ ఆ ఉత్తర్వులపై హైకోర్టులో రివిజన్ పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు. ఒకవేళ కేసు కొట్టేసేట్లయితే అప్పీలు దాఖలు చేసుకోవచ్చు.

సరైన ఉత్తర్వులు జారీకాలేదనుకున్నప్పుడు తిరిగి విచారణ జరుపమని ఆదేశిస్తారు.

# నష్ట పరిహారం

గోపాలరావునంతా కోర్టు పక్షి అంటారు. అతని జోలికి వెళ్ళాలంటే అందరూ గడగడలాడి పోతారు. పోలీసోణ్ణి చూసినంత భయపడతారు. అతను కన్నెరజేస్తే కనీసం ఒక క్రిమినల్ కేసయినా తగిలిస్తాడని పేరు. అలాంటిది ఈ మధ్యన గోపాలరావు పొరుగింటి వారితో గోడ పంచాయతీ వచ్చింది. సరిహద్దు గోడమాదంటాడు

పొరుగింటి రామారావు. కాదు మా ముత్తాత కట్టించాడంటాడు గోపాలరావు. మీ ముత్తాత గారు బ్రతికున్నప్పుడు నీవు పుట్టనేలేదని వాదించాడు రామారావు. నువ్వేమాత్రం వున్నావేంటి కావాలంటే నీ తండ్రినో, నీ తాతనో నీ ముత్తాతనో అడిగి తెల్సుకుని రా అన్నాడు గోపాలరావు. అదెలా కుదురుతుంది మా తండ్రిగారు, మా తాతగారు, వారి తండ్రిగారు పోయారు కదా! అన్నాడు రామారావు. ఇట్లా నీతో వాదిస్తూ కూర్చోడానికి వేరే పనులేమీ లేవా! నువ్వూ వాళ్ళు వెళ్లినచోటికే వెళ్లి తెల్సుకుందువు గానీ అని అరిచాడు గోపాలరావు. నన్ను చావమంటావా! నీ అంతుచూస్తానని అరిచాడు రామారావు. నీ మీద ఒక క్రిమినల్ కేసు తగిలిస్తాను. కాచుకోమని హెచ్చరించాడు కోర్టు పక్షి గోపాలరావు. ఆ రాత్రి గోపాలరావుకి నిద్ర పట్టలేదు. పొరుగింటి రామారావు మీద కేసు పెట్టి పరువుతీసి అతన్ని వాళ్ళ తాతల తండ్రుల దగ్గరికి పంపించేసి గోడ పంచాయతీ వదిలించేసు కోవాలనుకొన్నాడు గోపాలరావు. మర్నాడు ప్రొద్దున్నే సరిహద్దు గోడదూకి స్నానం చేస్తున్న తన భార్యని చెయ్యిపట్టుకు లాగాడని ఆరోపిస్తూ పోలీస్ కేసు పెట్టాడు గోపాలరావు రామారావు మీద.

గోపాలరావిచ్చిన రిపోర్టును పురస్కరించుకొని పోలీసులు రామారావు మీద కేసు రిజిస్టర్ చేసి అరవైఏళ్ళ వయసున్న రామారావుని అరెస్టు చేశారు. ఈ విషయం విని అందరూ రామారావుని ఛీఛీ అని అసహ్యించుకొన్నారు. వయసొచ్చినా మనిషికి బుద్ధి లేకపోవడమేమిటని విస్తుపోయారు.

రామారావుమీద కేసు నడిచింది. ప్రాథమిక సాక్ష్యాధారాలు లేనందువల్ల మెజిస్ట్రేట్ కేసు కొట్టివేశారు. అయితే పోయిన రామారావు పరువు తిరిగి రాలేదు. ఏదో ఆడకూతురు కాబట్టి పరువు కాపాడుకోడానికి కోర్టులో నిజం చెప్పి ఉండదనుకొన్నారు జనం. ఇలా కక్షలవలన తప్పుడు పోలీసు కంప్లైంట్ ఇవ్వడమేకాక,పోలీసులే తప్పుడు కేసులు పెట్టడం మనం నిత్యం చూస్తూనే ఉన్నాం.

నేరానికి గురికావడం ఎంత దారుణమో, తప్పుడు కేసులకు బలైపోవడం కూడా అంతే దారుణం. నేరానికి గురైన వారి తరపున నేరస్తులను శిక్షించి కోర్టులు న్యాయం చేస్తున్నాయి. కాని అక్రమ కేసుల్లో ఇరుక్కుపోయి పోలీస్ లాకప్‌లో మగ్గిపోయి ఇల్లు, వళ్ళు గుల్లయిపోయిన వారి పక్షాన కోర్టులేమైనా చేస్తున్నాయా?

పోలీస్ కేసులేకాక, ప్రైవేటు కంప్లైట్ దాఖలుచేసే కోర్టు పక్షులకి ఎర్రై కోర్టులో బలైపోయే వాళ్ళు కూడా ఉన్నారు. ఉదాహరణకి చీటికి మాటికి తగాదాలకు దిగే చిన్నారావు పిల్లల తగాదాల్లో జోక్యం చేసుకొని పెద్దవాళ్ళతో తగువుపడ్డాడు. అక్కడితో పోనివ్వక అతను పోలీస్ కేసు పెట్టాడు. పోలీసులు దర్యాప్తు చేసి అందులో కేసేమీ లేదని తెల్సుకొని ఊరుకొన్నారు. అయితే చిన్నారావు అంతటితో ఊరుకోకుండా

తన పిల్లలతో పోట్లాడిన పిల్లలపైన వారి తల్లిదండ్రుల మీద కోర్టులో ప్రైవేటు కంప్లైంట్ దాఖలు చేశాడు. కోర్టువారు ప్రాథమిక ఆధారాలేమీ లేవన్న కారణంగా నిందితులమీద విచారణ జరపకుండానే కేసు కొట్టేశారు. ఇలా కొందరు ఏవో కారణాలు అడ్డం పెట్టుకొని తమకు గిట్టనివాళ్ళమీద అన్యాయంగా కేసులు బనాయిస్తుంటారు. దీనివల్ల చాలామంది అనవసర ఇబ్బందులకు గురయ్యే ప్రమాదముంది. ఏదో ఒక స్థాయిలో అన్యాయంగా కేసులు పెట్టేవాళ్ళని నిరుత్సాహపర్చి వాళ్ళమీద తగినచర్య తీసుకొంటే తప్ప కోర్టు పేరిట జరిగే అక్రమాలని నిరోధించడం సాధ్యం కాదు.

న్యాయస్థానాలు నిందితుణ్ణి, నేరారోపణ చేసే వారిని ఒకే దృష్టితో చూడాలి. న్యాయం దృష్టిలో ఇద్దరూ ఒకటే. అలాంటప్పుడు అక్రమ కేసుల్లో ఇరికించబడ్డ నిందితుల తరపున న్యాయస్థానాలు నేరారోపణ చేసిన వారిపైన ఏమైనా చర్య తీసుకుంటారా? అన్న సందేహం కలగవచ్చు. అంతేకాక నేరానికి గురైన వారి తరపున బాధ్యత తీసుకొని నేరస్తుడిని శిక్షించే చట్టం అక్రమంగా కేసుల్లో ఇరుక్కుపోయిన నిందితులకి ఏమైనా నష్ట పరిహారం ఇప్పిస్తుందా అని సందేహం కూడా కలగవచ్చు.

క్రిమినల్ కేసుల్లో నిరాధారంగా ఎవరిపైనైనా ఆరోపణ చేసినట్లయితే కోర్టు కేసు కొట్టెయ్యడమే కాక నిందితుడికి నేరారోపణ చేసిన వారినుంచి నష్ట పరిహారం కూడా ఇప్పిస్తుంది. అయితే ఈ నష్ట పరిహారం నిందితుడు ఏ కేసులోనైతే నిందితుడిగా పేర్కొనబడ్డాడో అదే కేసులో ఇప్పిస్తారు. అంతేకాక నిందితుడు అవసరమనుకొనేట్లయితే నేరారోపణ చేసినవారిపైన సివిల్ కేసు దాఖలుచేసి నష్టపరిహారం పొందవచ్చు. అయితే సివిల్ కేసులో నష్ట పరిహారం మంజూరు చేసేముందు క్రిమినల్ కేసులో ఇచ్చిన నష్ట పరిహారాన్ని పరిగణనలోకి తీసుకొంటారు. ఇలా తక్షణం క్రిమినల్ కేసులోనే నష్టపరిహారం మంజూరు చేయడంలోగల ఉద్దేశ్యం ఇరుపక్షాల మధ్యన సామరస్యాన్ని నెలకొల్పాలన్నదే. అంతేకాక నిరాధారమైన ఆరోపణలు! ఆరోపణ చేసే వారిని నిరోధించాలని కూడా చట్టం భావిస్తుంది.

నిందితుడి నష్ట పరిహారం మెజిస్ట్రేట్‌కి విచారించే అధికారంవున్న ఏ కేసులోనైనా మంజూరు చేయవచ్చు. ఇంతకు ముందు చెప్పినట్లుగా పోలీస్ కేసులోనైనా, ప్రైవేటు కేసులోనైనా మంజూరు చేయవచ్చు. అయితే కాగ్నిజబుల్ నేరాల్లో పోలీసులు దాఖలు చేసే కేసుల్లో మాత్రం ఇది వర్తించదు. అయితే పోలీసులు ఎన్ని తప్పుడు కేసులు పెట్టినా నిందితులకు వాళ్ళు నష్టపరిహారం చెల్లించాల్సిన అవసరం లేదు.

పోలీసులకి ఎవరైనా సమాచారం ఇచ్చినపుడు ఆ సమాచారాన్ని పురస్కరించుకొని పోలీసులు దాఖలు చేసేట్లయితే ఆ సమాచారకుడిని కోర్టు నిందితుడికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు.

## నిందితుడికి నష్ట పరిహారం

ఒక నేరారోపణ చేసిన తర్వాత ఆ ఆరోపణ నిరాధారమైనదైనా, రుజువు కాక పోయినా నిందితుడికి నష్ట పరిహారం చెల్లించమని మెజిస్ట్రేట్ ఆదేశించవచ్చు. సత్ప్రవర్తనకి హామీ తీసుకొనే కేసుల్లో ముద్దాయిపై ఎలాంటి ఆరోపణ ఉండదు కాబట్టి ఆ ఆరోపణ రుజువుకావటం అన్న ప్రస్తావనకానీ, నిరాధారమైనదని నిర్ధారించడం కానీ జరుగదు. అంచేత ఈ కేసుల్లో ముద్దాయికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించడం జరుగదు. అలాగే మనోవర్తికి సంబంధించిన కేసుల్లో కూడా ప్రతివాదిని నిందితుడిగా పరిగణించరు. కనుక నష్టపరిహారం తలెత్తదు.

మెజిస్ట్రేట్ విచారించే అధికారం ఉన్న కేసుల్లో మాత్రమే నిందితుడికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు. కానీ సెషన్స్ కోర్టు మాత్రమే విచారణ జరిపే అధికారం ఉన్న కేసుల్లో నిందితుడికి ఏ పరిస్థితుల్లోనూ నష్ట పరిహారం చెల్లించరు. అయితే ఒక కేసులో కొన్ని ఆరోపణలు మెజిస్ట్రేట్ విచారణ పరిధిలోకి వచ్చి మరి కొన్ని ఆరోపణలు సెషన్స్ కోర్టు విచారణ పరిధిలోకి వచ్చేట్లయితే మెజిస్ట్రేట్ విచారణ పరిధిలోని ఆరోపణలు నిరాధారమనుకొన్నప్పుడు మెజిస్ట్రేట్ నష్టపరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు. అలాగే సెషన్స్ కోర్టు పరిధిలోకి వచ్చే ఆరోపణలని పేర్కొంటూ దాఖలయ్యే కేసుల్లో ఆరోపణలు మెజిస్ట్రేట్ కోర్టు పరిధిలోకి వస్తాయనుకొన్నప్పుడు మెజిస్ట్రేట్ ఈ ఆరోపణలకు సంబంధించినంతవరకు అవి నిరాధారమని నిర్ధారించేట్లయితే నిందితుడికి నష్టపరిహారం చెల్లించమని నేరారోపణ చేసినవారిని ఆదేశించవచ్చు.

ఏ మెజిస్ట్రేట్ అయితే కేసు విచారించారో ఆ మెజిస్ట్రేట్‌కి మాత్రమే నష్ట పరిహారం చెల్లించమనే అధికారం ఉంటుంది. ఒకోసారి సాక్ష్యాధారాలు స్వీకరించిన మెజిస్ట్రేట్ ఒకరై, వాదోపవాదాలువిన్న మెజిస్ట్రేట్ మరొకరై ఉండవచ్చు. అలాంటప్పుడు వాదోపవాదాలు విని తీర్పు చెప్పే మెజిస్ట్రేట్‌కి మాత్రమే నష్టపరిహారం చెల్లించమనే అధికారం ఉంటుంది. ఈ అధికారం అపీల్‌లోగానీ, రివిజనల్‌లోగానీ హైకోర్టులకి లేదు.

నేరారోపణ నిరాధారమని తేలినప్పుడుకానీ, నిందితుడిమీద కేసు రుజువు కానప్పుడు కానీ నష్టపరిహారం చెల్లించమని మెజిస్ట్రేట్ నేరారోపణ చేసిన వారిని ఆదేశిస్తారు. అంతేకాని నేరారోపణ చేసిన వారు నిందితుడు రాజీపడ్డప్పుడు నిందితుడికి నష్టపరిహారం చెల్లించమని ఆదేశించడానికి వీల్లేదు. అనేక పరిస్థితుల్లో క్రిమినల్ కేసులు కొట్టేస్తారు. అయితే కేసు కొట్టేస్తూ మెజిస్ట్రేట్ ఉత్తర్వులు జారీ చేసినప్పుడు మాత్రమే నిందితుడికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు. ఆ కారణంగా ఆరోపణలు చేసిన కేసుల్లోమాత్రమే నష్టపరిహారం చెల్లించమని ఆదేశిస్తారు. నిందితుడికీ, నేరారోపణ చేసిన వారికి మధ్యన సత్సంబంధాలు లేవన్న కారణంగా ఆరోపణ నిరాధారమైందిగా

భావించడానికి వీల్లేదు. అలాగే పోలీస్ దర్యాప్తులో నేరం రుజువుకాలేదన్న కారణంగా ఆరోపణ నిరాధారమైనదనడానికి వీల్లేదు. మెజిస్ట్రేట్ మాత్రమే ఆరోపణ నిరాధారమైనదీ లేనిదీ తేల్చాలి. కేసు కొట్టేస్తూ జారీచేసే ఆదేశాల్లోనే నష్ట పరిహారం చెల్లించాలని ఆదేశించ నవసరంలేదు. నష్ట పరిహారం చెల్లించమని చేసే ఆదేశాలు విడిగానే ఉంటాయి.

నిందితుడికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించడానికి ముందు మెజిస్ట్రేట్ నేరారోపణ చేసినవారికి షోకాజ్ నోటీస్ ఇస్తారు. కేసు కొట్టేసినప్పుడు నేరారోపణ చేసిన వారు కోర్టులో లేకపోయేట్లయితే వారిని వెంటనే కోర్టులో హాజరు పర్చమని సమన్లు జారీ చేస్తారు. నేరారోపణ చేసినవారికి షోకాజ్ నోటీస్ ఇవ్వకుండా నష్టపరిహారం చెల్లించమని ఆదేశించేట్లయితే ఆ ఆదేశాలు చట్ట విరుద్ధమైనవి.

షోకాజ్ నోటీస్‌కి నేరారోపణ చేసినవారు సంజాయిషీ ఇచ్చుకొనేట్లయితే మెజిస్ట్రేట్ ఆ సంజాయిషీని రికార్డు చేస్తారు. ఆ తర్వాత ఆ సంజాయిషీ సంతృప్తికరంగా ఉండేట్లయితే నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించరు. నష్టపరిహారం చెల్లించమని జారీ చేసే ఆదేశాల్లో, ఆదేశాలు జారీ చేయడానికి గల కారణాల్ని మెజిస్ట్రేట్ వివరించాలి.

మెజిస్ట్రేట్ కేసులో నిందితుడికి ఎంతయితే ఫైన్ వేయడానికి అవకాశం ఉందో ఆ మేరకు నష్టపరిహారం చెల్లించమని నేరారోపణ చేసిన వారిని ఆదేశించవచ్చు. నిందితుడికి చెల్లించే నష్టపరిహారాన్ని నేరారోపణ చేసినవారికి విధించే శిక్షగా పరిగణించరు. నష్టపరిహారాన్ని ప్రభుత్వ ఖాతాలో జమచేయరు. నిందితుడికి మాత్రమే చెల్లిస్తారు. నష్ట పరిహారాన్ని నిర్ణయించేముందు నిందితుడికి ఆ కేసులో కలిగిన అసౌకర్యాన్ని పరిగణనలోకి తీసుకొంటారు. నిందితుడి ప్రవర్తనలో ఏవైనా లోపాలుండేట్లయితే అతనికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించరు. సరైన కేసులో మాత్రమే నిందితుడికి నష్ట పరిహారం చెల్లించమని ఆదేశిస్తారు. అంతేకానీ కొట్టేసిన అన్ని కేసుల్లోను నష్టపరిహారం చెల్లించమని ఆదేశించరు.

నేరారోపణ చేసినవారు పోలీసులకు నేరారోపణకు సంబంధించిన సమాచారం ఇచ్చినవారు మాత్రమే నిందితుడికి నష్టపరిహారం చెల్లించడానికి బాధ్యత వహించాల్సి వుంటుంది. ఇద్దరు, ముగ్గురు, నిందితులున్న కేసులో ఒకరిపైన కేసు కొట్టేసినా వారికి నష్టపరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు. నేరారోపణ చేసినవారు నష్టపరిహారం చెల్లించకపోయేట్లయితే వారిని జైలుకు పంపించే అధికారం మెజిస్ట్రేట్‌కి ఉంది. ఇలా తప్పుడు కేసు పెట్టినవారు నిందితులకి నష్టపరిహారం చెల్లించినప్పటికీ వారిమీద సివిల్, క్రిమినల్ కేసులు దాఖలు చేసే హక్కు నిందితులకుంటుంది. అయితే ఆ కేసుల్లో ఇంతకు ముందు నేరారోపణ చేసినవారు చెల్లించిన నష్టపరిహారాన్ని కోర్టు దృష్టిలో ఉంచుకొంటుంది.

# అక్రమ అరెస్టుల్లో నష్టపరిహారం

కేశవరావు రిజర్వేషన్ కౌంటర్ ముందు క్యూలో కూర్చున్నాడు. అతను తొడుక్కున్న సిల్క్ చొక్కా జేబులోంచి పచ్చనోట్లు చుట్టూ వున్నవాళ్ళని వెక్కిరిస్తున్నాయి. బస్‌స్టాప్ కొచ్చిన ప్రతివారూ తన జేబులు కొట్టడానికే చూస్తున్నారన్నట్లుగా కేశవరావు అందరి మీదా చికాకు పడుతున్నాడు. ఇంతలో రిజర్వేషన్ కౌంటర్ తెరుచుకొంది. రద్దీ పెరిగి ఒకర్నొకరు తోసుకోసాగారు. పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడిలా గుంపుతో పెనుగులాడి ముందుకు చొచ్చుకుని ఎలాగైతేనే బుకింగ్ కౌంటర్ చేరుకొన్నాడు కేశవరావు. తీరా జేబులో చెయ్యి పెట్టేసరికి జేబులో పచ్చనోట్లు కాదు కదా పది పైసలు కూడా లేకుండా పోయాయి. అంతే "దొంగ దొంగ" అని అరిచాడు కేశవరావు. కేశవరావు అరుపులు విని పరుగెత్తుకొని వచ్చాడు పోలీస్ కానిస్టేబుల్.

"ఎక్కడ దొంగ ఏం పోయాయి" అని కేశవరావుని అడిగాడు. తన వెనక క్యూలో వుండి తనకంటే ముందు టికెట్ తీసుకు వెడుతున్నతన్ని అనుమానించి "అదిగో వాడే దొంగ. పట్టుకోండి పారిపోతున్నాడు" అన్నాడు కేశవరావు.

పోలీస్ కానిస్టేబుల్ పరుగెత్తి కొని వెళ్ళి ఆ వెళ్లిపోతున్నతన్ని పట్టుకొని "ఆగు ఆగు. లంజకొడుకా' ఆగు" అని నిలిపాడు. ఇంతలో కేశవరావు అక్కడికి చేరుకొని "వీడే సార్! వీడే సార్ వీడే నా వెనుక నిలబడ్డట్టే నిలబడి నాజేబు కొట్టేశాడు" అన్నాడు. ఆ పెద్దమనిషికి వొళ్ళు మండిపోయింది. నేనెవరకుకొంటున్నారు కాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడండి" అన్నాడు.

"నువు ఎవరైతే మాకేంటిరా! ఇప్పుడు నువు దొంగతనం చేశావు కాబట్టి దొంగవె. ఇంకా మాట్లాడావంటే ఉత్త దొంగలంజకొడుకువి" అని తిట్టి రెండు తగిలించాడు పోలీస్ కానిస్టేబుల్. ఆ పెద్దమనిషి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అవతల

తాను ఎక్కవలసిన బస్ పాయింట్ మీదకి వచ్చి బయలుదేరడానికి సిద్ధంగా వుంది. "కొడతావా నన్ను కొడతావా?" అని చూస్తానుండు నీ సంగతి అనాలనుకొని ఆ పొంగుకు రాగా దిగమింగేశాడు.

"కొడతానా లంజకొడుకా.... చీరేస్తాను. ముందు ఆ డబ్బులు కక్కు" అని అతని కడుపులో గుద్దేడు కానిస్టేబుల్. ఈ దెబ్బతో అతను మాటల్ని మరిచిపోయాడు. అతను ఎక్కడి పంచాయితీ ప్రెసిడెంటో, ఏ జిల్లా కలెక్టరో, ప్రెసిడెంట్ ఆవ్ ఇండియాయో అయిన్నప్పటికి పోలీసోడి పవర్ ముందు అతని అధికార దర్పం బలాదూర్ అయిపోయింది. అందుచేత అతను పోలీస్‌వాణ్ణి ఎదిరించలేక "నేను ఏ దొంగతనం చెయ్యలేదు" ఆ సంగతేదో పోలీస్‌స్టేషన్లో తేల్చుకొందాం పద అంటూ అతన్ని అరెస్ట్‌చేసి పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్ళాడు. విజయ గర్వంతో పాలో అయ్యాడు కేశవరావు.

ఆ పెద్దమనిషి మీద పోలీసులు కేసు పెట్టారు. అతను తిబ్బంపాడు పంచాయితీ ప్రెసిడెంటనీ అతనికి బోల్డంత ఆస్తి వుందని జేబు దొంగతనాలు చేయాల్సిన అవసరం అతనికి లేదని కోర్టువారు నిర్ధారించారు. పైగా అతని మీద పోలీసులు పెట్టిన కేసు రుజువు కాలేదు. కేసు కొట్టివేస్తూ కోర్టువారు కేశవరావుని ఆ పెద్దమనిషిని అనవసరంగా అరెస్టు చేయించినందుకు గాను వందరూపాయాలు నష్ట పరిహారం చెల్లించమని ఆదేశించారు. ఇలా ప్రతినిత్యం అక్రమ అరెస్టులకి గురై రోజుల తరబడి లాకప్‌లలో మగ్గిపోయి, తప్పుడు కేసుల్లో ఇరుక్కుపోయే వాళ్ళు అనేకమంది వున్నారు. పోలీసులకి ఎవరైనాసరే, ఎక్కడైనాసరే, ఎప్పుడైనాసరే అరెస్ట్‌చేసే అధికారంవుంది కాబట్టి,పలుకుబడి,డబ్బు,అధికారం వున్నవాళ్ళు పోలీస్ యంత్రాంగాన్ని వాడుకొని ప్రత్యర్థులని అరెస్ట్ చేయిస్తున్నారు. ఇలాంటి అరెస్ట్‌లకి గురైన వారికి చట్టం ఏమైనా నష్టపరిహారం చెల్లిస్తుందా? అక్రమంగా అరెస్ట్ చెయ్యడాన్ని చట్టం నేరంగా పరిగణిస్తుందా! వంటి సందేహాలు కలుగుతాయి.

అక్రమ అరెస్టులు అక్రమ నిర్బంధం పరిధిలోకి వస్తాయి. అలాగే వ్యక్తి స్వేచ్ఛా స్వాంతంత్ర్యాల్ని అడ్డగించినట్లవుతుంది. అంచేత అక్రమ అరెస్టును అక్రమ నిర్బంధంగానూ, అక్రమంగా అడ్డగించడంగానూ పరిగణించి భారత శిక్షాస్మృతి ననుసరించి నేరస్తుడిగా పరిగణించవచ్చు. ఇది శిక్షార్హమైన నేరం.

పోలీసులే కాక మరెవరైనాసరే ఇలాంటి నేరానికి పాల్పడినట్లయితే నేరస్తుని శిక్షించడమే కాక సివిల్ కోర్టు నుంచి నేరానికి గురయినవారు నష్టపరిహారాన్ని పొంద వచ్చు. సాధారణంగా పోలీసులకు అరెస్ట్ చేసే అధికారం వుంది కాబట్టి వాళ్ళు చేసిన ప్రతి అరెస్ట్‌నూ మనం చట్టబద్ధమైన అరెస్టుగానే భావిస్తున్నాం. అంతేకాక అక్రమ

అరెస్టు ఎప్పుడైనా కోర్టు దృష్టిలోకొచ్చినప్పటికీ కోర్టు దాన్ని పెద్దగా పట్టించుకోడం లేదు. ఈ విధానం పరోక్షంగా పోలీసు యంత్రాంగాన్ని అక్రమంగా వ్యవహరించడానికి పురిగొల్పుతోంది.

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో ఎవరైనా ఎవరినైనా అకారణంగా అరెస్టు చేయించేట్లయితే అలా అరెస్ట్ చేయించిన వ్యక్తి నుండి అరెస్టుచేయబడ్డ వ్యక్తికి వందరూపాయిల వరకు నష్టపరిహారం కోర్టు వారు ఇప్పించవచ్చు. ఇక్కడ మనమొక విషయాన్ని గమనించాలి. ఎవరు ఎవర్ని అరెస్టు చేయించినా అరెస్టు చేసేది మాత్రం పోలీసులే. గీతలో చెప్పినట్లుగా పోలీసులకు ఎలాంటి పాపమూ అంటదు. వాళ్ళు వరకీ నష్టపరిహారం చెల్లించనవసరం లేదు. కేవలం వాళ్ళు తమ విధిని నిర్వహిస్తున్నట్లుగానే చట్టం పరిగణిస్తోంది. నిజానికి పోలీసులు నేరాన్ని నిష్పక్షపాతంగా దర్యాప్తు చేసి ఒక నిర్ధారణకు రావలసివుంటుంది. అంటే పోలీసు యంత్రాంగం కూడా న్యాయవ్యవస్థలానే నిష్పక్షపాతంగా వ్యవహరిస్తుందని అర్థం చేసుకోవాలి. దీనికి భిన్నంగా పోలీసులు ఎవరి ప్రేరణతోనో, ప్రోద్బలంతోనో అరెస్ట్ చేయడమన్నదే మౌలిక న్యాయసూత్రాలకు విరుద్ధం. అలాంటప్పుడు పోలీసు వ్యవస్థ అధికారపక్షం యొక్క ఆయుధంగానే పని చేస్తుందని అర్థం చేసుకోవాల్సి వుంటుంది. దీనికి క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో పరోక్షంగా చట్టబద్ధత కల్పించడం జరిగింది.

అక్రమంగా అరెస్టయిన వ్యక్తికి అయిన ఖర్చుల్ని, జరిగిన కాలయాపననీ దృష్టిలో వుంచుకొని మెజిస్ట్రేట్ అరెస్ట్ చేయించిన వ్యక్తినుంచి నష్టపరిహారం ఇప్పిస్తాడు. అయితే ఏ పరిస్థితుల్లోనూ ఈ పరిహారం వంద రూపాయలకు మించి ఉండదు. ఒకరికి మించి ఎక్కువమందిని అక్రమంగా అరెస్టులు జరిగినపుడు వారికి చెల్లించే నష్టపరిహారం కూడా వంద రూపాయలకు మించి వుండదు. ఈ చట్టం క్రింద నష్టపరిహారం చెల్లించక పోయేట్లయితే అరెస్టు చేయించిన వ్యక్తిని ముప్పయి రోజులకు మించకుండా ఖైదు చేయమని కోర్టు ఆదేశిస్తుంది. ఈ ముప్పయి రోజుల్లోగా అతనెప్పుడు నష్టపరిహారం చెల్లించినా అతన్ని విడుదల చేస్తారు.

అక్రమ అరెస్ట్‌కు గురయిన వ్యక్తి సివిల్ న్యాయస్థానం నుంచి కూడా నష్టపరిహారం పొందవచ్చు. అయితే క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో మెజిస్ట్రేట్ కోర్టుకి ఈ అధికారం కల్పించడంలో గల ఉద్దేశ్యం అకారణంగా అరెస్టులు చేయించేవారిని నిరుత్సాహ పర్చడమూ, శిక్షించడంగా అర్థం చేసుకోవాలి. ఏదేమైనప్పటికీ ఈ నష్టపరిహారం చాలా స్వల్పమయినది. దీనివల్ల చట్టం ఆశించిన ఫలితం నెరవేరకపోవచ్చు అంతేకాక అక్రమ అరెస్టుకు గురయినవ్యక్తి పడే మానసిక హింసని చట్టం దృష్టిలో ఉంచుకోలేదని కూడా మనకు అర్థమవుతుంది.

# నేరానికి గురైనవారికి నష్టపరిహారం

శ్యామ్‌రావు కిరాణా కొట్టు ముందు ఓ రిక్షా ఆగింది. ఆ రిక్షాలో కూర్చున్న గూండా మీసాలు మెలేస్తూ రిక్షావాడికి ఆ కిరాణా షాపులో నుంచి తనని చూపించి యాభై రూపాయలు తెమ్మని పురమాయించాడు. రిక్షావాడు వచ్చి గూండాని చూపించి యాభై రూపాయలు ఇమ్మంటే ఎందుకివ్వాలో శ్యామ్‌రావుకి అర్థంకాలేదు. చూడబోతే ఆ రౌడీ పోలీసువాడిలా లేడు, మున్సిపాల్టీ వాడిలాలేడు కమర్షియల్ టాక్స్ అధికారిలా లేడు, పోలీసు వాడిలో వుండాల్సిన పొగరు, పవరూ వున్నా వుత్త రౌడిలా వున్నాడు. 'ఏం ఎందుకివ్వాలి' అని అడిగాడు. 'ఎందుకివ్వాలంటున్నాడు సార్' అని శ్యామ్‌రావు అన్న మాటలు గూండాకి మోసాడు రిక్షావాడు. 'ఎందుకివ్వాలో సాయంత్రానికి

తెలుస్తుంది' అంటూ గొణిగి 'పోనీ' అని రిక్షావాణ్ణి ఆదేశించాడు. ఆ సాయంత్రం గూండాలంతా ఏకమై శ్యామ్‌రావు కొట్టుమీద పడి దాడిచేశారు. 'ఇదేమి అన్యాయం' అని అడ్డమొచ్చిన శ్యామ్‌రావుని కొట్టి షోకేసులు, ఫర్నిచర్ ధ్వంసం చేశారు. శ్యామ్‌రావు పోలీసు కంప్లైంట్ ఇచ్చాడు. పోలీసులు రౌడీలను అరెస్ట్ చేసి వాళ్ళ మీద కేసు పెట్టారు. కోర్టువారు కేసు విచారణ జరిపి గూండాలకు ఆరు నెలలు జైలుశిక్ష విధించారు.

తీర్పు విని గూండాలు జైలుకు వెళితే నాకేమిటి, కొట్లోకెళితే నాకేమిటి నాకు జరిగిన నష్టాన్ని ఎవరు పూడుస్తారు? నాకొచ్చిన కష్టాన్ని ఎవరు తీరుస్తారని వాపోయాడు శ్యామ్‌రావు.

నిజమే నేరానికి గురైనవారికి నష్టపరిహారం చెల్లించకపోతే నిందితులకు శిక్ష వేసినా మానినా ఒకటే. ఒక నేరం మరొక నేరానికి దారి తీయకుండా వుండాలన్న ఉద్దేశంతో నేరస్తుడ్ని శిక్షిస్తున్నప్పుడు నేరానికి గురైన వారికి నష్టపరిహారం చెల్లించక పోతే పరోక్షంగా శిక్షకు గురైనట్లే అవుతుంది. ఉదాహరణకు ఇంతకుముందు శ్యామ్ రావు కేసులో గూండాలు ధ్వంసం చెయ్యడం వల్ల అతనికి కలిగిన నష్టాన్ని కోర్టు వారు నిందితులకు శిక్ష విధించడం వల్ల పూడ్చినట్లు కాదు. శ్యామ్‌రావుకి ఈ నష్టాన్ని పూడ్చడానికి కనీసం ఎలా లేదన్నా నాలుగేళ్ళు పడుతుంది. ఈ లోగా అతను వ్యాపారం చేసుకోలేకపోవచ్చు. దీన్ని బట్టి చూస్తే శ్యామ్‌రావుకి కూడా పరోక్షంగా శిక్ష విధించినట్లే అవుతుంది.

ఇటీవల సుప్రీంకోర్టు ఒక కేసులో తీర్పు చెబుతూ వీలైనంత వరకూ క్రిమినల్ కేసుల్లో నేరానికి గురైన వారికి నష్టపరిహారం చెల్లించాలని పేర్కొంది. ఈ తీర్పు యొక్క ఉద్దేశం నష్టపరిహారం పొందడానికి అవకాశంవున్న కేసుల్లో నేరానికి గురైన వారికి నిందితుడి నుంచి శిక్షలో భాగంగా నష్టపరిహారం ఇప్పించడమేనని అర్థం చేసుకోవాలి.

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సవరించకముందు ఫైన్ వేయడానికి అవకాశం వున్న కేసుల్లోనే నిందితుడికి వేసిన ఫైన్‌ని నష్టపరిహారంగా చెల్లించమని ఆదేశించేవారు. అయితే సవరించిన చట్టం ప్రకారం నేరస్తుడికి జైలు శిక్ష విధించినా ఫైన్‌తో సంబంధం లేకుండా నేరానికి గురైనవారికి నష్టపరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు.

ఫైన్ విధించే కేసుల్లో కోర్టు ఆ ఫైన్‌లో ఒక భాగాన్నికాని లేక మొత్తాన్ని కాని నష్టపరిహారంగా చెల్లించమని కోర్టు ఆదేశించవచ్చు. నష్టపరిహారాన్ని చెల్లించమని ఆదేశించేముందు కోర్టు ఆ జరిగిన నేరంలో నేరానికి గురైనవారికి జరిగిన నష్టాన్ని బేరీజు వేస్తుంది. అంతేకాని కేసులో నేరానికి గురైనవారికి అయిన ఖర్చుల్ని దృష్టిలో వుంచుకుని నష్టపరిహారాన్ని మంజూరు చేయరు.

కేసు విచారణ జరిపిన కోర్టు నష్టపరిహారం చెల్లించమని ఆదేశించవచ్చు. అంతేగాక అప్పీల్‌లోకాని, రివిజనల్‌లోకాని నేరానికి గురైనవారికి నష్టపరిహారం చెల్లించమని సెషన్స్ కోర్టు, హైకోర్టు, సుప్రీంకోర్టులు కూడా ఆదేశించవచ్చు.

తీర్పు చెప్పేటప్పుడు ముద్దాయికి శిక్ష విధించేటట్లయితే నేరస్తుడి ఆర్థిక స్తోమతను, తదితర విషయాల్ని పరిగణనలోకి తీసుకుని కోర్టువారు నష్టపరిహారాన్ని చెల్లించమని ఆదేశిస్తారు. ఏ ప్రత్యేకమైన కారణాల వల్ల నష్టపరిహారం చెల్లించమని ఆదేశించింది కోర్టు వివరించాలి. అంతేగాక కోర్టు ఈ విషయంలో నేరస్తుడి సంజాయిషీని కూడా పరిగణనలోకి తీసుకుంటుంది. శిక్ష విధించేటప్పుడు శిక్షలో భాగంగా జరిమానా విధించని పక్షంలో నేరస్తుడిని నేరానికి గురైనవారికి కలిగిన నష్టాన్ని నష్టపరిహారంగా చెల్లించమని ఆదేశించవచ్చు. జరిమానాలో భాగాన్ని ప్రాసిక్యూషన్ ఖర్చులుగా చెల్లించమని కూడా కోర్టు ఆదేశించవచ్చు.

ఈ చట్టం కింద నష్టపరిహారాన్ని కోరేముందు నేరానికి గురైనవారు నష్టానికి గురయ్యారని రుజువు చేసుకోవాలి. అంతేగాక ఆ నేరంలోనే నేరానికి గురైనవారు నష్ట పరిహారాన్ని తెలపాలి సివిల్ కోర్టులో కూడా నష్టపరిహారం పొందే అవకాశం వుందని కూడా రుజువు చేసుకోవాలి.

నష్టపరిహారం జరిగిన నష్టానికి మించి ఏ పరిస్థితుల్లోనూ కోర్టు మంజూరు చేయడానికి వీల్లేదు. నేరానికి గురైన వాళ్ళు చాలామంది వుండేటట్లయితే నిందితుడికి విధించిన జరిమానాని వారందరికీ సమానంగా పంచుతారు. ఈ చట్టం కింద కేవలం నేరానికి గురైన వాళ్ళేకాక వారి కుటుంబ సభ్యులు వారి మీద ఆధారపడేవాళ్ళు తదితరులు నష్టపరిహారం పొందవచ్చు. నేరానికి గురైనవాళ్ళు మరణించేటట్లయితే మృతుడి తరపున అతనిమీద ఆధారపడినవాళ్ళు నష్టపరిహారం పొందవచ్చు. యాక్సిడెంట్ కేసుల్లో యాక్సిడెంట్‌కి గురైనవారే గాక వారిమీద ఆధారపడినవాళ్ళు నష్టపరిహారం పొందడం మనకు తెలుసు. అంటే సివిల్ కోర్టులో నష్టపరిహారం పొందే హక్కు వున్న ప్రతివారూ క్రిమినల్ కేసులో కూడా నష్టపరిహారం పొందడానికి అర్హులు. దొంగ సొత్తని తెలియకుండా దాన్ని కొనుక్కున్న వారు ఆ తర్వాత సొమ్ము పట్టుపడ్డాక నేరస్తుడికి శిక్షపడేటట్లయితే ఈ చట్టం కింద నష్టపరిహారాన్ని పొందవచ్చు.

అప్పీల్ కాలపరిమితి దాటిపోయిన తర్వాత మాత్రమే ఎలాంటి అప్పీల్ దాఖలు చేయని పక్షంలో నేరస్తుడి నుంచి నేరానికి గురైనవారు నష్టపరిహారాన్ని పొందడానికి అర్హులవుతారు. నష్టపరిహారం సరిపోలేదని సివిల్ కేసు దాఖలు చేసేటట్లయితే సివిల్ కేసులో నష్టపరిహారం మంజూరు చేసేముందు క్రిమినల్ కేసులో పొందే నష్టపరిహారాన్ని పరిగణనలోకి తీసుకుంటారు.

# హెబియస్ కార్పస్

వారం రోజులయింది గోవిందయ్యని పోలీసులు పట్టుకెళ్ళి. ఆతని జాడ తెలియడం లేదు. ఆ జిల్లాలో ఉన్న అన్ని పోలీసు స్టేషన్లు వెదికారు. ఆతన్ని ఎక్కడ

ఉంచింది తెలియలేదు. అరెస్టు చేసిన పోలీసులు ఎందుక అరెస్టు చేశారో చెప్పడానికి నిరాకరించారు. అతన్ని కోర్టులో హాజరుపర్చలేదు. పైగా అతన్ని ఎక్కడ ఉంచింది చెప్పమని అడిగితే మిమ్మల్ని కూడా లోపల తోస్తామని బెదిరించారు.

గోవిందయ్య తల్లి బెంగపెట్టుకొంది. తండ్రి పిచ్చెత్తిన వాడిలా రాజకీయ నాయకుల చుట్టూ తిరిగి తన కొడుకునెలాగైనా విడిపించమని ప్రాధేయపడ్డాడు. చివరికి చేసేదిలేక సర్చ్‌వారెంట్ తెచ్చి తన కొడుకు ఎక్కడున్నది తెల్సుకోమని ప్లీడర్‌ని ఆశ్రయించాడు. ఎక్కడున్నది తెలిస్తే తప్ప మేమేమి చేయలేమని చెప్పాడు ప్లీడరు.

ఇవాల్టి రోజుల్లో ఇలాంటి పరిస్థితి సంభవిస్తూండటం మనం చూస్తున్నాం ఎవరో కొందరు తమ కొడుకు కనిపించడంలేదని, తమ భర్త జాడ తెలియడం లేదని మెట్టినింట అడుగుపెట్టిన కూతురు మాయమైపోయిందనీ ప్రతిరోజు ఎక్కడో ఒకచోట ఎవరో ఒకరు విలపిస్తూనే ఉన్నారు. రోజురోజుకి పెరిగిపోతున్న లాకప్ మరణాలు, ఎన్‌కౌంటర్లు చూస్తుంటే ఎవరైనా అరెస్ట్ అయితే చాలు ఇంకా మనిషికి భూమ్మీద నూకలు చెల్లిపోయినట్లుగా ఏడుస్తున్నారు.

అరెస్ట్ చేసిన వారిజాడ తెలియకపోయినా ఎవరైనా మరెవరినైనా అక్రమంగా నిర్బంధించినా ఆ మనిషిని హాజరుపర్చమని ఆదేశిస్తూ కోర్టు జారీచేసే ఉత్తర్వునే హెబియస్ కార్పస్ అంటారు.

భారత రాజ్యాంగంలో పౌరులకు స్వేచ్ఛగా జీవించే హక్కు, ప్రాణాల్ని పరిరక్షించుకునే హక్కు ప్రాథమిక హక్కుగా ప్రకటించారు. పౌరుల ఈ హక్కుల్ని కాపాడే బాధ్యత న్యాయస్థానాలకి ప్రభుత్వానికి ఉంది. అయితే హెబియస్ కార్పస్ ఆదేశాలు జారీ చేసే హక్కు కేవలం హైకోర్టుకు, సుప్రీం కోర్టుకి మాత్రమే ఉంది. అందుచేత ఏదైనా మారుమూల ప్రాంతంలో ఎవరైనా అక్రమ నిర్బంధానికి గురయ్యేట్లయితే వారికి తక్షణం న్యాయం జరిగే అవకాశం ఉండదు.

సాధారణంగా మెజిస్ట్రేట్ కోర్టు పరిధిలో ఎవరైనా అరెస్ట్ అయ్యేట్లయితే ఆ అరెస్టు అయిన వ్యక్తి ఎక్కడున్నాడో తెల్సుకోగల్గినప్పుడు సర్చ్‌వారెంట్ వేసి నిర్బంధంలో వున్న వ్యక్తిని కోర్టులో హాజరు పర్చుకోగల్గుతున్నారు. ఈ సర్చ్‌వారెంట్ వల్ల నిజానికి ఎక్కువ ఫలితం ఉండటంలేదు. కోర్టుల్లో పనిచేసే గుమాస్తాలో, నిరంతరం కోర్టుల్లో ఉండే పోలీసులో, పోలీస్ ఇన్‌ఫార్మర్లో సర్చ్‌వారెంట్ వేసిన మరుక్షణం సంబంధిత పోలీసు స్టేషన్లకు తెలియపరుస్తున్నారు. ఈ సమాచారం తెలియగానే నిర్బంధింపబడిన వ్యక్తిని అక్కడినుండి మరోచోటికి తరలిస్తున్నారు. తత్‌కారణంగా ఈ వారెంట్ వల్ల ఉపయోగంలేకుండా పోతోంది. అంతేకాక మరికొన్ని

సార్లు నిర్బంధంలో ఉన్న వ్యక్తిని వారెంట్ తీసుకువెళ్ళిన వ్యక్తిని కమీషనర్ కను గొన్నప్పటికీ అతన్ని కమీషనర్‌కి స్వాధీనపర్చడానికి పోలీసులు నిరాకరిస్తారు. లేక పోతే ఇప్పుడే అరెస్టు చేశామని అంటూ అప్పటికప్పుడు రిమాండ్ రిపోర్టు తయారు చేస్తారు. సర్చ్‌వారెంట్ సక్సెస్ కావడమన్నది ఒక మినహాయింపు మాత్రమే.

మారుమూల ప్రాంతాల వాళ్ళు హైదరాబాదు వచ్చి హెబియస్ కార్పస్ వెయ్య డం అంటే మాటలు కాదు. అలాంటప్పుడు చట్టానికి కొత్త భాష్యం చెప్పి కొత్త అర్థాలు ఇచ్చి కింద కోర్టులో ఏమైనా దరఖాస్తు చేయడానికి వీలుంటుందేమో వెతకాల్సిన అవసరం ఉంది.

ఈ దృష్ట్యా ఆంధ్రప్రదేశ్ హైకోర్టు సర్చ్‌వారెంట్‌కు సంబంధించిన చట్టానికి కొత్త అర్థాలు ఇచ్చింది. హెబియస్ కార్పస్ వెయ్యడం వలన నిర్బంధంలో ఉన్న మనిషిని కోర్టులో హాజరుపరుస్తారు. ముందుగా ప్రతివాదులకు నోటీసు ఇవ్వడంవలన అసలు ఆ మనిషిని అరెస్టు చేసిందీ లేనిదీ, నిర్బంధంలో ఉంచిందీ లేనిదీ తెలుసుకో డానికి వీలవుతుంది. ఈ పని సర్చ్‌వారెంట్ జారీచేసే ముందుకూడా చేయవచ్చు. సర్చ్ వారెంట్ జారీ చేసేముందు ప్రతివాదులకు నోటీసు ఇవ్వడం వలన అసలు ఆ వ్యక్తి నిర్బంధంలో ఉందీ లేనిదీ ప్రతివాదులు చెప్పుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. అయితే ప్రతివాది, సర్చ్‌వారెంట్ జారీ చేసే అవకాశం ఉందని తెలుసుకోడానికి ఈ పరిస్థితి దారితీసే ప్రమాదం ఉంది. నిర్బంధితుడిని ప్రతివాది ఎవ్వరూ గ్రహించుకో లేని చోటికి మార్చే ప్రమాదం ఉంది. అలాంటప్పుడు ఈ సర్చ్‌వారెంట్ వల్లనిర్బం ధితుడు బైటపడి నిందితుడ్ని శిక్షించే అవకాశాలు లేకుండా పోతాయి.

హెబియస్ కార్పస్ ఉద్దేశ్యం నిర్బంధితుడిని హాజరుపర్చమనో, అసలు నిర్బంధంలో ఉంచిందీ లేనిదీ తెలపమనో ఆదేశించడంకాదు, అక్రమ నిర్బంధంలో ఉన్న వ్యక్తికి నష్టపరిహారం చెల్లించమని ఆదేశించడం కూడా.

కేవలం ప్రతివాదినించి జవాబు మాత్రమే తెల్సుకోదలిచేట్లయితే సర్చ్‌వారెంటే కాక బెయిల్ పిటిషన్ కూడా వేసి తెలుసుకోవచ్చు. ఏదో ఒక ఆరోపణ ఉంటే తప్ప ఎవరినైనా అరెస్ట్ చేయడానికి వీల్లేదు. ఏ ఆరోపణకు సంబంధించి నిందతుడ్ని అరెస్ట్ చేసారో తెలపాల్సిన బాధ్యత పోలీసుల మీద ఉంటుంది. అట్లా తెలిపేట్లయితే ఆకేసులో బెయిల్ వేసి విడిచిపెట్టమని అడగవచ్చు. బెయిల్ వేయడానికి ముందు నిందితుడ్ని తీసుకువచ్చి కోర్టులో హాజరు పర్చనవసరం లేదు. అరెస్ట్ చేసిన వెంటనేకాని, పోలీసు కస్టడీలో ఉంచినప్పుడుకానీ, కోర్టులో హాజరుపర్చినప్పుడు కానీ, రిమాండ్‌కు పంపి నప్పుడు కానీ ఎప్పుడైనా సరే బెయిల్ పెట్టుకోవచ్చు. బెయిల్ పిటిషన్ వేసినప్పుడు ప్రాసిక్యూషన్ వారికి నోటీస్ ఇస్తారు. ఆ నోటీస్‌ను పురస్కరించుకొని ప్రాసిక్యూషన్

నిందితుడ్ని అరెస్టు చేసిందీ లేనిదీ కాక అతని మీద ఉన్న ఆరోపణ ఏంటో కోర్టులో చెప్పాల్సి ఉంటుంది. కాబట్టి బెయిల్ పిటీషన్ వెయ్యడానికి నిందితుడ్ని ఏ కేసులో అరెస్ట్ చేసిందీ, అతనిమీదున్న ఆరోపణ ఏమిటి? అన్న వివరాలు కూడా తెలియాల్సిన అవసరం లేదు. కేవలం అరెస్ట్ చేశారంటే సరిపోతుంది.

బెయిల్ పిటిషన్ వేసినప్పుడు కూడా ప్రతివాదులైన ప్రాసిక్యూషన్ నుండి సమాధానం తెలుసుకోవచ్చు. ఎవరైతే నిర్బంధంలో ఉన్నాడని ఆరోపించామో ఆ వ్యక్తి నిర్బంధంలో ఉందీలేందీ, ఒకవేళ నిర్బంధంలో ఉంటే అతన్నే కేసులో అరెస్టు చేసిందీ, అతని మీదున్న ఆరోపణలేంటి వంటి వివరాలను ప్రాసిక్యూషన్ తప్పని సరిగా కోర్టువారికి తెలియజేయాల్సి వస్తుంది. హెబియస్ కార్పస్ వేయటంలో కేవలం మన ఉద్దేశ్యం ప్రతివాదుల నుంచి సమాధానం తెల్సుకోవడమే అయితే అందుకు బెయిల్ పిటీషన్ పెట్టుకున్నా సరిపోతుంది. అయితే ఈ ప్రయోజనం కేవలం పోలీసులు అరెస్టు చేసిన కేసుల్లోనే సాధించవచ్చు. నిర్బంధితుణ్ణి పోలీసులుకాక ఇతరులెవరైనా నిర్బంధించేట్లయితే బెయిల్ పిటీషన్ పెట్టుకోవడం వల్ల ఫలితం ఉండదు.

భారత రాజ్యాంగం మనిషికి స్వేచ్ఛని రాజ్యాంగ హక్కుగా పరిగణించింది. ఈ స్వేచ్ఛనెవరూ హరించడానికి వీల్లేదు. చట్టబద్ధంగా మాత్రమే వ్యక్తి స్వేచ్ఛకు పరిమితులు విధించడం తాత్కాలికంగా స్వేచ్ఛను హరించడమో చేయవచ్చు. చట్ట బద్ధంగా స్వేచ్ఛను హరించే అధికారం ఉంది కాబట్టి పోలీసులు నిర్బంధించినంత మాత్రాన చట్టబద్ధమైన నిర్బంధమని అనుకోవడానికి వీల్లేదు. పోలీసులు చట్టంకాదు. రాజ్యాంగమూ కాదు. కేవలం చట్టాన్ని పరిరక్షించడానికి ఏర్పడిన వ్యవస్థ మాత్రమే పోలీసు యంత్రాంగం. కాబట్టి పోలీసులు అరెస్టుచేసినంత మాత్రాన దాన్ని ప్రశ్నించ డానికి వీల్లేదనుకోవడం సరైందికాదు.

పోలీసులు అరెస్టుకు గల కారణాలు చెప్పకపోయినా, అరెస్టును గురించి జిల్లా మేజిస్ట్రేట్‌కి కాని సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్‌కు గాని తెల్పకపోయినా, అరెస్టు చేసిన వ్యక్తికి తగిన న్యాయ సహాయం కల్పించకపోయినా, ఇరవైనాలుగు గంటల్లో అతణ్ణి మెజిస్ట్రేట్ ముందు హాజరుపర్చకపోయినా అక్రమ నిర్బంధమే అవుతుంది. కాబట్టి హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటీషన్ వేసి ఈ అక్రమ నిర్బంధాన్ని ప్రశ్నించ వచ్చు. దీన్ని బట్టి హెబియస్ కార్పస్ నిర్బంధితుణ్ణి హాజరుపర్చమనడమేకాక నిర్బంధాన్ని ప్రశ్నించడం కూడానని స్పష్టమౌతోంది.

ఒకవేళ ఎవరినైనా చట్ట విరుద్ధంగా కాని, రాజ్యాంగ విరుద్ధమైన చట్టాల క్రింద కాని నిర్బంధించేట్లయితే ఆ చట్టాన్ని ఆ చట్ట విరుద్ధమైన నిర్బంధాన్ని కూడా హెబియస్ కార్పస్ పిటీషన్ వేసి సవాల్ చేయవచ్చు. జాతీయ భద్రతా చట్టం,

గూండా చర్యల నిరోధక చట్టం, టెర్రరిస్టు చట్టం తదితర చట్టాల క్రింద నిర్బంధించేట్లయితే ఆ నిర్బంధాన్ని హైకోర్టులో ప్రశ్నించే హక్కు వుంది.

చాలా కేసుల్లో హెబియస్ కార్పస్ దాఖలు చేసినప్పుడు పోలీసులు హడావుడిగా ఏదో ఒక కేసు పెట్టి నిర్బంధితుడిని తీసుకువచ్చి కోర్టులో హాజరుపరుస్తారు. ఇలా హాజరుపర్చినప్పుడు నిందితుడు అంతకు ముందురోజు అరెస్టు చేసినట్లుగా రిమాండ్ రిపోర్టులో చూపుతారు. దీంతో అరెస్టు, నిర్బంధం, రిమాండ్ అన్నీ చట్టబద్ధమే అయిపోతాయి. ఈ విషయం హైకోర్టు దృష్టికి ప్రాసిక్యూషన్ తీసుకురాగానే కోర్టువారు హెబియస్ కార్పస్ పిటిషన్ కొట్టివేస్తారు. పార్టీలు కూడా చావుతప్పి కన్ను లొట్టపోయినందుకు సంతోషపడి ఊరుకుంటాయి. అసలు ఒక వ్యక్తి స్వేచ్ఛకు సంబంధించిన వివాదం కోర్టు ముందుకు వచ్చినప్పుడు కోర్టుదాన్ని తేలిగ్గా తీసివేయడం సరైందికాదు. అలా చేసినట్లయితే మానవ స్వేచ్ఛనీ, ప్రజాస్వామ్యాన్నీ, స్వాతంత్ర్యాన్నీ, రాజ్యాంగాన్నీ అపహాస్యం పాలుచేసినట్లే అవుతుంది. నిర్బంధితుణ్ణి ఏ కోర్టులోనైతే హాజరుపర్చారో కనీసం ఆ కోర్టయినా నిర్బంధితుడి నుంచి స్టేట్‌మెంట్ తీసుకోవాలి. ఆ స్టేట్‌మెంట్‌లో అక్రమ నిర్బంధానికి సంబంధించిన ఆరోపణ కనుక ఉండేట్లయితే దాన్ని ప్రైవేట్ కంప్లైంట్ కింద పరిగణించి తగిన చర్య తీసుకోవాల్సి ఉంది. ఇహపోతే హైకోర్టు కూడా క్రింది కోర్టులను నిర్బంధితుడి స్టేట్‌మెంట్ రికార్డుచేయమని ఆదేశించడం అవసరం.

## ప్రైవేటు వ్యక్తులపై హెబియస్ కార్పస్

హెబియస్ కార్పస్ రిట్ పిటిషన్ ప్రైవేటు వ్యక్తులపైన కూడా వేసుకోవచ్చు. ఉదాహరణకి భార్యాభర్తల మధ్యన వివాదాలేర్పడినప్పుడు పిల్లలు ఎవరో ఒకరి దగ్గరే ఉండిపోవచ్చు. అలాంటప్పుడు ఆ పిల్లల్ని రెండోవారికి చూపడానికిగానీ, రెండోవారికి స్వాధీనపర్చడానికి గానీ ఇష్టపడకపోవచ్చు. హెబియస్ కార్పస్ పిటిషన్‌వేసి తద్వారా హక్కున్న వారు పిల్లల్ని చూడటమో, పొందడమో జరుగుతుంది.

ఇటీవల ప్రాచుర్యం పొంది అనేక సత్ఫలితాలు సాధించిన పబ్లిక్ ఇంట్రెస్ట్ లిటిగేషన్స్ కారణంగా చాలామంది హైకోర్టు, సుప్రీంకోర్టుల వరకూ వెళ్ళలేని వాళ్ళు కూడా హెబియస్ కార్పస్ ఫలితాలు పొందారు. నిర్బంధానికి సంబంధించి వివరాలు తెలుపుతూ నిర్బంధితుణ్ణి హాజరుపర్చేలా చూడమనో, విడుదల చేయించమనో కోరుతూ హైకోర్టుకు వ్రాసే ఉత్తరాలనీ, టెలిగ్రాములనీ హెబియస్ కార్పస్ రిట్ పిటిషనల్‌గా పరిగణిస్తున్నారు. కొన్ని సందర్భాల్లో పత్రికల్లో వెలువడిన వార్తలను కూడా రిట్ పిటీషన్‌గా పరిగణించిన విషయం మనకు తెలుసు. ఈ విధంగా న్యాయ

వ్యవస్థ రోజురోజుకూ చేరువౌతోంది.

హెబియస్ కార్పస్ రిట్ జారీచేయడమంటే నిర్బంధంలో ఉన్న వ్యక్తిని కోర్టులో హాజరుపర్చమనడం, నిర్బంధించిన వారిని ఎందుకలా నిర్బంధించారో తెలియజేయమనడం, ఒకవేళ నిర్బంధం చట్టవిరుద్ధమైతే నిర్బంధించిన వ్యక్తిని విడుదల చేయమని ఆదేశించడమని స్పష్టమౌతుంది.

అక్రమ నిర్బంధాన్నుంచి, చట్టవిరుద్ధమైన నిర్బంధాన్నుంచి వ్యక్తులకు స్వాతంత్ర్యం కల్పించడం కోర్టు బాధ్యత. అంతేకాక రాజ్యాంగ విరుద్ధమైన నిర్బంధపు చట్టాన్నుంచి కూడా కోర్టులే రక్షణ కల్పించాలి.

క్రిమినల్ కేసులో శిక్ష పడేట్లయితే హెబియస్ కార్పస్ పిటీషన్ దాఖలుచేయడానికి వీలులేదు. అయితే ఈ శిక్ష అనధికారికంగా కోర్టు వేసేటట్లయితే హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోవచ్చు. హెబియస్ కార్పస్ పిటీషన్ వేసినప్పుడు ముందుగా నిర్బంధితుని అక్రమ నిర్బంధంలో ఉంచి ఉండవచ్చు. ఐతే ఆ తర్వాత నిర్బంధపు ఆదేశాల్ని సవరించి నిర్బంధాన్ని హెబియస్‌కార్పస్ తీర్పు వాటికి సక్రమ నిర్బంధంగా మార్చినట్టయితే అప్పుడు హెబియస్ కార్పస్ జారీచేయడానికి వీల్లేదు. ఉదాహరణకు గుండా చర్యలు నిరోధక చట్టం క్రింద ఒక వ్యక్తిని అరెస్టుచేసి నిర్బంధించారనుకొందాం. అరెస్టుచేసినపుడు నిర్బంధం సక్రమం కాకపోవచ్చు. హెబియస్‌కార్పస్ రిట్ వెయ్యగానే ఆ నిర్బంధం సక్రమమైపోతుంది. అప్పుడు హెబియస్ కార్పస్ పిటీషన్ నిర్బంధితుడిని విడుదల చేయమని ఆదేశించడానికి వీల్లేదు. ఈ నిబంధన చట్టాన్నతిక్రమించేవారికి బాగా ఉపయోగపడుతుంది. అరెస్టుచేసి నెలల తరబడి అక్రమ నిర్బంధంలో ఉంచే పోలీసులు హెబియస్ కార్పస్ వెయ్యంగానే నిర్బంధితుడిని కోర్టులో హాజరుపర్చడం జరుగుతుంది. ఇంతకాలం అక్రమ నిర్బంధంలో ఉన్న ఆ నిర్బంధితుడి నిర్బంధం సక్రమమైపోతుంది. హైకోర్టు కూడా ఏమీచేయలేని పరిస్థితిలో పడుతుంది.

చట్ట విరుద్ధంగా నిర్బంధించినా, రాజ్యాంగ విరుద్ధమైన చట్టం క్రింద నిర్బంధించినా హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోవచ్చు. ఆ చట్టాన్ని రాజ్యాంగ విరుద్ధంగా కోర్టు నిర్ణయించినపుడు నిర్బంధితుడిని కోర్టు విడుదల చేయాల్సి ఉంటుంది.

నిర్బంధాన్నుంచి బెయిల్‌మీద విడుదల అయిన తర్వాత కూడా హెబియస్ కార్పస్ పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు. బెయిల్ మీద విడుదల అవడమంటే పూర్తిగా స్వేచ్ఛని పొందినట్లుకాదు. జామీన్‌దార్ల పూచీపై విడుదల కావడమంటే కోర్టు కస్టడీలో ఇతరుల హామీపై సంచరిస్తున్నారన్న అర్థం. అంచేత కోర్టు బెయిల్ పైన విడుదల కావడాన్ని నిర్బంధంలో ఉన్నట్లుగానే పరిగణిస్తుంది.

హెబియస్ కార్పస్ పిటిషన్ విచారణలో ఉండగా బెయిల్ కోసం దరఖాస్తు తీసుకోవచ్చు.

శిక్ష పడకుండానే నిర్బంధించే అధికారం కల్పించే చట్టాలు మనకున్నాయి. నేరం జరిగినప్పుడు దర్యాప్తు జరుగుతున్న క్రమంలో నిందితుడ్ని నిర్బంధిస్తారు.

అలాగే కేసు విచారణలో ఉండగాకూడా నిందితుల్ని నిర్బంధిస్తారు. ఈ నిర్బంధం చట్ట ప్రకారం లేనప్పుడు హెబియస్ కార్పస్ దాఖలుచేసుకోవచ్చు. ఉదాహరణకి నిర్బంధ కాలం గడిచిపోయిన తర్వాత కోర్టులో హాజరుపర్చకపోయేట్లయితే ఆ నిర్బంధం అక్రమమౌతుంది. గనుక హెబియస్ కార్పస్ పిటిషన్ వేసుకోవచ్చు.

కేసువిచారణ జరగడంలో జాప్యం జరిగినపుడు హెబియస్ కార్పస్ పిటిషన్ పెట్టుకోవచ్చు. వారెంట్ మీద అరెస్టు చేసినపుడు ఆ అరెస్టును చట్ట విరుద్ధమైనదిగా పరిగణించడానికి వీల్లేదు. ఒక నేరారోపణపై నిందితుడ్ని నిర్బంధించినపుడు ఆ నిర్బంధం సరైందా కాదా అని హెబియస్ కార్పస్‌లో తేలుస్తారు. అంతేకాని ఆ నేరానికి సంబంధించి విషయాన్ని హెబియస్ కార్పస్‌లో తేల్చరు.

నేరారోపణపై నిర్బంధంలో ఉన్న వ్యక్తిని హెబియస్ కార్పస్ పై విడుదల చేసినట్లయితే తిరిగి అతన్ని అదే నేరారోపణపై అరెస్టు చేసే అధికారం పోలీసులకుంది. క్రిమినల్ చట్టం అమలుపర్చేప్పుడు దాన్ని అడ్డుకోవడం కోసం హెబియస్ కార్పస్ ఉద్దేశించబడలేదు. రాజ్యాంగ విరుద్ధంగా అరెస్టు చేసినపుడు హెబియస్ కార్పస్ దాఖలు చేయవచ్చు. అరెస్టు చేసినపుడు ఎందుకు అరెస్టు చేసిందీ ఏ కారణంచేత అరెస్టు చేసిందీ ఆ అరెస్టు చేసిన వ్యక్తికి చెప్పాలి.

న్యాయవాదిని సంప్రదించడానికి అవకాశం కల్పించడం, ఇరవై నాలుగు గంటల్లో కోర్టులో హాజరుపర్చకపోవడం రాజ్యాంగ విరుద్ధమైన అరెస్టు అవుతుంది.

మరే ఇతర చట్టాలకు విరుద్ధంగానైనా అరెస్టుచేస్తే ఆ అరెస్టును చట్టవిరుద్ధమైనదిగా పరిగణిస్తారు.

క్రిమినల్ కేసు విచారణలో ఉండగా హెబియస్ కార్పస్‌లో విడుదల చేయమని ఆదేశించడానికి వీల్లేనపుడు విచారణ తొందరగా ముగించమని ఆదేశించవచ్చు.

విదేశీయులు ఈ దేశంలో ఉండటానికి కాల పరిమితి చెల్లిపోయినపుడు వారిని అరెస్టు చేసినట్లయితే ఆ అరెస్టును ప్రశ్నిస్తూ హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోవడానికి వీల్లేదు.

సాధారణంగా ప్రత్యామ్నాయ అవకాశాలున్నప్పుడు హైకోర్టు రిట్‌పిటిషన్ స్వీకరించదు. అయితే హెబియస్ కార్పస్ విషయంలో మాత్రం దీనికి మినహాయింపు ఇచ్చారు. ప్రత్యామ్నాయ అవకాశాలున్నాయి కాబట్టి హెబియస్ కార్పస్ వెయ్యడానికి

బదులుగా ఆ అవకాశాలని ఉపయోగించుకోండి అనడం సరైందికాదు. ఉదాహరణకి ఒక మనిషిని అక్రమంగా పోలీసులు నిర్బంధించారనుకొందాం. అతన్ని అక్రమ నిర్బంధాన్నుంచి బైటకి తియ్యడానికి సర్చ్ వారెంట్ వెయ్యవచ్చు. హెబియస్ కార్పస్ కూడా వెయ్యవచ్చు. సర్చ్ వారంట్ వెయ్యడానికి అవకాశం ఉంది కాబట్టి హెబియస్ కార్పస్‌ను ముందు సర్చ్ వారెంట్ వేసినాక వెయ్యండి అనేట్లయితే కోర్టులు ఒకరకంగా అక్రమ నిర్బంధాన్ని పొడిగించడానికి తోడ్పడ్డట్టే అవుతుంది. అంతేకాక సర్చ్‌వారంట్ వెయ్యడానికి, హెబియస్ కార్పస్ వెయ్యడానికి మధ్యన గడిచే కాలవ్యవధిలో రెండింటా ఏ ఫలితం లేకుండా పోయే ప్రమాదం ఉంది.

మైనారిటీ తీరని పిల్లల గురించి కూడా హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోవచ్చు. అయితే ఆ పిల్లల శ్రేయస్సు దృష్ట్యా మాత్రమే పిటిషన్ దాఖలు చేయాల్సి ఉంటుంది. గార్డియన్‌గా నియమించమని క్రింద కోర్టులో అభ్యర్థించిన వ్యక్తి కోర్టు అందుకు నిరాకరించినపుడు ఆ పిల్లల కస్టడీ గురించి హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోడానికి వీల్లేదు.

మైనర్ల గురించి హెబియస్ కార్పస్ దాఖలు చేసినప్పుడు ఆ పిటిషన్‌లో కోర్టు పార్టీల హక్కులు నిర్ణయించదు. ఆ మైనర్ శ్రేయస్సుదృష్ట్యానే హెబియస్ కార్పస్ దాఖలు చేస్తారు.

ప్రివెంటివ్ డిటెన్షన్ కింద నిర్బంధించినప్పుడు ఆ నిర్బంధ చట్టం రాజ్యాంగబద్ధంకాదన్న విషయంపై హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోవచ్చు. ఒకవేళ నిర్బంధ చట్టం రాజ్యాంగ బద్ధతని ప్రశ్నించినపుడు ఆ చట్టబద్ధంగా నిర్బంధించలేదని హెబియస్ కార్పస్ కోరవచ్చు.

అడ్వైజరీ బోర్డు సిఫారసును సకాలంలో అమలు పర్చనపుడు, విచారణ దీర్ఘకాలం కొనసాగినపుడు కూడా హెబియస్ కార్పస్ జారీ చేయవచ్చు.

జైళ్లలో ఉన్న ఖైదీలని హింసించినప్పుడు, వారి రాజ్యాంగ హక్కులని కాలరాచినపుడు హెబియస్ కార్పస్ క్రింద తగిన ఆదేశాలు పొందవచ్చు. ఖైదీలు కోర్టుకు పంపుకునే హెబియస్ కార్పస్ పిటిషన్‌ని అధికార్లు త్రొక్కి పెట్టడానికి వీల్లేదు.

భార్య కస్టడీ నిమిత్తం హెబియస్ కార్పస్ దాఖలు చేసుకోవచ్చు. అయితే భార్య విషయంలో నేరానికి పాల్పడ్డ వ్యక్తి ఆ భార్య స్వాధీన నిమిత్తం హెబియస్ కార్పస్ దాఖలు చేయడానికి వీల్లేదు.

హైకోర్టు, సుప్రీంకోర్టులు హెబియస్ కార్పస్ పిటిషన్ దాఖలు చేసినప్పుడు ప్రతివాదిని కోర్టులో హాజరుకమ్మనీ, హెబియస్ కార్పస్ పిటిషన్‌లో కోరిన ఆదేశాలు ఎందుకు జారీ చేయకూడదో తెలియచేయమనీ, అక్రమ నిర్బంధంలో ఉన్న వ్యక్తిని

కోర్టులో హాజరు పర్చమని కోర్టు ఉత్తర్వులు జారీ చేస్తుంది.

కోర్టు ఆదేశాల మేరకు ఆ వ్యక్తిని ఎందుకు నిర్బంధంలో ఉంచిందీ కారణం తెల్పకపోయినా, తెల్పిన కారణాన్ని కోర్టు ఆమోదించక పోయినా కోర్టు నిర్బంధితుడ్ని విడుదల చేయమని ఆదేశిస్తుంది.

నిర్బంధితుడ్ని తప్పనిసరిగా కోర్టులో హాజరు పర్చాలన్న నిబంధనకి ఇటీవల కాలంలో కోర్టు మినహాయింపులు వచ్చాయి. కోర్టు ఆదేశాలు జారీ చేసేట్లైతే నిర్బంధితుడ్ని తప్పనిసరిగా విడుదల చేయాల్సి ఉంటుంది కాబట్టి అతన్ని కోర్టులో హాజరు పర్చమని ఆదేశించ నవసరం లేదని కోర్టులు అభిప్రాయపడ్డాయి.

నోటీసు తీసుకున్న తర్వాత అందుకు జవాబుగా ప్రతివాది ప్రమాణ పత్రాన్ని దాఖలు చేయాలి. పిటిషన్‌లో చేసిన ఆరోపణలకి ప్రతివాది జవాబీయక పోయేట్లైతే ఆ ఆరోపణలను తను ఆమోదించినట్లుగానే కోర్టు పరిగణిస్తుంది.

హెబియస్ కార్పస్ పిటిషన్ దాఖలు చేసిన రోజు నిర్బంధితుడు అక్రమ నిర్బంధంలో ఉండి ఆ తర్వాత పిటిషన్ విచారణ జరిగే నాటికి అతని నిర్బంధం సక్రమమైనదైతే కోర్టు హెబియస్ కార్పస్ జారీ చేయదు. కేసు విచారణ నాటి తేదీని మాత్రమే ప్రామాణికంగా తీసుకొంటుంది.

నిర్బంధితుడు విడుదలయినట్లుగా ప్రతివాది అందుకు కావాల్సిన సాక్ష్యాధారాలు కోర్టు వారికి చూపించాల్సి ఉంటుంది.

హెబియస్ కార్పస్ ప్రొసీడింగ్స్ అవసరమనుకుంటే కోర్టు సాక్ష్యాధారాలను విచారిస్తుంది. కేవలం ప్రమాణ పత్రాలపై ఒక నిర్ణయానికి రావడం సాధ్యం కానప్పుడు అనివార్యంగా కోర్టు విచారణ జరిపిస్తుంది.

హెబియస్ కార్పస్ ఉద్దేశ్యం అక్రమ నిర్బందంలో ఉన్న వ్యక్తిని శిక్షించడం కాదు. నిర్బంధితుడ్ని విడుదల చేయించడం మాత్రమే. ఒకోసారి ఆ కేసుకు సంబంధించిన ప్రత్యేక పరిస్థితుల్లో తగిన ఆదేశాలు జారీ చేసే అధికారం కోర్టుకుంది.

హెబియస్ కార్పస్ జారీ చేస్తూ నిర్బంధితుడ్ని విడుదల చేయమని కోర్టు ఆదేశించినపుడు కోర్టు ఆదేశం ప్రతివాది ఖాతరు చేయకపోయినట్లైతే ప్రతివాదిని కోర్టు ధిక్కారం నేరం కింద శిక్షించవచ్చు.

అది ఎమర్జెన్సీ చీకటి రోజులు. జీవించే హక్కును కాలరాసినా మనం చెయ్యగలిగిందేమీ లేదు. సరిగ్గా అలాంటి దశలో ఈ దేశపు న్యాయ వ్యవస్థను హెబియస్ కార్పస్ విచారించవచ్చునా లేదా అన్న సమస్య పట్టిపీడించింది. దేశంలోని అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టులో ఏడియమ్, జబల్పూర్ Vs శివ్‌కాంత్ శుక్లా కేసు విచారణ జరిగింది. ఈ కేసుమీద వాదోపవాదాలు డిసెంబర్ 15, 1975న

ప్రారంభమై కొన్నేళ్లపాటు కొనసాగాయి. సుప్రీంకోర్టులోని సీనియర్ న్యాయమూర్తు లంతా కూడా ఈ కేసు విచారణలో పాల్గొన్నారు. ప్రధాన న్యాయమూర్తి శ్రీ రే, న్యాయమూర్తులంతా కూడా ఈ కేసు విచారణలో పాల్గొన్నారు. ప్రధాన న్యాయమూర్తి శ్రీ రే, న్యాయమూర్తులు ఖన్నా, బెగ్, చంద్రచూడ్, భగవతిలు ఈ కేసులో న్యాయ మూర్తులుగా ఉన్నారు. అప్పటి అటార్నీ జనరల్ శ్రీ నరేండే. అప్పటి ప్రభుత్వ వైఖరిని ప్రతిబింబిస్తూ వాదించారు. న్యాయమూర్తులెవ్వరూ అతనికి సౌకర్యం కలిగించే ప్రశ్నలు వేయలేదు. అటార్నీ జనరల్ రెండవ రోజు తన వాదనని కొనసాగిస్తూ ఉండగా 'రాజ్యాంగం 21వ ప్రకరణలో జీవించే హక్కును పొందు పరిచారు. వాదనలు అక్కడి వరకూ పోడిగిస్తారా' అని న్యాయమూర్తి శ్రీ ఖన్నా ప్రశ్నించారు.

చట్టవిరుద్ధంగా మనిషి జీవితాన్ని హరించినప్పటికీ కోర్టులు ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో ఉన్నాయని శ్రీ నరేండే మరో ఆలోచనకు తావులేకుండా సమాధానం చెప్పారు. ఆటు తర్వాత మిగతా న్యాయమూర్తులు కూడా ఆ సౌకర్యం కల్గించే ప్రశ్నలు వెయ్యడం ప్రారంభించారు. కోర్టు వాతావరణం మారింది. నిర్బంధితుల న్యాయవాదులు ఊపిరి పీల్చుకున్నారు. ఆ తర్వాత న్యాయమూర్తి శ్రీ కృష్ణయ్యర్ మానవ హక్కులు సమర్థిస్తూ ఇచ్చిన తీర్పుని కోర్టు దృష్టికి తీసుకరావడం జరిగింది. వాదోపవాదాలు ముగిసింతర్వాత ప్రభుత్వం ఈ కేసు ఓడిపోతుందని కనీసం ఐదు గురిలో ముగ్గురు న్యాయమూర్తులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీర్పు చెబుతారని అంతా ఆశించారు. అయితే ఇందుకు భిన్నంగా దీర్ఘకాలం తర్వాత అనగా ఏప్రియల్ 28, 1976 న ఈ కేసులో కోర్టు తీర్పు చెప్పింది. న్యాయమూర్తి శ్రీ ఖన్నా మాత్రమే నిర్బంధితుల కనుకూలంగా తీర్పు చెప్పారు. ఈ కేసు తీర్పుతో సుప్రీంకోర్టు తన అధికారాన్ని తానే చేజేతులా జారవిడుచుకున్నట్టయింది.

మానవ స్వేచ్ఛని, జీవించే హక్కునీ కాపాడ్డానికి ఉపయోగపడే హెబియస్ కార్పస్ అస్త్రాన్ని సుప్రీంకోర్టు చేజేతులా వదులు కొంది. ఐతే ఆ రోజుల్లోనే అలహా బాద్, ఆంధ్రప్రదేశ్, బాంబే, ఢిల్లీ, కర్నాటక, కేరళ, రాజస్థాన్, మధ్యప్రదేశ్, పంజాబ్, కలకత్తా, మద్రాస్ హైకోర్టులు హెబియస్ కార్పస్ విచారించే హక్కు కోర్టు కుందని తీర్పు చెప్పాయి. ఈ తీర్పులు సుప్రీంకోర్టు దృష్టికి తెచ్చినప్పటికీ సుప్రీంకోర్టు లోని నలుగురు న్యాయమూర్తులు ఇందుకు భిన్నంగా తీర్పుచెప్పడం ఆశ్చర్యకరమైన విషయం. న్యాయస్థానాలు తమ స్వేచ్ఛనీ స్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటే తప్ప తమ అధికారాన్ని నిలుపుకోడం. తద్వారా ప్రాథమిక హక్కుల్ని కాపాడ్డం సాధ్యం కాదు. ఇహ ముందు కాలంలో ఎమర్జెన్సీలో లాకోర్టులు కూడా ప్రజల హక్కుల్ని కాపాడ లేని నిస్సహాయ స్థితిలో పడవని ఆశిద్దాం.

# సెక్యూరిటీ ప్రొసీడింగ్స్

మనదేశంలో అలహాబాద్ న్యాయస్థానానికి ఒక ప్రత్యేకత వుంది. ఇక్కడ న్యాయం నిష్పక్షపాతంగా జరుగుతుంది. పాలకులకైనా పాలితులకైనా న్యాయం ఒకటే. డబ్బున్న వారికైనా లేనివారికైనా ఒకే న్యాయం. ఇది కేవలం ఒక్క

అలహాబాద్‌కే పరిమితం కాదు. మొత్తం దేశంలో వున్న అన్ని న్యాయస్థానాల్లోనూ రాజ్యాంగం ప్రకారం ఇలాగే ఉండాలి. అయితే అలహాబాద్ న్యాయస్థానాలలో కొన్ని చరిత్ర ప్రాధాన్యత కలిగిన కేసులు నడిచాయి. కాబట్టి ఈ పేరు వచ్చింది. ముఖ్యంగా ఇందిరాగాంధీ కేసుతో సామాన్య జనం దృష్టిలో కూడా అలహాబాద్ న్యాయస్థానం ఒక ప్రత్యేకత సంతరించుకుంది. న్యాయస్థానాలు ఎంత ఉన్నత లక్ష్యంతో పనిచేసి నప్పటికీ పోలీసు వ్యవస్థలోనూ రాజ్యాంగ వ్యవస్థ ఆచరణలోనూ మౌలికంగా మార్పు రానంతవరకూ ప్రజలకి న్యాయం జరిగే అవకాశాలులేవు అని రుజువుచేస్తూ ఇటీవల ప్రజల దృష్టిలో ఒక సంఘటన జరిగింది.

అలనాడెప్పుడో ఇంకా ఈ దేశాన్ని బ్రిటిష్ వాళ్ళు వదిలి పెట్టనికాలంలో ఒకా నొక వ్యక్తిని పోలీసులు అరెస్టు చేశారు. అతన్ని పోలీసులు అక్రమంగా నిర్బంధించారో కొట్టారో తిట్టారో దీవించారో మనకు తెలియదు. అతను ఏ నేరం చేశాడో ఏ ఘోరం చేశాడో అతనికి తెలియదు. మనకూ అప్పటికీ ఇప్పటికీ తెలియదు. ఇహపోతే పోలీసులకి అంతకంటే తెలియదు. ఏదో అరెస్టు చేశారు కదా, అందుచేత అతను నేరస్థుడైనా కాక పోయినా తీసుకువెళ్ళి ఖైదులో పెట్టాలి కనుక వాళ్ళు అతనిని లాకప్‌లో కుళ్ళబొడవ కుండా ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ (తహశీల్‌దారు) దగ్గరకు తీసుకువెళ్ళి హాజరుపర్చారు. ఇతను అలవాటుపడ్డ నేరస్థుడు ఇల్లు వాకిలి వుందో లేదో తెలియదు. ఇతను రైల్వే స్టేషన్లలోను, బస్టాండుల్లోను వుంటాడు. కాబట్టి ఇతను ఏదో తీవ్రమైన నేరం చేసే అవకాశం వుందని తద్వారా శాంతి భద్రతలకు భంగం వాటిల్లే ప్రమాదం వుందని మేము భావిస్తున్నాం. అందుచేత ఇతన్ని ఖైదులోకి తోసి శాంతి భద్రతలకు భంగం వాటిల్లకుండా మీరు మాతో దయచేసి సహకరించగలరని కోరుతున్నాము అని అర్థం వచ్చేలా ఒక దరఖాస్తు పెట్టారు. అది చూసి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌గారు ఉబ్బి తబ్బిబ్బయి తన నాదేశించాల్సిన పోలీసులు తన ఆదేశాలు కోరడం చూసి గర్వంతో కాలరెగరేసి వుండవచ్చు. అసలు అతను పాత నేరస్థుడా కాదా? పాత నేరస్థుడైనప్పటికీ తనకు అతన్ని జైల్లో తోసే అధికారం వుందా; అసలు పోలీసులు చేసిన ఆరోపణల్లో ఎంతవరకు నిజం వుంది: అని కనీసంగా కూడా ఆలోచించకుండా ముద్దాయిని ఖైదు లోకి తోయమని ఆర్డరు వేశారు. ముద్దాయి ఏం చెప్పినా వినిపించుకోలేదు. పోలీసులు అతన్ని తీసుకువెళ్లి జైలువాళ్లకి అప్పచెప్పేశారు. ప్రతి పదిహేను రోజుల కొకసారి అతని రిమాండ్ కాలం పొడిగించబడుతూ వుండేది. పోలీసులకు గాని, జైలు అధి కారులకు గాని, ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ గారికి గాని అతన్ని గురించి ఏమీ పట్టలేదు. అనేక మంది అధికారులు మారిపోయారు. దేశంలోనూ ప్రపంచంలోనూ అనేక చారిత్రక మార్పులు వచ్చాయి. పాపం, మార్పురానిది మన ఖైదీ జీవితంలోనే. మన ఖైదీ

జైలుకు వెళ్లినప్పుడు అతని వయస్సు పాతిక. రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచిపోయాయి జైలుకు వెళ్లినప్పుడు యువకుడైన ఖైదీ వృద్ధుడైపోయాడు. ఈ దశలో అతను జైలుకు వెళ్లిన ముప్పైఏడు సంవత్సరాలకి అలహాబాదుకు చెందిన ఒక న్యాయవాది ఈ విషయం తెలుసుకొని అతని విడుదలకోసం అలహాబాద్ హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్ దాఖలు చేశారు. అలహాబాద్ హైకోర్టు నోటీసు ఇవ్వగా స్వతంత్ర భారత దేశపు పోలీసులకి, ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కు, జైలు అధికారులకి అసలు ఇతను ఎందుకు జైల్లో వున్నాడో తెలియలేదు. పాతరికార్డులు తిరగేసినతర్వాత అతని వల్ల శాంతి భద్రతలకి ప్రమాదముందన్న కారణంగా నిర్బంధించారని తెలుసుకున్నారు. అలహాబాద్ హైకోర్టు అతన్ని విడుదల చేయమని ఆదేశించింది. యౌవనంలో జైలుకెళ్లి 37 సంవత్సరాల జీవిత కాలం జైల్లో గడిపేసి వృద్ధుడై పండిపోయి బైటకి వచ్చిన మన ఖైదీకి మన దేశానికి స్వతంత్రంవచ్చిందని చెపితే గాని తెలియలేదు. అతనికి విముక్తిని, స్వేచ్ఛని ప్రసాదించిన స్వాతంత్ర్యాన్ని చూసి ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందట, అని మన ఖైదీ అనుకుంటూ వుండవచ్చు. శాంతి భద్రతల పరిరక్షణ కోసం సత్ప్రవర్తన కలిగి వుంటామని గ్యారంటీ తీసుకోడానికి అధికారం కల్పించే చట్టాన్ని అలనాటి బ్రిటిష్ పోలీసులే కాక ఇవాళ్టి భారతీయ పోలీసులు కూడా సక్రమంగా అర్థం చేసుకోవడంలేదో లేక ఉద్దేశ పూర్వకంగా దుర్వినియోగపరుస్తున్నారో గాని ఇవాళ్టి వరకు ఆచరణలో ఈ విషయంలో పెద్దగా మార్పులేమీ సంభవించలేదు.

అధికారులు కూడా కేవలం పోలీసులు చెప్పిన విషయం మీద ఆధారపడి వుండటమే తప్ప స్వతంత్రంగా ఆలోచించి తమ అధికారాన్ని వినియోగించుకోవడం లేదు. ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌లకి పాతక్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోను, 1973 క్రిమినల్ ప్రొసీజర్ చట్టంలోను సత్ప్రవర్తన కలిగి వుంటానని పౌరుల నుంచి జామీను తీసుకొనే అధికారం వుంది. అయితే ఎక్కడా ఎకాఎకిన ఈ అధికారం క్రింద పోలీసులు తీసుకు వచ్చే వ్యక్తులను నిర్బంధించే అధికారం లేదు. దురదృష్టవశాత్తు అంతకుముందు వాళ్లు చేసిన పనినే తిరిగి మనమూ చేయడం అన్నధోరణి మన అధికారుల్లో పాతుకుపోయింది. ఒక్కడుగు కూడా వాళ్లు అటో ఇటో వేయడానికి కూడా సందేహిస్తారు. కొత్తగా ఆలోచించడంగాని, తమ ఆలోచనలు విస్తృత పరచుకోడానికి గాని ఏనాడూ ప్రయత్నించడంలేదు. అంతేగాక పోలీసులు చెప్పిందే రూల్. పోలీసులు చెప్పిందే వేదమన్న ధోరణి కూడా వీళ్లలో పాతుకుపోయింది. ఈ యాంత్రికధోరణి, పోలీసుకి ఊడిగం చేసే మనస్తత్వం, ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌లలో పోనంతవరకూ వాళ్లకి ఒక వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకి సంబంధించిన అంశాలు కలిగి వున్న ఏ అధికారమూ వుండటం ఆరోగ్యకరం కాదు. ఈ విషయంలో బ్రిటిష్ కాలము నుండి ఇవాళ్టి వరకూ

ఏమీ మార్పులు రాలేదనడానికి అనేక ఉదాహరణలు మీ ముందుంచగలను. ఏ తహశీలు ఆఫీసుకు వెళ్ళి సెక్యూరిటీ ప్రొసీడింగ్‌కు సంబంధించిన రికార్డులు పరిశీలించినా ఈ విషయం స్పష్టమవుతుంది. నా అనుభవంలో జరిగిన కొన్ని విషయాలు మీముందుంచుతున్నాను. వరంగల్ పోలీసులు ఇద్దరు టీచర్లను అరెస్టు చేశారు. వాళ్లను చాలా రోజులు అక్రమంగా నిర్బంధించి తీవ్రవాదులతో సంబంధాలున్నాయన్న కారణంగా కొట్టి తిట్టి హింసించారు. ఉపాధ్యాయ సంస్థలు కల్పించుకోవడంతో వాళ్ళను తీసుకువచ్చి తహశీల్‌దారుముందు హాజరుపర్చారు. శాంతి భద్రతలకి భంగం వాటిల్లే పద్ధతిలో వాళ్ల ప్రవర్తిస్తున్నారని, అనేక మంది తీవ్రవాదులతో సంబంధాలున్నాయని, సభలు సమావేశాలు నిర్వహించడమే గాక అనేక సమావేశాలకు హాజరయ్యారని కూడా పోలీసులు ఆరోపించారు. మొత్తంగా చూస్తే ఇందులో అసలు ఆరోపణే లేదు. సభలు సమావేశాలు నిర్వహించడం, హాజరుకావడం నేరం కాదు. ఇహ పోతే తీవ్రవాదులతో సంబంధాలు కలిగివున్నారనడం హాస్యాస్పదమైన విషయం. ఎవరు తీవ్రవాది? తీవ్రవాదులతో సంబంధం కలిగివుండటం నేరమని చట్టం ఎక్కడా చెప్పలేదు.

వాళ్ళమీద ఒక స్పష్టమైన ఆరోపణ అంటూ ఏమీలేదు. కేవలం శాంతిభద్రతలకి ప్రమాదం వాటిల్లే అవకాశం ఉందన్న కారణంగానే పోలీసులు వాళ్లని అరెస్టు చేశారు. తీసుకువచ్చి తహసిల్దార్‌గారి ముందు హాజరు పర్చి వార్ని పదిహేను రోజుల పాటు జైల్లో ఉంచమని కోరగానే తహశీలుదారుగారు వాళ్లని జైలుకు పంపించారు. జైలు అధికార్లు కూడ ఈ చట్టం క్రింద రిమాండ్ తీసుకోవచ్చా లేదా అనికూడా చూడకుండా వాళ్ళని జైల్లో ఉంచేశారు. దీన్ని బట్టి ఒక విషయం స్పష్టం అవుతుంది. బ్రిటిషు పోలీసులకి బ్రిటిషు అధికార్లకి మనవాళ్ళకి పెద్దగా తేడా ఏమీలేదని తెలిపోయింది. ఒక మనిషి మీద స్పష్టమైన ఆరోపణ ఏమీ లేనప్పుడు, అతని మీద నేరం అనుమానానికి ఆస్కారం లేకుండా రుజువయ్యేంతవరకూ జైల్లోకి తోసి పరోక్షంగా శిక్షించే అధికారం ఎవరికీలేదు. ఆటవిక న్యాయంకూడా దీన్ని చూసి సిగ్గుపడుతుంది. పోలీసులు అరెస్టు చేసిన వాళ్ళని బొక్కలోకి తోసే అధికార్లు ఉన్నంతవరకూ ఈ పరిస్థితి ఇలాగే కొనసాగుతుంది.

శాంతిభద్రతల పరిరక్షణ పేరిట ఒకమనిషి నేరం చేసే అవకాశం ఉందన్న కారణంగా నిర్బంధించే అధికారం ఎవరికైనా ఉందా? ఈ విషయంలో ఆ వ్యక్తినించి ఎలాంటి సంజాయిషీ తీసుకోవల్సిన అవసరం లేదా? ఇలా శాంతిభద్రతల పేరిట ఎవరిని బడితేవారిని నిర్బంధించే పరిస్థితి కనుక ఉండేట్టయితే ఆకలికి తట్టుకోలేక పోయేవాళ్ళనందరిని, కూలికోసం సమ్మెకట్టే కూలీలను, ఇంకా అనేక బాధలతో విసిగి వేసారిన వాళ్ళనందరినీ జైళ్లలో త్రోసే ప్రమాదముంది.

పైన చెప్పిన టీచర్లని జైల్లోవేయడమేగాక వాళ్ళువిడుదలైన తర్వాత వాళ్ళ నించి సత్ప్రవర్తన కలిగి ఉంటామని జామీను తీసుకొన్నారు. ఇట్లా జామీనిచ్చినందుకు గాను సబ్-ఇన్‌స్పెక్టర్ పంపిన నివేదిక ఆధారంగా వాళ్ళు ఏ నేరం చేయకపోయి నప్పటికీ ఏ శిక్షా అనుభవించకపోయినప్పటికీ ఉద్యోగంలోంచి తొలగించారు. దీనినిబట్టి మనం ఇంగ్లీషువాళ్ళకంటే ఒకడుగు ముందే ఉన్నామని అనిపించకపోదు. అసలు సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో ఎక్కడా ఒకమనిషిని అరెస్టు చేయమని చట్టం ఆనాడు ఈనాడు పోలీసులకు చెప్పలేదు. ఇహపోతే ఏ అధికారికీ సంజాయిషీ నోటీసు ఇవ్వకుండా జైలుకు పంపే అధికారం చట్టం కల్పించలేదు. అయినప్పటికీ ఈ విధానాన్ని తప్పుగా అర్థంచేసుకోవడం వలననూ, లేదా కావాలని అధికారాన్ని దుర్వినియోగపరచడం వల్లనూ అనేకమంది జైళ్ళపాలవుతున్నారు.

శాంతిభద్రతల పరిరక్షణకోసం ఒక్కొక్కసారి ముందు జాగ్రత్తలు తీసు కోవలసిన అవసరం ఏర్పడుతుంది. ఈ ముందు జాగ్రత్తలైనా ఒకవ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు భంగం వాటిల్లకుండా అతన్ని ఏవిధంగాకూడా ప్రత్యక్షంగా కాని పరోక్షంగాకాని శిక్షించకుండా తగిన కట్టుబాట్లు చేయడం ద్వారా తీసుకోవలసి ఉంటుంది. అయితే ముందు జాగ్రత్తకోసం తీసుకొనే చర్యలే శాంతి భద్రతలు పరిరక్షించడానికి తీసుకొంటున్న చర్యలని చెబుతున్నారు. కాని ఈ చర్యలవల్ల శాంతిభద్రతల పరిరక్షణ అలావుంచి వ్యక్తి స్వేచ్ఛ కాలరాయబడుతోంది. అలాగని నేరం జరగనివ్వండి, శాంతి భద్రతలకు భంగంవాటిల్లనివ్వండి; ఆ తర్వాత చూసుకోవచ్చులే అనే వైఖరి కూడా సరైందికాదు. వీలైనంత వరకూ నేరం జరగకుండా నిరోధించడానికి వీలైన చర్యలు తీసుకోవలసిన అవసరముంది. దీనికి సంబంధించిన చట్టాలేమి చెబుతున్నాయో తెలుసుకుందాము.

క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ సెక్షన్ "107" క్రింద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటుకి ఒక వ్యక్తి ఏదైనా శాంతిభద్రతలకు భంగంకలిగించే అవకాశముందని సమాచార మందినప్పుడు ఆ వ్యక్తినించి శాంతిభద్రతలకు భంగంవాటిల్లకుండా ప్రవర్తిస్తానని హామీ ఎందుకు తీసుకోగూడదో తెలియజేయమని సంజాయిషీ నోటీసు జారీచేయవచ్చు. ఈ చట్టం యొక్క ఉద్దేశ్యం స్థానిక పోట్లాటలను నివారించటం. ఇది గతంలో జరిగిన నేరాలకి విధించే శిక్షకాదు. భవిష్యత్‌లో నేరం జరగకుండా చూడటానికి ఉద్దేశించిన చర్య. దీనిని ఎంత తప్పుడు పద్ధతుల్లో అమలుపరుస్తున్నారో ఈ ఉదాహరణచూస్తే మనకు స్పష్టమవుతుంది.

స్టూవర్టుపురానికి చెందిన కొందరు వ్యక్తులను అరెస్టుచేసి తీసుకువచ్చి వరంగల్ కోర్టులో కేసుపెట్టి వరంగల్ సెంట్రల్ జైల్లో రిమాండ్‌చేసారు. స్టూవర్టు

పురం గతంలో ఎప్పుడో సెటిల్‌మెంటు ఏరియాగా ఉండటం మూలాన అక్కడ నివసించే ప్రతిజీవి దొంగే అయివుంటాడని మనరాష్ట్రంలో పోలీసులకు పాతుకుపోయింది. రాష్ట్రంలో ఏ మూల దొంగతనం, దోపిడి జరిగినా స్టూవర్టుపురం వాళ్ళే చేసివుంటారని స్టూవర్టుపురం వెళ్ళి స్టాకులోవున్న వాళ్ళనెవరినైనా పట్టుకువచ్చి వాళ్ళే దొంగలని ఆరోపించి కోర్టులో హాజరు పరుస్తారు. ఎక్కువగా కష్టపడకుండా అసలు దర్యాప్తు అవసరంలేకుండానే ఇలా దొంగలని పుట్టించి పెంచిపోషిస్తుంది మన పోలీసు వ్యవస్థ. వరంగల్ సెంట్రల్ జైల్‌లో ఉన్న స్టూవర్టుపురం ఖైదీలని చూడటానికి వాళ్ళ భార్యా పిల్లలు ఊరూరు తిరిగి పోలీసుస్టేషన్లన్ని గాలించి చివరికి ఇక్కడకు చేరుకున్నారు. జైలు అధికారుల అనుమతితో వాళ్ళు తమ వాళ్ళను చూసుకోగలిగారు. వాళ్ళు జైలు ఆవరణలో ఉండగానే ఎక్కడినుంచో పోలీసులు గ్రద్దలలా వచ్చి వాళ్ళని అరెస్టుచేసి తీసుకుపోయారు. పోలీసుస్టేషన్లో ఏమేమి జరిగిందో మనకు తెలియదు. కాని వారం రోజుల తర్వాత వాళ్ళని తీసుకువచ్చి తహసిల్దారు ముందు హాజరు పరిచారు. పోలీసుల కోరిక మేరకు సెక్షన్ 107 క్రింద తహసిల్దారుగారు వాళ్లని పదిహేనురోజులు రిమాండ్‌చేసారు. ఇలా ప్రతి పదిహేను రోజులకి రిమాండ్ కాలం పెంచుతూ ఉండటం వలన వాళ్ళు మూడు నెలలపాటు గుట్టుచప్పుడుగాకుండా జైలులో ఉండిపోయారు.

ఒక వైపు నేరం చేసారో లేదో తేలకుండా, ఒక ఆరోపణపై మగవాళ్ళు జైలులో ఉన్నారు. మరోవైపు ఏ ఆరోపణాలేకుండా ఆడవాళ్ళు కూడా జైల్లో మగ్గిపోతున్నారు. అసలు అన్యంపున్యం తెలియని పసికందులు కూడా జైల్లోవుండిపోయారు.

మౌలికంగా ఈ చట్టం ఏ ఉద్దేశ్యం నెరవేరడానికి ఏర్పడిందో దానికి పూర్తి భిన్నంగా మాత్రమే పీళ్ల అరెస్టుగాని, రిమాండుగాని ఉందని మనకు స్పష్టమౌతోంది. వీళ్ళు ఏంనేరం చేసారు? ఎక్కడ శాంతిభద్రతలకు భంగం వాటిల్లే విధంగా నడుచుకున్నారు? ఏ ప్రాంతంవారు? ఈ ప్రాంతానికీ, వాళ్లకీ ఉన్న సంబంధం ఏమిటి? ఇక్కడ శాంతిభద్రతల పరిరక్షణకు సంబంధించి వాళ్ళబాధ్యత ఎంతవరకు? న్యాయంగానో అన్యాయంగానో జైళ్ళలో ఉండిపోయిన వాళ్ళ మొగాళ్లను చూసుకొనే హక్కులేదా? వాళ్ళకి న్యాయ సహాయం అందించడానికి వీలులేదా? ఆకాశంలో హరివిల్లులు చూసి అవి తమకోసమే అనుకొనే పసికందులకెందుకి జైలుశిక్ష? వాళ్ళేం పాపం చేశారని; ఏ నేరం చేసారని, ఏ ఘోరం తలపెట్టారని ఈ ఖైదు? ఆలోచించండి.

## సెక్షన్ 107 సి.ఆర్.పి.సి.

సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ పేరిట అనేక సందర్భాలలో శాంతి భద్రతలకు

భంగం వాటిల్లకుండాచర్యలు తీసుకోవచ్చు. వీటికి సంబంధించిన అంశాలు విడివిడిగా చర్చించి ఆ తర్వాత వాటిని అమలు పరిచే విధానం తదుపరి ఏర్పడే పరిణామాలు వివరిస్తాను. సెక్షన్ "107" సి.ఆర్.పి.సి.ని అమలుపరచడం పేరిట చట్టాన్ని ఎట్లా ఉల్లంఘిస్తున్నారో ఎలాంటి అక్రమాలకు పాల్పడుతున్నారో వివరించడం జరిగింది, సెక్షన్ '107' క్రింద చట్ట ప్రకారం ఏం చేయాలి?

ఒక ఊళ్లో విద్యార్థులు, లెక్చరర్లు సమ్మె చేస్తున్నారు. అక్కడ సమ్మె జరుగుతున్నప్పుడు పోలీసులు కల్పించుకొని విద్యార్థులను లెక్చరర్లను, లాఠీఛార్జీ పేరిట చితగొట్టారు. ఈ విషయంలో భవిష్యత్ కార్యక్రమము నిర్ణయించుకోవడానికి సమావేశము కానున్న తరుణంలో తహశీల్దారునుంచి "107" సి. ఆర్. పి. సి. షోకాజ్ నోటీసులు విద్యార్థి, అధ్యాపకుల నాయకులకి వచ్చాయి. మీరు అక్రమ సమావేశం ఏర్పాటుచేసి శాంతి భద్రతలకి భంగం వాటిల్లే విధంగా సమావేశం ఏర్పాటు చేయనున్నారని విశ్వసనీయంగా తెలిసింది. కాబట్టి, మీరు శాంతి భద్రతలకు భంగంవాటిల్లకుండా నడుచుకుంటామని హామీ ఎందుకివ్వకూడదో మార్చి 26లోగా తెలియజేయండి అని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ పంపిన నోటీసులో ఆదేశించబడింది. ఈ నోటీసు ఇవ్వడం వాస్తవానికి చట్టప్రకారం జరిగింది. అయితే శాంతిభద్రతల పరిరక్షణ విషయంలో వీళ్ల బాధ్యత ఎంతవరకు ఉంది? అనేది ప్రస్తుతం చర్చనీయాంశం కాదు. ఇహ పోతే అరెస్టుచేసి కోర్టులోహాజరు పరచకుండా ఉండటమే ఈ కేసులో విశేషం. సమాజంలో గౌరవనీయమైన స్థానంలో ప్రతి వాదులున్న కారణంగానో లేక ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటు గారికి చట్టం తెలిసి ఉంటం మూలానో ఆయన కొంతవరకు న్యాయంగా వ్యవహరించారు. ఈ చట్టం గతంలో జరిగిన నేరాలకి గానూ నిందితుడిని శిక్షించాలనే ఉద్దేశ్యంతో ఏర్పడింది కాదు. ఇది భవిష్యత్తులో నేరాలు జరగకుండా ఉండటానికి గానూ టీకా మందుగా మాత్రమే ఉద్దేశించబడింది. ముందు జాగ్రత్తకోసం తీసుకొనే చర్యల విషయంలో మెజిస్ట్రేట్లు అనివార్యంగా చట్టాన్ని అమలు పరచవలసి వుంటుంది. ఒకవేళ ఆయన ఏ మాత్రమైనా అజాగ్రత్తగా వ్యవహరిస్తే ప్రజా శాంతి భద్రతలు అలావుంచి, వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హరించిన వాళ్లవుతారు. ప్రజా శాంతి భద్రతల పరిరక్షణ ఇమిడి వుంది కాబట్టి ఈ విషయంలో మెజిస్ట్రేట్లు వీలైనంత తొందరగా చర్యతీసుకోవలసి వుంటుంది. అలాగని ఎలాంటి ఆరోపణా లేకపోయినప్పటికీ ఇలాంటి విషయాల్లో ప్రతివాది నుంచి సత్ప్రవర్తన కలిగివుంటానని హామీ తీసుకోవడం సరయింది కాదు. ఈ సెక్షన్ క్రింద తీసుకొనే చర్యలపై పై కోర్టులకి అప్పీలుగాని, రివిజన్ గాని దాఖలు చేసుకొనే హక్కు ఉంది.

ఈ సెక్షన్ క్రింద చర్యతీసుకోవాలను కున్నప్పుడు మెజిస్ట్రేటుకి సమాచారం అంది వుండాలి. ఆ సమాచారాన్ని ఆధారం చేసుకొని మాత్రమే ఆయన వ్యవహరించ దానికి వీలువుంటుంది.

మెజిస్ట్రేట్‌కి సమాచారం ఏవిధంగానైనా చేరవచ్చు. ప్రైవేటు వ్యక్తులు అందచేసిన సమాచారం కూడా కావచ్చు. దీన్నిబట్టి పోలీసులు ఇచ్చిన సమాచారం ఆధారంగా మాత్రమే గాకుండా మనం పోలీసులే శాంతిభద్రతలకు భంగంవాటిల్లజేసే ప్రమాదమున్నట్లయితే లేదా ఇంకెవరైనా ఇలాంటి పనిజేయడానికి పూనుకొన్నట్లయితే మెజిస్ట్రేటుకు సమాచారం అందించవచ్చునని ఆ సమాచారం ఆధారంగా మెజిస్ట్రేటు గారు చర్యతీసుకొనే అవకాశం వుందని స్పష్టమౌతోంది. కేవలం పోలీసు రిపోర్టు ఆధారంగా మెజిస్ట్రేటు ఈ సెక్షన్ క్రింద చర్యతీసుకోవడానికి వీలులేదు. ఇంతకు ముందు చెప్పిన ఉదాహరణలో లెక్చరర్లకు, విద్యార్థులకు కూడా పోలీసులు శాంతి భద్రతలకు భంగంవాటిల్లజేసే అవకాశం వుందని మెజిస్ట్రేటుకు సమాచారం అందించే అధికారం వుంది. అంతేగాక ఎలాంటి విచారణ లేకుండా కేవలం పోలీసు రిపోర్టు నాధారం చేసుకొని మెజిస్ట్రేటు గారు చర్యతీసుకోవడం సరయింది కాదు.

ఈ చట్టంక్రింద ఇచ్చే సమాచారం ఒక కంప్లయింట్‌గా భావించడానికి వీలులేదు. ఇందులో ఎలాంటి ఆరోపణావుండదు. ఈ సెక్షన్ క్రింద సమాచారం అందించేటట్లయితే తప్పుడు కేసు బనాయించారన్న ఆరోపణపై చర్య తీసుకోవచ్చునా లేదానన్న విషయంలో వివాదాస్పదమైన తీర్పులు వచ్చాయి. కొన్ని కోర్టులు అవునని, కొన్ని కోర్టులు కాదని తమ తీర్పులో పేర్కొన్నాయి. ఈ సెక్షన్ క్రింద సమాచారం ఇచ్చినప్పుడు పరువునష్టం దావా వేయడానికి వీలులేదు.

ఒక వ్యక్తి శాంతిభద్రతలకి భంగం వాటిల్లజేయడానికి అవకాశమున్నపుడు లేదా ప్రజా శాంతి భంగపరిచే ప్రమాదమున్నప్పుడు మాత్రమే ఈ చట్టం క్రింద చర్యతీసుకోవచ్చు. నేరుగా ఆ వ్యక్తి ప్రజాశాంతి భంగపరచడానికి ప్రయత్నం చేయాల్సిన అవసరం లేదు. పరోక్షంగా ప్రయత్నించాడన్నా సరిపోతుంది. అక్ర మానికి పాల్పడే అవకాశముందన్నప్పుడు కూడ ఈ చట్టం కింద చర్యతీసుకోవచ్చు. ఈ చట్టం క్రింద జామీనుతీసుకోదలుచుకొంటే నిర్దిష్టమైన సాక్ష్యాధారాలు ఉన్నప్పుడు మాత్రమే సాధ్యపడుతుంది. క్రిమినల్ కేసుల్లో నిందితులు నిర్దోషులని రుజువైనప్పటికీ వాళ్లు అనేక కేసుల్లో వాది ప్రతివాదులుగా కొనసాగినట్లయితే భవిష్యత్తులో శాంతిభద్రతలు కాపాడటానికి హామీ కోరే అధికారం మెజిస్ట్రేటుకు వుంది. కేవలం ఒక వ్యక్తి శాంతి భద్రతలకు భంగం వాటిల్లజేసే అవకాశం వుందన్నంత మాత్రాన సరిపోదు. అతను శాంతిభద్రతలకి భంగం వాటిల్లే అవకాశమున్న అక్రమ చర్యకి పాల్పడతాడన్నపుడు

మాత్రమే ఈ చట్టం కింద చర్య తీసుకోవాలి. ఎలాంటి చట్ట విరుద్ధమైన చర్యలకి పాల్పడకుండా ఊరేగింపులో పాల్గొన్నప్పుడు ఈ చర్య తీసుకోటానికి వీలులేదు.

మెజిస్ట్రేటు గారు సమాచారం అందినప్పుడు చర్యతీసుకోడానికి సరిపడా ఆధారాలున్నాయనుకొంటే షోకాజ్ నోటీసు జారీచేయాలి లేదా సమాచారాన్ని నిరాకరించాలి.

ఈ చట్టం క్రింద మెజిస్ట్రేటుగా పోలీసునుంచి గాని తన క్రింది అధికారి నుంచి గాని రికార్డు తెప్పించుకునే అధికారముంది. ఎలాంటి విచారణాలేకుండా కేవలం పోలీసు రిపోర్టు ఆధారంగా మెజిస్ట్రేటు గారు చర్య తీసుకోడానికి వీలులేదు. సమాచారం అందిన తర్వాత మెజిస్ట్రేటుగారు తప్పనిసరిగా షోకాజ్ నోటీసు జారీ చేయాలి. శాంతి భద్రత పరిరక్షించడానికి హామీ ఇవ్వవలసిందిగా షోకాజ్ నోటీసు లేకుండగా మెజిస్ట్రేటు గారు ఆదేశించేట్లయితే అది చట్ట విరుద్ధం. మిగతా క్రిమినల్ కేసులలో మాదిరిగానే ప్రాసిక్యూషన్ సమాచారంయొక్క నిజానిజాల్ని నిరూపించవలసి వుంటుంది. అంతే కాని షోకాజ్ నోటీసుకు సమాధానంగా ప్రతివాది తను నిర్దోషినని నిరూపించాలనడం సరయింది కాదు. హామీ కోరినపుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటు గారు జామీనుతో కాని జామీను లేకుండా కానీ హామీ కోరవచ్చు.

## సెక్షన్ 108, 109 సి.ఆర్.పి.సి

ఒక వ్యక్తి రోడ్డు మీద వెడుతున్న జనానికి కరపత్రాలు పంచుతున్నాడు. ఆయన వూళ్లో చాలా పేరున్న మనిషి కావడం మూలాన ఆ కరపత్రాలు తీసుకొని అందరూ చదువు కొంటున్నారు. అందులో ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాశారు. ఈ ప్రభుత్వం ఇలాగే కొనసాగేట్లయితే ప్రజలకి ఒరిగేది ఏమీ లేదని అందులో పేర్కొన్నారు. ఈ కరపత్రాలు అనేక చోట్ల అనేక మంది పంచారు. మర్నాడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ నించి కరపత్రాలు పంచిన వారందరికీ నోటీసులు వచ్చాయి. అందులో సత్ప్రవర్తన కలిగివుంటామని మీరెందుకు హామీఇవ్వకూడదో తెలియచెయ్యాలని ఆదేశించారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా కరపత్రాలు పంచడం నేరమా? సత్ప్రవర్తన కల్గివుండక పోవడం అవుతుందా? దానికి గానూ ఒక వ్యక్తి చట్టం దృష్టిలో నేరస్తుడు అవుతాడా? ఇలా మెజిస్ట్రేట్‌గారు హామీ కోరడం శిక్ష విధించడంతో సమానమా?

సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో భాగంగానే సెక్షన్ 108 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ క్రింద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి ఇలా హామీ కోరే అధికారం వుంది. ఒక వ్యక్తి నుంచి సత్ప్రవర్తన కలిగి వుంటామని హామీ కోరినంత మాత్రాన అతన్ని నేరస్తుడుగా

భావిస్తున్నట్లుగా గానీ అతనికి శిక్ష విధించినట్టుగా కాని అనుకోవడానికి వీలులేదు. ఇలాంటి హామీలు తీసుకుని తద్వారా ముందుముందు అతని వల్ల ఎలాంటి శాంతి భద్రతలకి భంగం వాటిల్లకుండా చూసుకోవడం కోసమే. ఏ వ్యక్తైనా మౌఖికంగా కానీ రాత పూర్వకంగా కానీ మరే ఇతర పద్ధతుల ద్వారా గానీ చట్టబద్ధంగా ఏర్పడ్డ ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రయత్నించినా, అందుకు తోడ్పడ్డా, లేక మతా తగాదాలు తలెత్తడానికి తోడ్పడ్డా ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకోవచ్చు.

ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకోవడం విషయంలో విచారణ జరుగుతుంది. కాబట్టి గతంలో జ్యుడీషియల్ మెజిస్ట్రేట్‌కి మాత్రమే అధికారాలు వుండేవి. అయితే 1980లో ఈ అధికారాన్ని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి కల్పించడం జరిగింది. ఈ చట్టం క్రింద ఒక వ్యక్తిపైన చర్య తీసుకోదల్చినప్పుడు ఆ వ్యక్తి ఉద్దేశ్యపూర్వకంగా పైన పేర్కొన్న చర్యల్ని ప్రచారం చెయ్యడానికి పూనుకొని వుండాలి లేదా ఇతరులని అలాంటి పనులు చేయడానికి పురికొల్పడం, లేదా అతను స్వయంగా అలాంటి పనులు చెయ్యడానికి పూనుకోవడమో జరిగి వుండాలి. ఈ ప్రచారం రాత పూర్వకంగానో, మౌఖికంగానో ఉండాల్సిన అవసరం లేదు. అది గ్రామ్‌ఫోన్‌లద్వారా, టేప్‌రికార్డుల ద్వారా చేసినా సరిపోతుంది. ఈ చట్టం కింద చర్య తీసుకోవాలంటే ఉద్దేశ్యపూర్వకంగా చేసే చర్య అయి వుండాలి. అంతేకాక అది రాజద్రోహ నేరానికి పాల్పడే అవకాశం వున్నప్పటికీ సరిపోతుంది. మతా తగాదాల్ని పురికొల్పే ప్రచారాలు కూడా ఈ పరిధిలోకి వస్తాయి.

న్యాయమూర్తుల మీద ఉద్దేశ్యపూర్వక దుష్ప్రచారానికిపాల్పడే పనులు చేసినప్పుడు, న్యాయమూర్తులను బెదిరించడానికి పాల్పడినప్పుడు కూడా ఈ చట్టం క్రింద చర్య తీసుకోవచ్చు. ఈ చట్టం క్రింద చర్య తీసుకునే ముందు మెజిస్ట్రేట్ గారు చర్య తీసుకోవడానికి తగిన ఆధారాలు ఉన్నాయని విశ్వసించాలి. అలా నిర్ణయించుకోవడానికిగాను ఆయన తన ముందు రికార్డులను క్షుణ్ణంగా పరిశీలించాల్సి వుంటుంది.

ఈ చట్టం క్రింద ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్లపై చర్య తీసుకోవడానికి వీలు లేదు. ఎందుకంటే వాళ్ళు ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ బుక్స్ చట్టం పరిధిలో వ్యవహరిస్తారు. కాబట్టి ఒకవేళ చర్య తీసుకోదలిస్తే రాష్ట్ర ప్రభుత్వ అనుమతి తీసుకోవలసి ఉంటుంది.

## సెక్షన్ 109 సి.ఆర్.పి.సి

రామయ్య వున్నట్టుండి అకస్మాత్తుగా మనుషుల్లోంచి తప్పుకున్నాడు. ఇది

జరగడానికి ముందు అతన్ని గోపాలక్రిష్ణయ్య బాకీ తీర్చలేదన్న కారణంగా ఘోరంగా అవమానించాడు. ఈ అవమానాన్ని భరించలేక తాను గోపాలక్రిష్ణయ్యను హత్య అయినా చేస్తానని లేదా తాను ఆత్మహత్య అయినా చేసుకుంటానని ప్రతిజ్ఞ చేశాడు. ఆ తర్వాత రామయ్య ప్రవర్తనలోనే ఓ పెద్ద మార్పొచ్చింది. అతను తన స్థిరాస్తులన్నింటినీ అమ్మేశాడు. రామయ్య ఆత్మహత్య చేసుకున్నా, హత్యచేసినా ఒక నేరానికి పాల్పడ్డ వాడే అవుతాడు. అయితే దీన్ని నివారించడానికి చట్టంలో ఎలాంటి మార్గం లేదా?

సెక్షన్ 109 సి. ఆర్. పి. సి. క్రింద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఇలాంటి సమాచారం అందిన వెంటనే నోటీసు ఇవ్వవచ్చు. ఆ నోటీసులో సత్ప్రవర్తన కల్గి వుంటామన్న హామీ ఎందుకు ఇవ్వకూడదో తెలియ చెయ్యమని ఆదేశిస్తారు. సాధారణంగా ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకున్నప్పుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ చాలా జాగ్రత్తగా వ్యవహరించాల్సి వుంటుంది. ఈ చట్టం క్రింద చర్య తీసుకోదలచినప్పుడు ఒక వ్యక్తి నేరం చెయ్యాలన్న ఉద్దేశ్యంతో తన అస్థిత్వాన్ని మెజిస్ట్రేట్ పరిధి నుంచి లేకుండా చేసుకుంటున్నాడని స్పష్టమైన సమాచారం అందినప్పుడు మాత్రమే ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకోవచ్చు.

ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకున్న తర్వాత చేసిన నేరానికి విచారణ జరుగుతుందన్న కారణంగా ముందు జాగ్రత్తచర్య తీసుకోగూడదు అనడం సరైందికాదు. ఒక కాగ్నిజబుల్ నేరం చెయ్యాలన్న ఉద్దేశ్యంతో తన అస్థిత్వం లేకుండా చేసుకోడానికి ప్రయత్నించినప్పుడు మాత్రమే ఆ వ్యక్తిపై ఈ చర్య తీసుకోవాలి. అయితే చర్య తీసుకోవాలా, లేదా అన్న విషయం పూర్తిగా ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఇష్టా ఇష్టాలపై ఆధారపడి వుంటుంది. జామీన్‌తోగానీ, జామీను లేకుండా గానీ హామీ ఇవ్వవలసిందని ఆదేశించే అధికారం కూడా మెజిస్ట్రేట్‌కి వుంది.

## సెక్షన్ 110 సి.ఆర్.పి.సి.

వీరయ్య లోకల్ బస్‌స్టాప్ దగ్గర 'దొంగలున్నారు జాగ్రత్త' అని హెచ్చరించడానికి తగిలించిన పటానికి అడ్డంగా, ఆ పటంలోవున్న దొంగలు కనిపించకుండా నిల్చున్నాడు. అతను ఏదో బస్ కోసం ఎదురుచూస్తున్నట్లుగా అటూ ఇటూ చూస్తున్నాడు. బసులు వస్తున్నాయి, వెడుతున్నాయి కానీ అతనుమాత్రం ఆ చోటినించి కదలకుండా నిల్చున్నాడు. అతనిప్రక్కనేవున్న ఎంక్వైరీ కౌంటర్‌దగ్గరకి చాలామంది ఫలానా బస్ ఎప్పుడు వచ్చి ఎప్పుడు బయలుదేరుతుందని అడిగి తెలుసుకుంటున్నారు. అతనడ్డుగా నిల్చున్నాడని కొందరు విసుక్కుంటున్నారు కూడా. అయినా అతను అక్క-

డ్నించి కదలడం లేదు. చివరికి జనంతో కిక్కిరిసిపోయివున్న బస్ అతని దృష్టిని ఆకర్షించింది. అప్పుడు అతను ఆ బస్‌లో ఎక్కబోయే వాడిలా సంధించిన బాణంలా పరుగెత్తాడు. ఎంక్వైరీ కౌంటర్ ముందర వున్న ఒకతని దృష్టి 'దొంగలున్నారు. జాగ్రత్త' అన్న బోర్డుమీద పడింది అందులో వీరయ్య ఫోటోని పోల్చుకొని తన డబ్బు, వస్తువులూ పోక పోయినప్పటికి "దొంగ దొంగ" అని అరిచాడు. ఇది విన గానే అతని చుట్టూ చాలామంది జనంపోగయ్యారు. "ఏం జరిగింది, ఏం జరిగిందని" అడిగారు. ఏదో దొంగతనం చెయ్యాలన్న వుద్దేశంతో ఒక దొంగ దొంగలున్నారు జాగ్రత్త అన్నపటానికి అడ్డంగా నిల్చున్నాడు అని చెప్పేడతను. ఈ హడావిడి అంతా చూసి అప్పుడే అక్కడికి వచ్చిన ఒక కానిస్టేబుల్ "ఎక్కడున్నాడు వాడు" అని అడి గాడు జబర్దస్తీగా. అతను బస్ ఎక్కే జనం మధ్యలో వున్న వీరయ్యను చూపించాడు. కానిస్టేబుల్ లాఠీ వూపుతూ బూట్లు టకటక లాడిస్తూ ఆ బస్ దగ్గరకి వెళ్ళాడు. దిగే జనానికి అడ్డుపడుతున్న ఎక్కేజనం మధ్యనవున్న వీరయ్య దిగటానికి ప్రయత్నిస్తున్న ముసలావిడ దగ్గర్నించి ఒక బ్యాగ్ అందుకొన్నాడు. ఇది చూడగానే కానిస్టేబుల్ వీరయ్యని జుట్టుపట్టుకొని ఇవతలకి లాగి బరాబరా ఈడ్చుకు పోసాగాడు. నేను దొంగ తనంచెయ్యలేదు, ఆ ముసల్ది మా అమ్మ అని ఎంతమొత్తుకున్నా వినిపించుకోలేదు. కాని స్టేబుల్ మాత్రమే కాదు చుట్టుప్రక్కల వాళ్ళు కూడా ఎవరూ అతని మాటలు పట్టించు కోలేదు. బస్సు దిగిన ముసల్ది మాత్రం తన కొడుకుని అన్యాయంగా పట్టుకున్నందుకు ఏడ్చింది. వీరయ్య దొంగతనం చెయ్యలేదని అర్థం అయినా పోలీసులు అతన్ని విడిచి పెట్టలేదు. అలవాటు పడ్డ నేరస్తుడిగా చిత్రించి అతన్ని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ముందు హాజరు పర్చారు. ప్రపంచంలో కొందరు దోపిడీలు చేసి, దొంగతనాలు చేసి, ఫోర్జరీలు చేసి, మోసాలు చేసి జీవిస్తూ వుంటారు. వీళ్లలో ఎవరైనా పట్టుబడి శిక్షింపబడితే మారి పోయి మంచి వాళ్ళుగా తయారౌతారు. కొందరు ఎన్ని శిక్షలు అనుభవించినా కుక్క తోక వంకరన్నట్లు గానే వుండిపోతారు. ఇలా ఒక అలవాటుగా నేరాలు చేసే వారినించి సమాజాన్ని కాపాడటానికి ముందు జాగ్రత్త చర్యగా సత్ ప్రవర్తనకి హామీ తీసుకోవడానికి చట్టం అధికారం కల్పిస్తోంది.

సెక్షన్ 110 సి.ఆర్.పి.సి. కింద అలవాటుపడ్డ నేరస్తులు ఎవరైనా తన అధికార పరిధిలో వున్నారని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటుగార్కి సమాచారం అందినట్లైతే వారి నుంచి ఎందుకు జామీనుతో హామీ కోరరాదో తెలియచెయ్యమని అడుగుతూ నోటీసు జారీ చేయవచ్చు.

ఈ సెక్షన్ యొక్క ఉద్దేశం సమాజాన్ని ప్రమాదకరమైన నేరస్తుల నించి కాపాడటం. అలాగనే నేరం జరగక ముందే అలవాటు పడిన నేరస్తున్ని శిక్షించడానికి

వుద్దేశించబడిందనుకోవడానికి వీల్లేదు. భవిష్యత్తులో అతను నేరం చెయ్యకుండా నివారించడానికి వుద్దేశించబడింది. చెడు నడపడి కలిగిన వార్ని జైళ్లలో తొయ్యడానికి ఈ చట్టం వుద్దేశించబడలేదు.

వ క్లమీద తగినంత ఒత్తిడి తీసుకువచ్చి భవిష్యత్తులో నేరం చెయ్యకుండా చూడాలన్నదే ఈ సెక్షన్ యొక్క లక్ష్యం. అలాగని గతంలో ఏ ఆరోపణలపైన అయితే విచారణ జరిగిందో తిరిగి అదే ఆరోపణలపై ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకోవడానికి లేదు. అందుకని ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకొనేప్పుడు మెజిస్ట్రేటుగారు జాగ్రత్తగా వ్యవహరించాల్సి వుంటుంది.

అంతేకాక ఒకసారి ఈ సెక్షన్ క్రింద జామీను కట్టలేక ముద్దాయి జైలుకు వెళ్ళి వచ్చిన పక్షంలో తిరిగి ఇదే సెక్షన్ క్రింద చర్య తీసుకోవడం సరైంది కాదు. ఒక వ్యక్తి సత్ ప్రవర్తన కలిగి వుండటానికి కావల్సిన అవకాశం కూడా కల్పించే బాధ్యత చట్టంమీద, న్యాయస్థానాల మీద వుంటుందని మర్చి పోరాదు. సెక్షన్ 110 సిఆర్‌పిసి క్రింద చర్య తీసుకున్నప్పుడు ముద్దాయి నించి మెజిస్ట్రేటు తప్పని సరిగా జామీను తీసుకోవల్సి వుంటుంది.

ఈ సెక్షన్ క్రింద మెజిస్ట్రేటు చర్య తీసుకొనే ముందర ఆయనకి తప్పని సరిగా తన అధికార పరిధిలో ఒక అలవాటు పడిన నేరస్థుడు వున్నాడని సమాచారం అందివుండాలి. ఇలా సమాచారం వచ్చినప్పుడే కదా ఆయన నేరం నివారించడానికి ఏమైనా చెయ్యగలుగుతారు. ఈ సమాచారం ముద్దాయికి తెలియజేసిన తరువాతే అతనిని సంజాయిషీ కోరాలి. తన కందిన సమాచారాన్ని గుడ్డిగా నమ్మకుండా అందులో ఎంతవరకూ నిజం వుందో తెలుసుకోవడానికి న్యాయబద్ధంగా విచారణ జరపాలి. ఒక వేళ అవసరం అనుకుంటే ప్రమాణం చేయించిన తరువాతే సమాచారం తీసుకోవాలి.

ఈ సెక్షన్ క్రింద అలవాటుపడ్డ దొంగలపై ముందు జాగ్రత్త చర్య తీసుకోవచ్చు. అలవాటుపడిన దొంగ, దోపిడీ దారులు అంటే గతంలో అనేక సార్లు దొంగతనాలు చేసివుండి అవకాశం వచ్చినప్పుడు తిరిగి దొంగతనం చెయ్యడానికి సిద్ధంగా వున్నవారని అర్థం. ఈ చట్టం క్రింద ఫోర్జరీ చెయ్యడానికి సిద్ధపడ్డ వారిపైన కూడా చర్యతీసుకోవచ్చు.

కొందరు అలవాటుగా దొంగ సొత్తు వుంచుకుంటూ వుంటారు. చౌకలో వస్తే ఎందుకు కాదనాలనో ఏమో అలాంటి వారిపైన కూడా ఈ సెక్షన్ క్రింద ముందు జాగ్రత్త చర్య తీసుకొనే అధికారం ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటుకు వుంది. మరికొందరు అలవాటుగా దొంగల్ని రక్షించడానికి ప్రయత్నిస్తారు. లేదా దొంగతనం కప్పి పుచ్చడానికి ప్రయత్నిస్తారు. అలాంటి వారి మీద కూడా ఈ సెక్షన్ క్రింద

చర్య తీసుకునే ప్రమాదం లేకపోలేదు.

కేవలం అలవాటు పడిన దొంగలకేకాక మిగతా నేరస్థుల విషయంలో కూడా ఈ సెక్షన్ క్రింద ముందు జాగ్రత్త చర్య తీసుకుంటారు. అలవాటుగా శాంతికి భంగం కలిగించే వారిపైన కూడా ఈ చట్టం క్రింద చర్య తీసుకోవచ్చు. అంటే ఎవరైనా పోరాటమే అన్ని సమస్యలకి పరిష్కార మార్గమని వుపన్యసించినప్పటికి వారిపై ఈ సెక్షన్ క్రింద చర్య తీసుకునే అధికారం మెజిస్ట్రేట్‌లకి వుంది.

క్రూరమైన ప్రవృత్తి కలిగిన వాళ్ళుకూడా ఈ చట్టం యొక్క పరిధిలోకి వస్తారు. తన చుట్టు ప్రక్కల వారి శరీరానికి, ఆస్తికి భద్రత లేకుండా ఎవరైతే చేస్తారో అతన్ని ప్రమాదకరమైన నేరస్థుడుగా భావిస్తారు.

## సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ అమలు

సెక్షన్ 107, 108, 109, 110 సి.ఆర్.పి.సి. ల క్రింద ముందుజాగ్రత్త చర్యలు ఏయే పరిస్థితుల్లో తీసుకోవచ్చునో ఆయా సెక్షన్‌లకి సంబంధించిన వ్యాసాల్లో వివరించడం జరిగింది. ఏ పరిస్థితుల్లో ముందు జాగ్రత్త తీసుకోవచ్చునో తెలిసినంత మాత్రాన సరిపోదు. ఈ సెక్షన్‌ల క్రింద చర్యతీసుకోవడం పేరిట అనేక అక్రమాలు, అన్యాయాలు జరుగుతున్నాయి. కాబట్టి వీటిని నివారించడానికి మెజిస్ట్రేట్లు అవలంబించాల్సిన పద్ధతులు ఏమిటో కూడా తెలుసుకోవల్సిన అవసరం వుంది. చట్టాన్ని అమలుపర్చే వాళ్ళు అక్రమాలకి పాల్పడినా, చట్టం ఉల్లంఘించే వాళ్ళు అసలు తమ హక్కులేమిటో తెలుసుకోవడం వల్ల వాటిని పరిరక్షించుకోవడానికి ప్రయత్నించవచ్చు. అందుకనే సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో మెజిస్ట్రేట్లు అవలంబించాల్సిన విధానం గురించి వివరించాల్సి వచ్చింది.

సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ తీసుకోదలచినప్పుడు మెజిస్ట్రేటు గారు తనకు వచ్చిన సమాచారాన్ని వివరిస్తూ, తను ఎందుకు సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ నిర్వహిస్తోందో తెలియజేస్తూ, సంజాయిషీ కోరడమే కాక, తను ఎంత జామీను కోరవలసిందీ జామీనుదార్లు ఏ రకమైన వాళ్ళు అయిఉండాల్సిందీ తెలియజేస్తూ సంజాయిషీ నోటీసు జారీచెయ్యాలి. అంటే ఈ సంజాయిషీ నోటీసులో అనివార్యంగా మెజిస్ట్రేటుకు వచ్చిన సమాచారాన్ని స్థూలంగా వివరించాల్సి ఉంటుంది. దీనివల్ల ముద్దాయి తనమీద వచ్చిన ఆరోపణలపై సంజాయిషీ ఇవ్వడానికి సిద్ధమై రావడానికి అవకాశం ఏర్పడుతుంది.

జామీను ఎంత ఉండాలనేది కూడా ఈ నోటీసులో తెలియజేస్తారు. ముద్దాయి హోదాని బట్టి జామీను నిర్ణయించాలి. అంతేకాని అతను తేలేనంత పెద్ద

మొత్తంలో జామీనుకోరేట్లైతే పరోక్షంగా అతన్ని శిక్షించడమే అవుతుంది. జామీను దార్లు ఏఏ వర్గానికి చెందిన వాళ్లైఉండాలి. వాళ్ళు ఏ తరగతికి చెందిన వాళ్లై వుండాలి అన్న విషయంలో మెజిస్ట్రేటు గారు తన సొంత అభిప్రాయం ప్రకారం నిర్ణయించ కూడదు. ముద్దాయిని బట్టి సత్ప్రవర్తన, పలుకుబడివున్న భూస్వాములనో మంచి గృహస్తులనో జామీనుదార్లుగా కోరవచ్చు.

కేసును బట్టి ఒకరిద్దరు ముద్దాయిల మీద జాయింట్‌గా కూడా ఈ రకమైన ఆదేశాల్ని జారీచేసే అధికారం మెజిస్ట్రేట్‌కి ఉంది. జైలులోవున్న ముద్దాయిలపైన కూడా ఈ రకమైన ఆదేశాలు జారీచెయ్యవచ్చు. ముద్దాయి దీర్ఘకాలంగా జైల్లోవున్న పక్షంలో అతన్నుంచి సమాజానికి ఏరకమైన ప్రమాదం వుండే అవకాశం లేదు కనుక అతని మీద ఈ ఆదేశాలుజారీచెయాల్సిన అవసరం లేదు. కానీ కొద్దికాలం మాత్రమే జైల్లో వుండి బయటపడే అవకాశంవున్న నిందితుల విషయంలో మాత్రం ఈ ఆదేశాలు జారీచేసే అధికారం వుంది. ఈ ఆదేశాల్ని పబ్లిక్ డాక్యుమెంట్స్‌గా భావిస్తారు. షోకాజ్ నోటీసు ఎవరిమీదనైతే జారీ చెయ్యాల్సి వుందో అతను ఏ కారణం చేతనైనా కోర్టులో హాజరైతే అతనికి నోటీసు లోని విషయాలు చదివి వినిపించి, అర్థమయ్యేలా మెజిస్ట్రేటు గారు చెప్పాలి.

కోర్టు ఆర్డర్ తీసుకొని కూడా కోర్టుకి హాజరుకాని ముద్దాయిల విషయంలో అతని హాజరు గురించి సమన్స్ ఇస్తారు. ముద్దాయి కనుక జైల్లో వుండేట్లైతే అతన్ని వారెంట్ ఇచ్చి పిలిపించి, అతన్నుంచి సంజాయిషీ కోరవచ్చు. కొన్ని సందర్భాల్లో ముద్దాయిని అరెస్టుచేస్తే తప్ప నేరాన్ని నివారించలేరు. అలాంటప్పుడు ముద్దాయి అరెస్టు గురించి కూడా మెజిస్ట్రేటుకి వారెంట్ ఇచ్చే అధికారంవుంది. అయితే ఇలా వారెంట్ జారీచేసే ముందు ముద్దాయిని అరెస్టు చెయ్యని పక్షంలో ముద్దాయిని అరెస్టు చెయ్యందే నేరం నిరోధించడం సాధ్యంకాదని మెజిస్ట్రేటు సహేతుకంగా విశ్వసించాలి. అంటే వెంటనే శాంతిభద్రతలకి భంగం వాటిల్లే అవకాశముండాలి. అరెస్టుచేస్తేవినా, శాంతి భద్రతలు కాపాడటం సాధ్యంకాదన్న అభిప్రాయం సహేతుకంగా ఏర్పర్చుకోవాలి. ఈ పరిస్థితుల్లో మాత్రమే అరెస్టు వారంట్ జారీ చెయ్యవచ్చు. అయితే ఏ పరిస్థితుల్లో ఏ కారణం చేత తను అరెస్టు వారెంట్ ఇవ్వవలసి వచ్చిందో మెజిస్ట్రేటు గారు తమ ఆదేశంలో స్పష్టంగా పేర్కొవలసి వుంటుంది. ముద్దాయి మెజిస్ట్రేటు గారి అధికార పరిధిలో వున్నప్పుడు మాత్రమే అతని అరెస్టు గురించి వారెంట్ ఇచ్చే అధికారం వుంటుంది ఇలా ఎవరినైనా అరెస్టు చేసి తీసుకొచ్చినప్పుడు అతన్ని రిమాండ్ చెయ్యడానికి వీల్లేదు. ఇలా వారెంట్ కానీ సమన్స్‌కానీ జారీ చేసినప్పుడు దానితో పాటు షోకాజు నోటీసుకు సంబంధించిన ఆదేశాలు కూడా ముద్దాయికి అందేలా

చెయ్యాలి.

అసలు చట్టంలో ఎక్కడా ఎవరినైనా సరే అరెస్టు చెయ్యడానికి వారెంట్ ఇచ్చినా లేదా అతని మీద ఏదైనా ప్రొసీడింగ్స్ నడపదలచినా ఆ వ్యక్తికి తనకు వ్యతిరేకంగా జరిగే ప్రొసీడింగ్స్ తెలియజేసే బాధ్యత వుంటుంది. ఇలా గనుక తెలియ జెయ్యని పక్షంలో అతను ఏం సంజాయిషీ ఇచ్చుకో గలుగుతాడు. సంజాయిషీ ఇచ్చుకో డానికి అవకాశం లేనప్పుడు విచారణ జరపకుండా ఒక మనిషిని శిక్షించడమే అవుతుంది.

సమన్లు జారీ చేసిన తరువాత వెంటనే సంజాయిషీ కోరడం కూడా సరైంది కాదు. జవాబు చెప్పుకోవడానికి తగినంత సమయం ఇవ్వాలి. అయితే ఈ నిబంధనని పాటించకపోవడం వలన చాలా మందికి అన్యాయం జరుగుతోంది. కొందర్ని పోలీసులు సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ క్రింద అరెస్టు చేసి కోర్టులో హాజరు పరుస్తారు.

మెజిస్ట్రేట్‌కి అతన్ని నిర్బంధించే అధికారం లేకపోయినా, నిర్బంధించి ఏదో ఒకరోజు తీరిగ్గా ముద్దాయిని ప్రశ్నించి వెంటనే సమాధానం చెప్పమని అడుగు తాడు. అలా అడిగినప్పుడు కోర్టులూ, పోలీసులూ, జైళ్ళూ అంటే వున్న భయం కారణంగా అతను కన్‌ఫ్యూజన్‌లో ఏదో ఒక సమాధానం చెప్పి అన్యాయానికి గురౌతాడు. అంచేత సంజాయిషీ కోరినప్పుడు ముద్దాయికి జవాబు చెప్పుకోవడానికి తగినంత సమయం కూడా ఇవ్వాల్సి ఉంటుంది.

ఒకవేళ సంజాయిషీ నోటీసు తాలూకు ఆదేశాలు సమన్లతో పాటు ముద్దాయికి పంపనంత మాత్రాన అది కేసుకు సంబంధించి తీవ్రమైన అభ్యంతరం కాదు. కానీ సమన్లు తీసుకొని ముద్దాయి కోర్టులో హాజరైనప్పుడు ఎందుచేత అతనిమీద ఈ ప్రొసీడింగ్స్ జరుగుతున్నాయో తెలియజేసి సమాధానం చెప్పడానికి కావల్సినంత సమయం ఇవ్వకపోతే మాత్రం అది చట్ట విరుద్ధం.

సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ విషయంలో సంజాయిషీ నోటీసుకు జవాబుగా ముద్దాయి కోర్టుకు హాజరు కానవసరం లేకుండా మినహాయింపు ఇవ్వవచ్చు అతని తరపున అతని ప్లీడరు హాజరై సమాధానం చెప్పే అవకాశం వుంది.

## సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ విచారణ

"నీవు ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాసిన కరపత్రాలు పంచుతున్నావనీ, అట్టి కరపత్రాలవల్ల చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వాన్ని ప్రజలుకూలదోసే ప్రమాదం ఉందికాబట్టి నీ ప్రవర్తన శాంతి భద్రతలకు భంగం వాటిల్లజేసేదిగావుంది అని నాకు

సమాచారం అందింది. నీవు ఈ విషయంలో సంజాయిషీ చెబుతూ వెయ్యిరూపాయలకు ఎందుకు జామీను ఇవ్వకూడదో ముఖతా కానీ ప్లీడరుద్వారా కాని ఈ నెల పదో తారీకు నాటి ఉదయం నా ముందు సమాధానం చెప్పగలవు" అన్న ఆదేశాలు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ నుంచి వెంకట్రావుకు అందాయి. మెజిస్ట్రేటు గారికి అందిన సమాచారంలోని నిజానిజాలు ఎంతవరకు వున్నాయో పరిశీలించకుండా కేవలం అందిన సమాచారం ఆధారంగా ఈ ఆదేశాలు జారీ చెయ్యడం ఏమిటి? ఇలా ఆదేశాలు జారీ చెయ్యడం అంటే మెజిస్ట్రేటుగారు చట్టబద్ధంగానే వ్యవహరించారని అనుకోవాలి.

ఇలా ఆదేశాలు జారీ అయిన తరువాత ముద్దాయి కనుక మెజిస్ట్రేటు ముందు హాజరై ఈ ఆదేశంలో పేర్కొన్న విషయాన్ని ఆమోదించక పోయేట్లయితే మెజిస్ట్రేటు గారు సాక్ష్యాధారాలు తీసుకొని విచారణ జరుపుతారు. అయితే చాలాసార్లు ముద్దాయిని అరెస్టు చేసి ఏ విచారణా లేకుండా జైల్లో పడేస్తున్నారు కాబట్టి ముద్దాయి వెనుకా ముందూ ఆలోచించకుండా ఎలాగొలా జైల్లోంచి బయటపడాలని మెజిస్ట్రేటుగారు ఆదేశాలు చదివి వినిపియ్యగానే కిక్కురుమనకుండా ఆమోదిస్తున్నారు. అందుచేత మెజిస్ట్రేటు గారు ఆరోపణ చదివి వినిపించగానే దాన్ని ముద్దాయి ఆమోదించాల్సిన అవసరం లేదనీ, ఆమోదించని పక్షంలో విచారణ జరుపుతారని స్పష్టం చెయ్యాల్సిన అవసరం వుంది.

నిజం తెలుసుకోవడానికి వీలుగావుండే సాక్ష్యాల్ని మెజిస్ట్రేటు విచారణ జరుపుతారు. అదైనా ముద్దాయి ముందే ఆ సాక్ష్యాలు రికార్డు చేసుకుంటారు. సాక్షుల విచారణ వీలైనంత తొందరగా అవసరమైనంత మేరకు జరపాలి. దీనివల్ల విచారణ తొందరగా పూర్తి అవుతుంది. అంతేకాక మెజిస్ట్రేటుగారు శాంతి భద్రతలకు ప్రమాదం లేదనుకుంటే ముద్దాయినుంచి జామీను కోరకుండానే కేసు కొట్టివేయవచ్చు.

మెజిస్ట్రేటు నుంచి నోటీసు తీసుకోగానే ముద్దాయి కనుక జామీను ఇచ్చి సత్ప్రవర్తన కలిగి ఉంటానని బాండ్ కనుక రాసిస్తే అతను అతనిపై వచ్చిన ఆరోపణని ఆమోదించినట్లేనని సుప్రీంకోర్టు ఇటీవల స్పష్టం చేసింది. అయితే గతంలో చెప్పినట్లుగానే ముద్దాయి పైన వచ్చిన ఆరోపణల్ని అతనికి చదివి వినిపించి వివరించాల్సిన బాధ్యత మెజిస్ట్రేటుమీద ఉంటుంది. మెజిస్ట్రేటు ఈ పని చెయ్యకపోతే రివిజన్‌లో మొత్తం కేసు కొట్టెయ్యవచ్చు. మెజిస్ట్రేటు ఆదేశాల్ని అనుసరించి కోర్టుకి హాజరైన తరువాత ముద్దాయి నుంచి తక్షణం శాంతి భద్రతలకు ప్రమాదం ఉందని భావిస్తే మెజిస్ట్రేటుగారు అతన్ని జామీను ఇవ్వమనిగానీ, జామీను లేకుండా బాండ్ అయినా ఇవ్వమని గానీ ఆదేశిస్తూ మధ్యంతర ఉత్తర్వులు జారీ చెయ్యవచ్చు. ఈ ఉత్తర్వులు జారీచేసే ముందు ఆయన కేవలం తక్షణం శాంతి భద్రతలకి ప్రమాదం ఉందనుకుంటే సరిపోదు. అంతకు ముందు

ఆయన చట్ట ప్రకారం అన్ని పద్ధతుల్ని సక్రమంగా అవలంబించిందీ లేందీ చూసుకోవాలి. ఒక్కొక్కసారి ముద్దాయి జామీను తేలేని పరిస్థితి ఉండవచ్చు. అలాంటప్పుడు కానీ. ముద్దాయి బాండ్ ఇవ్వడానికి నిరాకరించినప్పుడు కానీ, ఆతన్ని జామీను తెచ్చి, బాండ్ ఇచ్చేవరకూ నిర్బంధించే అధికారం మెజిస్ట్రేటుకు ఉంది.

సెక్షన్ 110 సి. ఆర్. పి.సి కింద ప్రమాదకరమైన అలవాటు పడిన నేరస్తుల్నుంచి ముందుజాగ్రత్త చర్యగా జామీను తీసుకోవచ్చు. ఒక మనిషిని ప్రమాదకరమైన వాడిగా ఎట్లా గుర్తించగలం? దీనికి సంబంధించినంతవరకూ సాక్ష్యాధారాలు ఎట్లా సేకరించాలి? కొన్ని కొన్నిసార్లు కొందరి మీద అతను ప్రమాదకరమైన వ్యక్తి అని, దొంగ అనీ ఏ దొంగతనాలూ దోపిడీలూ చెయ్యకుండా ఎవరి కొంపలూ కూల్చకుండానే పుకార్లు ఉండవచ్చు. అంత మాత్రం చేత అతన్నుంచి జామీను కోరవచ్చునా? దురదృష్టవశాత్తు ఈ చట్టప్రకారం ఇలాంటి పుకార్లని కూడా సాక్ష్యాలుగా భావిస్తున్నారు. అంతేకాక పాత కేసులైతే పోలీసు రికార్డునే సాక్ష్యంగా భావిస్తారు. అదిగో పులి అంటే ఇదిగో తోక అనే మన సమాజంలో నిప్పులేనిదే పొగ రాదుకదా అనే సామెత కూడా వుంది. కాబట్టి ఏ ఆధారం లేకుండానే ఒకమనిషిని కేవలం పుకారుల ఆధారంగా ఈ చట్టంకింద దోషిగా చూపించవచ్చు. అంతేకాక పాత నేరస్తుడైతే అతనికి గతంలో పడిన శిక్ష కూడా సాక్ష్యాధారాలుగా పరిగణిస్తారు. కొన్నిసార్లు ఇద్దరి ముగ్గురి మీద ఒకే ఆరోపణ సమాచారం అందేట్లయితే వాళ్లంతా కలసికట్టుగా పనిచేస్తున్నారని అనుకున్నప్పుడు మెజిస్ట్రేటుగారు విడివిడిగా జరపకుండా ఒకేసారి విచారణ జరపవచ్చు. ఇలా విచారణ జరిపినప్పుడు మెజిస్ట్రేటు గారు జాగ్రత్తగా వ్యవహరించాల్సి ఉంటుంది. అనేకమంది ముద్దాయిలున్న కేసులో ఒకముద్దాయి కనుక కేసు ఒప్పుకున్నట్లైతే ఆ ఒప్పుకోలులో ఇతరులనికూడా తనతోపాటు ఆ నేరంలో భాగస్వాములని పేర్కొంటే అతని ఒప్పుదల మిగతా ముద్దాయిలకి వ్యతిరేకంగా ఉండే సాక్ష్యంగా భావిస్తారు.

సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో విచారణ ప్రారంభమైన ఆరు నెలల్లో పూర్తి విచారణ పూర్తి కాకపోతే కేసు కొట్టివేయాల్సి వుంటుంది. ఆరు నెలల తర్వాత కూడా ఏ పరిస్థితులలోనైనా విచారణ జరపాలనివుంటే దానికి తగిన కారణాలు రికార్డు చేయవలసివుంటుంది కేసు విచారణప్పుడు ముద్దాయి జైల్లో ఉండేట్టయితే విచారణ ఆరు నెలల్లో పూర్తి కానిపక్షంలో అతన్ని విడుదల చేయాలి. ఆరునెలల తర్వాత కూడా విచారణ కొనసాగినప్పుడు సెషన్సు కోర్టుకి దరఖాస్తుచేసుకుని కేసుకొట్టివేయమని కోరవచ్చు సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో విచారణ జరిపినందుకుగాను తప్పుడు కేసు బనాయించారన్న కారణంగా కేసువేయడానికి వీలులేదు. ఎందుకనంటే ఒక నిర్దిష్టమైన ఆరోపణపై విచారణ జరిపి శిక్షించడమనేది సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ ఉద్దేశంకాదు.

కేవలం ముందు జాగ్రత్తకోసమే సెక్యూరిటీ ప్రొసీడింగు నిర్వహిస్తారు.

విచారణ పూర్తయిన తర్వాత శాంతి భద్రతలను కాపాడటంకోసం కాని, సత్ప్రవర్తన కలిగివుండటం కోసంకాని బాండు తీసుకోవటం అవసరమని మెజిస్ట్రేటు భావించినప్పుడు జామీనులోకాని జామీను లేకుండా కాని బాండు ఇవ్వమని ముద్దాయిని ఆదేశించవచ్చు. ఇలా ఆదేశించడానికి ముందు విచారణలో తేలిన విషయాన్ని బట్టి తను ఏఏ కారణాలచేత ఇలాంటి నిర్ణయానికి వచ్చిందీ స్పష్టం చేయాల్సి వుంటుంది. ఇలా ఇచ్చే తుది ఆదేశాల్లో గతంలో తాను ఇచ్చిన ఆదేశంలో పేర్కొన్న జామీను కంటే ఎక్కువ జామీను కోరడానికి వీలులేదు. జామీను నిర్ణయించేటపుడు ముద్దాయి స్తోమత దృష్టిలో ఉంచుకోవాల్సి ఉంటుంది. ఒక్కొక్కసారి ముద్దాయి చేయబోయే పనులవల్ల జరిగే నష్టాన్ని దృష్టిలో ఉంచుకొని జామీను కోరడం సరైంది అనిపించవచ్చు.

## ముందుజాగ్రత్త జామీను

విచారణలో ముద్దాయి వల్ల ప్రమాదమేమీలేదని తేలేట్లయితే అతనిని జామీను అడగకుండా బాండు తీసుకోకుండా కేసు కొట్టివేస్తారు. ఆ సమయంలో ముద్దాయి జైల్లో వున్న పక్షంలో అతనిని విడుదల చేయమని మేజిస్ట్రేట్ ఆదేశాలు జారీచేస్తారు. సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో భాగంగా తీసుకొనే బాండులో అతని వల్ల శాంతి భద్రతలకి భంగం కలగదన్న హామీ వుంటుంది. కొన్నిసార్లు కేసునుబట్టి భవిష్యత్తులో నేరానికి పాల్పడనన్న హామీ తీసుకోవడం జరుగుతుంది.

జామీను తీసుకొనేటప్పుడు జామీనుదారు సరైన వ్యక్తికాదనుకుంటే జామీను తీసుకోవడానికి నిరాకరించవచ్చు. అయితే ఇలా జామీను నిరాకరించేటప్పుడు ప్రమాణం చేయించి తగిన విచారణ జరపాల్సివుంటుంది. లేదా తన క్రింద పనిచేసే సబార్డినేట్ మెజిస్ట్రేట్‌తోనైనా విచారణ జరిపించాల్సి వుంటుంది. విచారణ జరిపే మెజిస్ట్రేట్ జామీనుదారుకి, ముద్దాయికి నోటీసు ఇవ్వాలి. విచారణ పూర్తయిన మెజిస్ట్రేట్ ఏ వుద్దేశ్యంతో అయితే బాండు తీసుకొంటున్నారో ఆ వుద్దేశ్యం ఈ జామీనుదారు జామీను నిరాకరించే అధికారం మేజిస్ట్రేట్‌కు వుంది. అయితే జామీను నిరాకరించిన తరువాత మెజిస్ట్రేట్ ముద్దాయిని అనివార్యంగా సమను జారీచేసి గాని, వారెంట్ ఇచ్చిగాని కోర్టుకు పిలిపించాల్సి వుంటుంది.

ముద్దాయి జామీను తెచ్చుకోవడంలో విఫలమైనప్పుడు మెజిస్ట్రేట్ ఎంత కాలమువరకూ అతను సత్ప్రవర్తనకు హామీ ఇవ్వవలసివుంటుందో అంతకాలం వరకూ అతనిని జైల్లో వుంచవచ్చు. ముద్దాయి అంతకు ముందే జైల్లో వుండివుంటే ఆ కాల పరిమితి వరకూ అతనిని ఈ కేసులో కూడా నిర్భంధించమని ఆదేశించవచ్చు.

జామీను గడువునాటికి ముందుగానీ ముగిసే నాటికిగానీ ముద్దాయి జామీను తేలేని పక్షం లోనే మెజిస్ట్రేట్ అతనిని ఖైదుచేసే అధికారం వుంది. అంతేగాక బాండులో పేర్కొన్న గడువుకంటే ముందు ముద్దాయి నిబంధనలని ఉల్లంఘించేట్లయితే అతనిని అరెస్టుచేసి ఖైదుచేస్తారు. ఇక్కడొక అనుమానం వచ్చే అవకాశంవుంది. ముద్దాయి సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ సంబంధించిన బాండులో పేర్కొన్న నిబంధనలని ఉల్లంఘించేట్లయితే నేరానికి పాల్పడడమే అవుతుంది. అలాంటప్పుడు నేరం చేసినందుకు అనుభవించే శిక్షని సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో ఖైదులోవున్న కాలాన్ని వేరువేరుగా చూస్తారా? ఈ రెండింటిని సమానంగా పరిగణిస్తారు.

ఒక వ్యక్తిని సంవత్సర కాలంవరకు సత్ప్రవర్తన కలిగి వుంటానని హామీ ఇస్తూ జామీను ఇవ్వాలసిందిగా ఆదేశించినట్లయితే ఆ వ్యక్తి జామీను తీసుకురాలేని పక్షంలో అతనిని నిర్బంధించవలసిందిగా మెజిస్ట్రేట్ ఆదేశాలు జారీచేస్తారు. ఈ ఆదేశాలు జిల్లా జడ్జి ఉత్తర్వులు అందేవరకు అమలులో వుంటాయి. అప్పుడు జిల్లా జడ్జి మెజిస్ట్రేట్ పంపిన రికార్డులను, సాక్ష్యాధారాలను పరిశీలించి తత్ సంబంధమున్న వ్యక్తి నుంచి సంజాయిషీ తీసుకున్న మీదట న్యాయమైన ఉత్తర్వులు జారీచేస్తారు. జామీను తీసుకురాలేనందుకు ఒక వ్యక్తిని నిర్బంధించాల్సివస్తే అది ఏ పరిస్థితులలోనూ మూడు సంవత్సరాలకి మించగూడదు. బాండు ఎంతకాలం వరకైతే తీసుకుంటారో అంతకాలం వరకే జామీను తేనందుకు గాను ఆ వ్యక్తిని నిర్బధించే అధికారం వుంటుంది ఉదాహరణకు ఒక వ్యక్తి నుంచి ఆరు మాసాల వరకు సత్ప్రవర్తన కలిగి వుంటామని హామీ తీసుకొనేట్లయితే ఈ ఆరుమాసాల కాలపరిమితి వరకే అతనిని జామీను తేనందుకుగాను నిర్బంధించవచ్చు. అంతకు మించి ఎక్కువ కాలం నిర్బంధించడానికి వీలులేదు. ఇలా జామీనులేనందుకు నిర్బంధించిన కేసుల్లో ఖైదీని ఏ పరిస్థితిలోను కఠిన కారాగార వాసంలో వుంచరు. ఇహ పోతే జైలు అధికారులు ముద్దాయి జామీను తెచ్చినవెంటనే ఆ విషయం కోర్టుకు తెలియజేస్తారు

సెక్యూరిటీ ప్రొసీడింగ్స్‌లో నిర్బంధించబడిన వ్యక్తిని జిల్లా మెజిస్ట్రేట్ అతని వల్ల సమాజానికి ప్రమాదం లేదనుకుంటే విడుదల చేయవచ్చు. జామీను తేలేనందుకుగాను ముద్దాయిని నిర్బంధించినప్పుడు హైకోర్టుగాని, జిల్లా కోర్టుగాని, జిల్లా మెజిస్ట్రేట్ గాని, ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌గాని జామీను సొమ్ము తగ్గించడమో, లేదా జామీనుదార్ల సంఖ్య తగ్గించడమో చేయవచ్చు. జిల్లా మెజిస్ట్రేట్ ముద్దాయిని విడుదల చేసేప్పుడు కొన్ని నిబంధనలు విధించవచ్చు. ఈ నిబంధనలు బాండులో పేర్కొన్న కాలపరిమితి వరకే వర్తిస్తాయి. ఈ నిబంధనలని మెజిస్ట్రేట్ రద్దు చేసేట్లయితే పోలీసు అధికారులు వారెంట్ లేకుండా ముద్దాయిని అరెస్టు చేసి మెజిస్ట్రేట్ ముందు హాజరుపరచే

అవకాశాలున్నాయి. అయితే ముద్దాయి జామీను ఇవ్వడానికి సిద్ధమయేట్లయితే నిబంధనలని ఎప్పటి నుంచయితే ఉల్లంఘించాడో అప్పటి నుండి బాండు పరిమితి పూర్తయ్యే నాటి వరకు జామీను తీసుకొని ముద్దాయిని విడుదల చేస్తారు. జామీను ఇవ్వకపోయినట్లయితే నిబంధనలు ఉల్లంఘించిన నాటినుండి బాండు కాలపరిమితి పూర్తయ్యేవరకూ ముద్దాయిని నిర్బంధిస్తారు. ఇలా నిర్బంధించిన వాళ్లని జామీను ఇచ్చిన వెంటనే విడుదల చేస్తారు కూడా. హైకోర్టు, సెషన్స్ కోర్టులు ఎప్పుడైనాసరే కారణాలు వివరిస్తూ ఈ బాండుని రద్దుచేయవచ్చు. జామీనుదారు కూడా ఎప్పుడైనాసరే మెజిస్ట్రేట్‌కి దరఖాస్తు పెట్టుకొని జామీను ఉపసంహరించుకోవచ్చు. అలాంటప్పుడు కోర్టు ముద్దాయిని అరెస్టు చేయమని గాని హాజరు కమ్మని కాని ఆదేశించే అధికారంవుంది. ఇలా హాజరైన ముద్దాయిని కొత్తగా జామీను తెచ్చుకోమని ఉత్తర్వులు జారీచేస్తూ పాత జామీనుదారులని రద్దు చేస్తారు.

ముందుజాగ్రత్త చర్య కింద తీసుకొనే చర్యలని చాలాకాలంగా దుర్వినియోగపరుస్తున్నారు కాబట్టే ఇంత విపులంగా చర్చించాల్సివచ్చింది. అయితే ఇక్కడ ఒక విషయాన్ని స్పష్టంగా అందరూ గుర్తుంచుకోవలసిన అవసరముంది. ఏ పరిస్థితులలోను సంజాయిషీ కోరకుండా, విచారణ జరపకుండా అసలు విషయమే వివరించకుండా ఒకరిని నిర్బంధించే అధికారం ఏ న్యాయస్థానానికి కూడా లేదు. అంతేగాక ముందు జాగ్రత్త చర్యలకు సంబంధించిన కేసుల్లో ముద్దాయిని ఏ పరిస్థితులలో కూడా నేరస్థుడని భావించగూడదు. అతను నేరస్థుడే అయేట్లయితే ముందు జాగ్రత్త అనే ప్రశ్నే తల ఎత్తదు. అసలు ఏ నేరము జరగకుండా ఏ ఆరోపణా లేకుండా ఒకరిని అనవసరంగా ముందు జాగ్రత్త పేరిట శిక్షించడం నాగరిక ప్రపంచానికి తలవంపులు తెచ్చే విషయం. అందుచేత ఈ చట్టాలని దుర్వినియోగ పరచకుండా న్యాయస్థానాల మీద ప్రభుత్వం మీద చూడాల్సిన బాధ్యత వుంటుంది. ఈ విషయాన్ని ఎవరూ పట్టించుకోకపోతే అకారణంగా అమాయకులు శిక్షించబడే ప్రమాదముంది.

ఒక నిందితుడుగాకుండా ఒక నేరం చేయకుండా ఒక వ్యక్తి సామాజిక బాధ్యతలని ఉల్లంఘించకుండా చూడటానికి గాను అతనిని నిర్బంధించడమంటే పరోక్షంగా అతను శిక్ష అనుభవించడమే అవుతుంది. ఒకవైపు ఇలావుండగా మరోవైపున క్రమశిక్షణ పేరిట అతని మీద చర్యలు తీసుకోవటం దుర్మార్గం. నేరం చేసినవాడు శిక్ష అనుభవించడం ఒక ఎత్తుకాగా అసలు ఏ నేరము చేయకుండానే శిక్ష అనుభవించడానికి సమాజం ఆమోద ముద్ర వేయవద్దు. అందుకని ముందు జాగ్రత్త చర్యలు కింద నిర్బంధించ బడ్డ వాళ్ల విషయంలో సమాజం సానుభూతిగా వ్యవహరించాలి.

# నేరం నిరోధానికి చర్యలు

అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటిపోయింది. ఎటుచూసినా చిమ్మచీకటి. వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఆ చీకటి రాత్రి ఓ నలుగురు గెడ్డపారలు

తీసుకొని బైలుదేరారు. వాళ్ళంతా ఆ చీకట్లో నడుస్తూ వెళ్ళి ఒక కిరాణా షాపు గోడల్ని పగలగొట్టటానికి గెడ్డపారతో తవ్వసాగారు. వాళ్లు చేస్తున్న చప్పుడు విని ఫుట్‌పాత్ మీద పడుకున్న బిచ్చగాడు లేచాడు. జరుగుతున్న దేమిటో చూసి అర్థం చేసుకొని భయంతో నిలువునా వణికిపోతూ లేచి చీకటి దారిని వెతుక్కుంటూ పరుగెత్తాడు. అలా అతను నైట్ పెట్రోలింగ్ చేస్తున్న పోలీసులని ఢీకొనేంత వరకూ పరుగెడుతూనే ఉన్నాడు. "ఛీ లంజ కొడుకా పోలీసులు కనిపించడం లేదురా" అని ఒక పోలీసు కానిస్టేబుల్ బూతులు తిడుతూ చాచి చెంపమీద కొట్టాడు. ఆ తిట్లనీ, తగిలినదెబ్బనీ లక్ష్య పెట్టకుండా ఆ బిచ్చగాడు "దొంగతనం జరిగిపోతోంది, బాబూ రండి" అని చెప్పాడు. పోలీసులంతా "ఎక్కడ ఏమిటి" అని అడుగుతూనే అతన్ననుసరించారు. పోలీసులు ఆ కిరాణా షాపు దగ్గరికి జేరుకొనేసరికి దొంగలు కిరాణా షాపుకి కన్నం వేసి లోపలికి ప్రవేశించారు. పోలీసులు దొంగలని పట్టుకోడానికి లోపలికి వెళ్లలేదు. బిచ్చగాడు. 'అదేంటి బాబూ వాళ్లు లోపలే వున్నారు.' అని తెల్లబోయాడు. ''ఛత్ లంజ కొడుకా నీకెందుకివిషయం. రేపు దొంగతనం జరిగిందని ఎవరైనా రిపోర్టిస్తే వీళ్లని పట్టుకొంటాం. ముందు నువ్విక్కడినించి వెళ్ళు" అని వాడిని రెండు తన్ని తరిమేశారు. ఆ తర్వాత దొంగలు దొంగతనం చేసి తెచ్చిన సొమ్ములో వాటా పంచుకొని చక్కా పోయారు పోలీసులు.

దొంగలు పడ్డ ఆరు నెలలకు కుక్కలు మొరిగినట్లుగా దొంగతనం జరిగిన తర్వాత పోలీసులు రంగంలోకి దిగుతారు అని చాలా మందికి ఒక అభిప్రాయంవుంది. పైన చెప్పిన కథలో కూడా బిచ్చగాడికి రిపోర్టిచ్చిన తర్వాత దొంగలని పట్టుకొంటాం అనే పోలీసుల వైఖరి పరోక్షంగా దొంగలతో చేతులు కలపడంతో సమానం.

వాస్తవానికి పోలీసులు నేరం జరిగిన తర్వాత దర్యాప్తు చెయ్యడమే కాక అసలు నేరం జరగకుండా నిరోధించాల్సివుంటుంది. ఇలా నేరం నిరోధించడానికి గాను పోలీసులకున్న అధికారం పరిమితమైంది. కాగ్ నిజబుల్ నేరం (ఏ కేసులోనైతే పోలీసులు నిందితుణ్ణి వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చునో) జరక్కుండా పోలీసులు తగిన చర్యలు తీసుకోవచ్చు. ఈ రకమైన నేరం జరక్కుండా నిరోధించే బాధ్యత పోలీసులకుంది. దొంగతనం జరుగుతోందన్న సమాచారం అందగానే కేవలం కానిస్టేబులైనా సరే వెంటనే అక్కడికి వెళ్లి ఆ దొంగతనం జరగకుండా ఆపాలి.

నేరాన్ని నిరోధించే పేరిట పోలీసులు అనేకసార్లు చట్టబద్ధంగా జరిగే ఊరేగింపుల్లో జోక్యం చేసుకుంటుంటారు. ఒక వర్గం వాళ్ళు ఆ వర్గాన్ని బలపరుస్తూవుండే బ్యానర్లు పట్టుకున్నారనీ తత్ కారణంగా వేరొక వర్గంలో అశాంతి ప్రబలవచ్చున్న

కారణంగా బ్యానర్లు లాక్కోవడం లాంటివి చేస్తూంటారు. ఇట్లా చేయడం వల్ల పోలీసులు తాము జరగబోయే నేరాన్ని నిరోధించామని బుకాయిస్తారు. నేరం నిరోధించే పేరిట పోలీసులు ఈ విధమైన చర్యలకు పూనుకోవడం సరైందికాదు. అలాగే రోడ్డు మీదెవరైనా గొడ్డలి పట్టుకు వెళుతుంటే ఆ గొడ్డలితో వారు ఎవరినైనా నరికే అవకాశముందని అనవసరంగా ఊహించుకొని దాన్ని లాక్కోవడం లాంటి చర్యలు కూడా నేరాన్ని నిరోధించడానికి తీసుకునే చర్యలో భాగం కాదు.

నేరం నిరోధించడం పేరిట పోలీసులకి ఉత్తర్వులు జారీచేసే అధికారం లేదు. ఒక నేరం జరుగుతున్నప్పుడు నేరం చేయబోతున్న వ్యక్తిని మౌలికంగా అట్లా చేయడానికి వీలులేదని ఆదేశించడం లాంటి పనులు చెయ్యడంగాక పోలీసులు అతను ఆ నేరం చేయకుండా నిలిపివేయడానికి చురుగ్గా అవసరమైన చర్యలు తీసుకోవాలి.

కాగ్నిజబుల్ నేరాన్ని నిరోధించడానికి నిందితుణ్ణి అరెస్టు చెయ్యడం అనివార్యం అనుకొన్నప్పుడు అతన్ని అరెస్టు చేసే అధికారం పోలీసులకుంది. ఒక నేరం చెయ్యాలని పథకం వేసుకొన్నప్పుడు, నేరం చెయ్యాలన్న ఉద్దేశం కలిగివున్నప్పుడు అరెస్టు చేసి అయినా అతన్ని నేరం చెయ్యకుండా నిరోధించలేమని నిర్ధారించుకొన్నప్పుడు మాత్రమే అతన్ని అరెస్టు చెయ్యవచ్చు. ఇట్లా అరెస్టు చేయదల్చినప్పుడు పోలీసులు కొన్ని నిబంధనల్ని పాటించాలి.

కాగ్నిజబుల్ నేరం చేయడానికి నిందితుడు పథకం వేసుకొని వుండాలి. 2) ఈ విషయం పోలీసు అధికారి దృష్టికి వచ్చి వుండాలి. 3) అరెస్టు కానున్న వ్యక్తి ఇందులో భాగస్వామి అయివుండాలి. 4) అరెస్టు చేయకుండా నేరాన్ని నిరోధించడం సాధ్యం కాదని పోలీసు అధికారి భావించాలి.

ఒక రాజకీయ పార్టీకి సంబంధించిన వ్యక్తిని ఆ రాజకీయపార్టీ తన కార్యక్రమంలో భాగంగా నేరాలు చేయనున్నది కాబట్టి ఆ నేరాలు నిరోధించడానికి గాను అరెస్టు చేస్తున్నామన్న కారణంగా ఆ పార్టీ కార్యకర్తను అరెస్టు చేయకూడదు.

నేరాన్ని నిరోధించడానికి గాను అరెస్టు చేసినప్పుడు అరెస్టయిన వ్యక్తిని ఏ పరిస్థితుల్లోనూ ఇరవైనాలుగు గంటలకు మించి కస్టడీలో వుంచడానికి వీల్లేదు. ఒక వ్యక్తికి స్వేచ్ఛకు సంబంధించిన అంశం ఇమిడివుంది కాబట్టి ఇట్లా అరెస్టు చేసేటప్పుడు పోలీసులు చట్టంలోని నిబంధనలను ఉల్లంఘించడానికి వీల్లేదు.

తప్పుడు కొలతలూ, తూనికలూ వుండకుండా వాటిని నిరోధించడానికి గాను పోలీస్ స్టేషన్ అధికారి తన పరిధిలో ఏ ప్రాంతాన్నయినా వారెంట్ లేకుండా సందర్శించి ఆ తూనికల్ని, కొలతల్ని పరీక్షించవచ్చు.

# చట్ట విరుద్ధంగా గుమిగూడటం

పెద్ద ఎత్తున విద్యార్థులు సెక్రటేరియట్ వద్ద గుమిగూడారు. అంతకంటె పెద్ద సంఖ్యలో పోలీసులు ఉన్నారు. అసలా తతంగమంతా తమకేమీ పట్టనట్లుగా పోలీసులు మౌనంగా ఉండి తమ హోదాని, లాఠీలని, తుపాకులని ప్రదర్శిస్తున్నారు. సరిగ్గా అదే సమయానికి విద్యామంత్రిగారు కార్లో వస్తున్నారని చూసి పోలీసులు విద్యార్థులను బలవంతంగా ప్రక్కకు నెట్టేసి కారులోపలికి వెళ్ళడానికి దారిచేశారు. దీనితో విద్యార్థులు రెచ్చిపోయి "పోలీసు జులుం నశించాలి. విద్యామంత్రిని కలవడానికి అనుమతించండి" అని తిరిగి పెద్ద ఎత్తున నినదించారు. అలా చాలాసేపు గడిచిపోయిన తర్వాత గేటుకు అడ్డంగా నిలబడిన పోలీసు అధికార్లని కనీసం విద్యార్థి నాయకులనైనా లోపలికి వెళ్ళనివ్వమని కోరారు విద్యార్థులు. పోలీసులు అడ్డంగా తలఊపారు. దానితో తోటి విద్యార్థులు మీరు ఒప్పుకోకపోతే మేమంతా లోపలికి వెళతాము అని హెచ్చరించారు. పోలీసు అధికార్లంతా కాసేపు ఏదో గుసగుసలాడారు. ఆ వెంటనే ఎలాంటి హెచ్చరిక లేకుండా విద్యార్థుల మీద, జనంమీద విరుచుకు పడి లాఠీలతో చితగ్గొట్టి దొరికిన నాయకులను పట్టుకొని చట్టవిరుద్ధంగా గుమిగూడారు అన్న అభియోగం మోపుతూ కేసు పెట్టారు.

సమాజంలోని ఏ వర్గమైనా సరే వాళ్ళ వాళ్ళ సమస్యలని పరిష్కరించుకోవడానికి కదిలినప్పుడు లాఠీచార్జిలకి, పోలీసు కాల్పులకి, మిలటరీ దురాగతాలకీ ఎర అవుతూనే వున్నారు. మరలాంటప్పుడు సమస్యల మీద కదలడానికి ప్రజలకి హక్కు లేదా? చట్టం ప్రజల హక్కులని అడగటాన్ని నిషేధించిందా?

ఐదుగురు గాని, అంతకు మించికాని జనం దురుద్దేశంతో నేరప్రవృత్తి కలిగి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలని గాని, శాసనసభనిగాని, పార్లమెంటునుగాని, ప్రజా ఉద్యోగులను గాని, వాళ్ళ అధికారులని అడ్డగించడానికి అక్రమంగా గుమిగూడినట్లయితే అది చట్టవిరుద్ధంగా గుమిగూడినట్లు భావిస్తారు. దీన్ని బట్టి అసెంబ్లీ ముందో, పార్లమెంటు ముందో, మరే ఇతర అధికార భవనాల ముందో తమ తమ సమస్యలను తెలియజేసి వాటి పరిష్కారం కోసం గుమిగూడటం చట్ట విరుద్ధం కాదని స్పష్టమౌతుంది. అయితే అధికార్లు లోపలికి వెళ్ళనివ్వడం లేదన్న కారణంచేతో, మరే ఇతర కారణాలు చూపిస్తూనో నాలుకలా ఈ చట్టాన్ని తమ ఇష్టం వచ్చినట్లుగాతిప్పి ప్రజల్ని ఇబ్బందులకు గురిచేస్తున్నారు. అంతేగాక తమ కనీస హక్కులని, కోరికలని తీర్చుకోడానికి కూడా వీల్లేకుండా ఊరేగింపులని, మీటింగులని చట్ట విరుద్ధమైనవని వర్ణిస్తూ ప్రజల్ని నిర్బంధాలకి, లాఠీచార్జీలకి, కాల్పులకి గురిచేసి భయభ్రాంతులని చేస్తున్నారు. ఇందుకు చట్టంలో వున్న కొన్ని లొసుగులు కూడా పోలీసు వ్యవస్థకు పరోక్షంగా

సహకరిస్తున్నాయి.

చట్టాన్ని అమలుపర్చే క్రమంలో గాని, న్యాయ వ్యవస్థ జారీచేసే ఉత్తర్వులని అమలు పర్చేప్పుడు గాని వాటిని అడ్డగించాలనే ఉద్దేశ్యంతో గుమిగూడేట్లయితే అది చట్ట విరుద్ధం. నేరానికి పాల్పడినట్లే అవుతుంది. ఏదైనా నేరం జేయాలని గాని, ఎక్కడికైనా అక్రమంగా జొరబడటానికి గాని గుమిగూడేట్లయితే కూడా అది నేరానికి పాల్పడినట్లే అవుతుంది.

చాలాసార్లు కొన్ని వర్గాల వాళ్ళని బావుల్లోను, చెరువుల్లోను నీళ్ళు ముట్టనివ్వకుండా అడ్డగిస్తూ ఉండటం మనం చూస్తూవుంటాం. ఇలాంటి చర్యలకు పాల్పడ్డప్పుడు గుమిగూడటం చట్ట విరుద్ధం. అలాగే ఎవరైనా తాము చేయాల్సిన పనులని చేయనివ్వకుండా అంగ బలంతో అడ్డం పడేట్లయితేనో చేయగూడరాని పనులు చేయించడానికి ప్రయత్నించేట్లయితేనో అది నేరం చేయడంతో సమానం. మొదట్లో గుమిగూడినప్పుడు అది చట్టబద్ధమైన ఉద్దేశ్యంతో కూడుకొన్నప్పటికి ఆ తర్వాత అది చట్టవిరుద్ధమైన గుమిగూడటంగా మారే ప్రమాదముంది. అంచేత ఒకోసారి శాంతియుతంగా ప్రారంభమైన ఉద్యమాలు ఆ తర్వాత హింసాయుతంగా మారడం వలన అది చట్ట విరుద్ధమైన ఊరేగింపుగా మారిపోతుంది. కేవలం చట్టవిరుద్ధంగా గుమిగూడినప్పుడు మాత్రమే కాక ఒక్కోసారి చట్టబద్ధంగా 5 గురు గాని అంతకు మించి గాని జనం గుమిగూడేట్లయితే పోలీసులు చర్య తీసుకుంటూండటం మనం గమనిస్తున్నాం. అయితేఇలా గుమిగూడినప్పుడు అది చట్టబద్ధమైనప్పటికీ ప్రజాశాంతికి భంగం వాటిల్లుతుందని పోలీసులు భావించినప్పుడు వారు చర్యతీసుకోవచ్చునని చట్టం స్పష్టం చేసింది. ప్రజాశాంతి భద్రతలకి భంగం వాటిల్లే పరిస్థితులేమిటో ఏ ఏ పరిస్థితుల్లో ప్రజాశాంతికి భంగం వాటిల్లే ప్రమాదముందో చట్టం ఎక్కడా స్పష్టం చేయలేదు. అందుకని ప్రజాశాంతికి భంగం వాటిల్లే ప్రమాదముందని తేల్చే అధికారం పూర్తిగా ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌ల చేతుల్లోనూ, పోలీసు అధికార్ల చేతుల్లోనూ మాత్రమే వుండిపోయింది. అంచేత పోలీసు అధికార్లకి వున్న ఈ అధికారాన్ని యథేచ్ఛగా తమ ఇష్టానుసారం వినియోగించి పూర్తిగా శ్మశానశాంతికి కారణమౌతున్నారు. లేదా ప్రజాశాంతిభద్రతలకు భంగం వాటిల్లజేసి ప్రజల్లో పూర్తిగా ఆందోళనకీ, అశాంతికీ కారకులౌతున్నారు.

ఏదైనా మీటింగ్ వల్ల శాంతిభద్రతలకు ప్రమాదం వాటిల్లుతుందని నిర్ధారించడానికి కేవలం పోలీసులకి మాత్రమే అధికారం వుంటానికి వీల్లేదు. ఇండిపెండెంట్‌గా సాక్ష్యం ఉన్నప్పుడు మాత్రమే మీటింగ్ విషయంలో ఒక నిర్ణయం తీసుకోవాల్సి వుంటుంది. అంతేగాక ఒక నిర్ధారణకు వచ్చే ముందు ఆ మీటింగ్ యొక్క స్వభావాన్ని, గుణగణాలని అంచనా వెయ్యాల్సి వుంటుంది.

# ఊరేగింపులపై లాఠీఛార్జీ, కాల్పులు

బహిరంగసభమీద పోలీసులు విరుచుకుపడ్డారు. ఎలాంటి హెచ్చరికా లేకుండా అందిన వాళ్ళని అందినట్లు లాఠీలతో చితగ్గొట్టారు. మీటింగ్‌లో ఏదో విందామని వచ్చిన జనం భయభ్రాంతులై చెల్లాచెదురయ్యారు. నాలుగు వేపుల నుంచి చుట్టుముట్టి పోలీసులు జరిపిన దాడిలో చాలామంది దెబ్బలు తింటున్నారు. మీటింగ్ ఆర్గనైజ్ చేసే కార్యకర్తలు 'పోలీసు దౌర్జన్యం నశించాలంటూ' స్లోగన్సిచ్చారు. అన్యాయంగా విరుచుకుపడ్డ పోలీసుల చేతుల్లో దెబ్బలు తింటున్న జనం కూడా కార్యకర్తలతో గొంతు కలిపారు. పారిపోతున్న వాళ్ళు కూడా తిరిగివచ్చి గుంపుతో చేరారు. ఇది చూసి పోలీసు అధికారి "ఫైర్" అని అరిచారు. అంతే నాలుగు వేపుల నుండి తుపాకులు అవిరామంగా మోగాయి. చాలామంది నేలకూలారు. మీటింగ్ పెట్టిన మైదానంలో రక్తం ప్రవహించింది. మిగిలిన వాళ్ళంతా పారిపోయారు.

ఇలా ఎలాంటి హెచ్చరికా లేకుండా లాఠీఛార్జీ చేయడం గాని, కాల్పులు

జరపడం గాని చట్ట విరుద్ధం అవుతుందా ? అలా చేయడానికి పోలీసులకున్న అధికారాలేంటి? సామూహిక హత్యాకాండకు పూనుకొన్న పోలీసులు హంతకులు కారా? ఇలాంటి సంఘటనలు చూసిన చాలా మందికి అనుమానాలు తలెత్తుతాయి. ప్రతినిత్యం ఇలాంటి సంఘటనలు జరుగుతున్నప్పటికీ కారకులైన అధికార్లని ఏ న్యాయ వ్యవస్థా శిక్షించడం లేదు. ఏ రాజకీయం కనీసంగానైనా ప్రశ్నించడం లేదు. అంచేత పోలీసు దురాగతాలు యధేచ్ఛగా కొనసాగుతున్నాయి.

అక్రమంగా జనం గుమిగూడినపుడు అలా గుమిగూడటం చట్ట విరుద్ధమనీ, చెదిరిపొమ్మని పోలీసులు ముందుగా ఆదేశించాలి. అలా ఆదేశించినప్పటికీ గుంపు చెదిరి పోకుండా ఉండేటట్లయితే గుంపును చెదరగొట్టడానికి లాఠీఛార్జీ, అనివార్యమైతే కాల్పులు జరపవచ్చు. ఇలా హింసాయుతంగా గుంపును చెదరగొట్టడానికి ప్రయత్నించే ముందు పోలీసు అధికార్లు గానీ, మిలటరీ అధికార్లు గానీ ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ అనుమతి పొందాల్సి ఉంటుంది. సమయానికి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ అందుబాటులో లేకపోతే సబ్ ఇన్స్పెక్టర్ కంటే తక్కువ స్థాయికాని పోలీసు అధికారి ఎవరైనా సరే గుంపును చెదరగొట్టడానికి ఆదేశాలు జారీచేయడం కానీ, అవసరమైన చర్యలు తీసుకోడం కానీ చేయవచ్చు. ఒక్కోసారి హెడ్ కానిస్టేబుల్ పోలీసు స్టేషన్ అధికారిగా వ్యవహరిస్తాడు. అయినా హెడ్ కానిస్టేబుల్‌కి చట్ట విరుద్ధమైన ఊరేగింపుని చెదరగొట్టే అధికారం లేదు. చట్టంలో సబ్ ఇన్స్పెక్టర్ కంటే క్రిందిస్థాయి ఉద్యోగులెవరికీ లాఠీఛార్జీ చేయడానికి గానీ, కాల్పులు జరపడానికి గానీ అధికారం లేదని ఉంది. మొత్తం మీద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ మొదలుకొని పోలీసు కమీషనర్ నుంచి సబ్ ఇన్స్పెక్టర్ వరకూ పోలీసు అధికార్లందరికీ గుంపును చెదరగొట్టడానికి ఆదేశాలు జారీచేసే అధికారముందని అర్థమవుతోంది.

గుంపును చెదరగొట్టడానికి ముందు గుంపును చెదిరిపొమ్మని హెచ్చరించాలి. అలా హెచ్చరించినా ఫలితముండదనుకున్నా చెదరగొట్టడానికి పోలీసు అధికార్లు హింసాయుతమైన చర్యలకు పూనుకొనవచ్చు ఇక్కడ ఫలితముంటుంది లేనిది నిర్ణయించుకొనే అధికారం పోలీసుల మీదే ఉంది. ఏ ఏ ఆదేశిక సూత్రాలననుసరించి పోలీసులు ఎలా నిశ్చయించుకోవచ్చునో చట్టం స్పష్టం చేయలేదు. చట్టంలోనే ఎలాంటి హెచ్చరికా లేకుండా లాఠీఛార్జీలకి, కాల్పులకి పాల్పడ్డానికి పోలీసుల కధికారం కలిగించినప్పుడు మనం కేవలం పోలీసులను మాత్రమే ఈ అక్రమాలన్నిటికీ, ఈ హింసలన్నిటికీ బాధ్యులుగా పేర్కొన వలసిన అవసరం లేదు. అందుకు పరోక్షంగా తోడ్పడుతున్న చట్టాన్ని మార్చమని ప్రభుత్వం మీద వత్తిడి తీసుకు రావాలి. న్యాయస్థానాలు కూడా తమకున్న విస్తృతాధికారాల్ని వినియోగించుకొని మారుతున్న కాలానికి అనుగుణంగా

పరిస్థితుల్నిబట్టి చట్టాన్ని విశదీకరించాలి. ఉదాహరణకి హెచ్చరిక లేకుండా లాఠీఛార్జీ లకి, కాల్పులకి పాల్పడేముందు ఏ ఏ పరిస్థితుల్లో అలా చేయవచ్చునో న్యాయస్థానాలు స్పష్టంచేస్తూ ఆదేశిక సూత్రాలు జారీ చేయవచ్చు.

మెజిస్ట్రేట్ కాని, పోలీసు అధికార్లు కాని చట్టవిరుద్ధంగా ఏర్పడిన గుంపుని చెదరగొట్టడానికి సమాజంలోని ఏ వ్యక్తి సహాయాన్నయినా కోరవచ్చు. అంతేగాని తప్పనిసరిగా పోలీసులనీ, మిలటరీని రంగంలోకి దింపాలన్నది చట్టం యొక్క ఉద్దేశ్యం కాదు.

చట్ట విరుద్ధంగా గుమిగూడినపుడు గానీ, ఒక గుంపు వల్ల ప్రజా శాంతిభద్ర తలకు భంగం వాటిల్లవచ్చునని భావించినపుడు ఆ గుంపులోని నాయకుల్ని అరెస్టు చేయాలి. దీనివల్ల ఫలితం ఉండి పరిస్థితులేమైనా మార్పువచ్చిందా లేదా అని గమనించిన తర్వాత ఫలితం లేకపోయేట్లయితే హింసకు పాల్పడవచ్చు. ఇలా అరెస్టు చేసిన వాళ్ళని కోర్టులో హాజరుపరచి ప్రాసిక్యూట్ చేస్తారు. అయితే సాధారణంగా అందిన వాళ్ళందరినీ హింసించి దొరికిన వాళ్ళందరిపైనా కేసులు పెట్టడం ఇలాంటి విషయాల్లో సర్వసాధారణం.

మొత్తం మీద ఎలాంటి హెచ్చరికా లేకుండా గుంపును చెదరగొట్టడానికి హింసకు పాల్పడటానికి అధికారం పోలీసులకున్నా, ముందుగా గుంపును చెదిరిపొమ్మని ఆదేశించడం అవసరం. అలా ఆదేశించినప్పటికీ చెదిరి పోకపోయేట్లయితే నాయకులని అరెస్టు చేయాలి. అప్పటికీ ఫలితం లేకపోయేట్లయితే హింసాయుతంగా గుంపును చెదర గొట్టుతున్నట్లు ప్రకటించాలి. ఆ తర్వాత మాత్రమే హింసాయుతమైన చర్యకు దిగడం సహేతుకమని అనేక న్యాయస్థానాలు స్పష్టం చేసాయి. లాఠీఛార్జీ లాంటి మామూలు హింసాయుతమైన చర్యల వల్ల ఫలితం లేకపోయేట్లయితే ఉన్నతస్థాయి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ సాయుధ దళాల సహాయం కోరవచ్చు. ఈ సహాయం కోరేముందు మెజిస్ట్రేట్ ప్రజాశ్రేయస్సు దృష్ట్యా అది అనివార్యమని భావించాలి. మెజిస్ట్రేట్ ఆదేశాలు పురస్క రించుకొని సాయుధ దళాల అధికార్లు వీలైనంత తక్కువ హింసతో మెజిస్ట్రేట్ ఆదేశాలు అమలుపర్చడానికి ప్రయత్నించాలి. అంతేకాని కనిపించిన వాళ్ళనందరిని వాళ్ళు చేయా ల్సింది కాల్చి చంపడం కాదు.

సమీపంలో ఉన్నతస్థాయి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ అందుబాటులో లేనప్పుడు సాయుధ దళాధికార్లు గుంపును చెదరగొట్టడానికి కాల్పులు జరపవచ్చు. అరెస్టులు కూడా చేయవచ్చు. అయితే తాము చేస్తున్న పనులని గురించి మెజిస్ట్రేట్‌కి తెలియజేయాల్సి ఉంటుంది. ఏ దశలోనైనా సరే సాయుధ దళాల చర్యలని మెజిస్ట్రేట్ నిలిపివేయమని ఆదేశించవచ్చు.

# అధికార దుర్వినియోగం - విచారణ

అవటానికి వాళ్ళిద్దరూ చిన్నప్పటి క్లాస్‌మేట్స్. అయినా వాళ్ళిద్దరి మధ్య పచ్చ గడ్డివేస్తే భగ్గుమంటుంది. అలాగని వాళ్ళిద్దరి మధ్యన వ్యక్తిగతమైన పగ, ద్వేషం ఏమీ లేవు. చిన్నప్పటి నుంచి వాళ్ళిద్దరి అభిప్రాయాలు చుక్కెదురే. ఒకడు రైటిస్టు

నంటే మరొకడు లెఫ్టిస్టునయ్యేవాడు. రైటిస్టునమ్మే విశ్వాసాలని, విలువలని లెఫ్టిస్టు కొట్టి పారేసేవాడు. రైటిస్టు దేవుడున్నాడంటే లెఫ్టిస్టు దేవుడులేడు దేవుడి పేరు మీద జరిగేదంతా దోపిడీయే. దేవుడు దోపిడి వర్గాల ఏజెంట్ అని వాదించేవాడు. తను దేవుడిని నమ్మినంత మాత్రాన ఎవరినీ దోచుకోడంలేదు. తన తిండేదో తాను తింటున్నాడు. తన బ్రతుకేదో తాను బ్రతుకుతున్నాడు. అలాంటప్పుడు ఈ లెఫ్టిస్టు కావాలనే తన్ను దోపిడి దారుడినని అల్లరి చేస్తున్నాడనుకొని లోపల్లోపల కుతాకుతా ఉడికిపోయాడు రైటిస్టు. అలా వాళ్ళిద్దరి మధ్యన పూడ్చలేని గొయ్యి ఏర్పడింది. రైటిస్టు పోలీసాఫీసరయ్యాడు. లెఫ్టిస్టు ఏవో ఉద్యమాలని విప్లవాలని అంటూ కార్మికులతో జేరిపోయాడు. జీతం పెంచమని సమ్మెచేస్తున్న కార్మికులకి ఒకరోజు లెఫ్టిస్టు నాయకత్వం వహించాడు. అతని నాయకత్వంలో పికెటింగ్ జరుగుతోంది. బందోబస్తుకని సిబ్బందితో తరలి వచ్చాడు రైటిస్టు. కార్మికుల గుంపులో లెఫ్టిస్టును చూడగానే అతనికి ఒళ్ళు మండిపోయింది. ఎలాంటి హెచ్చరికలు లేకుండానే లాఠి ఛార్జీ చేయమని ఆదేశించాడతను. పోలీసులాఠీలు కార్మికుల మీద స్వైర విహారం చేశాయి. "పోలీసు జులుం నశించాలి. దోపిడీ వర్గానికి ఏజెంట్లైన పోలీసు గుండాయిజం నశించాలి" అని లెఫ్టిస్టు స్లోగన్స్ ఇచ్చాడు. రైటిస్టు రెచ్చిపోయాడు. ఫైరింగ్‌కు ఆర్డరు ఇచ్చాడు. రివాల్వరు తీసి లెఫ్టిస్టును కాల్చేసాడు. పోలీసుకాల్పుల్లో మరి కొంతమంది కార్మికులు చనిపోయారు. లెఫ్టిస్టు మీద రైటిస్టుకు చిరకాలం నుండి వున్న కోపం చల్లారింది.

పట్టపగలు నడిరోడ్డు మీద జనం చూస్తుండగా జరిగిన దారుణ హత్యాకాండను గురించి ఎవరూ పట్టించుకోలేదు. పోలీసులకు ఇలా చట్టవిరుద్ధంగా ఏర్పడే గుంపును చెదరగొట్టడానికి లాఠీ చార్జీచేసే అధికారం కాల్పులు జరిపే అధికారం ఉన్నాయి కాబట్టి జరిగిన హత్యాకాండలో ఎవరూ నేరస్థులు కాదని ఎవరి మీదా విచారణ జరపాల్సిన పనిలేదని నిర్ణయించుకొని ప్రభుత్వం కిమ్మనకుండా ఊరుకొంది. ఇలా ఉద్దేశ్యపూర్వకంగా లాఠీఛార్జీ పేరిట కాల్పుల పేరిట నేరానికి పాల్పడేట్లయితే పోలీసులను శిక్షించడానికి వీలులేదా? వారిపై విచారణ జరిపే అధికారం ఎవరికి లేదా? అన్న అనుమానాలు కలగవచ్చు.

గుంపును చెదరగొట్టడానికి పోలీసులు జరిపే లాఠీఛార్జీలోగాని కాల్పుల్లోగాని ఎవరైనా గాయపడ్డా, మరణించినా పోలీసులు శిక్షార్హులుకారు. వారిని ప్రాసిక్యూట్ చేయడానికి కూడా వీలులేదు. ఈ అధికారాన్ని వినియోగించే క్రమంలో ఏదైనా దారుణం జరిగేట్లయితే అందుకుగాను పోలీసులపై చర్య తీసుకొంటానికి వీల్లేదని చట్టం ఒక మినహాయింపు కలిగించింది. అయితే ఈ విషయంలో ఎవరైనా కేసు నడపదలచినట్లయితే ప్రభుత్వం నుండి అనుమతి తీసుకోవాల్సి వుంటుంది. మిలటరీ అధికార్లు

గనుక లాఠీఛార్జీ చేసినా, కాల్పులు జరిపినా వారిపైన కేసు నడపదల్చుకుంటే కేంద్ర ప్రభుత్వ అనుమతి పొందాలి. పోలీసు అధికార్ల విషయంలో రాష్ట్ర ప్రభుత్వ అనుమతి పొందాల్సి వుంటుంది. సాధారణంగా చాలా వరకు సమ్మెలూ, ఉద్యమాలూ ఆయా ప్రభుత్వ చర్యలు నిరసిస్తూనో, తమ కనీస కోర్కెలు తీర్చుకోడం కోసం జరుగు తుంటాయి. అలాంటప్పుడు కోర్కెలు తీర్చలేని ప్రభుత్వం పోలీసులని మిలటరీ అధికార్లని పురిగొల్పి ఆయా ఉద్యమాలని అణిచేస్తుంది. అలాంటప్పుడు వాళ్ళని కాపాడుకోవలసిన బాధ్యత ప్రభుత్వం మీదే వుంటుంది. కాబట్టి ప్రభుత్వం ఈ సందర్భంలో ప్రాసిక్యూషన్‌కు అనుమతిని ఇవ్వకపోవచ్చు. ఎలాగో చట్టం మిన హాయింపు వుంది. ప్రభుత్వం తమ పక్షమే వుంది అనుకుంటున్న పోలీసులు చూసి రమ్మంటే కాల్చి వస్తున్నారు. ఈ పరిస్థితుల్లో ప్రాసిక్యూషన్‌ను అనుమతించే అధి కారం ప్రభుత్వం చేతుల్లో వుండటం సరైంది కాదు. ఏ కేసులోనైనా విచారణ జరిగిన తర్వాత ఒక నిర్ణయానికి రావడం సహేతుకంగా వుంటుంది.

చట్టం ప్రకారం పోలీసులకి, మిలటరీ అధికార్లకూ వున్న ఈ అధికారాన్ని వారేమైనా అధిగమించారనుకుంటే వారిపైన విచారణ జరపటానికి చట్టం అనుమతి స్తుంది.

మనసులో అణుచుకున్న పగలూ, ద్వేషాల కారణంగా ఈ అధికారాన్ని దుర్వినియోగపరచి ఎవరైనా నేరానికి పాల్పడేట్లయితే నేరుగా వారి మీద కేసు దాఖలు చేయవచ్చు. అలా కేసు దాఖలు చేసినప్పుడు ఏ దశలోనైనా కోర్టువారికి ముద్దాయిలు ఈ చట్టం క్రింద వున్న అధికారాన్ని వినియోగించుకోవడం వల్ల నేరం చేశాదని అనుకొనేట్లయితే కేసు క్లోజ్ చేయవచ్చు. ఆ తరువాత ప్రభుత్వాన్నించి ప్రాసిక్యూషన్ అనుమతి పొందిన మీదటే తిరిగి కేసు విచారణ ప్రారంభమవుతుంది. అయితే ఈ చట్టం కింద తనకి మినహాయింపు వుందని రుజువు చేసుకునే బాధ్యత ముద్దాయి మీదే వుంటుంది. కాబట్టి అసలు అనుమతి పొందకుండా ఇలాంటప్పుడు పోలీసుల పై విచారణ జరపడానికి వీల్లేదనుకోవడం సరైందికాదు. కోర్టుకి విచారణ జరిపే అధికారం అభియోగి చేసిన ఆరోపణలపైన ఆధారపడివుంటుంది. అంతేగాని నిందితుడు చేసే ఆరోపణలపై ఆధారపడివుండదు. నిందితుడు గనుక మినహాయింపు కోరదలిచేట్లయితే అతను (1) సంఘటన జరిగినప్పుడు ఐదుగురు గాని, అంతకు మించిగాని జనం గుమి కూడివున్నారని తద్వారా ప్రజాశాంతికి భంగం వాటిల్లే అవకాశముందని (2) ఆ గుంపుని చెదిరిపొమ్మని ఆదేశించడం జరిగిందని (3) ఆదేశించినప్పటికి చెదిరిపోయే అవకాశం కన్పించలేదని (4) ఈ పరిస్థితుల్లో అనివార్యంగా తాము హింసాయుత చర్యకు పూనుకోవాల్సివచ్చిందని రుజువు చేసుకోవాలి.

# సెక్షన్ 144

పోలీసు జీప్‌లో మైక్ పెట్టుకొని నలుగురుగాని అంతకు మించిగాని జనం గుమిగూడితే చెదరగొడతామని పోలీసులు హెచ్చరిస్తున్నారు. అంతేకాక ఎవరైనాసరే కర్రలు, కత్తులు తదితర మారణాయుధాలు పట్టుకొని తిరగరాదని కూడా వీరు ప్రకటిస్తున్నారు. నగరంలో వారం రోజులపాటు 144 సెక్షన్ అమలులో ఉంటుందని తత్కారణంగా తాము ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాలపై ఈ విధమైన ప్రకటన చేస్తున్నామని వారు వివరించారు. ఇది వినగానే జనం అంతా భయభ్రాంతులై

ఒకే కుటుంబ సభ్యులైనప్పటికీ విడివిడిగా నడుస్తున్నారు. కర్ర ఊతంగా పట్టుకొన్న ముసలాళ్ళు కూడా తమ చేతుల్లో కర్ర లేకపోతే ఎలా నడవాలా అని భయపడి హడా విడిగా ఇళ్ళదారి పట్టారు. పోలీసులు ఈ ప్రకటన చేసిన వెంటనే హోటళ్ళ ముందు, పాన్ షాపుల ముందు గుంపులుగా వున్న జనం మీద పోలీసులు లాఠీలతో విరుచుకుపడి చెదరగొట్టారు. కాలేజీల నుంచి, స్కూళ్ళ నుంచి, సినిమా హాళ్ళనుంచి వస్తున్న వారి మీద కూడా పోలీసులు విరుచుకుపడ్డారు. రోడ్ల మీద జనం 144- సెక్షన్ పెట్టారు అని అరుస్తూ పరిగెడుతున్నారు. పరుగెడుతున్న వాళ్ళని చూసి వన్ ఫార్టీఫోర్ సెక్షనంటే తెలియని వాళ్ళు కూడా వాళ్ళవెంట పరుగెత్తసాగారు. ఇలా మొత్తం ఊరు ఊరంతా గమ్యం లేకుండా వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ పేరిట భయభ్రాంతులై పారిపోసాగారు. పారిపోతున్న జనాన్ని పోలీసులు క్రిమినల్స్‌లా చూసి తరిమి కొడుతూ వెంటపడ్డారు. పరుగెడుతున్న గుంపుని ఒక పెద్ద మనిషి అవును "ఏమిటేమిటి" అని జనం అదే ప్రశ్నలడిగి ఒకరి నొకరు ప్రశ్నించుకొన్నారు. గుంపు మొత్తం నిలబడి పోయింది. అదే ప్రశ్న గుంపంతా తమ వెంటబడి తరుముతున్న పోలీసులను నిలేసి ప్రశ్నించింది. పోలీసులు వారి వారి అధికారాలు, వన్ ఫార్టీ ఫోర్ సెక్షన్ స్తబ్దంగా నిలబడిపోయాయి.

ఇంతకీ 144 సెక్షన్ అంటే ఏమిటి? అనేది తెలియకుండానే చాలా మందికి వన్ ఫార్టీఫోర్ సెక్షనంటూ ఒకటుందని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ పేరిట పోలీసులు ఆ సెక్షన్ అమలులోవుందని ప్రకటిస్తూ జారీ చేసే ఆదేశాల్ని తూచా తప్పకుండా తాము అమలు పర్చాలను కుంటారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినపుడు బ్రిటిష్ కాలం నుంచి ఇప్పటి వరకూ కొన్ని సవరణలతో ఈ వన్ ఫార్టీఫోర్ సెక్షన్ కొత్త రంగులు వేసుకుంటూ మన చట్టంలో నిలబడిపోయింది. మన తాతల నాటి నుంచి ఇప్పటి వరకూ ఈ సెక్షన్ గురించి వినని వాళ్ళు లేరు. అయితే ఈ సెక్షను అప్పుడప్పుడు అమలులోకివస్తుందని, అప్పుడు మాత్రమే ఈ సెక్షన్ కింద జారీ అయిన ఆదేశాలకి కట్టుబడి వుండాల్సి వుంటుందని మనం విశ్వసిస్తున్నాము. వాస్తవానికి ఈ విశ్వాసంలో నిజంలేకపోలేదు. కాని ఆచరణలో ఈ చట్టం అమలులో లేని రోజంటూ లేదు. ఒకోసారి పోలీసులు కొన్ని చర్యలకు పూనుకొని వాటినెవరైనా ప్రశ్నించినపుడు వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ ఉల్లంఘించారు. కాబట్టే, మేమిలా చేయవలసి వచ్చిందని బుకాయిస్తారు. ఇంతకీ వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ అమలులో వున్నట్లుగా దాఖలా ఏదని అడిగినపుడు అది తమకి సంబంధించిన విషయమని కావాలంటే వెళ్ళి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌ను తెలుసుకో మంటారు. అయితే వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ అమలు గురించి పబ్లిక్ నోటీసు జారీ

చేయవలసిన అవసరంలేదా? పబ్లిక్ నోటీసు లేకపోతే ఎవరైనాసరే దానికెందుకు కట్టుబడివుండాలన్న అనుమానం కలుగుతుంది. అసలు నిజానికి చాలా సందర్భాలల్లో ముందుగా ఒక చర్యకు పూనుకోడం ఆ తర్వాత మాత్రమే ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ నుండి ఆదేశాలు గైకొంటారు. అందుకని ముందుగా ఎలాంటి ప్రకటనా లేకుండానే ఈ చట్టం కింద పోలీసులు చర్య తీసుకోగలుగుతున్నారు.

వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ కింద ఉత్తర్వులు జారీ చేసే అధికారం ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌లకే ఉంది. అత్యవసర పరిస్థితుల్లో ఆదేశాలు జారీ చేయవలసివచ్చినప్పుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌లు అందుబాట్లో ఉంటారు కాబట్టి చట్టం వారికి అధికారాన్నిచ్చింది అయితే ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌లు న్యాయ వ్యవస్థకు సంబంధించిన మెజిస్ట్రేట్లలా స్వతంత్ర ప్రతిపత్తి కలిగివున్న వాళ్ళు కాకపోవడం వలన ప్రభుత్వంయొక్క చెప్పు చేతల్లో నడుస్తుంటారు. అందుకనే చట్టం అమలులో లేనప్పుడు కూడా పోలీసులు దాన్ని అమలుపర్చి అమలులో వున్నట్లుగా ఆదేశాల్ని పుట్టించగలుగుతున్నారు.

నిరంతరం విధి నిర్వహణలో వుండే న్యాయ వ్యవస్థకి వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ కింద ఉత్తర్వులు జారీ చేసే అధికారం వుండాలి. మరణ వాంగ్మూలం రికార్డు చేయడానికి జ్యుడీషియల్ మెజిస్ట్రేట్‌లు పనివేళలతో సంబంధం లేకుండా హాస్పిటల్స్‌కు వెళుతుంటారు. అలాగే అరెస్టు చేసిన వ్యక్తిని ఇరవై నాలుగు గంటల్లో మెజిస్ట్రేట్ ముందు హాజరుపర్చాలి. కాబట్టి రాత్రి పగలన్న తేడా లేకుండా ఎప్పుడు బడితే అప్పుడు జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ ఎక్కడున్నా సరే తీసుకువెళ్ళి హాజరుపరుస్తారు. దీన్ని బట్టి జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ నిరంతరం విధి నిర్వహణలో నిమగ్నులైవుంటారని స్పష్టమౌతుంది. అత్యవసర పరిస్థితుల్లో వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ విధించే అధికారం కూడా జ్యుడీషియల్ మెజిస్ట్రేట్‌కే అప్పగించవచ్చునని కూడా స్పష్టమౌతోంది. ఈ విషయంలో అవసరమైన సవరణ తీసుకు వచ్చి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ బదులు జ్యుడీషియల్ మెజిస్ట్రేట్‌కి వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ విధించే అధికారం అప్పగించాలి.

## 144 సెక్షన్ అమలు పరచడం

సెక్షన్ 144 అమలు పర్చేముందు ఈ సెక్షన్ క్రింద ఆదేశాలు జారీ చేయాల్సిన అవసరం తప్పనిసరిగా ఉందని మెజిస్ట్రేట్ భావించాలి. కొన్ని పరిస్థితులలో ముఠా తగాదాలు, మత కల్లోలాలు తదితర గొడవలు ఏర్పడే ప్రమాదముందనుకొన్నప్పుడు ఈ గొడవలు నివారించడానికిగాను అవసరమైన ఆదేశాలు మెజిస్ట్రేట్ జారీ చేస్తారు. అంటే అత్యవసరంగా ఈ చట్టం క్రింద ఆదేశాలు జారీచేయడం వినా ఆ

గొడవలు నివారించడం సాధ్యం కాదనుకున్నప్పుడు మాత్రమే ఆదేశాలను జారీచేయాలి. అంతేకాని తాను అత్యవసరమని తలచానుగాబట్టి ఆదేశాలు జారీచేస్తాననడం సబబుకాదు. వాస్తవానికి ఆయా పరిస్థితులలో అనివార్యంగా వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ విధించడం అవసరమైనప్పుడే మెజిస్ట్రేట్ ఈ చట్టం క్రింద ఆదేశాలు జారీ చేయడం సహేతుకం.

వన్ ఫార్టీఫోర్ సెక్షన్ విధించేముందు మెజిస్ట్రేట్ కొన్ని చర్యలను నివారించడం వలన ఆయా పరిస్థితులు మెరుగౌతాయని విశ్వసించాలి. ఉదాహరణకి గుంపుల మధ్యన తగాదాలను నివారించదలచేట్లయితే వన్ ఫార్టీఫోర్ సెక్షన్ విధిస్తూ ఆ ప్రాంతాల్లో ఎవరూ మారణాయుధాలు కలిగివుండకూడదని ఆదేశించవచ్చు. అలాగే గుంపులుగా తిరగడాన్ని కూడా నిషేధించవచ్చు. ఇలా చేయడంవలన మరితగాదాలు జరిగే అవకాశం తగ్గుతుంది. ఈ సెక్షన్ విధించడంలోగల మౌలిక ఉద్దేశ్యం కూడా నెరవేరినట్లే

సాధారణంగా ఈ సెక్షన్ అమలు పర్చేప్పుడు అది సామాజిక పరిరక్షణకి తోడ్పడుతుందా లేదా అని యోచిస్తారు. అంతేకాని ఏ ఒక్కరిద్దరి హక్కులో పరిరక్షించడం కోసం వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ విధించరు. అయితే మన అనుభవంలో ఈ చట్టాన్ని విస్తృతంగా వాడుకుంటోంది పోలీసు అధికార్లు మాత్రమే. వారు స్వప్రయోజనాలకోసమే ఈ చట్టాన్ని ఒక ఆయుధంగా ప్రజలమీద ప్రయోగిస్తున్నారు. శాంతి భద్రతల పరిరక్షణ కోసమే కాక మరే కారణం చేతనైనా సామాజిక ప్రయోజనాల దృష్ట్యా పోలీసులేగాక, మరెవరైనా సరే ఈ చట్టాన్ని అమలుపర్చమని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌ను కోరవచ్చు.

బ్రిటిష్ కాలంనుంచి ఇప్పటివరకూ వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ అమలులో లేని రోజును చూసినవాళ్ళు అరుదు. ఇలా రోజులు, సంవత్సరాల తరబడి నిషేధాజ్ఞలు విధించే హక్కు ఏ ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కీ, ప్రభుత్వానికీ ఉండటానికి వీల్లేదు. ఇట్టి అధికారమేగనుక ఉండేట్లయితే ఏ ఉద్దేశ్యంతో అయితే ఈ చట్టం ఏర్పడిందో ఆ వుద్దేశ్యం నెరవేరడం సంగతి అలావుంచి, అనేక దుష్పరిణామాలు ఏర్పడే ప్రమాదముంది. అయితే ఇప్పుడు చూస్తున్నదీ, మన అనుభవంలో ఉన్నది ఈ చట్టం అమలు పర్చడం వలన కలుగుతున్న దుష్పరిణామాలు మాత్రమే మనం చూస్తున్నాం. నిజానికి మెజిస్ట్రేటు రెండు నెలలకు మించి వన్ ఫార్టీఫోర్ సెక్షన్ అమలు పర్చడానికి వీల్లేదు. అయితే ఇంకా ఈసెక్షన్ అమలుపర్చాలని భావిస్తే రాష్ట్ర ప్రభుత్వం దాన్నే ఆరునెలలపాటు పొడిగించవచ్చు. ఒక వైపు చట్టం ఇలాఉండగా పోలీసులు మాత్రం చట్టం అమలులో లేని కాలంలో కూడా చట్టం అమలు పరుస్తూ ఆ తర్వాత అక్రమంగా ఆదేశాలు పుట్టిస్తున్నందువల్ల మనకెప్పుడూ ఈ చట్టం అమలులో ఉందనట్టు అనిపి

స్తుంది.

సామాజిక ప్రయోజనం దృష్ట్యా వన్ ఫార్టీఫోర్ సెక్షన్ అమలుపర్చేటప్పుడు ఒక్కోసారి ప్రైవేటు వ్యక్తుల హక్కులకి నష్టం వాటిల్లవచ్చు. అలాంటప్పుడు ఈ చట్టం అమలుపర్చడం సరైంది కాదనడం సహేతుకం కాదు. తాత్కాలికంగా కొందరికి ఈ చట్టం అమలువల్ల నష్టం వాటిల్లినప్పటికీ ప్రజాశాంతి పరిరక్షణ కోసం విస్తృత ప్రయోజనాల దృష్ట్యా ఈ చట్టాన్ని అమలుపరుస్తారు. అంతేకాని పూర్తిగా శాశ్వతంగా కొందరి ప్రయోజనాన్ని మంటగలపడం ఈ చట్టపు ఉద్దేశ్యంకాదు. దేవాలయాల ముందర ప్రదర్శనలను నిషేధిస్తుండటం కద్దు. మతకలహాలను నివారించడం కోసం ఇలా చేస్తుంటారు. ఈ నిషేధాజ్ఞలు సెక్షన్ 144 కింద మాత్రమే జారీచేస్తారు. ఊరేగింపులకీ, ప్రజా ప్రదర్శనలకీ అనుమతి తీసుకొనేప్పుడు వన్ ఫార్టీఫోర్ సెక్షన్ అమల్లో లేకపోయేట్లయితే కొన్ని కొన్ని ప్రాంతాల్లో ప్రదర్శనను నిషేధించడానికి పోలీసులకి అధికారం లేదు.

రెండు ముఠాల మధ్యగానీ, వర్గాలమధ్యగానీ ఏదైనా వివాదం తలెత్తినప్పుడు ఒక ముఠాకి లాభం కలిగేట్లుగా వేరొక ముఠాకి నష్టం వాటిల్లేవిధంగా వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ అమలు చేయడానికి వీల్లేదు. కేవలం ప్రమాదాన్ని ఊహించినప్పుడు మాత్రమే దాన్ని నివారించడానికి ఈ చట్టం అమలుపరుస్తారు. చట్టం అమలుపర్చేక్రమంలో ప్రైవేట్ వ్యక్తుల హక్కులకి భంగం వాటిల్లేట్లయితే చట్టం అమలుపరచడం ముగిసిన వెంటనే ఆయా హక్కులని తిరిగి పునరుద్ధరించడానికి మెజిస్ట్రేట్ ప్రయత్నం చేయాలి. చట్టం అమలులో లేనప్పుడు ప్రైవేట్ వ్యక్తులు తమ హక్కులని స్వేచ్ఛగా అనుభవించవచ్చు.

శాంతి భద్రతలకి ప్రమాదం వాటిల్లనప్పుడు ప్రైవేటు వ్యక్తుల స్వేచ్ఛలో జోక్యం చేసుకుంటూ వన్ ఫార్టీఫోర్ సెక్షన్ విధించడం సరైందికాదు. చట్టబద్ధంగా ఒక పనిచేసే అధికారం ఒకరికి వున్నప్పుడు వేరొకరు ఆ హక్కుని కాలరాస్తూ అతన్ని ఆ పనిచేయనీయకుండా అడ్డుపడుతున్నపుడు వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ అమలుపేరిట రెండో వ్యక్తికి తోడ్పడటం సరైందికాదు. ఈ చట్టం అమలు పర్చడం ద్వారా మొదటి వ్యక్తికున్న హక్కుని కాపాడాలి.

శాంతిభద్రతల పరిరక్షణకోసం ఈ చట్టం అమలుపర్చినపుడు అందుకు భంగం వాటిల్ల జేసేవారిపైన వన్‌ఫార్టీఫోర్ సెక్షన్ విధించాలి. అంతేగాని శాంతికాముకులపై కాదు.

'144' సెక్షన్ అమలుపర్చమని ఆదేశాలు జారీచేసేముందు మెజిస్ట్రేట్ తన ముందున్న విషయాన్ని గురించి సహేతుకంగా ఆలోచించి మాత్రమే నిర్ణయం తీసుకో

వాలి. అంతేకాని పోలీసులో, మరొకరో వన్ పార్టీఫోర్ సెక్షన్ క్రింద ఉత్తర్వులు కోరారన్న కారణంగా వెనకాముందూ ఆలోచించకుండా గ్రుడ్డిగా ఆదేశాలు జారీచేయ డానికి వీలులేదు. ముందు విషయానికి సంబంధించి బలమైన సాక్ష్యాధారాలున్నాయా లేదా, సమాచారం ఎంతవరకు సరైంది, అన్నది తెల్చుకొన్నాక మాత్రమే ఆదేశాలు జారీచేయాలి. ఒకవేళ అలాంటి ఆదేశాలు జారీచేయని పక్షంలో ప్రాణహాని, గలాటాలు, ముఠా తగాదాలు తదితర ప్రమాదాలు వాటిల్లే అవకాశముందని మెజిస్ట్రేట్ భావించినప్పుడు ఆదేశాలు జారీచేయడం సహేతుకం. ఆదేశాలు లిఖితంగా ఉండాలి. అందులో ఏ ఏ పరిస్థితుల్లో ఆదేశాలు జారీచేయాల్సి వచ్చిందీ, అందుకు సంబంధించిన విషయాలేమిటీ, అన్నది స్థూలంగా పేర్కొనాలి. ఏ ముఠా వ్యక్తులకీ, గుంపులకీ, వర్గాలకీ వ్యతిరేకంగా నైతే ఆదేశాలు జారీచేసారో వీలైనంతవరకు వాళ్ళకి తెల్పకుండా విషయాలు వివరించ కుండా ఆదేశాలు జారీచేయడం సరైందికాదు. అయితే కొన్ని అత్యవసర పరిస్థితుల్లో ఏకపక్షంగా నిర్ణయం తీసుకొని ఆదేశాలు జారీచేసే అధికారం మెజిస్ట్రేట్‌కి ఉంది. ఇది సాధారణ నిబంధనకి మినహాయింపు మాత్రమే. దురదృష్టవశాత్తు ఈ మినహాయింపే సాధారణ నిబంధనైపోయింది. ఎవరెవరికి వ్యతిరేకంగా అయితే, వన్ పార్టీఫోర్ సెక్షన్ అమలు జరుపుతున్నారో వాళ్ళకి ఈ సెక్షన్ అమలులోకి వచ్చేంతవరకు తెలపడంలేదు. కొన్నిసార్లు అసలెలాంటి ఆదేశాలు లేకుండానే వన్ పార్టీఫోర్ సెక్షన్ అమలుపర్చి ఆపైన ఈ సెక్షన్ క్రింద ఆదేశాలు జారీచేయించుకొని అధికారాన్ని పొందుతున్నారు. ఈ చట్టం కింద జారీచేసే ఆదేశాలు స్పష్టంగా ఉండాలి.

144 సెక్షన్ కింద ఆదేశాలు జారీచేసిన తర్వాత ఆ ఆదేశాలు ఏ ఏ వ్యక్తుల్ని ఉద్దేశించి జారీచేసారో వారికి దాని ప్రతుల్ని అందజేయాలి. అంతేకాక ఈ ఆదేశాన్ని ప్రకటించడం లాంటి పనుల ద్వారా ఆదేశాలకు విస్తృత ప్రచారం కల్పించాలి. మైక్ సెట్ల ద్వారా ప్రచారం చేయడం, రేడియో ద్వారా ప్రకటించడం ఇందులో భాగమే.

144 సెక్షన్ అమలుపర్చమని ఆదేశించే హక్కు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌లకి, సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌లకి, జిల్లా మెజిస్ట్రేట్ లకి ఉంది.

144 సెక్షన్ కింద జారీచేసే ఆదేశాలు విస్తృతమైన పరిధి కలిగివుండటమే గాక విపరీతమైన ప్రభావం కూడా కలిగిస్తుంది. అందుచేత వ్యక్తిస్వేచ్ఛకి, జాతిస్వేచ్ఛకి ఆటంకం కలిగించే అవకాశం ఉంది. కొన్ని సార్లు ఊరేగింపులు ఫలానా ప్రాంతం నుండి తీయవచ్చు. ఫలానా ప్రాంతం నుండి తీయడానికి వీల్లేదనడం ద్వారా తాత్కాలిక స్వేచ్ఛకు కూడా ఆటంకం కలిగిస్తుంది. ఈ చట్టం కింద జారీచేసే ఆదేశాల్ని ప్రధానంగా రెండు రకాలుగా విభజించవచ్చు. 1. కొన్ని రకాల చర్యల్ని

నిరోధించడం. 2. కొన్ని రకాల ఆస్తులకు సంబంధించిన ఆదేశాలు.

కొన్ని రకాల చర్యలను నిరోధించడానికి సంబంధించిన ఆదేశాలు స్పష్టంగా ఉండాలి. వాటిని గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి.

శాంతి భద్రతల పరిరక్షణకి ఉపయోగపడే ఆదేశాలు ఉదాహరణకి సంగీత సాధనాన్ని వాడకూడదని ఇచ్చే ఆదేశాలు; కొందరు వ్యక్తుల్ని కొన్ని పనులు చేయకూడదని, ఆ పనులు చేయడం వల్ల శాంతిభద్రతలకు ప్రమాదం వాటిల్లే అవకాశం ఉందని పేర్కొంటూ చేసే ఆదేశాలు; వివిధగుంపులు, వర్గాలు మధ్యన విభేదాలు తలెత్తాయని భావించినప్పుడు దానికి సంబంధించిన విషయాల్ని చర్చించరాదని జారీచేసే ఉత్తర్వులు; తదితర అనేక అంశాలు ఈ పరిధిలోకి వస్తాయి.

144 సెక్షన్ కింద జారీచేసే ఆదేశాలు రెండు నెలలకి మించి అమలులో ఉంటాయని ప్రకటించడానికి మెజిస్ట్రేట్‌కు అధికారాలు లేవు. ఈ రెండునెలల కాలం గరిష్ఠ పరిమితి అని అర్థం చేసుకోవాలి. అవసరం అనుకొంటే రాష్ట్ర ప్రభుత్వం ఈ సెక్షన్ కింద జారీచేసిన ఆదేశాల్ని మరో ఆరు మాసాల వరకు అమలులో ఉండేలా పొడిగించవచ్చు. రాష్ట్ర ప్రభుత్వమైనా ఈ చట్టం కింద ఆదేశాలు జారీచేసేప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది 144 సెక్షన్ అమలులో ఉండటం వల్ల ఏ ఏ వర్గాల వారికి నష్టం వాటిల్లుతున్నదో గమనించి వారు తెలిపే అభ్యంతరాలను కూడా పరిశీలించాలి. ముఖ్యంగా ప్రాణాలకి ప్రమాదం వాటిల్లినప్పుడు మాత్రమే ప్రభుత్వం ఆదేశాల్ని పొడిగించవచ్చు. మొత్తం మీద ఏ పరిస్థితుల్లోనూ రాష్ట్ర ప్రభుత్వం 144 సెక్షన్ అమల్ని ఆరు నెలలకుమించి పొడిగించడానికి వీల్లేదు. అవసరమనుకుంటే మధ్యలో ఈ ఆదేశాలను రద్దుచేసే అధికారం కూడా రాష్ట్ర ప్రభుత్వానికుంది.

144 సెక్షన్ కింద జారీచేసిన ఉత్తర్వు మెజిస్ట్రేట్ అవసరమనుకున్నప్పుడు సవరించవచ్చు. ఈ సవరణ ఆదేశాల మేరకు మాత్రమే పరిమితం. అంతేకాని వ్యక్తులని మారుస్తూ సవరించడానికి వీల్లేదు. ఒకవేళ రాష్ట్ర ప్రభుత్వం మెజిస్ట్రేట్ ఆదేశాలు కాల పరిమితి చెల్లిపోయిన తర్వాత పొడిగించినప్పటికీ మెజిస్ట్రేట్‌కి ఆ ఉత్తర్వును సవరించే అధికారం ఉంది.

144 సెక్షన్ కింద ఆదేశాలు జారీచేసిన తర్వాత ఆ ఆదేశాలు ఎవరిని ఉద్దేశించి ఐతే, జారీ చేసారో వారి వాదనలు వినడానికి మెజిస్ట్రేట్ అవకాశం ఇవ్వాలి. ఆ వాదన విన్న పిమ్మట ఆ ఆదేశాలు ఉపసంహరించుకోవడమో లేదా సవరించడమో చేసే అధికారం మెజిస్ట్రేట్‌కుంది. మెజిస్ట్రేట్ ఆదేశాలు ఉపసంహరించుకోడానికి నిరాకరించేట్లయితే అందుకు సంబంధించిన కారణాన్ని రికార్డు చేయాలి. అవసరమనుకుంటే మెజిస్ట్రేట్ ఈ విషయంలో స్వయంగా విచారణ జరపవచ్చు. తనకింద అధికారినెవరి

నైనా పంపించి విచారణ జరిపించవచ్చు. అవసరమనుకుంటే ఆ ప్రాంతాన్ని సందర్శించి ఒక నిర్ణయం తీసుకోవాలి.

144 సెక్షన్ క్రింద ఆదేశాలు జారీ చేసేప్పుడు మెజిస్ట్రేట్ ఆ అదేశాలు ఎవరికి వ్యతిరేకంగా జారీచేస్తున్నారో వారికి నోటీస్ ఇవ్వాలి. ప్రతివాది నోటీస్‌కు జవాబుగా ఇచ్చిన సంజాయిషీని పురస్కరించుకొని మెజిస్ట్రేట్ తన ఆదేశాలను ఉపసంహరించుకోవడమో, సవరించడమో చేయవచ్చు. అవసరమనుకుంటే మెజిస్ట్రేట్ విచారణ జరిపిన మీదట మాత్రమే ఆదేశాలు జారీచేయాలి. ఈ ఆదేశాలు జారీచేసేముందర శాంతి భద్రతల పరిరక్షణార్థం మాత్రమే చర్యలు గైకొంటారను విషయం మెజిస్ట్రేట్ తన దృష్టిలో ఉంచుకుంటారు.

144వ సెక్షన్ క్రింద ఆదేశాలు జారీ చేయమని కోరేవారికి ఈ విషయంలో విచారణ జరిపించమని కానీ, ఉపసంహరించుకోమని కానీ, సవరించుకోమనిగానీ, మెజిస్ట్రేట్ కోరే అధికారం ఉండదు. ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌ని తన క్రింది అధికారు లెవరిచేతనైనా విచారణ జరిపించవచ్చు. అయితే ఆ క్రింది అధికారి జరిపిన విచారణ పాఠాన్ని పరిశీలించిన మీదట అవసరమనుకుంటే 144 సెక్షన్ క్రింద ఆదేశాలు జారీ చేయవచ్చు. ఆదేశాలను యథాతథంగా కొనసాగనివ్వదలచినా, సవరించదలచినా, ఉపసంహరించుకోదలచినా మెజిస్ట్రేట్ కారణాలను వివరించాలి. 144 వ సెక్షన్ క్రింద జారీ అయిన ఉత్తర్వులను రాష్ట్ర ప్రభుత్వం పొడిగించదలచినా, రద్దుచేయదలచినా, సవరించదలచినా ప్రతి వాదికి నోటీస్ ఇచ్చి, అతడు తెలిపిన అభ్యంతరాలను పరిగణన లోకి తీసుకోవాలి. పొడిగించమని కోరుతూ దాఖలైన దరఖాస్తును త్రోసిపుచ్చదలచి నట్లైతే రాష్ట్ర ప్రభుత్వం కారణాలను వివరించాలి.

పోలీసులూ, పార్టీలూ పరస్పరం ఆరోపణలు చేసుకుంటూ పోయినపుడు అవసరమనుకుంటే మెజిస్ట్రేట్ ఏ ప్రాంతానికి సంబంధించైతే 144వ సెక్షన్ విధించ దలచారో ఆ ప్రాంతాన్ని సందర్శించిన మీదట ఒక నిర్ణయానికి రావాలి.

144వ సెక్షన్ క్రింద జారీ అయ్యే ఆదేశాలు న్యాయ వ్యవస్థకు సంబంధించిన ఆదేశాలు కావు. ఇవి పరిపాలనా వ్యవహారాలకు సంబంధించిన ఆదేశాలు. ఈ ఆదేశాలు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించినవి కావడం వల్లనే ప్రభుత్వాలు తమ అక్రమ పరిపాలనను కాపాడుకోవడానికి ఉపయోగించుకోగలుగుతున్నాయి. పోలీసులు తమ దురాగతాల్ని చట్టం ముసుగులో కొనసాగించగలుగుతున్నారు.

144వ సెక్షన్ క్రింద జారీ అయిన ఆదేశాలను సవరించమనిగానీ, రద్దు చేయమని గానీ, మెజిస్ట్రేట్‌ని కోరే హక్కు ఉన్నప్పటికీ మెజిస్ట్రేట్ అనధికారికంగా ఆదేశాలిచ్చినట్లయితే హైకోర్టులో రివిజన్ దాఖలు చేయవచ్చు. అయితే మౌలికంగా

అక్కడున్న పరిస్థితులు, తక్షణ అవసరాలు ఏమిటో మెజిస్ట్రేట్‌కు తెలిసి ఉంటాయి. కాబట్టి సాధారణంగా హైకోర్టు జోక్యం చేసుకోదు. ప్రమాదానికి సంబంధించిన తీవ్రత మెజిస్ట్రేట్ ఎరిగి ఉంటాడని హైకోర్టు భావిస్తుంది గనుక రివిజన్ దాఖలైనపుడు కోర్టు మెజిస్ట్రేట్ నుండి రికార్డు తెప్పించి పరిశీలిస్తుంది.

ఆదేశాలు జారీచేయడానికి కావలసిన ఆధారాలు ఏమీలేనపుడు, ఏ కారణంగానైతే ఆదేశాలు జారీచేశారో ఆకారణాలు లేనపుడు అవి చట్టవిరుద్ధమైనపుడు, ఆదేశాలు పార్టీల హక్కుల్ని నిర్ణయించే విధంగా ఉన్నపుడు, పార్టీలకు తెలియజెయ్యకుండా తుది నిర్ణయం గైకొని ఆదేశాలు జారీ చేసినపుడు, సాక్ష్యాధారాలు లేకుండా ఆదేశాలు జారీ చేసినపుడు హైకోర్టు కల్పించుకొని ఆ ఆదేశాలను రద్దు చేస్తుంది. ఆదేశాల కాలపరిమితి దాటిపోయిన తర్వాత సాధారణంగా హైకోర్టు జోక్యం చేసుకోదు.

రాజ్యాంగ ప్రాథమిక హక్కులు కాలరాస్తూ 44వ సెక్షన్ కింద ఆదేశాలు జారీచేస్తే వాటిని సవాల్ చేస్తూ రిట్‌పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు.

144వ సెక్షన్ క్రింద జారీ అయిన ఉత్తర్వులను ధిక్కరించేట్లయితే భారత శిక్షాస్మృతి క్రింద అది నేరం అవుతుంది. ధిక్కారణని నేరంగా పరిగణించాలంటే మౌలికంగా (1) 144వ సెక్షన్ క్రింద జారీఅయిన ఆదేశాలు చట్టబద్ధమైనవై ఉండాలి. (2) నిందితుడికి ఆదేశాలు తెలిసి ఉండాలి. (3) ఆదేశాలు అమలులో ఉండగా నిందితుడు ఉద్దేశపూర్వకంగా వాటిని ధిక్కరించి ఉండాలి. (4) ఆదేశాలను ధిక్కరించినందువల్ల వాటిని అమలుపరుస్తున్న అధికారికి అసౌకర్యమో, నష్టమో, అడ్డంకో సంభవించాలి. లేదా గలాటాలకో, ప్రాణ నష్టానికో, శాంతి భద్రతలకు భంగం వాటిల్లడానికో దారి తీయాలి.

చట్టవిరుద్ధమైన ఆదేశాలను ప్రతిఘటించే హక్కు ఎవరికైనా ఎప్పుడైనా ఉంటుంది. అయితే ఈ ప్రతిఘటనా క్రమంలో నేరానికి పాల్పడటానికి వీల్లేదు. కర్ఫ్యూ సమయాల్లో కర్ఫ్యూని అతిక్రమించిన వాళ్ళని కనిపిస్తే కాల్చివేయమని ప్రభుత్వం గనుక ఆదేశాలు జారీ చేసినట్లయితే అవి చట్టవిరుద్ధం మాత్రమే కాక రాజ్యాంగ విరుద్ధం కూడ.

కొన్ని కొన్ని ప్రాంతాల నుండి ఊరేగింపులు తీయవద్దని ఆదేశించినపుడు ఆయా ప్రాంతాలలో నడిచే హక్కు తమకుందని ప్రకటించమని కోర్టుకు వెళ్ళడానికి వీల్లేదు. అంతేగాక ఊరేగింపులో కొన్ని రకాల పాటల్నీ స్లోగన్స్‌నీ నిషేధించేటట్లయితే ఆయా పాటలు పాడుకొనే హక్కు, స్లోగన్స్ ఇచ్చే హక్కు తమకుందని ప్రకటించవలసిందిగా కోర్టును కోరే హక్కులేదు. అయితే ఈ ఆదేశాలు చట్ట విరుద్ధం, రాజ్యాంగ విరుద్ధం అయినప్పుడు హైకోర్టులో రివిజన్ పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు.

# పబ్లిక్ న్యూసెన్స్ నిరోధించే చట్టం

రోడ్ల మీద షాపులు పెట్టుకోవడమూ తద్వారా ట్రాఫిక్ అంతరాయం కలిగించడమూ, ఫలితంగా యాక్సిడెంట్లు జరగడమూ మనం తరుచూ చూస్తున్నాము. మున్సిపాల్టీ వాళ్ళు చెత్తకుండీల్లో చెత్త సంవత్సరాల తరబడి తియ్యకుండా వీధులన్నీ గబ్బు కొట్టించెయ్యడమూ మనం ఎరుగుదుము. రోడ్లమీద గేదెల్ని దున్నపోతుల్ని కట్టేసి ఇదేమిటి అంటే విరుచుకు పడ్డం మన అనుభవంలోని విషయమే. అయితే వీటన్నిటి విషయంలో ఏం చెయ్యాలో తెలవక ఏ షాపులోకో హోటల్‌కో వెళ్లి వస్తున్నప్పుడు మన కాళ్ళావేళ్ళా పడే అడుక్కొనే వాడినిచూసి వెధవ న్యూసెన్స్ అని ఈసడించుకొంటాం. నిజానికి ప్రజలకి అసౌకర్యం కలిగించే విషయాలు చాలా ప్రమాదకరంగా వుంటాయి

ప్రజా అసౌకర్యాలు కలిగినప్పుడు, ఆ అసౌకర్యానికి సంబంధించినంత వరకూ సివిల్ న్యాయస్థానం ముందు, క్రిమినల్ న్యాయస్థానం ముందూ పరిష్కారం పొందవచ్చు.

సివిల్ న్యాయస్థానంలో దావా వేసిన వాడు తనకి కలిగిన నష్టాన్ని ఋజువు చేసుకోవాల్సిన అవసరం లేదు. అది మొత్తం జనానికి నష్టం కలిగించేది అంటే సరిపోతుంది. అంతేకాక ఈ పబ్లిక్ న్యూసెన్స్ కారణంగా ప్రైవేట్ వ్యక్తికి కనుక నష్టం జరిగివుంటే నష్టపరిహారం కోసం కూడా దావా వెయ్యవచ్చు.

క్రిమినల్ చట్టం క్రింద ప్రజా అసౌకర్యానికి కారకుడైన వాడికి శిక్ష విధించవచ్చు. అలాగే నేరాన్ని తక్షణం నివారించడానికి కావాల్సిన చర్యలను కూడా తీసు

కోవచ్చు. వేరేదైనా ప్రత్యేక చట్టం ప్రకారం అయినా ప్రజా అసౌకర్యాలని కలిగించిన వారిపై చర్యలు గైకొనవచ్చు.

ఒక చట్టం క్రింద చర్య తీసుకొన్నారు కాబట్టి వేరొక చట్టం కింద తీసుకోవడానికి వీల్లేదనరాదు. దేనికదే వేరు వేరుగా చర్యలు తీసుకోవచ్చు. అయితే కోర్టుల్లో చర్య తీసుకోవడానికి జాప్యం జరిగేలోగా మరింత నష్టం వాటిల్లే ప్రమాదం వుంటుంది. అలాంటప్పుడు ఉపేక్షిస్తే లాభం లేదు అనిపించకపోదు. ఈ పరిస్థితుల్లో తక్షణం చర్య తీసుకోవాల్సి వుంటుంది. ఉదాహరణకి ఒక ఫ్యాక్టరీ నించి వెలువడుతున్న దుర్గంధ పూరితమైన వాటి కారణంగా డ్రైనేజ్ దెబ్బ తిని ప్రజలందరికీ వాంతులు విరోచనాలు పట్టుకొన్నాయనుకొందాం. అలాంటప్పుడు ప్రజలకి అసౌకర్యం కలిగించి అనారోగ్యం పాలు చేసిన ఈ ఫ్యాక్టరీ పై తక్షణం చర్య తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంటుంది. ఇలాంటప్పుడు చట్టం తక్షణం పరిష్కారం చూపించకపోతే పేటలకు పేటలూ, ఊళ్ళకు ఊళ్ళు ఖాళీ చేయాల్సివస్తుంది కాబట్టి సి.ఆర్ పి.సి. 133 వ సెక్షన్ క్రింద ప్రజా అసౌకర్యాన్ని తక్షణం నివారించే అవకాశం చట్టంలో కల్పించ బడింది.

ఈ అవకాశం కేవలం ప్రజా అసౌకర్యాన్ని తక్షణం నిర్మూలించడానికి ఉద్దేశించబడింది. ఐతే ఆరోపణ చేసిన వారికి ఈ పరిస్థితుల్లో ఎలాంటి నష్టపరిహారం చెల్లించడం జరగదు. ఈ అధికారం కలిగివున్న అధికారులు జాగ్రత్తగాను, న్యాయ బద్ధంగానూ వ్యవహరించాలి. లేని పక్షంలోవారు తీసుకొనే చర్యలే ప్రజలకు అసౌకర్యం కలిగించే ప్రమాదముంది.

ప్రజా అసౌకర్యం కలిగించే పనులు జరుగుతున్నప్పుడు ప్రజలు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడానికి వీల్లేదు. రోడ్లకు ఆటంకం కల్గించే నిర్మాణాలు జర్గి నప్పుడు ఆ నిర్మాణాన్ని ఎవరుబడితే వాళ్ళు తొలగించడానిక వీల్లేదు. అలా చేసే ట్లయితే ప్రజలు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడమవుతుంది.

ఈ చట్టం క్రింద అసాధారణ పరిస్థితుల్లో చర్య తీసుకొంటారు. సాధారణ చట్టం క్రింద వెంటనే చర్య తీసుకోలేని పరిస్థితుల్లో ఈ చట్టాన్ని ఉపయోగించుకో వచ్చు. ఉదాహరణకి అక్రమ నిర్మాణాన్ని తొలగించడానికి మునిసిపాలిటీ వాళ్ళు చర్య తీసుకోనప్పుడు తద్వారా ప్రజలకు అసౌకర్యం కలుగుతుండేట్లయితే ఈ చట్టాన్ని అమలు పర్చవచ్చు.

తక్షణ చర్య తీసుకోడానికి అవకాశం కల్పించే చట్టం రాజ్యాంగబద్ధమే. ఒకవేళ ఆస్థిని ధ్వంసం చేయమని ఆదేశించేట్లయితే ఆ ఆదేశాలు రాజ్యాంగబద్ధమే అవుతాయి. యజమాని తన హక్కును చట్టబద్ధంగానే కోల్పోయాడు కాబట్టి ఇది

రాజ్యాంగబద్ధమే.

ప్రజా అసౌకర్యం కల్గే ప్రమాదమున్నపుడు నిజానికలాంటి అసౌకర్యం కలగని దశలో ఈ చట్టం క్రింద చర్య తీసుకోవడానికి వీల్లేదు. అయితే గృహ నిర్మాణాలు చేపట్టినప్పుడు ఆ నిర్మాణం భవిష్యత్‌లో ప్రజాఅసౌకర్యానికి దారి తీస్తుందను కొన్నప్పుడు ఈ చట్టం క్రింద చర్య తీసుకోవచ్చు. అలాగే డ్రైనేజ్ శుభ్రపర్చక పోయేట్లయితే కూడా అసౌకర్యం కల్గే ప్రమాదముంది. ఈ సందర్భంలో కూడా ఈ చట్టం క్రింద ముందుగానే చర్య తీసుకొంటారు.

చాలాకాలంగా ఉన్న కొన్ని కర్మాగారల నుంచి వెలువడుతున్న వాయువులు ప్రజారోగ్యానికి నష్టం వాటిల్లచేసేట్టుగా వున్నట్లయితే ఈ చట్టం క్రింద దాన్ని నివారించగల్గుతామానన్న సందేహం కల్గవచ్చు. ఈ విషయంలో దేశంలోని న్యాయ స్థానాలు భిన్నాభిప్రాయాల్ని వ్యక్తపరచాయి. అయితే మెజారిటీ న్యాయస్థానాలు ఈ చట్టం క్రింద చర్య తీసుకోవచ్చునని తీర్పు చెప్పాయి. రోజు రోజుకి పెరిగిపోతున్న నగరాల్లో ఒకప్పుడు నిర్మానుష్యంగా ఉన్న స్థలాల్లో నిర్మించిన ఫ్యాక్టరీల చుట్టు ప్రక్కల గృహ వసతి నిమిత్తం పెద్ద పెద్ద భవనాలు నిర్మించడం జర్గుతోంది. అలాంటప్పుడు ఈ ఫ్యాక్టరీ నించి వెలువడుతున్న వాయువు జనారోగ్యాన్ని దెబ్బ తీయవచ్చు. కొత్తగా ఏర్పడిన ఈ పరిస్థితి వల్ల ఆ ఫ్యాక్టరీ చుట్టుపక్కల ఉన్న వాళ్ళ శ్రేయస్సు దృష్ట్యా అవసరమనుకొంటే ఈ చట్టం క్రింద విషవాయువును నివారించడానికి తగిన చర్య తీసుకోవాల్సి వుంటుంది. ఎప్పటి నించో ఉందన్న కారణంగా ఇప్పుడు దానిపై చర్య తీసుకోవడానికి వీల్లేదనడం సరైందికాదు. ఫ్యాక్టరీ నిర్మించింది అది ఉత్పత్తి చేసే వస్తువులు ప్రజాఉపయోగం కోసమే. అలాంటప్పుడు ఆ ఫ్యాక్టరీ ప్రజలకి ఉపయోగపడే బదులుగా హానికరంగా తయారైనప్పుడు ఆ ఫ్యాక్టరీపై చర్య తీసుకోవడం అనివార్యమౌతుంది. ప్రజారోగ్యం పరిరక్షించడం రాజ్యాంగ లక్ష్యం గనుక ఇలాంటి విషయాల్లో తక్షణం చర్య తీసుకోడానికి చట్టం అవకాశం కల్పించాలి. ఈ నేపథ్యంలోనే చట్టాన్ని విశ్లేషించడం అవసరం.

పబ్లిక్ న్యూసెన్స్ తొలగించడానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకించి అధికారాలు అప్పగించిన ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఎవరైనాసరే ఉత్తర్వులు జారీచెయ్యవచ్చు. పబ్లిక్ న్యూసెన్స్‌కి సంబంధించి ప్రాథమిక ఆధారాలు ఉన్నాయనుకుంటే వాటి ఆధారంగా ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాలు జారీచేస్తారు. అయితే ముందుగా తాత్కాలిక ఉత్తర్వులు జారీచేసి ఆ తరువాత ప్రతివాది వాదనల్ని విన్నమీదట మాత్రమే శాశ్వత ప్రాతిపదికపై ఆదేశాలు జారీచేస్తారు. తాత్కాలికంగా జారీచేసే ఆదేశాలు ముందుగా ఏకపక్షంగా జారీచేసేవై ఉంటాయి.

పబ్లిక్ న్యూసెన్స్ తొలగించడానికి ఆదేశాలు జారీచెయ్యమని పోలీసులు రిపోర్టు దాఖలు చెయ్యవచ్చు. లేదా నేరుగా ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కు దరఖాస్తు చేసుకోవచ్చు. మరే ఇతర పద్ధతిలోనైనా సమాచారం తెలిపేట్లయితే కూడా మెజిస్ట్రేట్ తనకు తానుగా కూడా చర్య తీసుకునే అవకాశం ఉంటుంది. మెజిస్ట్రేట్‌కు అందించే సమాచారంలో అన్ని వివరాలు పొందుపర్చాలి. సమాచారం అందిన తరువాత అవసరం అనుకుంటే తగిన సాక్ష్యధారాల్ని విచారిస్తారు. అయితే సాక్ష్యాధారాలు తీసుకోవడం తప్పనిసరి కాదు.

ప్రజల హక్కులకి అవరోధం కలిగించే పని ఏదైనా చేసినా, ఏదైనా పని చెయ్యాల్సివుండి చేయకపోవడంవల్ల అవరోధానికి కారణమైనట్లయితే దాన్ని ప్రజా అసౌకర్యం కలిగించే చర్యగా పరిగణిస్తారు. కాల్వలు. చెరువులు, రోడ్లవంటి వాటిపైన అందరికి హక్కు ఉంటుంది. ఉదాహరణకి ఈ హక్కుకి భంగం కలిగించే ఏ చర్య అయినాసరే ప్రజా అసౌకర్యంగా పరిగణిస్తారు. యాదృచ్ఛికంగా ఉపయోగించుకునే హక్కులకి, ప్రైవేట్ వ్యక్తులకు చెందిన హక్కులకి భంగం కలిగినపుడు వాటిని ప్రజా అసౌకర్యం కలిగించే చర్యగా పరిగణించరు.

రోడ్లమీద అక్రమ నిర్మాణాలు చేపట్టడం, విగ్రహాన్ని ఆవిష్కరించడం, ఆటంకం కలిగించేవిధంగా చెట్లను పెంచటంవంటివన్నీ ఈ కోవలోకి వస్తాయి. అయితే భవిష్యత్తులో అసౌకర్యం కలుగవచ్చనే కారణంగా ఇపుడే ప్రజా అసౌకర్యం కలుగుతోందనడం సరైందికాదు.

ప్రైవేట్‌గా స్థలాల్ని, కాల్వల్ని, చెరువుల్ని ఉపయోగించే హక్కున్నపుడు ఆ హక్కులకి ఆటంకం కలిగేట్లయితే దాన్ని పబ్లిక్ న్యూసెన్స్‌గా పరిగణించరు. ఇళ్ళల్లో కట్టుకునే పాయిఖానాలు శుభ్రపర్చకపోయినట్లయితే దాన్ని పబ్లిక్ న్యూసెన్స్‌గా పరిగణించరు. అయితే ఆ పాయిఖానాల తాలూకు గబ్బు చుట్టుపక్కల ఇళ్ళకు వ్యాపించేట్లయితే నిస్సందేహంగా అది పబ్లిక్ న్యూసెన్సే అవుతుంది.

మున్సిపాలిటీవాళ్ళు చెత్తకుండీలు, పబ్లిక్ లావెట్రీలు శుభ్రపర్చకపోయేట్లయితే దాన్ని పబ్లిక్ న్యూసెన్స్‌గా పరిగణించి తక్షణం వాటిని శుభ్రపర్చమని మెజిస్ట్రేట్ నుండి ఆదేశాలు పొందవచ్చు.

కొన్నిసార్లు కొందరు వ్యక్తుల ప్రైవేట్ హక్కులు పబ్లిక్ న్యూసెన్స్‌గా తయారయ్యే అవకాశముంటుంది. ఉదాహరణకి లావెట్రీలు ప్రజలందరూ ఉపయోగించే నూతుల సమీపాన కట్టేట్లయితే ఆ బావుల్లో నీరు చెడిపోయే అవకాశముంటుంది. అలాంటపుడు దాన్ని పబ్లిక్ న్యూసెన్స్‌గా పరిగణిస్తారు.

స్మశాన వాటికల్లో శవదహనాలు చేసేపుడు ఆ మంటలు వ్యాపించి చుట్టు

ప్రక్కల ఇళ్ళు తగులబడ్డానికి దారితీసేట్లయితే స్మశాన వాటిక ఉపయోగం పబ్లిక్ న్యూసెన్స్‌గా తయారైనట్లు భావించవచ్చు.

సరిహద్దుగోడ నిర్మించినపుడు ఆ నిర్మాణంవల్ల పక్క ఇళ్ళ చెత్తాచెదారం తొలగించడానికి వీల్లేని స్థితి ఏర్పడేట్లయితే గోడ నిర్మాణం పబ్లిక్ న్యూసెన్స్‌గా తయారవుతుంది.

ప్రజలు నివసించే ప్రాంతంలో ఏర్పర్చిన హోటళ్ళలో జరిగే వంటకాలు చుట్టు ప్రక్కల ఉన్నవారికి ఇబ్బంది కల్గించేట్లయితే ఆ హోటల్ నిర్వహణ ప్రజా అసౌకర్యం కలిగించే చర్యగా భావిస్తారు.

రోడ్ల పక్కనున్న షాపుల్లో చుట్టూ వ్యాపారం సాగించి తద్వారా అక్కడ ఒక గుంపు ఏర్పడ్డానికి కారణమయ్యేట్లయితే వ్యాపారంతో నిమిత్తం లేకుండా ఈ పరిస్థితి ప్రజా అసౌకర్యమైన చర్యగా పరిగణిస్తారు.

ఇటీవల నగరాల్లో పెరిగిపోతున్న పరిశ్రమల కారణంగా వాతావరణ కాలుష్యం ఏర్పడుతోంది. ఫ్యాక్టరీల నుంచి వెలువడుతున్న పొగ ఆ చుట్టుపక్కలా ఇళ్ళరూపాన్ని, మనుషుల రూపాన్ని మార్చేస్తోంది. కట్టుకునే బట్టలు తొందరగా మాసిపోతుంటాయి ఈ వాతావరణ కాలుష్యంవల్ల ఆహార పదార్థాలు కూడా చెడిపోతాయి. అలాంటపుడు ఫ్యాక్టరీల్లోంచి వెలువడుతున్న పొగ ప్రజలకు అసౌకర్యం కలిగిస్తున్నట్టుగా పరిగణించవచ్చు.

ఇలాంటపుడు ఆ ప్రాంతానికి చెందిన రాష్ట్ర ప్రభుత్వంచే ప్రత్యేక అధికారం పొందిన మెజిస్ట్రేట్ తక్షణం చర్యతీసుకోవచ్చు. ఆ ఫ్యాక్టరీల నుండి కాలుష్య భరితమైన పొగ వెలువడకుండా నిలిపివేయమని ఆదేశించవచ్చు.

ప్రజలకందరికీ అసౌకర్యం కలిగించే ప్రమాదం వాటిల్లజేసే సాధారణ ప్రజాహక్కుల నడ్డగించే ఏ చర్య అయినా పబ్లిక్ న్యూసెన్స్ అవుతుంది.

ప్రజలంతా చట్టబద్ధంగా ఉపయోగించుకొనే చెరువులు, నదులు, బావులు, రోడ్లు వంటి వాటికి సంబంధించి ప్రజలకసౌకర్యం కల్గించే చర్యలను మాత్రమే పబ్లిక్ న్యూసెన్సుగా పరిగణించి చర్యతీసుకొంటారు. ఉదాహరణకి ఊళ్ళోవాళ్ళంతా ఉపయోగించుకొనే చెరువులోకి డ్రైనేజి నీళ్ళు వదిలేట్లయితే అది ప్రజలకసౌకర్యం కల్గించే చర్య అవుతుంది అంతేకాని ప్రైవేటు వ్యక్తులు ప్రజా హక్కులతో సంబంధం లేకుండా వాళ్ళ స్వంత ఆస్తులని ఉపయోగించుకొంటే దాన్ని ప్రజా అసౌకర్యం కలిగించే చర్యగా పేర్కొనడానికి వీల్లేదు. ప్రజా అసౌకర్యం కలిగించే చర్యలను నిషేధిస్తూ మెజిస్ట్రేట్ ముందు తాత్కాలిక ఉత్తర్వులు జారీ చేస్తారు. ప్రతివాది నోటీసు అందుకున్న తర్వాత అది ప్రజా అసౌకర్యం కల్గించేది కాదని వివరించవచ్చు.

అలాంటప్పుడు మెజిస్ట్రేట్ విచారణ జరుపుతారు. ఆ విచారణలో ప్రజా అసౌకర్యం కల్గించే చర్యకాదని తేలినట్లయితే అంతకుముందు జారీచేసిన ఉత్తర్వులను ఉపసంహరించుకొని పార్టీని సివిల్ కోర్టుకు పంపుతారు.

కొన్నిసార్లు కొందరు ప్రైవేటు ఆస్తులను తాత్కాలికంగా ప్రజలందరు ఉపయోగించుకొన్నంత మాత్రన ప్రజలందరికి ఆ ఆస్తి మీద ఎలాంటి హక్కు ఏర్పడదు. అలాగే ఎవరైనా ప్రైవేటు వ్యక్తికి చెందిన భూముల్లోంచి గ్రామస్తులు పశువులు తోలుకొని వెళుతున్నంత మాత్రాన ఆ భూమిని ప్రజలందరూ ఉపయోగించే రహదారిగా పరిగణించడానికి వీల్లేదు. ఇలాంటి విషయాల్లో ప్రజలకు ఎలాంటి హక్కు ఉండదు కాబట్టి ఒకవేళ వాళ్ళకి అసౌకర్యం కల్గించే పనులేమైనా జరిగినా వాటిని నిషేధించే అధికారం మెజిస్ట్రేట్‌కు ఉండదు.

ప్రజల ఆయురారోగ్యాలు దెబ్బతీసే వ్యాపారం చేసినా, ఉపాధి చేపట్టినా అది ప్రజలకు అసౌకర్యం కల్గించే చర్యగా పరిగణించి నిషేధిస్తారు. ఉదాహరణకి ఎముకల మిల్లు యజమాని ఎముకలను బైట వదిలేయడం వల్ల అవి చెడిపోయి దుర్వాసన వ్యాపింప జేసేట్లయితే అది ప్రజల ఆరోగ్యానికి హానికరమైంది. కాబట్టి దీన్ని పబ్లిక్ న్యూసెన్సు అనవచ్చు. అలాగే ఫ్యాక్టరీల్లో యంత్రాలు చేసే చప్పుడు ఆ చుట్టు ప్రక్కలవారికి నిద్రాభంగం కల్గించేట్లయితే దాన్ని పబ్లిక్ న్యూసెన్స్‌గా పేర్కొనవచ్చు. అయితే సాధారణంగా ఎక్కడైతే వ్యాపారాలు పెరుగుతాయో అక్కడ జరిగే వ్యాపారాలవల్ల ఆ చుట్టు ప్రక్కల నివసిస్తున్న వారికి అసౌకర్యం కల్గిస్తున్నంత మాత్రాన దాన్ని పబ్లిక్ న్యూసెన్సు అనడానికి వీల్లేదు.

ఇళ్ళల్లో ఉండి వ్యభిచారం చేసే స్త్రీల వల్ల ఆ చుట్టు ప్రక్కల వాళ్ళు అనారోగ్యనికి గురౌతున్నారు. కాబట్టి ఆ స్త్రీ చేస్తున్న వ్యభిచార వ్యాపారాన్ని నిషేధించమనడానికి వీల్లేదు. అయితే ఆ వ్యభిచారిణి బైటికి వచ్చి జనాన్ని వ్యభిచారానికి పురిగొల్పే విధంగా ప్రవర్తిస్తే మాత్రం అది ప్రజల ఆరోగ్యానికి హానికలిగించే చర్యగా పరిగణించవచ్చు.

పశువుల వ్యాపారం చేసే వాళ్ళు పశువుల్ని ఇరుకైన స్థలాల నించి తోలుకు వెళ్ళేట్లయితే అది ప్రజల ప్రాణానికి ప్రమాదం కల్గించే చర్య అవుతుంది.

ఆ పరిసర ప్రాంతంలో నివసించే ప్రజల ఆరోగ్యానికి హానికలిగించని ఏ వ్యాపారాన్నయినా పబ్లిక్ న్యూసెన్స్‌గా అభివర్ణించడానికి వీల్లేదు.

కొన్ని కొన్ని ఇతర చట్టాల్లో వ్యాపార వృత్తులు ప్రజల ఆరోగ్యాన్ని దెబ్బ తీయకుండా నిర్వహించడానికి కావల్సిన నిబంధనలని ఏర్పాటు చేశారు. ఒకవేళ ఈ నిబంధనల్ని ఉల్లంఘించేట్లయితే ఆయా చట్టాల క్రింద తగిన చర్యలు తీసుకోడానికి

అవకాశముంది. అయినా ఈ చట్టం క్రింద ఆ వ్యాపారంగాని, వృత్తిని కాని తక్షణం నిషేధించమని కోరవచ్చు. మౌలికంగా ఈ చట్టం పబ్లిక్ న్యూసెన్సు విషయంలో తక్షణం చర్య తీసుకోడానికి ఉద్దేశించబడింది.

ఒకోసారి కొన్ని మేడలు, గుడిసెలు, వృక్షాలు ప్రజలకి అసౌకర్యం కలిగించవచ్చు. ఉదాహరణకి చెట్లు కూలిపోయి రోడ్లపైన ఆటంకంగా తయారవడం, కూలడానికి సిద్ధంగా ఉన్న మేడలు వంటివి ప్రజలకి ప్రమాదకరంగా తయారుకావచ్చు. అలాంటప్పుడు ఈ విషయాల్లో తగిన చర్య తీసుకొని ఆ ప్రమాదాన్ని నివారించాల్సి ఉంటుంది. ఇక్కడ మొత్తం ప్రజలందరికీ ప్రమాదం కావల్సిన అవసరంలేదు. ఆ చుట్టు ప్రక్కల వ్యాపారం చేసుకొనే వారికి, జీవించేవారికి ప్రమాదకరంగా ఉండేట్లయితే సరిపోతుంది.

ముందుజాగ్రత్త చర్యగా మెజిస్ట్రేట్ జారీచేసే ఆదేశాలు తాత్కాలికమైనటువంటివి కాబట్టి ప్రతివాది ఎప్పుడు ఎక్కడ కల్సుకొని జవాబుచెప్పుకోవచ్చునో తెలియజేయాలి. ఈ ఆదేశాలు అందరినీ ఉద్దేశించి జారీ చేసేవికావు. ఏ ఒక్కరిద్దరినో ఉద్దేశించి జారీ చేస్తారు. ఆదేశాలు స్పష్టంగా ఉండాలి. ఉదాహరణకి ఒక నిర్మాణాన్ని కూల్చి వేయమని ఆదేశించినప్పుడు ఆ నిర్మాణంలో ఏభాగాన్ని కూల్చివేయాలో స్పష్టంగా పేర్కొనాలి. అనేకమంది నుద్దేశించి జారీచేసే ఆదేశాల విషయంలో అందరూ ప్రజా అసౌకర్యానికి సమానమేనా అన్న ఆరోపణ లేనప్పుడు ప్రతి వ్యక్తికి అతను చేస్తున్న ప్రత్యేకమైన పనేమిటో పేర్కొని ఆ పని మానేయమని ఆదేశించాలి.

న్యూసెన్సు తొలగించమని సంబంధిత వ్యక్తులకి తెల్పకుండా ఆదేశించేట్లయితే ఆ ఆదేశాలు చెల్లవు. అలాగే ప్రతివాది జవాబు చెప్పకోడానికి అవకాశం కల్పించనప్పుడు కూడా మెజిస్ట్రేట్ జారీ చేసిన ఆదేశాలు ఆ తర్వాత చెల్లవు.

ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఏఏ పరిస్థితుల్లో ఎలాంటి న్యూసెన్స్‌ను తొలగించడానికి ఆదేశాలు జారీ చేయవచ్చునో చట్టంలో స్పష్టంగా పేర్కొనడం జరిగింది. కాబట్టి మెజిస్ట్రేట్‌కి ఈ విషయంలో విస్తృత అధికారాలు ఉన్నాయనుకోడానికి వీల్లేదు. ఉదాహరణకి ఒక బావిలోని నీళ్లు ఇతరులనెవ్వరిని త్రాగనివ్వద్దని ఎవరినైనా ఆదేశించడానికి వీల్లేదు. అలాగే ఒక ప్రాంతానికి పరిమితమై మాత్రమే వ్యవసాయం చేయాలని, పాత కాలువల స్థానే కొత్త కాలువ నిర్మించమని, పందుల కొట్టం రోడ్డుకు కొంచెం దూరంలో గట్టమని ఆదేశించడానికి వీల్లేదు.

చట్టంలో పేర్కొన్న విధంగానే న్యూసెన్స్‌ను తొలగించమని ఆదేశించాలి. అంతేకాని మరో విధంగా ఆదేశించడానికి వీల్లేదు. ఉదాహరణకి ఇంటికి సరిహద్దులు నిర్మించడంవల్ల రోడ్డు మీద వాళ్లకి ఆటంకం కల్గించేట్లైయితే ఆ సరిహద్దు గోడని

కూల ద్రోయమని ఆదేశించాలి. అంతేకాని మొత్తం ఇంటిని కూలగొట్టమని ఆదేశించ కూడదు.

లాట్రెన్ శుభ్రపర్చకుండా ఆ చుట్టు ప్రక్కల నివసిస్తున్న వారికి ఇబ్బంది కల్పించేట్లైయితే లాట్రిన్ పడగొట్టమని ఆదేశించరాదు. కేవలం ఆ లాట్రిన్ శుభ్రపర్చమని మాత్రమే ఆదేశించాలి. సరిహద్దు గోడకి పొరుగింటి వారికి మధ్యన ఉన్న ఖాళీ స్థలంలో చెత్తచెదారం పేరుకొనేట్లయితే ఆ చెత్తా చెదారం తొలగించమని మాత్రమే ఆదేశించాలి. కానీ సరిహద్దు గోడ పడగొట్టమని ఆదేశించకూడదు.

స్మశాన వాటికలో శవదహనాలు న్యూసెన్స్‌గా తయారైనపుడు అందుకవసరమైన చర్యలు తీసుకోమనాలికాని మొత్తం శ్మశాన వాటికనే మూసెయ్యమనడానికి వీల్లేదు.

హోటళ్లలో జరుగుతున్న వంటకాలు చుట్టు ప్రక్కలవారికి న్యూసెన్సుగా తయారైనట్లైయితే ఆ న్యూసెన్స్ తొలగించమని ఆదేశించలేకాని హోటల్ మూసెయ్యమని ఆదేశించరాదు.

ఇటుక బట్టీ చుట్టు ప్రక్కల వారికి అనారోగ్య హేతువైనప్పుడు మొత్తం ఆ ఇటుక బట్టీనే మూసేయమని ఆదేశించడానికి వీల్లేదు. ఏ కారణాల చేత ఆ ఇటుక బట్టీ అనారోగ్యహేతువైనదో తెలుసుకొని ఆ కారణాన్ని తొలగించమని మాత్రమే ఆదేశించాలి. ఇంకా ఈ విషయంలో అనేక ఉదాహరణలు పేర్కొనవచ్చు.

ఆదేశాలు జారీ చేసినపుడు అవి తాత్కాలికమైనవే కాబట్టి ప్రతివాదికి మెజిస్ట్రేట్ నోటీసు ఇస్తారు. ప్రతివాది తన కింది అధికారి సమక్షంలో హాజరుకావచ్చునని మెజిస్ట్రేట్ తన ఆదేశాల్లో పేర్కొనవచ్చు. అయితే న్యూసెన్స్ తొలగించమని తాత్కాలిక ఆదేశాలు జారీ చేస్తూ ముందుగా తన సమక్షంలో హాజరుకమ్మని ఆదేశించినట్లైతే ఆ తర్వాత ఆదేశాన్ని సవరించి తన క్రింద అధికారి సమక్షంలో హాజరుకమ్మని ఆదేశించడానికి వీల్లేదు. ప్రతివాది స్వయంగా హాజరుకాకున్నా కోర్టు అతని హాజరు మాఫీ చేయవచ్చు. ప్రతివాదికి నియమించుకొన్న న్యాయవాది ద్వారా హాజరయ్యే హక్కు ఉంటుంది.

న్యూసెన్స్ తొలగించమని ముందుగా తాత్కాలిక ఆదేశాలు జారీ చేస్తారు. ఆ తర్వాత ఆదేశాన్ని శాశ్వత ఆదేశాలుగా ఎందుకు మార్చగూడదో తెలియపర్చమని ప్రతివాదిని కోరతారు. ఇలా కోరకుండా జారీ చేసే ఆదేశాలు చెల్లవు.

ఈ చట్టం క్రింద జారీచేసే ఆదేశాలు ఎవరిని ఉద్దేశించి జారీ చేస్తారో వారికి వర్తిస్తాయి. సాధారణ ప్రజానీకానికందరికీ వర్తించే ఆదేశాలు జారీ చేయడానికి వీల్లేదు. ఉదాహరణకి రామయ్య, భీమయ్య తన పొలంలోకి నీళ్లు వదులుతున్నాడని ఆరోపించినట్లైతే మెజిస్ట్రేట్ భీమయ్యకి వర్తించే ఆదేశాలు జారీ చేయవచ్చు. అంతేకాని భీమయ్య

పొలంలోంచి వదులుతున్న నీళ్లని మళ్లించి చంద్రయ్య పొలంలోకి వదలమని ఆదేశిం చడానికి వీల్లేదు. ఇలా ఆదేశించినట్లైతే చంద్రయ్యకి విరుద్ధమైన ఆదేశంగా ఉంటుంది కనుక ఆదేశాలు చెల్లవు. ఆదేశాలు జారీ చేసిన తర్వాత ప్రతివాది మరణించేట్లైయితే ఆదేశాలు ప్రతివాది వారసులకు వర్తించవు. పబ్లిక్‌న్యూసెన్స్ జరిగినపుడు సత్వర విచా రణ చర్యలు అవసరమౌతాయి కాబట్టి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి అధికారం కల్పించడం జరిగింది. ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాన్ని సివిల్ కోర్టులో సవాల్ చేయడానికి వీల్లేదు.

వాది ప్రతివాదుల ఖర్చులకు సంబంధించి మెజిస్ట్రేట్ ఎలాంటి ఆదేశాలు జారీ చేయరు.

అవసరమయ్యేట్లయితే ఇంకా విచారణ పొడిగించడానికి ఈ చట్టం క్రింద అవకాశం లేదు. అయితే అవసరమనుకుంటే మెజిస్ట్రేట్ తిరిగి కొత్తగా ఆదేశాలు జారీ చేయడమో పరిస్థితిని పునఃసమీక్షించడమో చేయవచ్చు. ఒకోసారి సివిల్‌కోర్టుకి వెళ్ల మని పార్టీలకి సూచించేట్లైతే ఆ తర్వాత అదే విషయంపై ఈ చట్టం కింద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి ఆదేశాలు జారీచేసే అధికారం ఉండదు.

ఈ చట్టం కింద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ జారీచేసిన ఆదేశాలపై హైకోర్టులో రివిజన్ పిటీషన్ దాఖలు చేసుకోవచ్చు.

సమన్లు జారీచేసే పద్ధతిలోనే ఈ చట్టం కింద జారీ చేసిన ఆదేశాన్ని ప్రతి వాది కందజేస్తారు. ప్రతివాదికి ఆదేశాలు అందని పక్షంలో రాష్ట్ర ప్రభుత్వం నిర్దేశిం చిన విధంగా ఆదేశాన్ని ప్రకటించి ప్రచురిస్తారు. అంతేకాక ప్రతివాది చూసే అవకాశ మున్న ప్రాంతాల్లోకాని, ప్రతివాది కల్సుకునే వ్యక్తివద్దకాని ఆదేశాల ప్రతిని ఉంచుతారు.

ఆదేశాలనందుకొన్న తర్వాత ప్రతివాది వాటినమలుపర్చి మెజిస్ట్రేట్ ముందు హాజరై సంజాయిషీ ఇచ్చుకోవాలి. ఇలాచేయని పక్షంలో ఆదేశాల్ని శాశ్వతం చేస్తూ ప్రతివాదికి శిక్ష విధిస్తారు.

## తాత్కాలిక ఆదేశాలు

వర్షాలు లేక రామయ్య పొలం బీడు పడింది. బీడుపడ్డ భూమిలోంచి ఆ వూరి ప్రజలు పొరుగూరికి వెళ్ళసాగారు. క్రమంగా ఆ బీడుభూమి పొరుగూరికి బాటయింది.

రామయ్యకి బ్యాంకు వాళ్ళు బావి తవ్వుకోడానికి లోను ఇచ్చారు. ఆ డబ్బు తీసుకొని రామయ్య బీడుభూమి దున్నుకోసాగాడు. రామయ్య వ్యవసాయం చేయడం ద్వారా పొరుగూరి బాటకి ఆటంకం కల్పిస్తున్నాడనీ ఆ వూరి జనం ఎగ్జిక్యూటివ్

మెజిస్ట్రేట్‌కి రిపోర్టు చేసారు. మెజిస్ట్రేట్ ఆ రిపోర్టుని పురస్కరించుకొని తక్షణం వ్యవసాయం పనులు నిలిపివేసి సంజాయిషీ ఇచ్చుకోమని రామయ్యనాదేశిస్తూ తాత్కాలిక ఆదేశాలు జారీ చేసారు. తన పొలం తను దున్నుకొంటే మధ్యన తహశీల్‌దారికి ఏం సంబంధమని వాపోయాడు రామయ్య.

రామయ్య పొలంలో వ్యవసాయం చేసుకొంటే తప్పేమిటి? రామయ్య పొలం మీద ఊళ్ళో ప్రజలందరికి ఏమైనా సాధారణ హక్కుందా ? రామయ్య ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ముందు హాజరై తన పొలం మీద ప్రజలకెలాంటి హక్కులేదని వాదించుకో వచ్చునా? రామయ్య వాదనని పురస్కరించుకొని మెజిస్ట్రేట్ విచారణ జరుపుతారా? రామయ్య వాదన సరైందని తేలేట్లయితే అంతకు ముందు జారీచేసిన ఆదేశాల్ని ఉపసంహ రించుకొంటారా? వంటి అనేక సందేహాలు ఈ సంఘటనవల్ల తలెత్తే అవకాశముంది. నిజానికి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ పబ్లిక్ న్యూసెన్స్ నిరోధిస్తూ జారీచేసే ఆదేశాలు ఏక పక్షమైన నిర్ణయంగా అనిపిస్తుంది. అలాంటప్పుడు అవి శాశ్వతమైన ఆదేశాలయేట్లయితే ఒక పక్షానికి అన్యాయం జరిగే ప్రమాదముంది. అంచేత ప్రతివాది తన వాదనని వినిపించుకొన్న తర్వాతనే మెజిస్ట్రేట్ ఒక నిర్ణయానికొచ్చి శాశ్వత ఆదేశాలు జారీ చేస్తారు.

పబ్లిక్ న్యూసెన్స్ నిరోధిస్తూ మెజిస్ట్రేట్ తాత్కాలిక ఆదేశాలు జారీ చేసిన తర్వాత ప్రతివాది అతని సమక్షంలో హాజరైనపుడు ఆదేశాలు జారీచేసిన విషయంలో ప్రజలందరికీ వర్తించే హక్కేదైనా ఉందానని ప్రశ్నించాలి. ఆ విషయంలో ప్రజలకి ఎలాంటి హక్కులేదని ప్రతివాది చెప్పుకొనేట్లయితే మెజిస్ట్రేట్ విచారణ జరుపుతారు.

ప్రతివాది వాదనని సమర్థించే సాక్ష్యాధారాలు ఉండేట్లయితే అంతకు ముందు మెజిస్ట్రేట్ పబ్లిక్ న్యూసెన్స్ తాత్కాలికంగా నిరోధిస్తూ జారీచేసిన ఆదేశాల అమలును నిలిపివేస్తారు. ఆ తర్వాత ఈ హక్కుని నిర్ధారించే సంబంధిత న్యాయస్థానం తీర్పు వెలువడే వరకూ మెజిస్ట్రేట్ ఈ విషయంలో ఎలాంటి నిర్ణయం తీసుకోరు. అయితే ప్రతివాది వాదనని సమర్ధించే సాక్ష్యాధారాలు లేవనుకున్నపుడు మాత్రం ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ చట్టప్రకారం పబ్లిక్ న్యూసెన్సును నిరోధిస్తూ ఉత్తర్వులు జారీచేస్తారు.

తాత్కాలిక ఆదేశాలు స్వీకరించిన మీదట ప్రతివాది తను ఆటంకం కల్పిస్తున్నాడని వచ్చిన ఆరోపణకి సంబంధించి ప్రజలకెలాంటి హక్కులేదని తెలుపు కోని పక్షంలోనూ, ఒకవేళ తెలుపుకున్నా తగిన సాక్ష్యాధారాలు చూపించుకోలేనప్పుడూ ఆ తర్వాత ఏ దశలోనైనా సరే అతను ప్రజలకు హక్కు లేదని వాదించడానికి వీల్లేదు. సాధారణంగా ప్రజలందరికీ వర్తించే సాధారణ హక్కుకి ఆటంకం కల్పించినప్పుడు మాత్రమే దాన్ని పబ్లిక్ న్యూసెన్స్‌గా అభివర్ణిస్తాము. అయితే ఈ విషయంలో

న్యూసెన్సు కలిగించే ఆస్తి ప్రైవేట్ వ్యక్తుల దైనప్పటికీ అది చుట్టు ప్రక్కల వారికి ఇబ్బందికరంగా తయారయ్యేట్లయితే దాన్ని పబ్లిక్ న్యూసెన్సుగా పేర్కొంటున్నాం. ఆస్తి ఎవరిది ఏమిటన్నది సమస్యకాదు. ప్రజలందరికీ వర్తించే హక్కేదైనా ఉన్నదా లేదా అన్నదే సమస్య. ప్రజల హక్కు భంగం కలిగిందనుకున్నప్పుడు దాన్ని నిషేధిస్తూ మెజిస్ట్రేట్ ఆదేశాలు జారీ చేస్తారు.

ప్రతివాది షోకాజ్ నోటీస్ అందుకొని మెజిస్ట్రేట్ ఆదేశాలకు భిన్నంగా కారణాలు వివరించేట్లయితే మెజిస్ట్రేట్ సాక్ష్యాధారాలు స్వీకరించి విచారణ జరుపుతారు.

విచారణలో ఇంతకు ముందు తాను జారీ చేసిన తాత్కాలిక ఆదేశాలు సరైనవని తేలినట్లయితే వాటినే శాశ్వతం చేస్తారు. ఒకోసారి అవసరమనుకొనేట్లయితే కేసునుబట్టి అంతకు ముందు జారీచేసిన ఆదేశాలు సవరించనూవచ్చు.

మెజిస్ట్రేట్ సాక్ష్యాధారాలతో సంతృప్తి పడకపోయేట్లయితే ఇంతకు ముందు జారీ చేసిన ఆదేశాలను ఉపసంహరించుకోడమో అంతటితో ఊరుకోడమో చేస్తారు.

విచారణ జరిపే క్రమంలో అవసరమనుకొంటే మెజిస్ట్రేట్ సాంకేతిక నిపుణులచేత పరిశీలింపజేసి నిపుణుల నివేదికనీ, సాక్ష్యాలని తీసుకుంటారు. నిపుణుడు పరిశీలించాల్సిన అంశాలను వివరిస్తూ మెజిస్ట్రేట్ ముందుగా ఉత్తర్వులు జారీ చేస్తారు. ఆ తర్వాత ఖర్చు లెవరు భరించాలో కూడా పేర్కొంటూ ఆదేశాలు జారీచేస్తారు. నిపుణుల నివేదికని సాక్ష్యంగా పరిగణించవచ్చు. అవసరమనుకుంటే నిపుణుడిని సాక్ష్యానికి పిలిపించి ఆ ఖర్చులని ఎవరు భరించాలో తెలియజేస్తూ తగిన ఆదేశాలు జారీ చేస్తారు.

ముందుగా జారీ చేసిన తాత్కాలిక ఆదేశాల్ని శాశ్వతం చేసేట్లయితే ఆ ఆదేశాలని ఎన్ని రోజులలో అమలుపర్చాలో తెలుపుతూ ఉల్లంఘించేట్లయితే భారత శిక్షాస్మృతి క్రింద తీసుకోనున్న చర్యలని వివరిస్తూ ప్రతివాదికి నోటీసు ఇస్తారు. నోటీస్‌లో పేర్కొన్న సమయంలో ఆదేశాల నమలు పర్చక పోయేట్లయితే ఆదేశాల నమలుపర్చి మెజిస్ట్రేట్ అందుకయిన ఖర్చులు ప్రతివాదినించి అతని ఆస్తులు జప్తు చేయడం ద్వారా వసూలు చేస్తారు.

ప్రజలకు ప్రమాదం వాటిల్లజేసే పరిస్థితులు నివారించడానికి అవసరమనుకుంటే మెజిస్ట్రేట్ ఇంజక్షన్ జారీ చేస్తారు. ఇంజక్షన్ అమలుపర్చకపోయేట్టయితే మెజిస్ట్రేట్ స్వయంగా అమలుపరుస్తారు.

రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిన జిల్లా మెజిస్ట్రేట్ గాని, సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ గాని మరే ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ గాని పబ్లిక్ న్యూసెన్సు తిరిగి కొనసాగించవద్దని ప్రతివాదిని ఆదేశించవచ్చు.

# స్థిరాస్తి గొడవలు

భూపతిగార్కి బక్కయ్య పొలం మీద కన్ను పడింది. ఆ కాస్త పొలం కలుపుకొంటే తన పొలానికి ఉత్తర దక్షిణాలు కల్సిపోతాయని ఆయన అభిప్రాయం. అంచేత బక్కయ్య తండ్రి చనిపోయినప్పుడు దహనక్రియలకనీ, దినం ఖర్చులకనీ బక్కయ్య వద్దంటున్నా అతనికి అప్పుపెట్టాడు భూపతిగారు. ఆ సంవత్సరం అతివృష్టి కారణంగా కాలువలు పొంగి పంటలు ముంచేసాయి. పంటపొలాలనీరు, పండించే రైతుల కన్నీరు మాత్రమే మిగిలింది ఆ సంవత్సరం. నిల్వలో ఉన్న భూపతిగార్కి ఈ నష్టం పెద్దగా బాధించలేదు. మరుసటి సంవత్సరం వ్యవసాయం మొదలయ్యే టైమ్‌కి బక్కయ్య పొలం స్వాధీనం చేసుకున్నారు భూపతిగారు. బక్కయ్యకి వళ్ళు మండిపోయింది. తన పొలంలోకి కాలు పెడితే కాళ్ళు విరగ్గొడతాని శపథం చేశాడతను. ఇచ్చిన అప్పుక్రింద, వడ్డీ క్రింద ఆ భూమి ఖరీదు చెల్లిపోయింది గన్క ఇహనుంచి ఆ భూమి తనదేనని బుకాయించారు భూపతిగారు. ఈ అన్యాయం సహించలేక బక్కయ్య అతనితోపాటు మిగిలిన బక్క రైతులూ భూపతిగారి మీద తిరగబడ్డారు. అంతే భూపతిగారి మనుష్యుల కర్రలు లేచాయి. ఇహ రణరంగమై పోయింది. ఈ గొడవతో ఆ ఊర్లో శాంతి భద్రతలు క్షీణించాయి. పోలీసులు కల్పించుకొన్నారు. రైతుల మీద కేసులు పెట్టారు. అయినా మౌలికంగా సమస్య పరిష్కారం కాలేదు.

ఇలాంటి కొన్ని సమస్యలు పరిష్కారం కావాలంటే ఆ సమస్య ఉత్పన్నం కావడానికి కారణం ఏమిటో తెల్సుకోవాల్సి ఉంటుంది. అంతేకాక ఈ సమస్యలు తొందరగా పరిష్కారం కాకపోయేట్లయితే శాంతిభద్రతలు క్షీణించే ప్రమాదం ఉంటుంది. ఒక్కోసారి ఇలాంటి సమస్యల మూలంగా హత్యలు, దొమ్మీలు జరుగుతుండటం మనం చూస్తున్నాం. ఇలాంటి సమస్యల పరిష్కారానికి లాఠీఛార్జీలు, కాల్పులు, క్రిమినల్ కేసులు పెట్టడంవల్ల ఫలితం ఉండదు. తక్షణం సమస్య పరి

ష్కారం కావల్సిన చర్యలు తీసుకోవాలి.

కొన్ని ఆస్తితగాదాలు కేవలం ఇరువురికి మాత్రమే పరిమితం కాకుండా అంతకు మించి వ్యాపించి శాంతిభద్రతలకు విఘాతం కలిగించే దశకు చేరుకోవచ్చు. అలాంటప్పుడు తాత్కాలికంగానైనా సరే ఆ తగాదాని పరిష్కరించాల్సి ఉంటుంది. తద్వారా రానున్న ప్రమాదాన్ని నివారించవచ్చు.

ఇంతకుముందు చెప్పిన ఉదాహరణలో భూపతిగార్కి ఐక్కయ్య పొలం మీద ఏమైనా హక్కు ఉన్నదా లేదా అన్నది అనవసరం. ఆయనకలాంటి హక్కేదైనా ఉండేట్లయితే కోర్టులో కేసు వేసి తద్వారా తేల్చుకోవలసి ఉంటుంది. అంతేకాని ఐక్కయ్య స్వాధీనంలో వున్న పొలాన్ని స్వంతం చేసుకోవడం వల్ల భూపతిగారు శాంతిభద్రతలకు భంగం కల్పించిన వారయ్యారు.

ఆభూమి మీద తక్షణ హక్కు ఐక్కయ్యకుంది. ప్రాథమికంగా ఈ హక్కుకు భంగం వాటిల్లినందువల్లనే ఆ వూళ్ళో శాంతి భద్రతలకు భంగం వాటిల్లింది. అందుచేత తక్షణం శాంతిభద్రతలు మెరుగుకావాలంటే ముందుగా ఆ భూమి ఎవరి స్వాధీనంలో ఉండాలో తేల్చాల్సి ఉంటుంది. ఇలా తేల్చగల్గితే తప్ప శాంతిభద్రతల సమస్య పరిష్కరించడం సాధ్యంకాదు.

స్థిరాస్తులకు సంబధించి వివాదాలు తలెత్తినపుడు వాటిని తేల్చాల్సింది సివిల్ న్యాయస్థానాలు. ఒక్కొక్కసారి సివిల్ వివాదాలు కూడా ముదిరిపోయి క్రిమినల్ చర్యలకు దారితీసే ప్రమాదం ఉంటుంది. అలాంటప్పుడు ఒకే వివాదం సివిల్ కోర్టులోనూ, క్రిమినల్ కోర్టులోనూ నడుస్తుంది.

సివిల్ కోర్టు ఆయా ఆస్తులకు సంబంధించి వివాదాల్లో పార్టీల శాశ్వత హక్కును నిర్ణయిస్తుంది. అదే క్రిమినల్ కోర్టుకి ఆస్తి వివాదాల్లో పార్టీలకు సంబంధించిన హక్కులను నిర్ణయించడంతో సంబంధం ఉండదు. అయితే క్రిమినల్‌కోర్టు - ఆస్తులకు సంబంధించిన వివాదాలు క్రిమినల్ చర్యలకు దారి తీసేట్లయితే ఆ క్రిమినల్ కేసును పరిష్కరించాల్సి ఉంటుంది. ఒక్కోసారి నేరాలు జరక్కుండా నిరోధించే బాధ్యత కూడా క్రిమినల్ కోర్టు మీద ఉంటుంది కాబట్టి తాత్కాలికంగా స్థిరాస్తి వివాదాలు పరిష్కరించాల్సిన అవసరమేర్పడుతుంది. అలాంటప్పుడు మాత్రమే క్రిమినల్ కోర్టు స్థిరాస్తి వివాదాల్లో పార్టీల తక్షణ హక్కులు నిర్ణయిస్తాయి.

ముందు జాగ్రత్త చర్యల్లో భాగంగా చట్టం ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి స్థిరాస్తికి సంబంధించిన వివాదాలు తాత్కాలిక పరిష్కారానికి అవకాశం కల్పించింది. అయితే ఈ మెజిస్ట్రేట్ ఇచ్చే ఉత్తర్వులు పార్టీల శాశ్వత హక్కులు నిర్ణయించవు. స్థిరాస్తికి సంబధించి వివాదం తలెత్తి తత్కారణంగా శాంతి భద్రతలకు ప్రమాదం

వాటిల్లే అవకాశం ఉందనుకున్నప్పుడు మెజిస్ట్రేట్ ఈ చట్టం క్రింద చర్యలు గైకొంటారు.

సాధారణంగా గ్రామాల్లో పొలాల్లో నీరు పెట్టుకొనేటప్పుడు వివాదాలు తలెత్తే ప్రమాదం ఉంటుంది. అలాగే సరిహద్దు వివాదాలు, చేపలు పట్టుకునేటప్పుడు తలెత్తే వివాదాలు తదితర వివాదాలు చిలికి చిలికి గాలి వానయినట్లుగా ముదిరిపోయి శాంతి భద్రతలకు ముప్పువాటిల్లే ప్రమాదం ఉంటుంది. అలాంటప్పుడు మెజిస్ట్రేట్ ఈ చట్టం క్రింద చర్య తీసుకోవచ్చు. ఈ చట్టం క్రింద చర్య తీసుకోవడానికి ముందుగా పోలీసు రిపోర్టు నాధారం చేసుకోవచ్చు. లేదా మరెవరైనా ఇచ్చిన సమాచారాన్ని ఆధారం చేసుకోవచ్చు. అంతేకాని కేవలం పోలీసులే కేసు పెట్టాలన్న నిబంధనేమీ లేదు.

## తాత్కాలిక పరిష్కారం

పొలానికి నీళ్ళ విషయంలో కనకయ్యకి, కామరాజుకీ మధ్య గొడవలు వచ్చాయి. కనకయ్య మనుషులు కామరాజును కొట్టారు. దానితో కామరాజు మనుషులు కనకయ్య కోసం గాలింపు మొదలు పెట్టారు. ఈ తగాదా గురించి సమాచారం అందగానే ఇదేదో చిలికి చిలికి గాలివానయ్యేటట్లుగా వుందని పోలీసులు భావించారు. ఆ ఊళ్ళో క్యాంప్ పెట్టి ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి ఈ విషయం అంతా వివరిస్తూ సవివరమైన రిపోర్టు పంపించారు. ఈ విషయంలో ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఏం చేయగలడు? కనకయ్యకి, కామరాజుకీ మధ్య జరిగిన గొడవను పరిష్కరించగలడా? ఈ గొడవ ముదరకుండా అక్కడితో సమసిపోయేటట్లుగా చేయగలడా? పోలీసులైనా, మరెవరైనా భూమి, నీరు, సరిహద్దు వివాదాలు ఉత్పన్నమై తత్ కారణంగా ప్రజా శాంతికి భంగం వాటిల్లగలదనుకుని ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి తెలియజేస్తే ఆయన ఆ విషయాన్ని పరిశీలిస్తారు. మౌలికంగా వివాదం పరిష్కారంకానిదే ప్రజాశాంతిని పరిరక్షించడం సాధ్యం కాదనుకున్నప్పుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆ వివాదానికి సంబంధించిన ఇరుపక్షాల వారిని వ్యక్తిగతంగాగాని, ప్లీడర్ ద్వారాకాని హాజరుకమ్మని ఆదేశిస్తారు. ఇలా తాను ఎందుకు ఆదేశించాల్సివచ్చిందన్న కారణాలు ఆ ఉత్తర్వులో వివరిస్తారు. అంతేగాక ఆ ఉత్తర్వుల్లో పార్టీలు ఏ రోజు ఏ సమయానికి హాజరు కావాల్సింది తెలుపుతూ వివాదానికి సంబంధించి పార్టీల హక్కుల్ని లిఖితంగా తెల్పమని కూడా ఆదేశిస్తారు.

ఇలా ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాలు జారీ చేయడంలో గల ఉద్దేశం

తాత్కాలికంగా సమస్యను పరిష్కరించి తద్వారా ప్రజాశాంతికి భంగంవాటిల్లకుండా చూడాలనుకోవడమే. అయితే నిజానికి చాలా తగాదాలు వున్న వారికీ లేనివారికీ మధ్యన తలెత్తుతున్నందువల్ల లేని వారిని న్యాయం పేరిట, చట్టం మరిన్ని ఇబ్బందులకు గురిచేయడానికి మాత్రమే ఉపయోగపడుతోంది. ఉన్నవాడు ఏ ప్లీడర్‌నో పెట్టుకుని ఇహ ఆ కోర్టు ఛాయలకు వెళ్ళరు లేనివారు మాత్రం రోజులు, నెలలు, సంవత్సరాల తరబడి కోర్టు చుట్టూ తిరుగుతూ వుంటారు. ఒకరకంగా చెప్పాలంటే సమస్యను అణచి పెట్టడానికి పోలీసుల లాఠీలు, తుపాకులు ఎంతగా ఉపయోగపడుతున్నాయో అంతగానే వివాదాలు పరిష్కారంకాకుండా జాప్యం చేసే న్యాయ వ్యవస్థ, చట్టాలు ఉపయోగ పడుతున్నాయి. ఇక్కడ తాత్కాలికంగా ప్రజాశాంతిని పరిరక్షించవచ్చు. అయినా ఆకలికీ, అన్యాయానికి, అక్రమాలకు గురైనవారికి మాత్రం తక్షణం జరిగే న్యాయం ఏమీ వుండదు.

కొన్నిసార్లు పోలీసులు ఓ వర్గానికి కొమ్ముకాసి అన్యాయానికి పాల్పడే ప్రమాదముంది. అలాంటప్పుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ సెక్షన్-145 సి.ఆర్.పి.సి. కింద రిపోర్టు పంపేటట్లయితే దాన్ని ఆయన జాగ్రత్తగా పరిశీలించి నిర్ణయం తీసుకోవాలి. ఆలా నిర్ణయం తీసుకోవడానికి గల కారణాన్ని కూడా వివరించాలి. గుడ్డిగా నిర్ణయం తీసుకోవడం వల్ల పార్టీలు ఇబ్బందులకు గురయ్యే ప్రమాదం వుంటుంది. ఈ అధికారం ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి భూమి, నీరు వరకూ మాత్రమే కాకుండా తత్సంబంధమైన గృహ నిర్మాణం, మార్కెట్లు, చేపలు, పంటలు తదితర భూమి మీద వచ్చే ఉత్పత్తులు అద్దెలు, లాభాలకు కూడా విస్తరిస్తుంది.

ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాలు సమన్లు జారీ చేసినట్లుగానే జారీ చేస్తారు. అంతేగాక కనీసం ఒక కాపీని వివాదస్థలంలో అతికిస్తారు. ఆదేశాల్ని స్వీకరించి హాజరైన పార్టీల హక్కుల్ని తెలుసుకుని తగిన సాక్ష్యాధారాలను ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ స్వీకరిస్తారు. అయితే అప్పుడు పార్టీలు వారి వారి వాదనలను సమర్థించే సాక్ష్యాధారాలను కోర్టు ముందు ప్రవేశ పెడతారు. ఈ సాక్ష్యాధారాలేగాక వివాదానికి సంబంధించి ఇంకా అవసరమైన సాక్ష్యాధారాలను మెజిస్ట్రేట్ పిలవనంపి స్వీకరిస్తారు, విచారణ జరుపుతున్నప్పుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ పార్టీల హక్కుల్ని నిర్ణయించరు. అతను నిర్ణయించేది కేవలం వివాదం తలెత్తే నాటికి ఎవరి స్వాధీనంలో ఆస్తి వున్నదన్నది మాత్రమే. ఈ విధమైన నిర్ణయం వెలువడడం వల్ల శాంతిభద్రతలకు భంగం వాటిల్లడానికి గల కారణం తాత్కాలికంగా పరిష్కారం అవుతుందనే. ఈ పరిష్కారం వల్ల ఇంతకు ముందున్న పరిస్థితి తిరిగి నెలకొంటుంది. అందుచేత ప్రజాశాంతికి భంగం వాటిల్లే అవకాశాలు సన్నగిల్లుతాయి. ఇక్కడ ఇంకో అనుమానం తలెత్తవచ్చు. ఒక్క

వివాదం అంటూ ఏర్పడి తత్కారణంగా పరిస్థితులు క్రిమినల్ చర్యకు దారితీసినప్పుడే గదా ప్రజాశాంతికి భంగంవాటిల్లేది. అలాంటప్పుడు మౌలిక సమస్య తాత్కాలికంగా పరిష్కారమైనప్పటికీ క్రిమినల్ చర్య మూలంగా విద్వేషాలు, విరోధాలు కొనసాగకుండా పోతాయా? ఇలా కొనసాగినట్లయితే శాంతిభద్రతల సమస్య పరిష్కారమైనట్లు కాదు. అయితే ఇక్కడొక విషయాన్ని గమనించాల్సివుంటుంది. క్రిమినల్ చర్య జరిగినప్పుడు ఆ నేరానికి సంబంధించినంతవరకూ కేసు ధాఖలు చేయడమౌతుంది. ఇక్కడ అన్యాయానికి గురైన వారి వైపు ప్రభుత్వం బాధ్యత వహిస్తుంది. కనుక వ్యక్తిగత విరోధాలు, విద్వేషాలు కొనసాగే అవకాశం వుండదు. అలాంటప్పుడు ప్రజల మధ్య అశాంతి కొనసాగే అవకాశం లేకుండా పోతుంది. ఇకపోతే మౌలిక సమస్య పరిష్కారం కానిదే తిరిగి అదే వివాదం కొనసాగే ప్రమాదం వుంటుంది కాబట్టి ఈ చట్టం రూపొందించడం జరిగింది.

ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాలు జారీ చేసేనాటికి ఎవరి స్వాధీనంలోనైతే ఆ వివాదానికి సంబంధించిన ఆస్తివుందో నిర్ణయిస్తారు. అయితే ఒకేసారి వివాదం అంటూ తలెత్తిన తర్వాత ఆస్తి ఎవరి స్వాధీనంలో వుందో వారిని ఆ స్వాధీనం నుంచి బలవంతంగా తొలగించే అవకాశం వుంటుంది. అలాంటప్పుడు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఆదేశాలు జారీ చేసే నాటికి ఆస్తి అతని స్వాధీనంలో వున్నట్లుగానే పరిగణిస్తారు లేదా అంతకుముందు రెండు నెలల క్రితం వరకూ తీర్పు వర్తించేలా మెజిస్ట్రేట్ నిర్ణయించవచ్చు.

## స్థిరాస్తి వివాదాల్లో తలెత్తే సమస్యలు

స్థిరాస్తి వివాదాలు తలయెత్తి తద్వారా శాంతి భద్రతలకు భంగం వాటిల్లే ప్రమాదం లేదనికానీ అంతకుముందు అలాంటి పరిస్థితి ఉత్పన్నం కాలేదని కానీ ఇరు పక్షాలకి చెందిన వారిలోంచి ఏవరైనా మెజిస్ట్రేట్‌కి తెలియజెయ్యవచ్చు. అంతేగాక ఇతరులెవరైనా సరే, ఈ విషయం మెజిస్ట్రేట్ దృష్టికి తీసుకురావచ్చు. అలాంటప్పుడు మెజిస్ట్రేట్ అంతకుముందు జారీచేసిన ఆదేశాల్ని రద్దు చేస్తారు. ఈ ఆదేశాల్ని అనుసరించి తలపెట్టిన చర్యలన్నిటినీ నిలిపివేస్తారు. మెజిస్ట్రేట్ జారీచేసిన ఆదేశాలపైన ఇలాంటి అభ్యంతరాలు ఏమీ రాకపోతే అంతకుముందు ఆయన జారీచేసిన ఆదేశాలు అమల్లో వుంటాయి. వాటినే అంతిమనిర్ణయంగా పరిగణిస్తారు. ఆర్థిక వ్యత్యాసాలు వున్న వ్యవస్థలో సాధారణంగా పేదల్ని పీడించడానికి ఉన్నతవర్గాలవాళ్ళు కోర్టును ఉపయోగించుకొనే ప్రమాదం ఉంటుంది. అలాంటప్పుడు తప్పుడు సమాచారాల

ఆధారంగా, తప్పుడు ఆరోపణల కారణంగా మెజిస్ట్రేట్‌చే తమకు అనుకూలమైన ఆదేశాలు సంపాదించుకొని పేదల్ని భూములనించి వెళ్ళగొట్టడం లాంటి దురాగతాలకి పాల్పడే అవకాశం వుంటుంది. నిజం వెలుగులోకి వచ్చిన తరువాతనైనా మెజిస్ట్రేట్ అంతకు ముందు తాను జారీచేసిన ఆదేశాల్ని ఉపసంహరించుకోని పక్షంలో ఈ అన్యాయానికి మెజిస్ట్రేట్‌కూడా తోడ్పడినట్లే.

మెజిస్ట్రేట్ విచారణ జరిపిన తరువాత వివాదంలో వున్న ఆస్తి ఎవరి స్వాధీనంలో వుందో నిర్ణయిస్తారు. ఈ నిర్ణయానికి వచ్చిన తరువాత ఆ ఆస్తి స్వాధీనంలో వుండాల్సిన వ్యక్తి ఎవరోనన్నది ప్రకటిస్తారు. ఈ స్వాధీనానికి ఎలాంటి విఘాతం కలగకుండా వుండటానికి వీలుగా కావల్సిన ఆదేశాలు జారీచేస్తారు. బలవంతంగా స్వాధీనంనుంచి తొలగించబడ్డ వారికి తిరిగి ఆస్తి స్వాధీనపరుస్తారు. అయితే స్వాధీనహక్కులు ఖచ్చితంగా నిర్ణయించే అధికారం ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేటుకు వుండదు కాబట్టి మెజిస్ట్రేట్ నిర్ణయం న్యాయవ్యవస్థ అంతిమతీర్పు వెలువరించేంత వరకు మాత్రమే అమలులో ఉంటుంది. ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కి ఈ అధికారం అయినా కేవలం శాంతిభద్రతలకి భంగం వాటిల్లకుండా కాపాడేందుకు మాత్రమే ఏర్పడిందని మాత్రం మర్చిపోకూడదు.

మెజిస్ట్రేట్ నిర్ణయం, పార్టీలకి వ్యక్తిగతంగా అందజెయ్యడమే కాక వివాదంలో వున్న ఆస్తి పరిసరాల్లో కూడా అతికిస్తారు.

కొన్నిసార్లు వివాదాలు తలఎత్తి, అవి విచారణలో వుండగా ఏదో ఒక పక్షంవారు మరణించవచ్చు. అలాంటప్పుడు మరణించినవారి వారసుల్ని పార్టీగా జేర్చి విచారణ జరుపుతారు. వారసులు ఎవరన్నదికూడా వివాదాస్పదంగా పరిగణించేట్లైతే మేం వారసులం అంటున్న ప్రతివారినీ పార్టీలుగా జేరుస్తారు. వివాదం ముగిసి మెజిస్ట్రేట్ ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత కూడా వారసత్వపు వివాదం సరిగ్గా పరిష్కారం కాకపోయినట్లయితే, అలాంటప్పుడు ఈ రెండో తగాదాను న్యాయస్థానంలో తేల్చుకోవాల్సి వుంటుంది.

పంటపొలాలు, చేపల చెరువులు వంటి ఆస్తులకు సంబంధించి వివాదాలేర్పడినపుడు ఆ వివాదాలు సత్వరం పరిష్కారం కాకపోయినట్లయితే ఉత్పత్తి దెబ్బతినచ్చు. అలాటప్పుడు ముందుగా ఈ ఉత్పత్తులకు సంబంధించి, మెజిస్ట్రేట్ తక్షణం ఒక నిర్ణయానికి రావాలి. అంటే ఆ ఉత్పత్తులు ఎవరికి స్వాధీనపర్చాలన్న విషయం మీదకాదు. ఆ ఉత్పత్తుల్ని అమ్మివేయడమో, నిల్వచేసే అవకాశం ఉంటే నిల్వచేయడమో చేయవల్సి వుంటుంది. సాధారణంగా నిల్వచేయడానికి అవకాశం ఉన్నప్పుడు అమ్మివేయాలనే నిర్ణయం తీసుకోరు. విచారణ ముగిసిన తర్వాత ఆ

నిల్వ ఉంచిన ఉత్పత్తో లేక అమ్మగా వచ్చిన డబ్బో, మెజిస్ట్రేట్ నిర్ణయానుసారము ఒక పక్షానికి స్వాధీనపరుస్తారు. ఒకవైపు ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ తీసుకొనే నిర్ణయం తాత్కాలికమైనదంటూనే మరోవైపు ఆ నిర్ణయానుసారం ఆ ఉత్పత్తుల్ని ఒక పక్షానికి స్వాధీనపరచడం సరియైనదికాదు. ఇలాంటి విషయంలో తుదితీర్పు వెలువడేంతవరకు (న్యాయవ్యవస్థ నిర్ణయం ప్రకటించేంత వరకు) ఉత్పత్తిని ఒక పక్షానికి స్వాధీన పర్చడం సరైనది కాదు. ఉన్నతవర్గాలు బల ప్రయోగం ద్వారా ఆస్తుల్ని స్వాధీన పర్చుకోవడం తరచూ సంభవిస్తోంది. స్వాధీనంలో ఉన్నవారికే ఆస్తిని తాత్కాలికంగా అప్పగించే అధికారం ఈ చట్టం కింద ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్‌కుంటుంది.

అలాంటప్పుడు కష్టపడి పనిచేసి ఉత్పత్తులకు మూలకారణమైన సామాన్యులకి ఆ ఉత్పత్తి కూడా దక్కకపోయినట్లయితే వారికి మెజిస్ట్రేట్ తీరని నష్టం చేసినట్లే అవుతుంది.

విచారణ కొనసాగుతున్న ఏ దశలోనైనా పార్టీల్లో ఏ పక్షంవారు కోరినప్పటికి మెజిస్ట్రేట్ వారికోరిక మన్నించి తగిన సాక్ష్యాధారాలు కోర్టు ముందు హాజరుపర్చమని ఇతరులను కూడా ఆదేశిస్తారు. కేవలం సాక్షుల్నేకాక సాక్ష్యంగా ఉపయోగపడే వస్తువుల్ని, పత్రాల్ని కూడా మెజిస్ట్రేట్ తెప్పిస్తారు.

మౌలిక సమస్యకి తాత్కాలిక పరిష్కారం ఇచ్చినప్పటికీ అంతకుముందు రాజుకున్న పగలు, ద్వేషాలూ చల్లారకపోవచ్చు. అలాంటప్పుడు వివాదానికి మూలమైన వ్యక్తులపై ముందు జాగ్రత్తచర్యగా శాంతిభద్రతలకి భంగం వాటిల్లేలా ప్రవర్తించబోమని హామీ తీసుకుంటారు. ఇలా హామీ తీసుకోవడం అన్నది స్థిరాస్తి వివాదాలకి సంబంధించి, మెజిస్ట్రేట్ జారీచేసే ఆదేశాలకి విరుద్ధంకాదు. ఇక్కడో విషయం గమనించాలి. శాంతిభద్రతలు పరిరక్షించడానికి చట్టప్రకారం తీసుకొనే చర్యలన్నీ మనుష్యుల్ని సమస్యల వలయంలో చిక్కుకొనేలా చేస్తున్నాయి. ఉదాహరణకి ఆస్తికి సంబంధించి ఓ వివాదం ఏర్పడుతుంది. ఆ వివాదం ప్రజాశాంతికి భంగం కల్గించవచ్చు. ఒక్కోసారి పరస్పరం క్రిమినల్ చర్యలకు కూడా దారి తీయవచ్చు. అంటే ముందుగా ఏర్పడిన వివాదాన్ని పరిష్కరించుకోవడం కోసం సివిల్ న్యాయస్థానాన్ని ఆశ్రయించాల్సి ఉంటుంది. అక్కడా సమస్య తక్షణం పరిష్కారం కాదుగాబట్టి తద్వారా శాంతిభద్రతల్ని కాపాడాల్సిన బాధ్యత ఉన్న ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ఈ చట్టం కింద ఆదేశాల్ని జారీచేస్తారు. వివాదం క్రిమినల్ చర్యలకు దారితీసేట్లయితే క్రిమినల్ కోర్టు చుట్టూ కూడ తిరగాల్సి ఉంటుంది. అక్కడకి ఫలితం ఉండదనుకుంటే పార్టీల నుంచి హామీ తీసుకుంటారు. దీన్నిబట్టి ఎక్కడవేసిన గొంగళి అక్కడే ఉండగా పార్టీలు ఎన్నెన్ని అగచాట్లు పడాల్సి వస్తుందో స్పష్టమవుతోంది.